ప్రజల స్మృతులలో చిరస్థాయిగా వుండిపోయే రష్యా వ్రతులు వున్నారు. తర్వాతి తరంవాళ్ల ప్రేమాదరాలకి నోచుకున్న వాళ్లల్లో రచయిత ఇవాన్ తుర్గనెవ్ (1818 – 1883) ఒకడు.

ప్రపంచ సాహిత్యంలో వుండే రచనలు, దేశకాలాతీతమైనవి. దూరాన్ని, సరిహద్దుల్ని, జాతీయ విభేదాల్ని, భాషాభేదాల్ని అధిగమించేవి. ఆ రచనలు చిరస్థాయిగా వుండిపోతాయి. తుర్గనెవ్ పుస్తకాలు ఆ కోవకి చెందుతాయి. వాటిల్లో "వేటగాని కథలు," "రూదిన్," "గొప్పవారి గూడు," "ఆ సందర్భంలో," "తండ్రులూ కొడుకులూ" లాంటి నవలలు, యెన్నో నాటకాలు, నవలికలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, 'వచనంలో పద్యాలు' వున్నాయి. అవి ప్రపంచ ప్రఖ్యాతి గడించాయి, యేమంటే అవి ప్రచురితమైన భాషతో నిమిత్తం లేకుండా, వాటిని చదివే పాఠకులు యెక్కడ జీవించేవాళ్లైందీ దానితో నిమిత్తం లేకుండా లక్షలాది మంది హృదయాల్ని తహతహలాడిస్తూ యివి ప్రతిధ్వనించాయి.

అనువాదం: ఆర్వియార్

И. С. Тургенев
ДВОРЯНСКОЕ ГНЕЗДО
*на языке телугу*

Ivan Turgenev
A NEST OF THE GENTRY
*In Telugu*


సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

T $\frac{4702010100-325}{031(01)-84}$ 366—84

# ముందుమాట

ఇవాన్ సెర్గేయెవిచ్ తుర్గేనెవ్ (1818–1883) సృజనాత్మక కృషి రష్యన్ సాహిత్య శిఖరాల్లో ఒకటి. ఆశ్చర్యకరమైన శ్రావ్యతతోటీ, సర్వవ్యాపక లాలిత్యంతోటీ యీ మహా రచయిత వచనం విశిష్టమైంది. ఆయన మానవతావాది. జీవితంలోనూ, ప్రజల లోనూ, చారిత్రక పురోగతిలోనూ ఆయనకి ప్రగాఢమైన విశ్వాసం వుంది. రష్యన్ చరిత్ర లోనూ, ప్రపంచ చరిత్రలోనూ యెంతో ఉద్రిక్తభరితమైన ఒక దశలో తుర్గేనెవ్ జీవించాడు. తన కాలపు సాహిత్య, సాంఘిక ఉద్యమాలలో యెన్నో దశాబ్దాలు ప్రముఖంగా వున్నాడు. రష్యన్ జీవితపు అతి సామయికమైన సారభూతమైన సమస్యలకి తన రచనలద్వారా ప్రతి స్పందించాడు. సాంఘిక పోరాటంలో పాల్గొన్నాడు. స్వాతంత్ర్యంకోసం, పురోగతికోసం జరిగిన సకల జాతీయ పోరాటానికీ ఆ రకంగా మూర్తిమంతుడయ్యాడు. తన జీవితకాలం లోనే ప్రపంచ ప్రఖ్యాతి గడించాడు. ఎన్నో దేశాల్లో ఆయన రచనలని చదివారు. ఆయన్ని అభినందించారు, అభిమానించారు. సర్వ ప్రపంచ పాఠకులకీ రష్యన్ సాహిత్యాన్ని ఆదరణ పాత్రం చేసింది తుర్గేనెవేనని అన్నారు. ఆయన రష్యన్ సాహిత్యాభివృద్ధినీ ప్రపంచ సాహిత్యాభివృద్ధినీ యెంతగానో ప్రభావితం చేశాడు.

తుర్గేనెవ్ ఆరు నవలలనీ, యెన్నో నవలికలనీ, కథలనీ, కవితలనీ రాశాడు.

''గొప్పవారి గూడు'' ఆయన ద్వితీయ నవల. 1853లో అర్ధసంవత్సర కాలంలోనే దీన్ని రాయడం జరిగింది. లీజా కలీతినా, ఫ్యోదొర్ లవ్రేత్‌స్కీల విషాద ప్రేమగాథ యిందులో ప్రధాన యితివృత్తం. లవ్రేత్‌స్కీ వివాహితుడు. అతని భార్య యిక పరాయిదైనా, నిజానికి వాళ్ళు విడిపోయినా, వాళ్ళని యింకా బంధించే లాంఛనప్రాయమైన సంబంధాలు లీజా, లవ్రేత్‌స్కీల గాఢ అనుభూతుల్ని విషణ్ణం చేస్తాయి. ఒకళ్ళనొకళ్ళు ప్రేమించుకున్నా తమ ప్రేమని వెల్లడి చేసుకోవడానికి వాళ్ళు భయపడతారు. లవ్రేత్‌స్కీ భార్య మరణించిం

దన్న వార్త వస్తుంది. తమకి దైవం అనుకూలించిందని ఆ ప్రేమికులు ఆశిస్తారు. కాని ఆ వార్త తప్పు. వాళ్ల ఆశ భగ్నం అవుతుంది — ఆనందం అసంభవం. ఎంతో భక్తురాలైన లీజా తనకి శిక్షగా యీ దెబ్బని పరిగణిస్తుంది. సన్యాసిని అవుతుంది. లవ్రేత్‌స్కీ జీవితం కూడా భగ్నం అవుతుంది. యిదీ యీ నవల యితివృత్తం. మొత్తంమీద యిది ఒక మామూలు ప్రేమ కథ. కాని తుర్గేనెవ్ లాంటి మహా రచయిత నవల రాసేటప్పుడు దానికే పరిమితమై వుండటం జరుగుతుందా? వాస్తవానికి ''గొప్పవారి గూడు'' అనే యీ నవలకి ఆ యుగపు జీవితంతో సన్నిహిత సంబంధం వుంది. తన కాలపు అత్యంత ప్రాణభూతమైన సమస్యలకి యీ నవల ద్వారా తుర్గేనెవ్ సమాధానం అన్వేషించబోయాడు. రష్యా అను భవించిన ఆ యుగం సామాన్యమైంది కాదు. ప్రజలు ''బడితె మనిషి'' అని మారుపేరు పెట్టి పిలిచే నిరంకుశ చక్రవర్తి మొదటి నీకొలస్ ముప్పై సంవత్సరాల పాలనలో స్తబ్దంగా వుండిపోయిన దేశం, అప్పుడే దాన్నుంచి బయటపడింది. ప్రతివాళ్లూ సంస్కరణల కోసం యెదురుచూస్తున్నారు. మరీ ముఖ్యంగా భూస్వామ్య దాస్యపు రద్దు — లక్షలాది రష్యన్ రైతుల్ని దాస్యంలో మగ్గబెడుతున్న భూస్వామ్య దాస్యపు రద్దు. తుర్గేనెవ్ ఒక ఐశ్వర్యవంతు డైన రష్యన్ భూస్వామి కొడుకుగా, బాల్యంలో యజమాని నిరంకుశత్వపు పాశవిక దృశ్యాలు చూశాడు. భూస్వామ్య దాస్యంపట్ల ఆ విద్వేషం జీవితాంతం ఆయనకి వుండిపోయింది. ప్రజల జీవితాల్లోని సాంప్రదాయిక సూత్రాలని ఆదర్శీకరించకుండానే ప్రజలతోటి సన్ని హితత్వాన్ని, వాళ్ల అవసరాలపట్ల శ్రద్ధనీ, ప్రతివ్యక్తికీ నైతిక నియమాల గీటురాయిగా ఆయన పరిగణించాడు. యీ కోణంనుంచే ఆయన తన పాత్రలన్నిటినీ అంచనా కట్టాడు. ఆ కాలపు మేలు బంతుల్లాంటి రష్యన్‌లందరితోనూ కలిసి, ''ఏం చెయ్యాలి?'' ''ఎవరు చేస్తారు దీన్ని?'' అనే సమకాలీన ప్రధాన సమస్యలకి జవాబు కోసం అన్వేషించాడు. యీ రెండవ ప్రశ్న తుర్గేనెవ్‌కి ప్రత్యేకం ముఖ్యమైంది. సమాజపు క్రియాశీల శక్తిగా అవగల వారెవరో వాళ్ల కోసం రష్యన్ జీవితంకేసి రచయిత తదేకంగా చూస్తూనే వున్నాడు.

నవలలో లీజా కలితినా పాత్ర ముఖ్యమైంది. రచయితకి పరిచితమైనట్టి అనేకమంది రష్యన్ మహిళలా, బాలికలా లక్షణాల్ని మూర్తీభవింపచేసే సమష్టి రూపం అది. లీజా నమూనాలో చాలా మంది మూల వ్యక్తులు వున్నారు. వాళ్లల్లో తుర్గేనెవ్ బంధువుల్లో ఒకరు — ఎలిజవేతా షాహొవా, ప్రతిభావంతురాలైన కవయిత్రి, విషాద ప్రేమవల్ల ఆమె సన్యాసిని అయింది; ఎలిజవేతా లాంబెర్ట్ ఒక జమీందారిణి, రచయితకి పరిచయస్తురాలు; మహత్తర రష్యన్ విప్లవ రచయిత అలెగ్జాండర్ గేర్‌త్సెన్ మొదటి భార్య నతాల్య గేర్‌త్సెన్.

లీజా రచయితకి ప్రియమైన పాత్ర. రష్యన్ జాతీయ స్వభావపు అత్యుత్తమ లక్షణాల న్నిటినీ ఆమె పొదువుకుని మూర్తిమంతం అయింది. ఆమెలో అసాధారణమైన నైతికశక్తి, స్వచ్ఛత, సత్యసంధత, పరిశుద్ధ స్త్రీత్వపు మనోహరత్వం గోచరమవుతాయి. సొగసు, మృదు

త్వం, సౌకుమార్యం, నిజాయితీ ఆమెలో నిండిపోయాయి. తన దయాగుణంలోనూ, ప్రజల పట్ల ఆమెకి గల జాలిలోనూ, ప్రజల పట్లా, దేశం పట్లా ఆమెకి గల ప్రేమలోనూ ఆమె సందేశం వుంది. ఆమెకి ఆధ్యాత్మిక శక్తి, సమున్నత కర్తవ్య దీక్ష వున్నాయి. యిది అత్యు గ్రమూ, ఆత్మత్యాగపు టంచుల దగ్గర వుండేదీనీ. వేరొక వ్యక్తికి బాధని కలిగించడం కంటే తన ఆనందాన్ని తిరస్కరించడమే ఆమెకి సులభం. తుర్గేనెవ్ ఆమెని సంభావించడమే గాదు, ఆమెని తప్పపడతాడు కూడానూ. అణకువ, అన్నిటినీ క్షమించడం, ఒదిగి వుండటం లాంటి లీజా గుణాలు ఆమెకి ఆధ్యాత్మికపరమైన పెంపకం వల్ల అబ్బాయి. వాస్తవానికి లీజా సన్యాసినుల మఠానికి వెళ్లడం నిరాశవల్లనే కాదు, ప్రపంచంలోని చెడుని శాళనం చెయ్యడానికి, త్యాగానికి ప్రాయశ్చిత్తం చేసుకోడానికీ తపన పడడం వల్లా కూడా. కాని యీ చర్య వల్ల ఆమె యెవరికీ ఆనందాన్ని కలిగించలేదు.

లీజా రూపానికి మరో పాత్రలో – హెలేనా స్తాహొవా – తుర్గేనెవ్ తర్వాతి నవల "ఆ సందర్భంలో" అన్నదాంట్లో కొనసాగింపు వుంది. యీ పాత్రలో ప్రేమ భావమూ, పౌరధర్మమూ పొందికగా మిళితమయ్యాయి.

లీజా పాత్రలోని ఉన్నత నైతిక శక్తిని రష్యన్ అభ్యుదయ విమర్శకులు యెంతగానో పొగిడారు. "యీ గంభీరమైన కన్య ఆత్మలో భవిష్యత్కాలపు మహత్తర లక్షణాలు దాగి వున్నాయనీ, అలాంటి స్త్రీల సహాయంమీద పురుషులు ఆధారపడే దేశానికి, మరింత మెరుగైన భావిని ఆశించే ప్రతిహక్కూ వుంది" అనీ రచయితా, విప్లవకారుడూ అయిన సెర్గేయ్ స్తెప్న్యక్-క్రవ్‌చీన్‌స్కీ "గొప్పవారి గూడు" నవల ఆంగ్ల అనువాదానికి తన ముందుమాటలో రాశాడు.

"గొప్పవారి గూడు"లో మరో ముఖ్యమైన పాత్ర ఫ్యోదొర్ లవ్రేత్‌స్కీ. పాత రష్యన్ గొప్ప కుటుంబపు బిడ్డ. అదే సమయంలో సామాన్య రైతువనిత తనయుడు కూడా. అతను తెలివైనవాడు, దయగలవాడు. అనుభూతీ, ఆలోచన వున్నవాడు. మంచి విద్యపొందాడు. అతనిలో తుర్గేనెవ్ చాలా మట్టుకు ప్రతిబింబించాడు. ఆయన అనుభూతులూ, ఆలోచనలూ వెల్లడి అయాయి. యీ పాత్రలో రష్యన్ గొప్ప వంశీకుల అత్యుత్తమ ప్రతినిధిని రచయిత ప్రదర్శించ ప్రయత్నించాడు. వాస్తవానికి తన వ్యక్తిగత విధి, పౌరధర్మమూల సమస్య తన జీవిత ప్రధాన సమస్య అయిన పాత్ర యిది. సత్యంలోనూ, సమున్నత ఆదర్శంలోనూ విశ్వాసం అతని ప్రధాన అవసరం. తన తరహా కార్యాచరణని అతను యెడతెగకుండా అన్వేషించాడు. దాన్ని తన రైతు జీవిత వ్యవస్థని మెరుగుపరచడంలో దర్శించాడు. లీజాతో పోల్చినట్లయితే లవ్రేత్‌స్కీ ఆనందమూ, కర్తవ్యమూ అనే భావాలని ఒక దానికి ఒకటి పోటీ పెట్టడు. ప్రతికూల పరిస్థితుల ప్రాబల్యంవల్ల లీజా ధార్మిక విశ్వాసాల మొండితనంవల్లా మాత్రమే అతను తన వ్యక్తిగత ఆనందం లుప్తమైందానికి సమాధాన పడిపోతాడు. తుర్గే

నెవ్‌కి యీ పాత్రపట్ల సానుభూతి వుంది. కాని నిష్పాక్షికంగా వివరించుకున్నట్టయితే యీ పాత్ర, నూతన చారిత్రక దశలోని వ్యక్తిగా ల్రవేత్‌స్కీ, విఫలమైనట్టేనని రచయిత నిర్ణయానికి వస్తాడు. అతనికి దృఢసంకల్పం, ఆత్మత్యాగం, నిశ్చితత్వం లేవు. అతను ఓ రకంగా స్తబ్దుగా వుంటాడు. సమాజపు క్రియాశీల శక్తుల అనివార్య ప్రజాస్వామికీకరణా భావం తుర్గేనెవ్ నవలలో స్పష్టంగా వెల్లడి అయింది. మరి మూడేళ్లకాలంలో ''తండ్రులూ కొడుకులూ'' అనే తన నవలలో ఒక నూతన చారిత్రక వ్యక్తిని – రజ్నొచీనెత్స్ (కులీన వర్గానికి చెందని మేధావి) – బజారొవ్‌ని తుర్గేనెవ్ చిత్రించబోతున్నాడు.

''గొప్పవారి గూడు''లోని కవిత్వపు వైలక్షణ్యాన్ని గురించి కూడా ముచ్చటించుకోవాలి. నవలంతా యీ సంగీతం పల్లవిస్తూ వుంటుంది. తుర్గేనెవ్ రాసిన మరే యితర నవల లేనంతగా యిది సంగీతాత్మకంగా వుంది. సంగీతాన్ని యెంతగానో ప్రస్తావించడం జరిగింది, చాలా పాత్రలు సంగీతం పట్ల తమ వైఖరిని బట్టి లక్షితం అయాయి. నవలలోని భాష కూడా సంగీతాత్మకంగా వుంది. పైగా, ప్రకృతి దృశ్య లాలిత్యానికి 'శాబ్దిక రచన' ప్రధానమైన అంశం. నవలలోని సంగీతాత్మక అంశానికి శిఖరస్థాయి యేదంటే వృద్ధ సంగీతకారుడు లెమ్ రాసిన మధుర గీతం. యిది నవలలో కేంద్ర విషయమైన ఆనందాన్ని ప్రతిపాదిస్తుంది. నవలంతా దీని చుట్టూతా అల్లుకుంటుంది. తుర్గేనెవ్‌కి అభిమాన పాత్రమైన కళారూపం సంగీతం. ''గొప్పవారి గూడు''లో సాహిత్య పద్ధతుల ద్వారా రచయిత సంగీతానికి గల ఉద్రేకాత్మక ప్రభావపు శక్తిని సృష్టించ ప్రయత్నించాడు. లెమ్ పాత్ర హృదయాన్ని కదిలించేదిగా, ఆకర్షించేదిగా వుంది. అతను పరిశుద్ధమైన మనసు వున్నవాడు, గొప్ప సంగీతకారుడు. కాని, పాపం, విఫలుడైన వ్యక్తి. నవలలోని పాత్రల నైతిక సారాన్ని వెల్లడించే హక్కుని, అంతరాత్మ తీర్పుద్వారా వాళ్లని పరీక్షించడాన్ని తుర్గేనెవ్ లెమ్‌కి యిచ్చాడు.

''గొప్పవారి గూడు'' ప్రచురితమైనప్పుడు పాఠకులూ, విమర్శకులూ ఉత్సాహపూరితంగా, యీ నవలని ఆదరించారు. యీ నవలని ఉద్దేశించి రాసిన అనేక వ్యాసాలూ, సమీక్షలూ యిందులోని ప్రముఖమైన సాహిత్యాత్మక, సాంఘిక ప్రాముఖ్యాన్ని గుర్తించాయి. యీ నవలతోటి తుర్గేనెవ్ ప్రసిద్ధుడయాడు. తనకి దక్కిన విజయాలలో ఘనమైంది ''గొప్పవారి గూడు''కి వచ్చిందని రచయితే అన్నాడు.

రచయిత మిహయీల్ సల్తికోవ్-శ్చెద్రీన్ యీ నవలని చదివి ''ప్రతిశబ్దంలోనూ నిండిపోయివున్న నిర్మలిన లాలిత్యానికి'' ముగ్ధుడైపోయాడు. ''సామాన్యంగా తుర్గేనెవ్ రచనలన్నిటి గురించీ యెవళ్లేనా చెప్పగలిగింది యేమిటి? వాటిని చదివిం తర్వాత సునాయాసంగా జీవించగలిగేటువంటి, విశ్వసించగలిగేటువంటి, ఆర్ద్రంగా వుండగలిగేటువంటి అనుభూతా? మీ నైతిక స్థాయి యెలా యెదుగుతోందో మీరు స్పష్టంగా అనుభూతం చేసుకోగలిగి, మీ ఆలోచనల్లో రచయితని అభిమానించి, అభినందించే అనుభూతా? నిజంగా అదే అను

భూతి. గంధర్వ సదృశంగా వుండేటువంటి రూపాలు, ప్రతిపాదంలోనూ స్పందించేటు వంటి యీ ప్రేమ వెలుగుల వసంతం కలిగించే అనుభూతి నిజంగా అదే....''

తుర్గేనెవ్ ''గొప్పవారి గూడు'' నవలని రాసి 130 యేళ్లు అయింది. కాని యీ నవల యింకా సజీవమే. దీని పాత్రల నైతిక సౌందర్యం, వాళ్ల అనుభూతుల తేజోవంతమైన కవిత్వం, వాళ్ల ఆధ్యాత్మిక ఆతృత, వాళ్ల గవేషణ, — ప్రజల భవిష్యత్తుకి సంబంధించిన గాఢమైన విశ్వాసంమీద ఆధారపడి వున్న యివి — నవలలోని యీ యీ అంశాలన్నీ తుర్గేనెవ్ సమకాలికులకి మాదిరిగానే మనకీ స్పష్టంగా వుంటాయి.

అర్థర్ టొల్స్త్యకోవ్

# 1

1842వ సంవత్సరం. వసంత రుతువులో ఒక చక్కని రోజు సాయంసంధ్య అవబోతోంది. కెంపువన్నె మబ్బుతునకలు నిర్మలాకాశంలో యెత్తుగా వూగుతున్నాయి. అవి మెల్లిగా సాగుతూ వుంటే నీలిమలోతుల్లో కరిగిపోతున్నట్టుగా వున్నాయి.

గుబేర్నియా ముఖ్య పట్టణం ఓ— వూరి చివర్లో ఓ అందమైన యింటి తెరిచిన కిటికీ దగ్గర యిద్దరు మహిళలు కూర్చున్నారు. ఒకామెకి దాదాపు యాభై సంవత్సరాలు వుంటాయి, రెండో ఆమెకి డెబ్బై యేళ్ళు.

వాళ్ళల్లో చిన్నావిడ పేరు మార్య దీమ్త్రియెవ్నా కలీతినా. ఆమె భర్త గుబేర్నియాకి మాజీ పబ్లిక్ ప్రాసెక్యూటర్. ఆయన చనిపోయి పదేళ్ళు అయింది. అతను బతికున్న రోజుల్లో పెడసరంగా, చిర్రుబుర్రులాడుతూ వుండే స్వభావం వున్నవాడనీ, తెలివీ, చురుకూ వున్న మనిషనీ నలుగురూ అనుకునేవాళ్ళు. అతనికి మంచి చదువు చెప్పించారు. విశ్వవిద్యాలయంనుంచి పట్టా పుచ్చుకున్నాడు. కాని సామాన్య కుటుంబంలో పుట్టడంవల్ల ప్రపంచ పరమపద సోపానపటంలో నిచ్చెనలెక్కి పైకి పోవాల్సిన అవసరం గురించీ, జేబులు నింపుకోవాల్సిన అవసరం గురించీ చిన్నతనంలోనే గ్రహించాడు. మార్య దీమ్త్రియెవ్నా వైపునుంచి చూస్తే ఆమెకిది ప్రేమ వివాహమే. యేమంటే అతను సుపురద్రూపీ, తెలివైనవాడూ, తలచుకుంటే స్నేహపాత్రుడుగా వుండేవాడూను. మార్య దీమ్త్రియెవ్నాకి (కన్యానామం పేస్తొవా) చిన్నతనంలోనే తల్లితండ్రులు పోయారు. ఆమె కొన్ని సంవత్సరాలు మాస్కోలోని ఒక ఆడపిల్లల కళాశాలలో గడిపి, తిరిగి వచ్చాక ఓ— పట్టణానికి ఒక పది కోసుల దూరంలో కుటుంబ జమీ వున్న పాక్రోవ్‌స్కాయె గ్రామంలో మేనత్తతోటీ, అన్నగారితోటీ వుండేది. ఆ అన్నగారు తర్వాత కొద్దికాలానికే సెయింట్ పీటర్స్‌బర్గ్‌కి మారిపోయాడు. అక్కడ అతనికి ఓ గవర్నమెంటు ఉద్యోగం వుండేది. అతను తన అత్తమీదా, చెల్లెలిమీదా

దాక్షిణ్యం వెలగబెట్టేవాడు. యింతట్లోకీ హఠాత్తుగా అతను చనిపోవడంతోటి అతని కథ ముగిసిపోయింది. మార్య ద్మీత్రియెవ్నా పొక్రోవ్స్కొయె జమీకి వారసురాలైంది. కాని అక్కడ యెక్కువ కాలం వుండలేదు. తన హృదయాన్ని అనతి కాలంలోనే చూరగొన్న కలీతిన్‌తోటి వివాహం అయి, ఆ తర్వాత ఒక యేడాదిలోనే అంతకంటే లాభసాటిగా వుండే జమీకోసం పొక్రోవ్స్కొయెని బదలాయించేశారు. యేమైనా ఆ కొత్త జమీ ఆకర్షణీయమైందీ కాదు, జమీందారీ నివాసభవనం వున్నదీ కాదు. అదే సమయంలో ఓ— పట్టణంలో కలీతిన్ ఒక యిల్లు కొన్నాడు. అదే ఆ దంపతుల స్థిర నివాసం అయింది. ఆ యిల్లు ఒక పెద్ద తోటలో వుండేది. ఆ తోట ఓ పక్క వూరి చివరి మైదానందాకా వ్యాపించింది. "అంచేత యిది వదలిపెట్టి పల్లెకి పోవాల్సిన పనేలేదు" అని ఖండితంచేశాడు కలీతిన్. పల్లెపట్టుల్లోని సౌకర్యాలంటే అతనికి అభిమానం లేదు. గలగల పారే సెలయేరూ, విశాలమైన పచ్చిక బయళ్ళూ, పచ్చటి చిట్టడవులూ వున్న అందమైన పొక్రోవ్స్కొయె పోయినందుకు చాలా సార్లు మార్య ద్మీత్రియెవ్నా లోపల్లోపల తలుచుకుని యేడ్చేది కాని భర్తని మాత్రం యే విధంగానూ యెదిరించలేదు. అతని తెలివి తేటలన్నా, విషయజ్ఞానం అన్నా ఆమె అపారమైన భయభక్తులతో వుండిపోయేది. పదిహేనేళ్ల కాపరం తర్వాత, ఒక కొడుకూ, యిద్దరు కూతుళ్లూ పుట్టేనాక, అతను చనిపోయేటప్పటికి మార్య ద్మీత్రియెవ్నా ఆ యింటికీ, పట్టణవాసానికీ యెంతగా అలవాటు పడిపోయిందంటే ఓ—ని వదిలిపెట్ట బుద్ధి పుట్టింది కాదు ఆమెకి.

పడుచుదనంలో వున్నప్పుడు మార్య ద్మీత్రియెవ్నా అందకత్తెగానే లెఖ్ఖ. యాభై యేళ్లప్పుడు కూడా ఆమె కనుముక్కు తీరు అందం పూర్తిగా పోలేదు, కొంచెం వెలవెల బారుతున్నట్టున్నప్పటికీ. ఆమెది జాలిగుండె కంటే కూడా భావ దౌర్బల్యం కల ప్రవృత్తి. వయసు వచ్చినా కానీ బడిపిల్లల నడవడిక ఆమెకి పోలేదు. గారం కుడిచేది. తన అలవాట్లలో యెవళ్లైనా జోక్యం చేసుకుంటే ఆమెకి యిట్టే కోపం వచ్చేసేది. కళ్లల్లో నీళ్లు కూడా తిరిగిపోయేవి. కాని ఉబ్బేసి, యెవరూ ఎదురు చెప్పకుండా వుంటే మాత్రం ఆర్ద్రం అయిపోయేది. ఆ పట్టణంలోని అతి చక్కని యిళ్లల్లో వాళ్లదొకటి. ఒక మాదిరి స్థితిమంతురాలే. అదేనా ఆమెకి వారసత్వంగా సంక్రమించిన దాని కంటే భర్త పొదుపరితనంవల్ల కూడిందే యెక్కువ. ఆమె యిద్దరు కూతుళ్లూ ఆమెతోనే వుంటున్నారు. ఆమె కొడుక్కి సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లోని అతి మంచి కళాశాలల్లో ఒక దాంట్లో ప్రవేశం దొరికింది.

మార్య ద్మీత్రియెవ్నా పక్కన కూర్చున్న ముసలావిడే ఆ మేనత్త. ఆమెతోటే ఒకప్పుడు మార్య ద్మీత్రియెవ్నా పొక్రోవ్స్కొయెలో కొన్ని యేళ్లు యేకాంత వాసం చేసింది. ఆ మేనత్త పేరు మార్ఫ తిమొఫేయెవ్నా పేస్తొవా. యెవళ్ల పెత్తనం లక్ష్యపెట్టని తత్వం వున్న మనిషనీ, తిక్క మనిషనీ ఆవిడకి పేరు. వున్నదున్నట్టు మొహంమీదే కుండబద్దలు

కొట్టినట్టు అనేసేదనీ పేరు. పొయ్యిలో పిల్లి లేవకపోయినా దర్జా, దర్పం వెలిగించేసేది. కలీతిన్ అంటే ఆవిడకి మహా మంట. తన మేనకోడలు అతన్ని పెళ్లి చేసుకున్న ఉత్తర క్షణంనుంచీ ఆమె తన పల్లెకి వెళ్లిపోయి, ఒక రైతు పొగచూరిన పూరికొంపలో నిండా పదేళ్లు కాలక్షేపం చేసింది. మార్య ద్మీత్రియెవ్నాకి ఆవిడ అంటే కొంచెం బెదురు. కొనా దేసిన ముక్కూ, నల్లని జుట్టూ, వార్ధక్యంలో కూడా తీక్ష్ణమైన చూపూ వున్న చిన్న మనిషి మార్ఫ తిమొఫేయెవ్నా. చలాకీగా నడిచేది, నడుంవంచకుండా నిటారుగా నిలబడేది. దడ దడా, స్పష్టంగా ఉచ్చస్వరంతో ఖంగున మాట్లాడేది. ఆమె యెప్పుడూ తెల్లటి లేసు టోపీ పెట్టుకునేది. తెల్లటి చేతుల గౌను తొడుక్కునేది.

''ఏమిటి సంగతి?'' అని వున్నట్టుండి ఆమె మార్య ద్మీత్రియెవ్నాని అడిగింది. ''ఏమిటే ఉస్సురంటున్నావ్?''

''వుహుం, యేవీ లేదు'' అందామె. ''యెంత చక్కని మేఘాలు!'' అంది తర్వాత.

''వాటికోసం బాధపడుతున్నట్టుంది నువ్వు?''

మార్య ద్మీత్రియెవ్నా జవాబు చెప్పలేదు.

''గెదెయొనోవ్స్కీ రాడేం చెప్మా'' అంది మార్ఫ తిమొఫేయెవ్నా, అల్లిక సూదుల్ని చకచకా తిప్పుతూ. (ఆమె పెద్ద ఉన్ని స్కార్ఫ్‌ని అల్లుతోంది.) ''అతను వస్తే నువ్వు ఉస్సురనడానికి వగిచేవాడు, లేకపోతే కాసిని కల్లబొల్లి కబుర్లు చెప్పేవాడు.''

''అతనంటే యెప్పుడూ పిసరు కనికరం లేకుండానే మాట్లాడుతూ వుంటావు. సెర్గేయ్ పెత్రోవిచ్ యోగ్యుడైన మనిషి.''

''యోగ్యుడు!'' అని ఆ ముసలావిడ బుసకొట్టింది.

''పాపం మా ఆయనంటే యెంత పడి చచ్చేవాడో! యివాల్టికి కూడా ఆయన్ని గురించి మాట్లాడేటప్పుడు ఆవేశపడకుండా వుండలేడు'' అంది మార్య ద్మీత్రియెవ్నా.

''నేనూ అదే అనుకోవాలన్నమాట! మీ ఆయన యితన్ని దిక్కూ మొక్కూ లేకుండా వున్నప్పుడు కదూ చేరదీసింది?'' అల్లిక సూదుల్ని యింకా గబగబా కదుపుతూ గొణిగింది మార్ఫ తిమొఫేయెవ్నా.

''వూఁ! చూడ్డానికి పరమ సాత్వికుడులాగా వుంటాడు'' అంటూ యింకా చెప్పుకు పోయింది ఆవిడ. ''తల అంతా పండిపోయినా కాని నోరు విప్పాడో అన్నీ అబద్ధాలే. అంతా కంపే. పైగా కౌన్సిలర్ హోదాలో వున్న ప్రభుత్వ ఉద్యోగం! ఆఁ, యింతా చేసి గ్రామ పాచకుడి కొడుకు!''

''ప్రతివాళ్లకీ లొసుగులు వుంటాయి, అత్తా. అది అతని బలహీనత, నిజమే. సెర్గేయ్ పెత్రోవిచ్‌కి చదువు లేదు. ఆ మాట నేనూ ఒప్పుకుంటాను — అతనికి ఫ్రెంచ్ రాదు. కాని మనిషి మంచివాడు, నువ్వేన్నేనా చెప్పు.''

''అవున్లే, నీకెప్పుడూ వంగి దణ్ణం పెడతాడుగా. ఫ్రెంచ్ రాకపోతే యేమిటి! ఫ్రెంచ్ మాటలు పేలితేనే నేను యింతదాన్నయ్యానా? అసలతను యే భాషా మాట్లాడకుండా వుంటేనే మెరుగు — అబద్ధాలు చెప్పకుండా వుంటాడు. అదుగో, అతగాడే వస్తున్నాడు, — మాటనుకుంటే వూడిపడతాడు'' అంది మార్ఫ తిమొఫేయెవ్నా వీధి కేసి చూస్తూ. ''అదుగో నీ మంచి మనిషి, వూక్కుంటూ వస్తున్నాడు. సన్నగా, గడకర్రలా రూపూ తనూ!''

మార్య దీమ్త్రియెవ్నా ఉంగరాల జుట్టు సవరించుకుంది. మార్ఫ తిమొఫేయెవ్నా యెత్తిపొడుస్తున్నట్టుగా ఆమెకేసి చూసింది.

''ఏమిటే అమ్మా, అది, జుట్టు నెరవడం కాదూ? మీ పలాష్కాకి లాభం లేదని చెప్పెయ్యాలి. దానికి కళ్లు ఆనటం లేదా యేమిటి?''

''నిజమేనత్తా, నువ్వెప్పుడూ...'' బాధపడుతున్నట్టి గొంతుకతో, కుర్చీ చేతిమీద వేళ్లు తాటిస్తూ గొణిగింది మార్య దీమ్త్రియెవ్నా.

తల గుమ్మం దగ్గర లటుక్కునపెట్టి, గులాబీ బుగ్గల నౌకరు కుర్రాడు బూరా వూదినట్టు ''సెర్గేయ్ పెత్రోవిచ్ గెదెయొనోవ్స్కీ'' అని అన్నాడు.

## 2

పొడుగాటి మనిషి ఒకతను లోపలికి ప్రవేశించాడు. అతను చక్కటి ఫ్రాక్‌కోటూ, కురచ పంట్లాం, కచిక రంగు మేకపిల్ల చర్మపు గ్లవ్సూ వేసుకున్నాడు. అతను మెడకు చుట్టుకున్న గుడ్డ జవునుది — పైన నల్లనిది, కింద తెల్లనిది. ఆకర్షణీయంగా వుండే ముఖ తీరునుంచి, చక్కగా జుట్టు దువ్వుకున్న కణతల దగ్గర్నుంచి, చదును మడమలూ, మెత్తటి నడక వుండే యెత్తు బూట్లదాకా అతని ఆకారమే మర్యాదా మన్ననా నిండివుండినట్లు కనిపిస్తోంది. అతను మొదట యింటి యజమానురాలికి అభివాదం చేశాడు. తర్వాత మార్ఫ తిమొఫేయెవ్నాకి అభివాదం చేశాడు. చేతులనుంచి గ్లవ్సు మెల్లిగా వూడదీసుకుని మార్య దీమ్త్రియెవ్నా చేతిమీదకి వంగాడు. ఆమె చేతిని వినయంగా చుంబించి, ఆ మాటకొస్తే రెండు సార్లు చుంబించి, అతను నిదానంగా చేతులున్న కుర్చీలో కూర్చుని, చేతివేళ్ల కొనలు రుద్దుకుంటూ, చిరునవ్వు నవ్వి అన్నాడు:

''ఎలిజవేతా మిహైలొవ్నా* బాగుందా?''

---

* రష్యన్లకి సామాన్యంగా మూడు పేర్లు వుంటాయి: మొదటిది తమ పేరు, రెండవది తండ్రి పేరు, మూడవది కుటుంబం పేరు. రెండవ పేరు చివర స్త్రీవాచక లేదా పురుషవాచక సంజ్ఞలుంటాయి. అందుకని అక్కచెల్లెళ్లకి (యిక్కడ వున్నట్టుగా) అదే రెండవ నామం వుంటుంది. — అను.

''ఊఁ, తోటలో వుంది'' అంది మార్య దీమ్రిత్రియెవ్నా.

''మరి యెలేనా మిహైలొవ్నా?

''లేనొచ్కా* కూడా తోటలోనే వుంది. యేమిటి విశేషం?''

''విశేషమే మరి'' అన్నాడు ఆ వచ్చినతను, కళ్లు మెల్లిగా చికిలించి, మూతి ముడుస్తూ. ''హుమ్!... నిజంగా విశేషమే మరి, ఆశ్చర్యంగా వుండే విశేషం కూడానూ. ఫ్యోదొర్ ఇవానిచ్ లవ్రేత్‌స్కీ, యిక్కడకి వచ్చాడు.''

''ఫేద్యా!'' అని అరిచింది మార్ఫ తిమొఫేయెవ్నా. ''యేమిటి, యేమిటి? యిది నీ కల్పన, కదూ?''

''అబ్బే, నా కళ్లతో నేను చూస్తే.''

''అదేం రుజువు కాదు.''

''మనిషి దివ్యంగా వున్నాడు'' అని చెప్పుకుపోయాడు గెదెయొనోవ్‌స్కీ, మార్ఫ తిమొఫేయెవ్నా మాట వినిపించుకోనట్టే. ''విశాలమైన భుజాలూ, చక్కటి గులాబీ రంగు బుగ్గలూ వున్నాయి.''

''దివ్యంగా వున్నాడూ'' మార్య దీమ్రిత్రియెవ్నా మెల్లిగా రెట్టించింది. ''అలా వుండటానికి తగ్గ కారణం యేమీ లేదే.''

''అవును, నిజమే. అతని స్థానంలో మరెవరేనా వున్నట్టైతేనా, వూళ్లోకి రావడానికి ఒకటికి రెండు సార్లు పస్తాయించేవాడు'' అన్నాడు గెదియొనోవ్‌స్కీ.

మార్ఫ తిమొఫేయెవ్నా అడ్డం వచ్చింది: ''అలా యెలా? అది శుద్ధ చెత్త! అతగాడు యింటికి వచ్చాడు, యింకెక్కడికి పోతాడు? నాకిప్పుడు అనిపిస్తోంది అతని తప్పేముందా అని.''

''పెళ్లాం సరిగా వుండకపోతే, చూడండమ్మా, తప్పంతా మొగాడిదే. తెలుసా, నే చెబుతున్నా.''

''మీరలాగే అంటార్లెండి, మీకసలు పెళ్లే అవలేదు కాబట్టి.''

గెదెయొనోవ్‌స్కీ తెచ్చిపెట్టుకున్నట్టు చిరునవ్వు నవ్వాడు.

కొంచెం సేపయిం తర్వాత అతను అన్నాడు: ''నేనేదో కుతూహలంగా వున్నానని మీరను కోకపోతే ఆ చక్కటి స్కార్ఫ్ యెవరికోసం?''

మార్ఫ తిమొఫేయెవ్నా అతని కేసి చురుగ్గా చూసింది.

---

*సన్నిహిత బంధువులు, స్నేహితులు ముద్దు పేర్లు పెట్టి తమ వాళ్లని పిలుచుకోవడం మన దేశంలో లాగానే రష్యాలోనూ ఆచారం. ఎలిజవేతాకి లీజా అనీ, యెలేనాకి లేనొచ్కా అనీ వ్లదీమిర్‌కి వొలోద్య అనీ ముద్దు పేర్లు. అలాగే ఫ్యోదొర్‌కి ఫేద్య అని. — అను.

''యిది యెప్పుడూ పుకార్లు కల్పించకుండానూ, ఆషాఢభూతికాకుండానూ, అబద్ధాలు పేలకుండానూ వుండే మగాడికి, ప్రపంచంలో అలాంటి వాడంటూ యెవడేనావుంటే. నాకు ఫేద్య బాగా తెలుసు. అతని తప్పల్లా అతను పెళ్ళాన్ని అతిముద్దు చేశాడు. కాని పాపం, ప్రేమ వివాహం చేసుకున్నాడు. అలాంటి పెళ్లిళ్లు యెప్పుడూ యింతే, ఒక్కటి సవ్యంగా లేదు,'' క్రీగంటితోటి మార్య ద్మీత్రియెవ్నాకేసి ఓసారి చూసి, లేస్తూ అంది ఆ ముసలావిడ. ''బాబూ, యిక మీ యిష్టం. యెవళ్లనేనా దుమ్మెత్తిపోసుకోండి, నన్ను కూడా; నే పోతున్నాను, మీ కడ్డం రాను.'' అలా అని ఆవిడ వెళ్లిపోయింది.

''ఆవిడ యెప్పుడూ యింతే, యెప్పుడూ'' అంది మార్య ద్మీత్రియెవ్నా వెళ్లిపోతూన్న తన అత్తకేసి కళ్లతో అనుసరిస్తూ.

''మీ అత్తకి పెద్దతనం వచ్చేస్తోంది. ప్చ్, యేం చేస్తాం!'' అన్నాడు గెదెయొనోవ్‌స్కీ. ''ఆషాఢభూతిగా వుండటం గురించి ఆవిడ యేదో అంది. ఆ మాట కొస్తే యివాళ అలా లేని వాడెవడు? యివాళ బతుకే అలా వుంది. మా నేస్తం ఒకడుండేవాడు, యోగ్యుడే, హోదా తక్కువ వాడూ కాదు. అతనంటూ వుండేవాడు యీ రోజుల్లో కోడిపెట్ట కూడా టక్కులు పోకుండా వరిగింజ యేరుకోదని — అది యెప్పుడూ వంకర చూపుల్తో పక్కనుంచే పోతుంది. కాని మిమ్మల్ని చూస్తూ వుంటేనండీ, ఒక దేవతని చూస్తున్నట్టు వుంటుంది నాకు. ఆఁ, యేదీ మీ హిమ సదృశమైన తెల్లటి చేతిని చుంబించే అదృష్టం నాకు కలగ చెయ్యండి.''

మార్య ద్మీత్రియెవ్నా నీరసంగా చిరునవ్వు నవ్వి, సొట్టలు పడ్డ తన చేతిని, చిటికిన వేలు పక్కకు వచ్చేటట్టు, యెదరకి పెట్టింది. అతను దానికి పెదాలు తాటించాడు. ఆమె తన కుర్చీని అతనికి దగ్గరగా లాక్కుంటూ, కొంచెం ముందుకు వంగి, లోగొంతుకతో అడిగింది:

''అయితే మీరు నిజంగా అతన్ని చూసారన్న మాట? అతను నిజంగా — బాగున్నాడా — ఉమ్... అంటే, చలోపాలో మంటూ హుషారుగా వున్నాడా?''

''ఆహాఁ, మాంఛి హుషారుగా వున్నాడు'' అన్నాడు గెదెయొనోవ్‌స్కీ లోగొంతుకతో.

''అతని భార్య యెక్కడ వుందో మీకు తెలిసిందా?''

''మొన్న మొన్నటిదాకా పారిస్‌లో వుండేది. యిప్పుడు ఇటలీకి వెళ్లిపోయిందంటున్నారు.''

''నిజంగా దారుణం — ఫేద్య పరిస్థితి. పాపం యెలా భరిస్తున్నాడా అని అనిపిస్తోంది నాకు. కష్టాలు యెవళ్లకేనా వస్తాయనుకోండి. కాని పాపం అతను మొత్తం యూరప్ అంతా నవ్వుల పాలైపోయాడు.''

గెదెయొనోవ్‌స్కీ నిట్టూర్చాడు.

''అవును, అవును, నిజమే. తెలుసా, ఆవిడ కళాకారులతోటీ, పియానిస్టులతోటీ పూసుకుని తిరుగుతుందట — వాళ్లందర్నీ సంఘంలో పెద్దమనుషులని పిలుస్తారట. అలాంటి వాళ్లందరితోటీ తిరుగుతుందట. ఛఛ ఆవిడకి అసలు సిగ్గూ శరమూ లేవు.''

''నాకెంతో బాధగా వుంది. అతను మా కుటుంబంలోని వాడేకదా, నాకు దూరపు బంధువు. తెలుసుగా మీకు సెర్గేయ్ పెత్రోవిచ్.''

''అయ్యొయ్యో! నాకు తెలియకేం. మీ కుటుంబంలో నాకు తెలియని విషయాలేమున్నాయ్.''

''మమ్మల్ని చూడ్డానికి వస్తాడంటారా?''

''వస్తాడేమో మరి. అతను వాళ్ల వూరికి వెళ్లాలను కుంటున్నాడని విన్నాను.''

మార్య దీమ్త్రియెవ్నా కళ్లు పైకెత్తింది.

''ఆహాఁ సెర్గేయ్ పెత్రోవిచ్, సెర్గేయ్ పెత్రోవిచ్, దీన్ని గురించి అనుకుంటూ వుంటే, మేం, ఆడవాళ్లం, యెప్పుడెక్కడ యెలా మెలగాలో తెలుసుకుని వుండాలి కదా అనిపిస్తుంది నాకు!''

''అందరు ఆడాళ్లూ అదే మచ్చుగా యెందుకుంటారు, మార్య దీమ్త్రియెవ్నా. దురదృష్టవశాత్తూ కొంతమంది ఆడాళ్లు వుంటారు — చపల చిత్తులు, యేమంటారు.... సరే, కాలమాన పరిస్థితిని బట్టే యిలా వుంటుంది; పైగా చిన్నతనంలో సరిగ్గా వాళ్లని పెంచకపోతేనూనూ.'' (సెర్గేయ్ పెత్రోవిచ్ నీలం జేబురుమాలు తీసి దాన్ని మడతలు విప్పడం మొదలుపెట్టాడు.) ''అలాంటి ఆడాళ్లు వున్నారు. వున్నారు.'' (సెర్గేయ్ పెత్రోవిచ్ ఒక దాని తర్వాత ఒకటిగా తన కళ్లని రుమాలుతో ఒత్తుకున్నాడు.) ''కాని మామూలుగా మాట్లాడుకుంటే, ఆ మాట అనుకోనిస్తే కనక, అంటే.... వూళ్లో మాత్రం పిచ్చ దుమ్ము రేగిపోతోంది'' అన్నాడతను.

''అమ్మా, అమ్మా'' అంటూ ఒక పదకొండేళ్ల అందమైన అమ్మాయి గదిలోకి పరిగెత్తుకుంటూ వచ్చింది. ''వ్లదీమిర్ నికొలాయెవిచ్ గుర్రంమీద వస్తున్నాడు.''

మార్య దీమ్త్రియెవ్నా లేచినుంచుంది; సెర్గేయ్ పెత్రోవిచ్ కూడా నుంచుని అభివాదం చేశాడు. ''యెలేనా మిహైలొవ్నా, అభినందనలు'' అన్నాడతను. మర్యాద కోసమని ఓ మూలకి తొలగి వెళ్లిపోయి, పొడుగాటి ముక్కుని చీదుకోవడం మొదలెట్టాడు.

''అతని గుర్రం యెంత బాగుందో!'' ఆ చిన్న పిల్ల చెప్పుకుపోయింది. ''అతను యిప్పుడే గేటుదగ్గర కనిపించాడు. ముందు వసారా వేపు వస్తానని నాతోటీ, లీజాతోటీ చెప్పాడు.''

గిట్టల చప్పుడూ దగ్గర పడింది. గోధుమరంగు గుర్రంమీద కూర్చున్న నాజూకైన యువకుడూ వీధిలో కనిపించి, తెరిచిన కిటికీ ముందు ఆగాడు.

3

''బాగున్నారా, మార్య దీమ్త్రియెవ్నా'' అన్నాడా యువకుడు యింపైన కంచుకంఠం తోటి. ''యెలా వుంది నా కొత్త గుర్రం?'' అని అడిగాడు.

మార్య దీమ్త్రియెవ్నా కిటికీలోనుంచి బయటికి వంగింది.

''బాగున్నావా, వాల్దెమార్. అబ్బ, యెంత బాగుంది గుర్రం! యెక్కడ కొన్నావు?''

''సైనిక కంట్రాక్టరు దగ్గర కొన్నా. దొంగవెధవ, నా దగ్గర యెక్కువ వడికేశాడు.''

''దీని పేరేమిటి?''

''ఆర్లండో, చెత్తపేరు. దీని పేరు మార్చేస్తాను. ఆ బ్యాం, ఆ బ్యాం, మోన్ గర్సొం...* అబ్బో మహా పెంకి గుర్రం యిది!''

గుర్రం బుసకొట్టి, చెంగున గంతువేసి, నురగ చారలున్న ముట్టెని అటూ యిటూ కదిలించింది.

''లేనొచ్కా, దాన్ని నిమురు, ఫరవాలేదు, భయంలేదు.''

ఆ చిన్న పిల్ల కిటికీలోనుంచి చెయ్యి బయటికి పెట్టింది. కాని ఆర్లండో వెనక్కి జంకింది. కాని అతను నిబ్బరంగా దానికి మెడమీద కొరడాతోటి ఓ చురక తగిలించి, దాని డొక్కలో కాళ్లతో తన్ని, అది మొరాయిస్తూ వున్నాగాని, మళ్లీ కిటికీ దగ్గరికి తీసుకువచ్చాడు.

''ప్రేనె గర్డ్, ప్రేనె గర్డ్''** అంటూనే వుంది మార్య దీమ్త్రియెవ్నా.

''లేనొచ్కా, నిమురు. దాని యిష్టం వచ్చినట్టు అది చెయ్యడానికి ఒప్పుకోను'' అన్నాడా యువకుడు.

ఆ పిల్ల మళ్లీ చెయ్యి బయటికి పెట్టి, బెరుకు బెరుగ్గా, కళ్లేన్ని కరకర కొరుకుతూ పెంకెగా వున్న ఆ గుర్రపు వణికే నాసికాపుటాలమీద తట్టింది.

''సెభాష్!'' అని అంది మార్య దీమ్త్రియెవ్నా. ''యిప్పుడు గుర్రం దిగి లోపలికి రా.''

అతను లాఘవంగా గుర్రపు తలని తిప్పి, దానికి ఒక ములుకోల చురక తగిలించి, వీధిలో చెంగున లగెత్తించి ముందు పెరట్లోకి వచ్చాడు. చమ్కీకోలని తిప్పకుంటూ అతను వెంటనే వసారా లోగిలిలోనుంచి డ్రాయింగ్ రూంలోకి ప్రవేశించాడు. అదే సమయంలో యింకో గుమ్మంలోనుంచి పొడుగ్గా, నాజూగ్గా, నల్లని జుట్టు వున్న పంథొమ్మిదేళ్ల పడుచు పిల్ల మార్య దీమ్త్రియెవ్నా పెద్ద కూతురు, లీజా అనే అమ్మాయి ప్రవేశించింది.

---

* మంచిది, మంచిది బాబు... (ఫ్రెంచి).

** జాగ్రత్త, జాగ్రత్త (ఫ్రెంచి).

# 4

యిప్పుడు వచ్చిన యువకుడు వ్లదీమిర్ నికొలాయెవిచ్ పాన్‌షిన్. అతను ఆంతరంగిక వ్యవహారాల మంత్రివర్గంలో ప్రత్యేక నియామకం మీద పనిచేసే ప్రభుత్వోద్యోగిగా, సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో పనిచేశాడు. అతను ఓ— పట్టణానికి తాత్కాలిక అధికార సంబంధమైన వ్యవహారంమీద వచ్చాడు. గవర్నరు అయిన జనరల్ జోన్నెబర్గ్‌వారిని కనిపెట్టుకుని వుండే పనిలో వున్నాడు. ఆయన యితనికి దూరపు బంధువు. పాన్‌షిన్ తండ్రి అశ్విక దళంలో పూర్వం కేప్టెన్. పేరు మోసిన జూదరి. తేనె కళ్ళూ, ముడతలు పడ్డ ముఖం, ఈడ్పుగా కదిలే మూతి వుండే ఆయన తన జీవితమంతా గొప్పవాళ్లతో భుజం భుజం రాసుకుంటూ తిరుగుతూనే గడిపాడు. మాస్కో సెయింట్ పీటర్స్‌బుర్గుల్లోని ఇంగ్లీషు క్లబ్బుల్ని వెంటాడాడు. అంత నమ్మదగ్గవాడు కాకపోయినా చమత్కారంగల మనిషిగా, యెవళ్లతోనేనా సాయిలా పాయిలాగా కలిసిపోయే వ్యక్తిగా పేరు పొందాడు. యెంత నాజూకుగా వున్నా, అస్తమానూ ఇనప గజ్జెల తల్లి ఒళ్లో దాదాపు పడిపోతూ వుండేవాడు. కొడుక్కి అతి తక్కువ — అదీ అధికంగా తాకట్టు పడిపోయివున్న — ఆస్తిని మిగిల్చాడు. యేమైనా కొడుకు చదువుకి మాత్రం ఓ రకంగా యేర్పాటు చేశాడు. వ్లదీమిర్ నికొలాయెవిచ్ ఫ్రెంచ్ అద్భుతంగానూ, ఇంగ్లీషు ఫరవాలేదన్నట్టుగానూ, జర్మన్ అంతంత మాత్రంగానూ మాట్లాడేవాడు. మరి అది అలాగే వుండాలి: జర్మన్ బాగా మాట్లాడ్డం మర్యాదస్థుల దృష్టిలో మంచి అలవాటు కాదు; కాని సమయోచితంగా ఒక జర్మన్ పదబంధాన్ని వాడటం, హాస్యపూరిత ధోరణిలో అయితే యింకా మేలు, మరో రకం, "సె మేమ్ త్రె షిక్"* అని పీటర్స్‌బుర్గ్ పారిసియన్లు** అన్నట్టు. వ్లదీమిర్ నికొలాయెవిచ్ పదిహేనవ యేటే నాగరికుల డ్రాయింగ్ రూముల్లోకి నదురు బెదురు లేకుండా వెళ్లగలిగేవాడు, కులాసాగా కాలక్షేపం చెయ్యగలిగేవాడు, అదునులో నిష్క్రమించగలిగేవాడు. పాన్‌షిన్ తండ్రి కొడుకుకి అనేక పరిచయాలు సంపాదించి పెట్టాడు. రెండు రబ్బర్ల*** మధ్య పేకలు కలిపేటప్పుడో, లేకపోతే "గ్రాండ్ స్లామ్"**** నెగ్గిం

---

* అతి ఫాషనబుల్‌గా (ఫ్రెంచి).

** ఆనాటి సంఘంలో వుండే పెద్దమనుషులు ఫ్రెంచి మర్యాదలని పాటించడం గొప్పగా భావించేవాళ్లు. "పారిసియన్లు" అంటే పారిస్‌వాసులు. పారిస్ నాగరికతని అనుసరించే పీటర్స్‌బుర్గ్ పెద్దమనుషులని పీటర్స్‌బుర్గ్ పారిసియన్లు అని అధిక్షేపంగా రచయిత పిలుస్తున్నాడు. — అను.

*** రబ్బరు — బ్రిడ్జ్ మొదలైన ఆటల్లో అదే ఆటగాళ్ల మధ్య వరసగా సాగే మూడు ఆటల్ని రబ్బరు అంటారు — సం.

**** గ్రాండ్ స్లామ్ — బ్రిడ్జ్ మొదలైన పేకాటల్లో అన్ని పట్లనీ గెలుచుకోవడం. — సం.

తర్వాతో, అలాంటి నైపుణ్యం వున్న ఆటలంటే యిష్టపడే ప్రముఖ వ్యక్తులెవరితో నేనా గానీ తన "వాలోద్కా" గురించి ఓ మాట చెప్పకుండా వుండేవాడు కాదు. తను పట్టా పుచ్చుకున్న విశ్వవిద్యాలయంలో చదువుకునేటప్పుడు వ్లదీమిర్ నికొలాయెవిచ్ కూడా తనకిగా తనూ మేలు జాతి యువకులతోటి పరిచయాలు యేర్పాటు చేసుకుని, గొప్పవాళ్ల యిళ్లల్లో ఆదరణ పొందేవాడు. ఎక్కడేనా అతనికి స్వాగతం లభించేది. అతను అందగాడూ, నిమ్మకు నీరెత్తినట్టు వుండేవాడూ, సరదా అయినవాడూ, యెప్పుడూ మంచి ఆరోగ్యంగానూ, కలుపుగోలుగానూ వుండేవాడూ. అవసరమైనప్పుడు వినయంగానూ, ధైర్యం చిక్కినప్పుడు పొగరు మోత్తనం గానూ వుండేవాడు. భేషైనవాడు, అన్ షర్మాన్ గర్సాం,* జీవితం అత నికి దేవతల దరస్మితం అయింది. పాన్‌షిన్ ఉన్నత సమాజపు రహస్యాలన్నిటినీ అనతి కాలంలోనే పట్టేశాడు; దాని ఆజ్ఞలకి సిసలైన మన్నన యిచ్చేవాడు. సునాయాసంగా తీసిపారేసే గంభీర త్వంతోటి తేలిక విషయాలతోటి వినోదించేవాడు. గంభీరమైన విషయాలని తేలిక విష యాలుగా చూసే నటన చేసేవాడు. అతను అద్భుతంగా నాట్యం చేసేవాడు, ఇంగ్లీషువాళ్ల తరహాలో వేషధారణ చేసేవాడు. అతి తక్కువ కాలంలోనే అతను సెయింట్ పీటర్స్‌బుర్గ్ లోని యెంతో స్నేహపాత్రులూ, ప్రవీణులూ అయిన యువకుల్లో ఒకడుగా పేరు గడించాడు. పాన్‌షిన్ నిజంగా అతిశయించిన చమత్కారి, తండ్రికంటే కూడా యెక్కువ. అలా అని ప్రతిభకేం తక్కువ లేదు. యెందులోనేనా ప్రవేశం చూపించగలడు: యింపుగా పాడతాడు, చక్కగా బొమ్మలు గీస్తాడు, పద్యాలల్లుతాడు, నటనా విషయంలో తీసిపోడు. యింతా చేసి అతని వయసు యిరవై యెనిమిది యేళ్లే, అయినా అప్పటికే కామేర్ జుంకర్** మంచి ఉద్యోగంలో వున్నాడు. పాన్‌షిన్‌కి తన తెలివితేటల్లోనూ, విచక్షణాజ్ఞానంలోనూ ఆత్మ విశ్వాసం వుంది. ధైర్యంగా, ఉల్లాసంగా జీవితంలో ముందుకుపోయాడు. అతని జీవితం ఒడిదుడుకుల్లేకుండా సాగిపోతోంది. పెద్దాళ్లకీ, చిన్నాళ్లకీ కూడా సామాన్యంగా అతనంటే యిష్టం. తనకి మనుషుల తీరు, ముఖ్యంగా ఆడవాళ్ల తీరు, తెలుసునని అతను భావించే వాడు: అతనికి కచ్చితంగా వాళ్ల ఉమ్మడి దౌర్బల్యాలు తెలుసు. కళలపట్ల అభిరుచి వుండటం చేత సహజోత్సాహం, భావనాత్మక ఔత్సుక్యం, పారవశ్యం కూడా అతను గుర్తించాడు. అందు వల్ల నిత్య సూత్రంనుంచి తనకిగా కొన్ని మినహాయింపులు యిచ్చుకున్నాడు. మర్యాదస్థుల

---

* భేషైనవాడు (ఫ్రెంచి).

** 19వ శతాబ్దపు రష్యాలో ప్రభుత్వోద్యోగంలోని ఉన్నత వంశీకులలో వుండే ఒక హోదా. — సం.

సమాజపు అంచుల కవతల వున్న జనంతోటి పైలా పచ్చీసుగా తిరిగాడు, అలవోకగా సంచరించాడు. అంతరంగంలో మాత్రం అతను ఉదాసీనుడు, కుయుక్తుడూనూ. మైమరిచి పోయే సందర్భాల్లో కూడా అతని చురుకైన గోధుమ వర్ణపు నేత్రం, చుట్టుతా యేం జరుగుతోందో కనిపెట్టే వుండేది. సాహసవంతుడైన, స్వతంత్రుడైన యీ యువకుడు యెప్పుడూ అతివ్యామోహానికి లొంగిపోలేదు. యే మాట కామాట చెప్పుకోవాలంటే అతనెప్పుడూ ప్రగల్భాలు చెప్పుకోలేదు. ఓ— పట్టణానికి వచ్చిన మరుక్షణం మార్య ద్మీత్రియెవ్నా యింట్లోకి పోగలిగాడు, అక్కడ కొత్త లేకుండా కలిసిపోయాడు. మార్య ద్మీత్రియెవ్నాకి అతనంటే వెర్రి ప్రేమ.

పాన్షిన్ గదిలో వున్న ప్రతి ఒక్కళ్లకీ మర్యాదగా అభివాదం చేశాడు. మార్య ద్మీత్రియెవ్నాతోటీ, ఎలిజవేతా మిహైలొవ్నాతోటీ కరచాలనం చేశాడు, గెదెయొనొవ్స్కీ భుజం మీద మెల్లిగా తట్టాడు, అటు తిరిగి లేనొచ్కా తల పట్టుకుని నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు.

"అలాంటి పొగరుమోతు గుర్రంమీద స్వారీ చెయ్యాలంటే భయంగా లేదూ?" అని మార్య ద్మీత్రియెవ్నా అతన్ని అడిగింది.

"నిజం చెప్పాలంటే అది బాగా మచ్చికైన గుర్రం. నేను అసలు భయపడేదేమిటో చెప్పనా? సెర్గేయ్ పెత్రోవిచ్‌తోటి ప్రిఫరెన్సు* ఆడ్డం అంటే. నిన్న బెలనీత్సిన్‌ల యింటి దగ్గర నన్ను నిలువు దోపిడీ చేసేసాడు."

గెదెయొనొవ్స్కీ యిహిహీ అని యికిలించాడు. సెయింట్ పీటర్స్‌బుర్గ్‌నుంచి వచ్చిన యువ ఆఫీసరూ, గవర్నరుగారి అభిమాన పాత్రుడూ అయిన యితని అనుగ్రహం సంపాదించాలని గెదెయొనొవ్స్కీ తంటాలు పడ్డాడు. మార్య ద్మీత్రియెవ్నాతోటి మాట్లాడేటప్పుడు ఆ యువకుడి ప్రతిభావిశేషాలని తరచుగా సూచిస్తూనే అతను మాట్లాడాడు. "నిజంగా యేం లెక్కల్లో కుర్రాడు. చాలా పెద్దపెద్ద వాళ్ల దగ్గర మెప్పుపొందాడు. మణిపూసలాంటి ఆఫీసరు. పిసరు కూడా అతిశయం లేదు" అంటూ వుండేవాడు. వాస్తవానికి సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో కూడా పాన్షిన్‌ని సమర్థుడైన అధికారికిందే గణించేవాళ్లు. అతని పనిసామర్థ్యం అమోఘం. తను పడే శ్రమని పెద్ద భారంగా చూడనట్టు ప్రవర్తించే ఉన్నత సమాజపు వ్యక్తికి తగ్గట్టుగానే అతను పనిని గురించి తేలిగ్గా మాట్లాడేవాడు, కాని అతను "సమర్థుడైన అధికారి." పై వాళ్లకి అలాంటి వాళ్లంటేనే యిష్టం. తలుచుకుంటే సకాలంలో మంత్రి స్థాయి హోదా తను అందుకోవడం గురించి అతనికే సందేహమూ లేదు.

---

* ప్రిఫరెన్సు — ఒక తరహా పేకాట. — సం.

''నేను మీమీద గెల్చానంటారా. మొన్న నా దగ్గర పన్నెండు రూబుళ్లు గెల్చిందెవరండీ? మరి అప్పుడు...'' అన్నాడు గెదెయొనోవ్స్కీ.

''అబ్బ, మా చెడ్డ మనిషి'' అన్నాడు పాన్‌షిన్ ఒకరకమైన దయాన్వితమైన, యేవగింపుతో కూడిన ఉదాసీనతతోటి. ఆ తర్వాత అతన్ని గురించి పట్టించుకోలేదు. అప్పుడు లీజా దగ్గరికి వెళ్లాడు. మాట్లాడ్డం మొదలెట్టాడు.

''నాకు 'ఒబెరోన్'* ప్రస్తావన దొరకలేదు. బెలనీత్సినా తన దగ్గర శాస్త్రీయ సంగీతం అంతా వుందని వూరికే గప్పాలు కొట్టింది. ఆమె దగ్గర పోల్కాలు**, వాల్ట్‌జ్లు*** తప్ప యేమీ లేవు. కాని నేను మాస్కోకి కబురు చేశాను. ఓ వారంలో మీకది వస్తుంది. సరేగాని, నేను నిన్న ఓ కొత్త పాట రాశాను, సొంతం. వింటారా? అదెలా వుందో నాకు తెలీదు. బెలనీత్సినా యీ పాట చక్కగా వుందంది. కాని ఆమె మాట లెఖ్ఖలోది కాదు. మీరు యేమనుకుంటున్నారో అది కావాలి నాకు. పొన్లెండి, మళ్లీ చూడచ్చు...'' అతను చెప్పుకుపోయాడు.

''మళ్లీ యెప్పటికో యెందుకు?'' మాటకి అడ్డం వచ్చింది మార్య ద్మీత్రియెవ్నా. ''యిప్పుడే చూద్దాం.''

''మీ యిష్టం'' అన్నాడు పాన్‌షిన్, ముచ్చటగా తళుక్కుమనే చిరునవ్వుతోటి. ఆ చిరునవ్వు యిట్టే వచ్చి అట్టే పోయింది. కుర్చీ పీటని పియానో దగ్గరికి మోకాలుతో గెంటి, దానిమీద కూచుని, మెట్లని ఓసారి తాటించి మాటలని స్పష్టంగా వివరిస్తూ పాడ్డం మొదలుపెట్టాడు:

జాబిలి విహరించెను కలువల కొలనుల పైన,
మబ్బుతునక మాటునుంచి తళుక్కుమంచు,
ఆకాశపు అంచునుంచి అశ్రు అలలపైన తేలు
మాయాకిరణాలతో
నువ్వే కద, ప్రియ, నా హృదయ తరంగాన్ని — దాని
అవధిలేని జలధిని — తరచే జాబిలివి.
నీ శ్రుతి ఖేదమోద తరంగాలు
యెగుడుదిగుడు ఆటుపోట్లు.

---

* కార్ల్ మరియా వేబెర్ రాసిన ''ఒబెరోన్'' సంగీత నాటకానికి సంగీత ప్రవేశం 1830–40 సంవత్సరాలలో చాలా ప్రాచుర్యం పొందింది. — సం.

** బొహీమియా దేశంలో పుట్టిన ఉత్సాహవంతమైన ఒక నృత్యం. — అను.

*** స్త్రీ పురుషులు జంటగా చేసే నృత్యం, దాని కనుగుణమైన సంగీతం. — అను.

నీ కోసమే నా హృదయం, ఆత్రపడు, సాంతవనం చేయు,
వివశుడనగుదు నీపై ప్రేమతోడ.
అచ్చటి జాబిలి వలె నిశ్చల, ప్రశాంతమైన
నిన్నే కాంచెద.

పాన్‌షిన్ రెండవ చరణాన్ని ప్రత్యేకమైన వూపుతోటీ, అనుభూతితోటీ పాడాడు. వాయిద్యపు కల్లోలిత ధ్వని అలల్ని స్ఫురింప చేసింది. "వివశుడనగుదు నీపై ప్రేమతోడ" అన్న పాదం తర్వాత అతను మెల్లిగా నిట్టూర్చాడు, కళ్లని వాల్చి, గొంతుకు స్థాయి తగ్గించాడు. మంద్రస్థాయిలో అతను పూర్తిచెయ్యగానే లీజా దాన్ని మెచ్చుకుంది, మార్య దీమ్త్రియెవ్నా అది "మనోహరంగా వుంది" అంది. గెదెయొనోవ్‌స్కీ అయితే తబ్బిబ్బు అయిపోయి "అద్భుతం! సంగీతం, పాటలోని పదాలు అన్నీ అద్భుతంగా వున్నాయి!" అన్నాడు. లేనొచ్కా పాటగాని కేసి పసిపిల్లల భక్తితోటి చూసింది. ఒక్క ముక్కలో చెప్పాలంటే మొత్తం అంతా కూడా ఆ యువ కళాకారుడి కృతితోటి చాలా సంతృప్తిచెందారు. కాని వసారాలో ఒక ముసలాయన నుంచుని వున్నాడు, ఆయన అప్పుడే అక్కడికి వచ్చినట్టుంది. ఆయన వాలిపోయిన ముఖాన్ని బట్టీ, భుజాలని కదిలించే భంగిమని బట్టీ చూస్తే పాన్‌షిన్ పాట, బాగానే వున్నప్పటికీ, ఆయనలో సంతోషాన్ని తప్ప మరే భావాన్నైనా గానీ కలిగించి వుండవచ్చని తెలుస్తుంది. తన బూట్ల దుమ్ముని ముతక రుమాలుతో దులుపుకోవడానికి ఓ క్షణం ఆగి, ఆ ముసలాయన కళ్లు ముడుచుకొని, ముసురు మూతి పెట్టుకుని, అప్పటికే వంగివున్న విగ్రహాన్ని యింకొంచెం వంచి, గదిలోకి వచ్చాడు.

"ఓ! క్రిస్టఫర్ ఫ్యోదొరిచ్, నమస్తే!" అని అరిచాడు పాన్‌షిన్, మిగతా వాళ్లు అలా చెయ్యడానికి ముందే, తను కూర్చున్న చోటినుంచి లేస్తూ. "మీరిక్కడున్నారని నాకు తెలియనే తెలియదు — మీరుంటే పాటపాడే ధైర్యమే నాకు! మీకు లలిత సంగీతమంటే యిష్టం వుండదని నాకు తెలుసు."

"నేను దాన్ని వినలేదు" అన్నాడా వచ్చినాయన, అసలు రాని రష్యన్లో. అక్కడున్న అందరికీ అభివాదం చేసి, గది మధ్యలో అవకతవగ్గా నిలబడ్డాడు.

"మెస్యో* లెమ్, లీజాకి సంగీత పాఠం చెప్పడానికి వచ్చారు కదూ?" అంది మార్య దీమ్త్రియెవ్నా.

"వుహుం, ఎలెజవేతా మిహ్హైలొవ్నాకి కాదు. యెలేనా మిహ్హైలొవ్నాకి."

"ఆఁ! బాగుంది. లేనొచ్కా, ఆయనతో కలిసి మేడమీదకి వెళ్లు."

---

* మెస్యో ఫ్రెంచ్‌లో "శ్రీ."

ఆ చిన్న పిల్ల వెనకాల ఆ ముసలాయన వెళ్లడానికి సిద్ధంగా వున్నప్పుడు పాన్‌షిన్ అతన్ని ఆపాడు.

"పాఠం అయిపోయాక వెళ్లిపోకండి, క్రిస్టఫర్ ఫ్యోదొరిచ్, ఎలెజవేతా మిహైలొవ్నా నేనూ కలిసి ఒక బీథోవెన్ కృతి వాయిస్తాం" అన్నాడతను.

వినిపించీ వినిపించనట్టుగా ఆ ముసలాయన యేదో గొణిగాడు. పాన్‌షిన్ తప్పుడు ఉచ్చారణతోటి జర్మన్‌లో అన్నాడు:

"మీరు తనకి అంకితం యిచ్చిన దైవభక్తి గేయ నాటకాన్ని ఎలెజవేతా మిహైలొవ్నా నాకు చూపించింది, చాలా బాగుంది! శాస్త్రీయ సంగీతాన్ని ఆస్వాదించలేని వాణ్ణని నన్ను గురించి అనుకోకండి. అందుకు వ్యతిరేకంగా, ఒకో అప్పుడు అది విసుగ్గా వున్నా, అది అంత పూర్ణమైంది."

ఆ ముసలాయన కుదుళ్లలోకంటా యెర్రబడిపోయి, లీజా కేసి ఓరగా చూసి హడా వుడిగా గదిలోనుంచి బయటికి వెళ్లిపోయాడు.

మార్య ద్మీత్రియెవ్నా పాన్‌షిన్‌ని మళ్లీ ఆ పాట పాడమంది. కాని అతను ఆ పండిత జర్మన్ ఆయనకి శ్రుతి కాఠిన్యం కలిగించడం బాగోదన్న సాకుతోటి దాటవేసి, అందుకు బదులుగా బీథోవెన్ కృతి సాధన లీజాకి నేర్పుతానన్నాడు. అప్పుడు మార్య ద్మీత్రియెవ్నా నిట్టూర్చి, తనతోబాటు తోటలోకి షికారుకి రావల్సిందిగా గెదెయొనోవ్‌స్కీని అడిగింది. "మనం మాట్లాడుకునే విషయాన్ని గురించే యింకా మాట్లాడాలని వుంది నాకు. పాపం మా ఫేద్య గురించి మీ సలహా కావాలి" అందామె. గెదెయొనోవ్‌స్కీ కృత్రిమంగా నవ్వి, వందనం చేసి, రెండు వేళ్లతోటే టోపీ యెత్తి పట్టుకున్నాడు. దాని అంచులమీద జాగ్రత్తగా మడిచి వుంచిన గ్లవ్స్ తీసుకున్నాడు. అప్పుడు మార్య ద్మీత్రియెవ్నాని అనుసరించి అవతలికి వెళ్లాడు. గదిలో పాన్‌షిన్, లీజాలు మాత్రమే వుండిపోయారు. ఆమె కృతి పుస్తకం తీసి తెరిచింది. వాళ్లు నిశ్శబ్దంగా పియానో దగ్గర కూర్చున్నారు. చిన్న పిల్ల లేనొచ్కా తడ బడుతూ వుండే వేళ్లతోటి స్వరసాధన చేస్తూవుండడం పైనుంచి నీరసంగా వినవస్తోంది.

## 5

క్రిస్టఫర్ థియొడోర్ గాత్‌లిబ్ లెమ్ సాక్సనీలోని హెమ్‌నిట్జ్ పట్టణంలో, బీద సంగీతకారుల కుటుంబంలో, 1786లో పుట్టాడు. ఆయన తండ్రి ఫ్రెంచ్ తప్పెట వాయించే వాడు, తల్లి త్రికోణాకారపు వీణ వాయించేది. అయిదో యేటే ఆయన మూడు రకాల వాయిద్యాలమీద సాధన చేశాడు. ఎనిమిదో యేట తల్లీ తండ్రీలేని అనాథ అయ్యాడు. పదో యేటకే తన కళద్వారా జీవనోపాధి సంపాదించుకోవడంలో వున్నాడు. చాలా కాలం తెగిన గాలి

పటంలా, యెక్కడ పడితే అక్కడ—సత్రాల్లో, సంతల్లో, రైతుల పెళ్లిళ్లల్లో, విందు నాట్యాల్లో, సంగీతం వాయిస్తూ తిరిగాడు; క్రమేణా ఒక ఆర్కెస్ట్రా బృందంలో చేరి అక్కడ కొంచెం కొంచెమే పైకి వచ్చి, ఆఖరికి దాని దర్శకుడు అయ్యాడు. వాయిద్యాకారుడుగా చెప్పుకోదగ్గవాడు గాదు, కాని ఆయన సంగీతజ్ఞానం మాత్రం పూర్ణమైంది. ఆయన యిరవై యెనిమిదో యేట రష్యాకి చక్కావచ్చేశాడు. సంగీతం అంటే అసహ్యం వున్నా, దర్పంకోసం ఆర్కెస్ట్రా వుంచుకున్న ఓ ఘనుడైన మర్యాదస్థుడు అతన్ని ఆహ్వానించాడు. లెమ్ ఆయన దగ్గర సంగీత దర్శకుడి హోదాలో యేడేళ్లు వుండి, శుష్క హస్తాల్తో అతన్నుంచి సెలవు తీసుకున్నాడు. ఆ పెద్దమనిషి దివాళా యెత్తేసి, లెమ్‌కి ప్రామిసరీ నోటు యిద్దామనుకుని, దరిమిలా ఆ ఆలోచన మార్చుకున్నాడు. మొత్తంమీద లెమ్‌కి ఎర్రని ఏగాని ముట్ట చెప్ప లేదు. దేశం వదిలిపెట్టి పోవల్సిందిగా లెమ్‌కి సలహా యిచ్చారు గాని, రష్యానుంచి ఆ మహత్తర రష్యానుంచి, కళాకారుల పాలిటి కల్పవృక్షమైన రష్యానుంచి ముష్టివాడుగా స్వదేశం పోవడం అతనికి నచ్చలేదు. వుండిపోయి మళ్లీ అదృష్టం పరీక్షించుకుందామని నిశ్చయించు కున్నాడు. పాపం ఆ జర్మన్ ఆయన యిరవై యేళ్లుగా తన అదృష్టాన్ని పరీక్షించుకుంటూనే వున్నాడు: నానారకాల గొప్పవంశీకులతోటీ గడిపాడు; మాస్కోలోనూ స్థానిక పట్టణాల లోనూ ప్రయత్నించాడు. యెంతో బాధపడ్డాడు, యెన్నో ఓర్చుకున్నాడు. దారిద్ర్యాన్ని రుచి చూశాడు, నికృష్టంగా జీవిత పోరాటం సాగించాడు. కాని యిన్ని కఠోర పరీక్షల్లోనూ కూడా స్వదేశం పోవాలనే ఆలోచన మాత్రం అతన్ని వదిలిపెట్టలేదు. ఆ ఆలోచన ఒక్కటే అతన్ని నిలబెట్టింది. పాపం తొలిదీ, కడపటిదీ అయిన ఆ ఆనందాన్ని విధి ఆయనకి అను గ్రహించలేదు: యాభైయ్యవ యేట జబ్బుగా, అకాల దుర్బలతతో, ఓ— పట్టణంలో చిక్కు పడిపోయి, రష్యాని, తను అసహ్యించుకునే రష్యాని, వదిలి వెళ్లిపోవాలనే ఆలోచనకి స్వస్తి చెప్పి, అక్కడ్నే యెప్పటికీ వుండిపోయాడు. సంగీత పాఠాలు చెపుతూ యేదో దైవాధీనపు జీవనాధారం జరిపించుకుపోతున్నాడు. లెమ్‌ది కంటికి నదురుగా అనే రూపం కాదు. పొట్టి, వంగిపోయి వుంటాడు. వంకరగా వున్న భుజాలూ, అప్పళించుకుపోయిన పొట్ట, చదునుగా పెద్దగా వున్న పాదాలూనూ. పొంగిన నరాలున్న యెర్రటి చేతులకి వుండే బిర్ర బిగిసిన, కొమ్ముల్లాంటి వేళ్లకి నీలమూ తెలుపూ కలిసినట్టుండే గోళ్లూ వుంటాయి. అతని ముఖం రెండు ముక్కలు అతికించినట్టు వుంటుంది. చప్పి దవళ్లు, బిగుసుకుపోయిన పెదాలు. ఆయన ఆ పెదాలని ఎప్పుడు మెలిపెడుతూ, కొరుకుతూ, అలవాటుగా వుండే మితభాషిత్వానికి అసహ్యం కలిగించే లక్షణాన్ని తోడు చేస్తాడు. ఆయన తలమీది తెల్ల వెంట్రుకలు పల్లపు కనుబొమలమీద వుంజీలుగా చెదరివుంటాయి. నిశ్చలమైన ఆయన కళ్లు ఆరిపోయే చితుకుల్లాగా మండుతూ వుంటాయి. ప్రతి అడుక్కీ తూలుతూ, భారంగా కాయాన్ని ముందుకు తోసుకుంటూ వికారంగా వుండే నడక తీరు అతనిది. అతని భంగిమలు కొన్ని,

పంజరంలో పెట్టిన గుడ్లగూబ, తనని చూస్తున్నారనుకొని, నిస్సహాయంగా చేసేదేమీ లేక మిడిగుడ్లని మిటకరిస్తూ, వికారంగా చూస్తున్నట్టి దృశ్యాన్ని గుర్తుకు తెస్తాయి. గాఢమైన హరించే దుఃఖం పాపం ఆ సంగీత సాధకుడిమీద చెరపలేని ముద్ర వేసింది. యేవిధంగానూ సరసంగా వుండని ఆయన వైఖరిని ఆ దుఃఖం ధ్వంసం చేసి, వికలం చేసింది. యీ శాపగ్రస్తుడైన ప్రాణిలో యేదో అసాధారణమైంది, నిజాయితీ పూర్వకమైంది యేదో తొలి చూపులవల్ల కలిగే అభిప్రాయాలకే లొంగిపోని వాళ్లకి కనిపించేది. బాఖ్‌నీ, హేండెల్‌నీ అభిమానించేవాడుగా, తన వృత్తి నైపుణ్యం వున్నవాడుగా, జర్మన్ జాతికి వుండే విలక్షణమైన మానసిక శక్తీ, స్పష్టమైన వూహాతోటీ సంపన్నుడైన లెమ్ కాలగతిలో — ఎమో ఎవరికి తెలుసు? — తన దేశపు మహత్తర వాగ్గేయకారులతో సరితూగే వాడేమో, అదృష్టం వరిస్తే. కాని పాపం అతనిదలాంటి అదృష్ట జాతకం కాదు. తన రోజుల్లో యెన్నో కృతులు రాశాడు. కాని అందులో ఒక్క పాదం కూడా గడ్డన పడలేదు. ఆయన విషయ సాధనకి సక్రమమైన దారిలో వెళ్లడు, అనుకూలమైన చోట స్తోత్రపాఠం చెయ్యడు, సరియైన వ్యవధిలో కదలడు. పూర్వం యెప్పుడో ఒకప్పుడు అతని అభిమానీ మిత్రుడూ అయిన ఒకతను, అతని లాగానే జర్మన్ దేశీయుడూ బీదవాడూ అయిన అతను, లెమ్ రాసిన రెండు కృతుల్ని తన సొంత ఖర్చుమీద అచ్చువేసి ప్రకటించాడు. కాని మొత్తం కాపీలన్నీ దుకాణాల అరల్లోనే వుండిపోయాయి; ఎవరో వాటిని రాత్రికి రాత్రి నదిలో గిరవాటు వేసినట్టుగా, విస్మృతంగానే చెదలకి మేత అయిపోయాయి. చివరికి లెమ్ తన కర్మకి తను సమాధాన పడిపోయాడు. మరి వయస్సు కూడా అతన్ని వంగదీస్తోంది. అతని చేతుల్లాగానే అతని మనసు కూడా గట్టిపడి, బిరుసెక్కిపోయింది. కలీతిన్‌ల యింటికి దగ్గర్లోనే ఒక చిన్న యింట్లో ఒంటరిగా వుండేవాడు. అతనితోబాటు పేదల సత్రంనుండి ఆయన చేరదీసిన వంటావిడ వుండేది. (ఆయన అసలు పెళ్లి చేసుకోలేదు.) ఆయన చాలా దూరం నడిచి షికారు వెళ్లేవాడు, బైబిల్ చదివేవాడు, ప్రోటస్టెంట్ ప్రార్థనాగీతాల గ్రంథం చదివేవాడు, లేకపోతే ష్లెగల్ అనువాదం చేసిన షేక్స్పియర్ నాటకాలు చదివేవాడు. యెంతోకాలంగా ఆయన యే సంగీత కృతీ రాయలేదు. కాని ఆయన అతిప్రియమైన శిష్యురాలైన లీజా ఆయన వైముఖ్యాన్నుంచి ఆయన్ని జాగృతం చేసింది. ఆమె కోసం అతను పాన్‌షిన్ ప్రస్తావించిన గేయనాటికని రాశాడు. తన నాటకానికి తన ప్రార్థనాగీతాల పుస్తకంలోని మాటలు జోడించాడు. ఆ గేయనాటికకి ఆయన కొన్ని సొంత పద్యాలు జత చేశాడు. దాన్ని రెండు బృంద గానాలుగా రాశాడు — ఒక బృందగానం సంతోషందీ, యింకొకటి దుఃఖందీ. యీ రెండూ చివర్లో కలిసి పోయి ఒకే స్వరంతో, "దయాళువైన ప్రభూ, భవదీయ పాపులను మన్నించు; దుష్టచింతనలనుండీ, ఐహిక కాంక్షలనుండీ మమ్మల్ని తరింప చెయ్యి" అని ముగుస్తాయి. ముఖ పత్రంమీద బహు జాగ్రత్తగా చెక్కిన, ఆ మాట కొస్తే పొదిగిన, ఐతిహ్యం వుంది:

''బుజాశీలురే ధర్మబద్ధులు. దైవపరమైన గేయనాటిక. నా ప్రియమైన శిష్యురాలు కుమారి ఎలిజవేతా కలీతినా కోసం రాసి, అంకితం చేస్తున్నది, ఆమె గురువు సి.టి.జి. లెమ్.'' ''బుజాశీలురే ధర్మబద్ధులు,'' ''ఎలిజవేతా కలీతినా'' అనే మాటలు మాత్రం కాంతి కిరణాల వృత్తంలో వున్నాయి. కింద యింకా వుంది, ''నీ ఒక్కర్తె కోసమే, ఫ్యుర్ జి ఎల్లైన్*'' అని. అందుకనే ఆయన జేవురించుకుని, లీజా కేసి నిష్ఠూరంగా చూశాడు. తన ముందు పాన్‌షిన్ ఆ గేయనాటిక ప్రస్తావన తెచ్చినందుకు ఆయన చాలా నొచ్చుకున్నాడు.

## 6

పాన్‌షిన్ ఖంగుమని, స్థిరంగా పాట ఆరంభచరణాలు వాయించాడు (అతను పియానో మీద వంత వాయిస్తున్నాడు), కాని లీజా అసలు వాయించడం మొదలుపెట్టలేదు. అతను పాట ఆపి ఆమె కేసి చూశాడు. ఆమె కళ్ళు అతని మీదే లగ్నమై అసంతృప్తిని వ్యక్తం చేస్తు న్నాయి. ఆమె పెదవులమీద చిరునవ్వు లేదు. ఆమె ముఖం ముభావంగా వుంది. దాదాపు విచారంగా వుంది.

''ఏమిటి సంగతి?'' అని అతను అడిగాడు.

''అన్న మాటమీద వుండరేం మీరు? ఆయన ముందు ఒక్క మాట కూడా అనకుండా వుంటారని అనుకునే కదా నేను క్రిస్టఫర్ ఫ్యోదొరిచ్‌గారి గేయనాటికని మీకు చూపించింది?'' అందామె.

''పొరపాటైపోయింది, ఎలిజవేతా మిహైలొవ్నా. నోరు జారింది.''

''ఆయన్ని బాధపెట్టారు, నన్నూ బాధపెట్టారు. యిప్పుడు ఆయన నన్ను నమ్మతాడా?''

''ఏమిటో అలా అయిపోతుంది ఎలిజవేతా మిహైలొవ్నా. నా చిన్నప్పటినుంచీ కూడా ఓ జర్మన్‌ని చూస్తే యేడిపించకుండా వుండ బుద్ధెయ్యదు.''

''ఆ మాట అనడానికి నోరెలా వచ్చిందండీ, వ్లదీమిర్ నికొలాయెవిచ్! యీాయన పాపం ఒంటిగాడు, చితికిపోయిన మనిషి — ఆయన్ని చూస్తే మీకు జాలి వెయ్యదూ? అలాంటాయన్ని యేడిపించ బుద్ధి పుడుతుందా?''

పాన్‌షిన్ సిగ్గుపడిపోయాడు.

''మీరన్న మాట నిజమే, ఎలిజవేతా మిహైలొవ్నా. అదే నా దుందుడుకుతనం. హుం,

---

* నీకొక్కర్తె కోసమే (జర్మన్).

ఆక్షేపించకండి. నాకు తెలుసు. నా తెలివితక్కువతనం చాలా చేటు తెచ్చిపెట్టింది. దాని పుణ్యమా అని నాకు అహంభావిననే పేరు వచ్చింది.''

పాన్‌షిన్ ఆగాడు. అతను యే విషయం గురించి సంభాషణ మొదలుపెట్టినా సరే, దాన్ని ఆఖరికి తనకి ముడిపెట్టుకునే ముగించేవాడు. ఆ పని కూడా అవతలి వాళ్లకి అనుమానం కలగనంతటి సొగసుగా, సహజంగా వున్నట్టుగా, సరసంగా — అనుకోకుండా అలవోకగా చేసేవాడు.

''మాటకి మీ యిల్లే తీసుకోండి'' అతను చెప్పుకుపోయాడు, ''మీ అమ్మ, సరేనను కోండి, నేనంటే యిష్టపడతారు. ఆమె అంత దయగల మనిషి; మీరు.... సరే, నాకు తెలీదు మీరు నన్ను గురించి యేమను కుంటున్నదీనీ. కాని మీ మామ్మగారు మాత్రం, ఆవిడకి నా పొడే గిట్టదు. నా దుందుడుకుతనం వల్ల నేను బహుశా ఆవిడని కష్టపెట్టి వుంటాను. వెధవ బుద్ధి. ఆమెకి నేనంటే యిష్టం వుండదు. వుందా?''

''లేదు.'' ఒక క్షణం తటపటాయించి లీజా ఒప్పుకుంటున్నట్టు అంది. ''ఆమెకి యిష్టం లేదు.''

పాన్‌షిన్ పియానో మెట్లమీద వేళ్ళు ఆడించాడు. ఒక నీరస వ్యంగ్యహాసం అతని పెదాలమీద తొణికిసలాడింది.

''మీ సంగతి చెప్పారు కాదు. మీరు కూడా నేను అహంభావిననే అనుకుంటున్నారా?'' అన్నాడు.

''మీ గురించి నాకు యేమంత బాగా తెలుసు?'' అంది లీజా. ''కాని మిమ్మల్ని అహం భావి అని నేను అనుకోను. పై పెచ్చు, మీకు నేను కృతజ్ఞురాలిగా వుండాలి.''

''నాకు తెలుసు, మీరేం చెప్పబోతున్నారో నాకు తెలుసు.'' పాన్‌షిన్ మాటకి అడ్డం వచ్చాడు, మరో సారి మెట్ల మీద వేళ్ళు ఆడిస్తూ. ''ఆ సంగీతం కోసం, మీకు నేని చ్చిన పుస్తకాల కోసం, మీ బొమ్మల పుస్తకంలో నేను గీసే చెత్త బొమ్మల కోసం వగైరా వగైరాలకి నాకు కృతజ్ఞత చూపిస్తానంటారు. అవన్నీ చేస్తూ కూడా, నేను అహంభావిగా వుండచ్చుగా. నా స్నేహం మీకు విసుగనిపించదనీ, నన్ను చెడ్డవాడుగా అనుకోరనీ నేను ఆశించే సాహసం చేస్తాను, కాని నేను — ఏమిటి, ఆ సామెత — ఆఁ, వేళాకోళం చేసేదానికి మనవాడైనా, పైవాడైనా ఒక్కలాగే వుంటానని మీరు అనుకుంటారు కదూ.''

''మీకు ధ్యాస తక్కువ, మరుపెక్కువ. సంఘంలో నాగరీకులందరి లాగానే. అంతే'' అంది లీజా.

పాన్‌షిన్ కొంచెం కనుబొమలు ముడిచాడు.

''పోన్లెండి, నా గురించి యింక మాట్లాడుకోవద్దు, యీ కృతి చూద్దాం. ఓ విషయం మిమ్మల్ని అడగాలను కుంటున్నాను'' అని చెప్పుకుపోయాడతను, స్టాండ్‌మీద వున్న

సంగీత పుస్తకపు కాగితాలని సరిచేస్తూ. "నన్ను గురించి యేమైనా అనుకోండి. నేను అహంభావినని కూడా అనుకోండి — అలాగే! కాని నన్ను మాత్రం నాగరిక సమాజం వాడని అనకండి. ఆ మాటంటేనే నాకసహ్యం. అన్‌చియో సానో పిట్టోరె.* నేను ఓ కళాకారుణ్ణి కూడా, అంతంత మాత్రం వాణ్ణే, బహుశా; నేను అంతంత మాత్రం కళాకారుణ్ణే అన్న విషయాన్ని యిక్కణ్ణే యిప్పుడే రుజువు చేస్తాను. మొదలు పెడదాం."

"వూఁ, మొదలు పెడదాం" అంది లీజా.

మొదటి విళంబితం ఫరవాలేదన్నట్టుగానే సాగింది, పాన్‌షిన్ తరచుగా ఘోరమైన తప్పులు చేసినా. తను సాధన చేసిన కృతుల్నీ, సంగీతాన్నీ అతను బాగానే వాయిస్తాడు, కాని చూసి చదవడం మాత్రం అతని వల్ల కాదు. కృతిలోని రెండవ భాగం — కొంచెం వేగంగా వుండే ద్రుతగతి (allegro) మాత్రం మొత్తానికి చెడిపోయింది; యిరవైయ్యవ చరణం వచ్చేసరికి, రెండు చరణాలు వెనకబడిపోయానని గమనించి, పాన్‌షిన్ వదిలిపెట్టేసి, కుర్చీ వెనక్కి తోసేసి, నవ్వేశాడు.

"ప్చ్, లాభం లేదు" అన్నాడతను. "యివాళ వాయించలేను. యింకా నయం, లెమ్ గారు వినలేదు. గుండె బాదుకునేవాడు."

లీజా లేచి నుంచుని, పియానో మూసేసి, పాన్‌షిన్ కేసి తిరిగింది.

"మరి యేం చేద్దాం?" అని అడిగింది.

"అసలా ప్రశ్న యేమిటి! ఒక్క క్షణం కూడా వూరికే కూచోలేరు. సరే, మీకిష్టమైతే, కాసేపు బొమ్మలు గీద్దాం, వెలుతురు వుండగానే. బహుశా యింకో దేవత — చిత్రలేఖన దేవత — ఆవిడ పేరేమిటీ? ఏమిటో గుర్తు రావడం లేదు — ఆమె నన్ను అనుగ్రహిస్తుందేమో. యేదీ మీ బొమ్మలు గీసే పుస్తకం? నాకు గుర్తున్న మట్టుకి నేను గీస్తూ వుండే ప్రకృతి దృశ్యం పూర్తవలేదు."

లీజా పుస్తకం తేవడానికి పక్క గదిలోకి వెళ్ళింది. పాన్‌షిన్ ఒక్కడే వుండిపోయి జేబులోనుంచి మిసమిసలాడిపోయే తన జేబురుమాలు తీసి, గోళ్ళు తుడుచుకుని, కళ్ళు కొంచెం ముడిచి తన చేతులని పరిశీలనగా చూశాడు. అవి తెల్లగా వున్నాయి. చాలా నీటుగా వున్నాయి. యెడమచేతి బొటన వేలికి బంగారపు శంకువు లాంటి ఉంగరం వుంది. లీజా తిరిగి వచ్చింది; పాన్‌షిన్ కిటికీ దగ్గర కుర్చీలో కూర్చుని బొమ్మలు గీసే పుస్తకం తెరిచాడు.

"ఓహో! మీరు నా బొమ్మని కాపీ చెయ్యడం మొదలెట్టారన్న మాట — భేష్! నిజంగా, చాలా బాగుంది! యిక్కడ మాత్రం కొంచెం — యేదీ, పెన్సిల్ యిలా యివ్వండి — ఛాయలు యింకొంచెం మందం వుండాలి. చూడండి" అన్నాడు.

---

* నేనూ కూడా కళాకారుణ్ణి (ఇటాలియన్).

పాన్‌షిన్ కొన్ని పాడుగాటి గీతల్ని గీశాడు. అతను యెప్పుడూ అవే ప్రకృతి దృశ్యాలు గీస్తాడు: ముందు భాగంలో పాడుగాటి, వూగులాడే చెట్లూ, వెనక కొంచెం పచ్చిక బీడూ, యెగుడుదిగుడు కొండల రేఖలు. లీజా అతని భుజాల వెనకనుంచి చూస్తోంది.

"చిత్రలేఖనంలో, సామాన్యంగా జీవితంలో లాగానే, ముఖ్యమైన దేమిటంటే — లాఘవమూ, ధైర్యమూనూ" అన్నాడతను తలని ఓసారి కుడివేపుకీ, ఓసారి యెడం వేపుకీ ఓరగా తిప్పుతూ.

సరిగ్గా ఆ సమయంలోనే లెమ్ గదిలోకి ప్రవేశించాడు. గబగబా వందనం చేసి వెళ్ళి పోవడానికి సిద్ధమయాడు; కాని బొమ్మలు గీసే పుస్తకమూ, పెన్సిలూ పక్కకు గిరవాటేసి పాన్‌షిన్ అతనికి అడ్డం వెళ్ళాడు.

"యెక్కడి కండీ పోతున్నారు? కాస్త టీ తాగి వెడుదురుగాని."

"నేనింటికి పోతాను. నాకు తలనొప్పిగా వుంది" అన్నాడు లెమ్, చిరచిరలాడుతూ.

"అబ్బ, రండీ, కాసేపు కూర్చోండి. మనం షేక్‌స్పియర్ నాటకాలని గురించి మాట్లాడుకుందాం."

"నాకు తలనొప్పిగా వుంది" రెట్టించాడు ముసలాయన.

"మీరు లేకుండానే బీథోవెన్ కృతిని మొదలుపెట్టాం" పాన్‌షిన్ ఆ ముసలాయన నడుం చుట్టూ ఆప్యాయంగా చెయ్యి పెట్టి, తియ్యగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు, "కాని సాగలేదు. రెండు చరణాలు వరసగా తప్పుల్లేకుండా వాయించలేకపోయాను, తెలుసా?"

"మీ పాటనే మళ్ళీ యింకో సారి పాడాల్సింది" అన్నాడు లెమ్, పాన్‌షిన్ చెయ్యి తోసేసి, బయటికి పోబోతూ.

లీజా ఆయన వెనక పరిగెత్తింది. ఆయన్ని ముందు వసారాలో అందుకోగలిగింది.

"ఏమండీ, వినండి" అందామె జర్మన్‌లో అతనితో, తోటలోని పచ్చిక బయలుగుండా గేటుదాకా నడిచి వెడుతూ. "నేను మీకు కష్టం కలిగించాను. క్షమించరూ?"

లెమ్ జవాబివ్వలేదు.

"మీ గేయనాటకాన్ని వ్లదీమిర్ నికొలాయెవిచ్‌కి చూపించాను. అతను మెచ్చుకుంటాడనే నమ్మకంతోటి. నిజంగా అతనికది యెంతో నచ్చింది."

లెమ్ ఆగాడు.

"సర్లే" అన్నాడతను రష్యన్లో, మళ్ళీ జర్మన్‌లో అన్నాడు: "కాని అతనికేమీ అర్థం కాదు; నీకు తెలీదూ? అతను వట్టి ఔత్సాహికుడు — అంత మాత్రమే!"

"అతన్ని గురించి అన్యాయంగా మాట్లాడుతున్నారు. అతనికి అన్నీ తెలుసు, ప్రతిదీ దాదాపు సొంతంగా చేస్తాడు" అంది.

"కావచ్చు. కాని నాసి రకం. చవకబారు సరుకు, పేలపిండి లాంటిది. జనానికి అదంటే

యిష్టం, అతనంటే యిష్టం, అతనికి తృప్తి — అంచేత అంతా బాగుండిపోతుంది. నాకు కోపం లేదు. ఆ గేయనాటికా, నేనూ యిద్దరమూ తెలివితక్కువ వాళ్లమే. నాకు కొంచెం సిగ్గయింది. అయినా ఫరవాలేదు.''

''క్షమించండి'' లీజా మళ్లీ గొణిగింది.

''పోన్లే'' ఆయన మళ్లీ రష్యనులో అన్నాడు. ''నువ్వు మంచి పిల్లవి.... చూడు, యెవరో వస్తున్నారు. వస్తాను. నువ్వు మంచి పిల్లవి!''

లెమ్ హడావుడిగా గేటు దగ్గరకి వెళ్లిపోయాడు. అప్పుడు బూడిదరంగు కోటు తొడుక్కుని వెడల్పాటి అంచులున్న టోపీ పెట్టుకున్న వ్యక్తి యెవరో లోపలికి ప్రవేశించాడు. అతనికి మర్యాద పూర్వకంగా వందనం చేసి లెమ్ దడి వెనక్కాల మాయమైపోయాడు (ఆయన యెప్పుడూ పరాయి వాళ్లకి అభివాదం చేస్తాడు, దారిలో కనక పరిచితులు తటస్థ పడితే తప్పుకు పోతాడు. అది ఆయన తీరు.) ఆ కొత్త వ్యక్తి వెనక్కి వెళ్లిపోయే ఆయన కేసి ఆశ్చర్యంగా చూసి, అప్పుడు లీజా కేసి పరిశీలనగా చూసి, ఆమె దగ్గరికి నేరుగా నడిచి వచ్చాడు.

## 7

''నన్ను గుర్తుపట్టలేదూ?'' అన్నాడతను, టోపీ తీసేసి. ''కానీ నేను మిమ్మల్ని గుర్తుపట్టాను, మిమ్మల్ని చూసి యెనిమిదేళ్లయినా కానీ. అప్పుడు మీరింత పిల్లలా వుండే వాళ్ళు. నా పేరు ల్రవేత్‌స్కీ. అమ్మగారు యింట్లో వున్నారా? నేను ఆవిడని చూడాలి.''

''మిమ్మల్ని చూడాలంటే అమ్మకి సంతోషమే. మీరు వచ్చారని ఆవిడకు తెలిసింది'' అంది లీజా.

''మీ పేరు ఎలిజవేతా కదూ?'' అన్నాడు ల్రవేత్‌స్కీ వసారా మెట్లు యెక్కుతూ.

''వూఁ.''

''మీరు నాకు బాగా గుర్తున్నారు. అప్పట్లో కూడా మిమ్మల్ని ఒక సారి చూస్తే మరచి పోలేరు. మీకు నేను మిఠాయిలు తెచ్చిపెట్టేవాణ్ణి.''

లీజా సిగ్గుపడి, అనుకొంది: యేం వింత మనిషి! ల్రవేత్‌స్కీ హాల్‌లో ఒక క్షణం ఆగాడు. లీజా డ్రాయింగ్ రూంలోకి వెళ్లింది. అక్కణ్ణుంచి పాన్‌షిన్ గొంతుకా, నవ్వులూ వినిపిస్తున్నాయి. షికారు నుంచి అప్పటికే తిరిగి వచ్చిన మార్యా దీమ్రితియెవ్నాకీ, గెదెయొనోవ్‌స్కీకీ అతను లోకాభిరామాయణపు సంఘటననొకదాన్ని వర్ణిస్తున్నాడు. తను చెప్పే దానికి తనే గట్టిగా నవ్వుతున్నాడు. ల్రవేత్‌స్కీ పేరు వినగానే మార్యా దీమ్రితియెవ్నా దడదడ లాడింది. అతన్ని కలుసుకోవడానికి వస్తూ ఆమె వివర్ణమైపోయింది.

"బాగున్నారా?" అందామె సాగదీస్తూ దాదాపు గుడ్ల నీళ్లు కుక్కుకుంటూన్న గొంతుకతో. "మిమ్మల్ని చూడ్డం చాలా సంతోషంగా వుంది."

"బాగున్నారా, అక్కయ్యగారూ" అన్నాడు ల్రవేత్స్కీ ఆమె చేతిని ఆప్యాయంగా గుంజుతూ. "భగవంతుడు బాగా చూస్తున్నాడా?"

"కూర్చోండి, కూర్చోండి, ఫ్యోదొర్ ఇవానిచ్. అబ్బ, యెంత సంతోషంగా వుందో. మొదటగా మా అమ్మాయి లీజాని పరిచయం చెయ్య నివ్వండి."

"మీ అమ్మాయి ఎలిజవేతా మిహైలొవ్నాని నేనిప్పుడే పరిచయం చేసుకున్నాను" అన్నాడు ల్రవేత్స్కీ.

"యీయన పాన్షిన్, యీయన సెర్గేయ్ పెత్రోవిచ్ గెదెయొనోవ్స్కీ. కూర్చోండి. మొత్తానికి వూడిపడ్డారు. నిజంగా నన్ను నేను నమ్మలేకుండా వున్నాను! ఎలా వున్నారు?"

"చూస్తున్నారుగా, ఫరవాలేదు. మీరు అక్కయ్యగారూ — అనుకుంటే తప్పుగాకపోతే — ఎనిమిదేళ్ల కితం వున్నట్టే వున్నారు."

"దాన్ని గురించి అనుకోడమంటే యిదిగా వుంది. ఒకొళ్లనొకళ్లం చూసి యెంత కాలమైంది" అంది మార్య దీమ్త్రియెవ్నా సాలోచనగా. "ఎక్కడనుంచి వచ్చారు? ఎక్కడి వెళ్లిపోయా.... అంటే, నా ఉద్దేశం," తన మాటకి తనే అడ్డువచ్చి అంది ఆమె, "అంటే యెక్కువ రోజులు వుంటారా?"

"నేను యిప్పుడే బెర్లిన్‌నుంచి వచ్చాను. రేపు వూరికి పోతాను. బహుశా చాలా రోజులు అక్కడ వుంటా" అన్నాడు ల్రవేత్స్కీ.

"లావ్రికిలో వుంటారు, కదూ?"

"వుహుఁ, లావ్రికిలో కాదు. మా వూరు యిక్కడికి ఆరు కోసులు వుంటుంది. అక్కడికి వెడదా మనుకుంటున్నాను."

"గ్లఫీర పెత్రోవ్నానుంచి మీకు వారసత్వంగా వచ్చింది అదే, కదా?"

"ఆఁ, అదే."

"కాని ఫ్యోదొర్ ఇవానిచ్! లావ్రికిలో మీ యిల్లు యెంత బాగుంటుంది!"

ల్రవేత్స్కీ కొంచెం కనుబొమలు ముడిచాడు.

"అవును.... కాని, ఆ వూళ్లో కూడా చిన్న యిల్లు వుంది. ప్రస్తుతానికి నాకది బాగా సరిపోతుంది. యిప్పట్లో అంతకంటే యెక్కువ అక్కర్లేదు."

మార్య దీమ్త్రియెవ్నా యెంతో ఆశ్చర్యపడిపోయి, కుర్చీలో అలానే బిగిసిపోయి, నిరాశా పూరితమైన సంజ్ఞ చేసింది. పాన్షిన్ ఆవిడకి యిబ్బంది తప్పించి, ల్రవేత్స్కీని సంభాషణలో దించాడు. మార్య దీమ్త్రియెవ్నా మళ్లీ స్థిమితపడి, చేతుల కుర్చీలో కూలబడి, మధ్యమధ్యలో ఓ మాట అండిస్తూ, ఆ వచ్చిన వ్యక్తికేసి యీ లోపున చూస్తూ సూచ

నార్ధకంగా నిష్ఠూరుస్తూ విషణ్ణంగా తల పంకిస్తూ వుండేటప్పటికి అతగాడు విసుగెత్తి పోయి ఆఖరికి ఆమెని వంట్లో బాగాలేదా అని అడిగాడు.

''దేవుడి దయవల్ల ఆ లోపంలేదు. ఏం అలా అడుగుతున్నారు?'' అంది మార్య దీమ్త్రియెవ్నా.

''వూరికేనే. ఒక క్షణం పాటు మీకు వంట్లో బాగా లేదేమో ననిపించింది.''

మార్య దీమ్త్రియెవ్నా అహం దెబ్బతిన్న వాలకం పెట్టింది. ''ఓహో, అదా, సంగతి'' అనుకొంది ఆమె. ''నాకేమీ బాధకలగదు. బాబూ, మీకైతే తామరాకుమీద నీటి బొట్టులా వుంటుంది. మీ స్థానంలో మరెవరేనా వుంటే అడుగంటిపోయి వుండేవాడు, మీరు మాత్రం తుళ్లుతూ పేలుతూ వున్నారు.'' మార్య దీమ్త్రియెవ్నా తన మనసులో అతి సున్నితమైన మాటలకోసం తంటాలు పడలేదు. కాని పైకి సున్నితంగా అనేసేది.

లవ్రేత్‌స్కీ విధికి బలైనట్టుగా పిసరైనా కనిపించనే కనిపించడు. గులాబీరంగు ఛాయ, విశాలమైన తెల్లటి నుదురు, మాంసలమైన నాసిక, బాణంలా వంపులు తిరిగిన పెదవులు వున్న విలక్షణమైన రష్యన్ వదనం తన స్వదేశపు పచ్చిక మైదానాల నిర్మల ప్రాచీన దారుఢ్యాన్నీ, శక్తినీ ఆశ్వాసిస్తున్నట్టుగా వుంటాయి. పుష్టిగా, పొందికగా వుండే విగ్రహం. అతని అందమైన జుట్టు పిల్లవాడి జుట్టు లాగా ఉంగరాలు తిరిగి వుంటుంది. నీలంగా, స్ఫుటంగా, కొంచెం నిశ్చలంగా వుండే అతని కళ్లే వ్యామోహాన్ని — లేక ఆయాసాన్నా? — వెల్లడి చేస్తాయి. అతని గొంతుక కొంచెం అతి అయిన సమస్వరంతో వున్నట్టుంటుంది.

యింత సేపూ పాన్‌షిన్ నిరుత్సాహంగా వున్న ఆ సంభాషణని కొనసాగించాడు. పంచదారను శుద్ధి చెయ్యడంమీదకి అతను సంభాషణని మళ్లించాడు. దాన్ని గురించి అంతకు ముందే అతను రెండు ఫ్రెంచ్ పుస్తకాలు చదివాడు. నిబ్బరమైన వినయంతోటి ఆ పుస్తకాల్లోని విషయాన్ని వివరించుకుంటూపోయాడు. కాని ఆ పుస్తకాలని గురించి మాత్రం ఒక్క ముక్క కూడా చెప్పలేదు.

''ఎవరది, ఫేద్య కాదూ?'' సగం తెరుచుకున్న తలుపు అవతలి పక్కగదిలో నుంచి వున్న పళంగా మార్ఫ తిమోఫేయెవ్నా గొంతుక వినపడింది. ''ఫెద్యయే!'' ఆ ముసలావిడ చెంగున ఆ గదిలోకి వచ్చింది. లవ్రేత్‌స్కీ యింకా నుంచున్నాడో లేదో ఆమె అతన్ని కౌగిలించు కుంది. ''యేదీ ఒక సారి నిన్ను చూడనీ'' అంటూ ఆమె ఒక అడుగు వెనక్కి వేసింది. ''ఓహ్, యెంత సొగసైన పిల్లాడివి నువ్వు! కొంచెం వయసొచ్చింది, అయినా ఫరవాలేదు, ఆఁ! నా చెయ్యి ముద్దుపెట్టుకోనక్కర్లేదు. నా బుగ్గలు ముద్దెట్టుకో, జిడ్డుగా వున్నాయా? నన్ను గురించి అనుకోలేదు కదూ నువ్వు? యీ ముసలి అత్త వుందో లేదో అడిగావా? నిన్ను నా చేతుల్తో పెంచాను, కొంటెవాడా! పోన్లే, నన్ను గురించి నువ్వు అనుకుంటావూ?

పోస్లే వచ్చావు, అదే పదివేలు. చూడమ్మా'' అంటూ ఆవిడ మార్య దీమ్మిత్రియెవ్నా కేసి తిరిగి అంది, ''అతని కేమన్నా పెట్టారా?''

''అబ్బెబ్బె, నాకేమీ వద్దు'' అని గబగబ అన్నాడు లవ్రేత్స్కీ.

''కాస్త టీ అయినా తాగు, పోనీ. భగవంతుడా! పాపం యెక్కడ్నుంచి వచ్చాడో యేమో ఒక కప్పు టీ కూడా లేదాయె! లీజా, వెళ్లి దాని సంగతి చూడు, వూఁ, త్వరగా! వాడు యింత పిల్లాడుగా వున్నప్పుడు తిండిపోతు, యిప్పుడు కూడా అంతే వుంటాడు, యేం.''

''నమస్కారం, మార్ఫ తిమొఫేయెవ్నా'' అన్నాడు పాన్‌షిన్ తడబడిపోతూ వున్న ఆ ముసలావిడ కేసి జరుగుతూ, వందనం చేసి.

''నువ్వా, ఏం అనుకోకు, నిన్ను యీ సంబరంలో చూడనే లేదు'' అంది మార్ఫ తిమొఫేయెవ్నా. ''నువ్వు మీ అమ్మలాగే వుంటావు'' అని లవ్రేత్స్కీ కేసి తిరిగి మళ్లీ అంది. ''ముక్కు తప్ప, అది మీ నాన్న పోలికే. అలాగే వుంటుంది. అయితే యెక్కువ రోజులు వుంటావా?''

''రేపు వెళ్లిపోతున్నానత్తా.''

''యెక్కడికి వెడతావు?''

''వసీల్యెవ్‌స్కాయెలోని మా యింటికి.''

''రేపేనా?''

''రేపే.''

''సరే, రేపే అయితే, కానీ. దేవుడి దయవల్ల నీకు తెలుసు. కాని వెళ్లి పోయేముందు వచ్చి చెప్పి వెళ్లు!'' ఆ ముసలావిడ అతని బుగ్గ నిమిరింది. ''నిన్ను మళ్లీ చూస్తాననుకో లేదు. నేను వెళ్లిపోయే రోజు దగ్గర పడుతోందని కాదు. పదేళ్లు చులాగ్గా లాగేస్తాను, ఆఁ! మా పేస్తొవ్‌ల ఆయుర్దాయాలు గట్టివి. మీ తాతగారు అంటూ వుండేవారు మాకు ఒక్కొక్కళ్లకీ యిద్దరి యిద్దరి ఆయుర్దాయాలు వున్నాయని. కాని నువ్వు యెంత కాలం దేశదిమ్మరిగా వుండేవాడివో దేవుడికి తెలియాలి. యేమైతేనేం నిన్ను చూడ్డమే పండగగా వుంది. యింకా ఒంటి చేత్తో గుండెత్తు మూట యెత్తుతున్నావా? యిదివరకు చేసేవాడివిగా! మీ నాయన — అవకతవక మనిషైనా గానీ — అలా అంటున్నందుకు యేమీ అనుకోకు, నీ చదువుకోసం ఆ స్విస్ ఆయన్ని పెట్టి మంచి పనిచేశాడు. గుర్తుందా మీ యిద్దరి ముష్టి యుద్ధాలూ? జిమ్నాస్టిక్కులనే వారు కదూ? నాయనా, యిక్కడ నేను అర్థం పర్థం లేకుండా వాగుతూ, పన్‌షీన్ మాటల్లో జోక్యం కలగ జేసుకుంటూ వున్నాను.'' (ఆమె పాన్‌షిన్ పేరులో మొదటి స్వరంకంటే రెండో స్వరం ఒత్తి పలికేది.) ''కానీ, టీ తాగుదాం. రా, వరండాలో కూచుని టీ తాగుదాం. మంచి మీగడ వుంది. లండన్లలోనూ, పారిస్‌ల్లోనూ

దొరికేలాంటిది కాదు. రండి, రా, ఫేద్య, యేదీ చెయ్యి కొంచెం ఆసరా యియ్యి. అబ్బ, యెంత సత్తువైన జబ్బ! నువ్వుంటే పడిపోతామన్న భయంలేదు.''

గెదెయొనోవ్‌స్కీ తప్ప అంతా లేచి వరండాలోకి వెళ్లారు. అతను మెల్లిగా జారుకున్నాడు. యింటి యజమానురాలితోటీ, పాన్‌షిన్‌తోటీ, మార్ఫ తిమొఫేయెవ్నాతోటీ ల్రవేత్‌స్కీ మాట్లాడుతూ వున్నంతసేపూ అతను ఓ మూల కూర్చుని, కళ్లు చికిలిస్తూ, చిన్న పిల్లల మాదిరీ జిజ్ఞాసతోటి నోరు వెళ్లబెట్టి చూస్తూనే వున్నాడు. యీ నూతన వ్యక్తి రాక గురించి వూళ్లో వూదెయ్యడానికి తొందరగా వెళ్లిపోతున్నాడు.

అదే రోజు రాత్రి పదకొండు గంటలకి శ్రీమతి కలీతినా యింటిదగ్గర జరిగింది యిదీ. కింద, డ్రాయింగ్ రూం నడవలో వ్లదీమిర్ నికొలాయెవిచ్, అదును చూసుకుని, లీజా దగ్గర సెలవు తీసుకుంటూ, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటున్నాడు: ''నేనిక్కడికి రావడానికి కారణం మీకు తెలుసు. నేను యిక్కడికి, తరచుగా మీ యింటికి, యెందుకు వస్తానో మీకు తెలుసు. దాన్ని గురించి చెప్పడం యెందుకు, అంతా యింత స్పష్టంగా వున్నాక?'' లీజా జవాబు చెప్పలేదు. ఆమె చిరునవ్వు నవ్వలేదు. కాని కనుబొమలు కొంచెం యెత్తి నేలకేసి చూస్తూ, సిగ్గుపడుతోంది. తన చేతిని వెనక్కి లాక్కోలేదు. ఆ సమయంలో పైన మేడమీద, మాసిపోయిన విగ్రహాల ముందు వేలాడే చమురు దీపపు మసక వెలుతురులో, మార్ఫ తిమొఫేయెవ్నా గదిలో ల్రవేత్‌స్కీ పడక కుర్చీలో కూర్చుని వున్నాడు. అతని మోచేతులు మోకాళ్లమీద ఆని వున్నాయి. అతను చేతులమీద ముఖం ఆన్చుకుని వున్నాడు. ఆ ముసలావిడ, అతని ముందు నుంచుని నిశ్శబ్దంగా అతని తల నిమురుతోంది. యజమానురాలిదగ్గర సెలవు తీసుకున్నాక ఓ గంట పైగా అతను ఆ ముసలావిడదగ్గర వున్నాడు. అతను యీ దయాన్విత, పాత మిత్రంతోటి సరిగా మాట్లాడనేలేదు. ఆమె కూడా అతన్ని ప్రశ్నించలేదు. అయినా మాట్లాడ్డానికేం వుంది, ప్రశ్నల అవసరం యేముంది? ఆమె అంతా అర్థం చేసుకుంది. అతనికి అతని హృదయంలో సెల్లుబికేవాటికన్నిటికి మృదువైన సానుభూతి చూపించింది.

## 8

ఫ్యోదొర్ ఇవానొవిచ్ ల్రవేత్‌స్కీ గొప్ప వంశస్థుడు. (కొంచెం సేపు కథలో అంతరాయం వస్తున్నందుకు పాఠకుడు మన్నించు గాక.) ల్రవేత్‌స్కీల మూలపురుషుడు వసీలియ్ త్యోమ్ని*

---

* బెసిల్ ది బ్లైండ్. ఆయన 1425–1462లలో మాస్కో రాజ్యపు పాలకుడు. — సం.

పరిపాలనా కాలంలో ప్రష్యానుంచి వచ్చాడు. బెజెత్‌స్కీ వెర్ఖ్‌లో రెండు వందల ఎకరాల భూమిని మాన్యంగా పొందాడు. ఆయన వంశీకులు చాలా మంది అనేక ఉద్యోగాలు చేశారు, రాకుమారుల దగ్గరా, జమీందారుల దగ్గరా దూరప్రాంతాల్లో సేవచేశారు. అయినా వాళ్లల్లో యెవళ్లూ కూడా ఠాణేదారు కంటె పెద్ద హోదాకాని, చెప్పుకోదగ్గ ఐశ్వర్యం కాని పొంద లేదు. ల్రవేత్‌స్కీ వంశంలో కొంచెం చెప్పుకోదగ్గ వ్యక్తి ఫ్యోదొర్ ఇవానిచ్ ముత్తాత అంద్రేయ్. నిరంకుశుడు, పొగరు మోతు, జిత్తుల మారీ, కుయుక్తిపరుడూనూ. ఆయన నిరంకుశత్వపు కీర్తిగాని, ఉద్ధృతమైన తత్వంగాని, అసంగతమైన వితరణగాని, విపరీతమైన లౌల్యం గాని యీనాటికీ మనుషుల స్మృతిపథంలో చెరగిపోలేదు. ఆయన దృఢకాయుడు, పొడగరి, నల్లని చాయ, శ్మశ్రురహితుడు, పరుషంగా మాట్లాడేవాడు, నిద్రమత్తుగా వుండేటట్టు కని పించేవాడు. కాని ఆయన కంఠస్వరం యెంత మృదువుగా వుంటే, ఆయన పక్కలనుండే వాళ్లు అంతలా వణికి పోయేవాళ్లు. ఆయన పెళ్లి చేసుకున్న ఆవిడ ఆయనకి మంచి జోడీ. ఆవిడది మీది గుడ్లు, గద్ద ముక్కూ, గుండ్రని పాలిపోయిన ముఖమూ వున్న ఆకారం. జన్మతః జిప్సీ అయిన ఆవిడ గయ్యాళి, పగ బట్టే మనిషిని. ఆవిడ భర్త మాటని యెప్పుడూ ఖాతరు చెయ్యలేదు. ఆయన యెప్పుడూ ఆవిడకి మృత్యు భీతిగానే వుండేవాడు. కాని ఆయనతోటి శునక మార్జాలవతు జీవితం గడిపినా ఆయన పోయాక ఆవిడా ఎక్కువ కాలం బతకలేదు. అంద్రేయ్ కొడుకు ప్యోత్ర్‌కీ, అంటే ఫ్యోదొర్ తాతకీ, ఆ తండ్రికీ పోలికే లేదు. యీయన పచ్చిక బీళ్ల సాదా యజమాని. కొంచెం ఉల్లాసంగా, వదురుతూ, మందంగా వుండేవాడు. మోటు మనిషిగాని స్వభావం చెడ్డది గాదు, అతిథి సత్కారాపేక్ష గలవాడు, జాగిలాలతో వేట అంటే యిష్టపడేవాడు. చెక్కు చెదరకుండా రెండు వేలమంది భూస్వామ్యదాసులతో వున్న జమీకి వారసుడయ్యేనాటికి ఆయన వయస్సు ముప్పైకి కొంచెం పైబడివుంది. కాని త్వరలోనే వాళ్లందర్నీ యథేచ్ఛగా వదిలేశాడు, జమీలో కొంత భాగం అమ్మేశాడు, సేవకులందర్నీ పాడుచేసేశాడు. నానా రకాల జనమూ కూడా ఆయన ఆతిథ్యాన్ని అందుకోవడానికి ఆదరపూర్వకంగా వుండి, సరిగా నిర్వహణలేని ఆయన యింటికి బొద్దింకల్లా వచ్చిపడ్డారు. ఆ సోదర గణమంతా ఆయన్ని ఇంద్రుడివనీ, చంద్రుడివనీ పొగిడేసి తినగలిగినంత తిని, తాగగలిగినంత తాగి, అందినంత అంకించుకుని పోయారు. ఆయన కూడా మానసికంగా ఒడిదుడుకుగా వున్నప్పుడు వాళ్లని తిండిపోతులనీ, దొంగలనీ తూలనాడేవాడు గాని, వాళ్లు లేకపోతే ఆయనకి తోచేది కాదు. ప్యోత్ర్ అంద్రేయెవిచ్ భార్య సాధువు, మెతక మనిషిని. ఆయన తండ్రి కోరికమేరకీ, ఆజ్ఞమేరకీ పొరుగు కుటుంబం నుంచి ఆవిడని పెళ్లి చేసుకున్నాడు. ఆవిడ పేరు అన్నా పావ్‌లొవ్నా. ఆవిడ యెప్పుడూ యెందులోనూ జోక్యం చేసుకునేది కాదు. ఆదరపూర్వకమైన గృహిణి. సంతోషంగా పెత్తనాలు పోయేది. కాని వాసన గుండలు చల్లడం మాత్రం పీడ అని ఖండితంగా అనేదావిడ.

"నెత్తిమీద బొచ్చు టోపీలాంటి దాన్ని పెడతారు. జుట్టంతా పైకి దువ్వుతారు. దానికి జిడ్డు పట్టిస్తారు. దాన్ని పిండితో మెత్తుతారు, మొత్తం అంతా ఇనప సూదులు గుచ్చుతారు. యెంతలా తల రుద్దుకున్నా అదిపోదు. కాని వాసన గుండ చల్లించుకోకుండా యెవళ్లనీ చూడ్డానికి పోలేరు. వాళ్లు తప్పు పట్టుకుంటారు. అబ్బ! యెంత దుర్భరం అది!" అని ఆవిడ వార్ధక్యంలో అంటూ వుండేది. చురుకైన పందెపు గుర్రంమీద స్వారీ అంటే ఆవిడకి యెంతో యిష్టం. పొద్దున్నుంచి సాయంత్రందాకా పేకాట ఆడడానికి తయారుగా వుండేది. కాని భర్త ఆటదగ్గరికి వచ్చేటప్పటికల్లా తను గెలిచిన ఆ కాసిని పైసలనీ దాచేసేది. అయినా తన కట్నం మొత్తం, తన డబ్బంతా, అతని వద్దీలోనే వుంచింది. ఆమెకి యిద్దరు పిల్లలు పుట్టారు. ఒక కొడుకు ఇవాన్, ఫ్యోదొర్ తండ్రి; ఒక కూతురు, గ్లఫీర. ఇవాన్ యింటి దగ్గర పెరగలేదు. సంపన్నురాలైన మేనత్తదగ్గర పెరిగాడు. ఆవిడ పేరు రాకుమారి కుబేన్స్కయా. ఆమె అతన్ని వారసునిగా చేసింది (మరోలా జరిగేటట్టయితే అతని తండ్రి అతన్ని పంపివుండేవాడు కాదు). ఆమె అతన్ని ఒక బొమ్మలాగా ముస్తాబు చేసేది. సర్వ రకాల గురువులనీ యేర్పాటు చేసింది. ఒక ఉపాధ్యాయుడి అజమాయిషీలో అతన్ని వుంచింది. ఆ ఉపాధ్యాయుడు ఫ్రెంచ్ ఆయన, పూర్వం మతగురువు, జాన్ జాక్ రూసో శిష్యుడు, నామధేయం కూర్తిన్ దె వసిల్యే. సూక్ష్మ బుద్ధిగలవాడు, పన్నుగడ తెలిసినవాడు, ఆమె అన్నట్టు వలసవచ్చిన వాళ్లల్లో ఫిన్ ఫ్లోర్*. దాదాపు డెబ్బై యేళ్ల యౌవన ప్రాయంలో యీ ఫిన్ ఫ్లోర్‌ని వివాహమాడింది. తన ఆస్తినంతా అతనికి దఖలు పరచి, ఆతర్వాత కొద్ది కాలంలోనే రిషల్యే పద్ధతిలో** అత్తరు సువాసనలతోటీ వర్ణశోభితమై నీగ్రో పరిచారకులు, పెంపుడు కుక్కలు, రామచిలకలు పరివేష్టించి వుండగా, చేతిలో పింగాణీ పూత పెట్టిన ముచ్చటైన ముక్కు పొడుం డబ్బీ పట్టుకుని పదిహేనవ లూయీకి చెందినటువంటీ, వంగిపోయినటువంటీ సిల్కు సోఫామీద దివంగతురాలైంది. భర్తృపరిత్యక్తయై దివంగతురాలైంది. మృదువుగా మాట్లాడే శ్రీమాన్ కూర్తిన్ ఆమె ధనం అంకించుకుని పారిస్‌కి పోవడం యుక్తమని భావించాడు. యీ అనుకోని దుస్సంఘటన జరిగే నాటికి (అంటే రాకుమారి వివాహం, మరణం కాదు) ఇవాన్‌కి యిరవై సంవత్సరాలు. తను ఒక సంపన్నుడైన వారసుడి స్థాయినుంచి మరొకళ్లమీద ఆధారపడవలసి వచ్చే నికృష్ట జీవిత స్థితికి హఠాత్తుగా దిగజారిపోయి, యిక ఆ మేనత్త యింట్లో వుండటం అతనికి వెలపరం అయిపోయింది. సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో తను పెరిగిన ఆ సమాజం అతన్ని రానివ్వలేదు.

---

* ఆణిముత్యంలాంటివాడు (ఫ్రెంచి).

** ఆర్మన్ రిషల్యే (1696–1788) – ఫ్రాన్స్‌లో సేనాధిపతి. తన రసిక సాహస కృత్యాలకీ, కల్పిత స్మృతులకీ ప్రసిద్ధుడు. – సం.

ఓ చిన్న ఉద్యోగం తాలూకు హీనవృత్తీ, అనామకత్వం అతనికి వెగటుని పించాయి (యిది అలెగ్జాండర్ చక్రవర్తి పాలనలోని తొలి నాళ్లల్లో); చేసేది లేక గ్రామానికీ, తండ్రి గృహానికీ పోవాల్సివచ్చింది. ఆయన పాత యిల్లు మురికిగా, బీదగా, అసహ్యంగా కనిపించింది. ఆ లోతట్టు ప్రాంతాల రొచ్చు, బావురుమనే వాతావరణం అడుగడుగునా అతన్ని అదరగొట్టేశాయి. అతనికి చచ్చేటంత విసుగయిపోయింది. మరో పక్కన, యింట్లో తల్లి తప్ప అందరూ అతన్ని అనుమానంగా చూశారు. అతని తండ్రికి అతని బస్తీ పద్ధతులు, ఆ ఫ్రాక్ కోట్లు, నున్నటి క్రాపింగులు, పుస్తకాలు, పిల్లనగ్రోవి, ప్రతిదానికీ సొంటు పెట్టే సున్నితమైన అలవాట్లు యేవీ నచ్చలేదు. ఆయన తరచుగా కొడుకుమీద గొణుక్కుని, నిష్ఠూరం ఆడేవాడు. ''వాడికి యేదీకిట్టదు'' అనేవాడు ఆయన. ''తిండిదగ్గర అంతా పదును. సరిగ్గా తినడు, మనుషుల పొడ గిట్టదు, గది ఉక్కగా వుంటే కిట్టదు; తాగుబోతుతనం అంటే మంట. వాడి ముందు ఒక భూదాసుణ్ణి దండించడానికి లేదు. ఉద్యోగంలోనా చేరడు, ఆరోగ్యం పసి అయింది కాదు. ఛ, మరీ ముద్దూ, గారాల పాలకూచి! అదుగో బుర్రనిండా వాల్టేర్ భావాలుండబట్టే యిదంతాను.'' ఆ ముసలాయనకి వాల్టేర్ అన్నా ఆ ''నాస్తికుడు'' డిడెరాట్ అన్నా ప్రత్యేకమైన కోపం, తను యెప్పుడూ వాళ్ల రాసినవి ఒక్క ముక్క చదవకపోయినా; ఆయన గొప్పతనం చదువులో లేదు. ప్యోత్ర్ అంద్రేయెవిచ్ పొరపడలేదు: డిడెరాట్, వాల్టేర్ ఆ మాటకొస్తే రూసో, రేనాల్, హెల్వెటియస్ యింకా యింకా అలాంటి చాలా రచయితల భావాలు ఆయన కొడుకు బుర్రలో కుక్కుకుపోయాయి; కాని అవి అతని బుర్రలో మాత్రమే వుండిపోయాయి. ఉద్యోగ విరమణ చేసిన మత బోధకుడూ విజ్ఞాన సర్వస్వపండితుడూ అయిన, అతని పూర్వపు గురువు మొత్తం పద్దెనిమిదవ శతాబ్దపు విజ్ఞానాన్ని ఆమూలాగ్రంగా తన శిష్యుని బుర్రలో కుక్కడంకంటే యేమీ చెయ్యలేదు. అతని బుర్రలో పిసరు సందులేకుండా యిదే కూరుకుపోయింది. అది అతని రక్తంలోకి యింకకుండా, ఆంతరిక జీవితంలోకి జారకుండా, దృఢ విశ్వాసాలతో వెల్లడి అవకుండా అలానే వుండిపోయింది. యీనాటికూ్కడా దృఢ విశ్వాసాలు యేర్పరచుకునేటట్టుగా మనం యెదగలేదే, యాభై యేళ్లకితం యువకులకి అవి వుంటాయా? అతని తండ్రిగారి అతిథులు కూడా ఇవాన్ పెత్రోవిచ్ ముందు యిబ్బంది పడిపోయేవారు; అతను వాళ్లనుంచి తప్పించుకునేవాడు, వాళ్లు అతనంటే భయపడేవాళ్లు. యిక అక్క గ్లఫీర, అతని కంటే పన్నెండేళ్లు పెద్ద, ఆమెతోటి అతను కలిసి వుండనే లేకపోయాడు. యీ గ్లఫీర ఓ వింత మనిషి: అంద విహీనంగా, గూని నడుముతోటి శుష్కించిపోయి వుండేది. వికారంగా వెర్రిచూపులు చూసే కళ్లూ, పల్చగా, బిగిసిపోయిన పెదాలూ మొత్తంమీద వాలకంలోనూ వంకర చేష్టల్లోనూ తన మామ్మ అయిన జీప్సీ, అంద్రేయ్ భార్యని, పోలి వుండేది. తలబిరుసు, దురాశ వున్న ఆవిడ పెళ్లి మాట తలపెట్టేదే కాదు. ఇవాన్ పెత్రోవిచ్ యింటికి

తిరిగి రావడం ఆవిడకు యిష్టం లేదు. రాకుమారి కుబేన్స్కయా అతని పోషకురాలుగా వున్నంత కాలం తండ్రి ఆస్తిలో సగం తనకి వస్తుందని ఆశిస్తూ వుండేది. పిసినారితనంలో కూడా ఆవిడకి మామ్మ పోలికే వచ్చింది. పై పెచ్చు గ్లఫీరకి తమ్ముడు అంటే అసూయగా వుండేది. అతను బాగా చదువుకుని పారిస్‌వాసుల ఉచ్చారణలోనే ఫ్రెంచ్ మాట్లాడగలిగితే తను సరిగ్గా ''బాన్ జూ'' (శుభోదయం) అనిగాని, ''కొమాన్ వు పొర్తె వు?'' (బావున్నారా?) అని గాని అనలేకపోయేది. ఆవిడ తల్లిదండ్రులకీ ఫ్రెంచ్ భాషా జ్ఞానం పూజ్యమే గాని ఆవిడ తత్కారణంగా యే ఆధిక్యతా పొందలేదు. పనిలేకపోవడంవల్ల ఇవాన్ పెత్రోవిచ్‌కి యేమీ పొద్దుపోక పిచ్చెక్కినంత విసుగ్గా వుండేది. అతను పల్లెలో యేడాదికంటే గడప లేదు, కాని ఆ ఒక్క యేడూ పదేళ్ల పెట్టు అయిపోయింది. కప్పు యెత్తు తక్కువ వున్న తల్లి గదిలో కూచుని ఆవిడ చెప్పే అమాయకపు కబుర్లు వింటూ జామ్ మెక్కుతూ ఒక్క ఆమె దగ్గరే మనసు బరువు దించుకునేవాడు. ఆన్నా పావ్‌లొవ్నా పరిచారికల్లో సౌమ్యమైన కళ్ళూ, సున్నితమైన లక్షణాలూ వున్న చక్కటి అమ్మాయి వుండేది. ఆమె పేరు మలాన్యా. తెలివిగా, అణకువగా వుండే పిల్ల. ఆమె అతన్ని ఆకర్షించింది: వెంటనే అతను ఆమెని ప్రేమించేశాడు. ఆమె బెరుకుగ్గా వుండే వైఖరినీ, బిడియంతో వుండే జవాబులనీ, మృదువైన కంఠాన్నీ, మెత్తటి చిరునవ్వునీ అతను ప్రేమించాడు. ఆమెపట్ల అతని ప్రేమ రోజు రోజుకీ పెరిగింది. ఆమె కూడా ఇవాన్ పెత్రోవిచ్‌కి మనసారా దగ్గరగా వచ్చింది. రష్యన్ అమ్మాయి మాత్రమే ప్రేమించగలిగినట్టుగా ఆమె అతన్ని ప్రేమించింది. ఆమె అతని ప్రేమకి వశ్యురాలైపోయింది. పల్లెటూరి కలవారి యింట్లో యే రహస్యమూ యెక్కువ కాలం దాగదు. త్వరలోనే మలాన్యాతోటి కుర్రయజమానిగారి ప్రేమ కలాపం నలుగురికీ తెలిసిపోయింది. క్రమేపీ యీ వార్త ప్యోత్ర్ అంద్రేయెవిచ్‌గారి చెవుల సోకింది. మరొకప్పుడెప్పుడేనా అయితే ఆయన అలాంటి క్షుద్ర విషయాన్ని ''ప్చ్'' అని తీసిపారేసేవాడు. కాని చాలా కాలంగా కొడుకుపట్ల కోపంతో వుండటంవల్ల, పీటర్స్‌బుర్గ్ ఛాందసుడూ, బడాయి కోరూ అయిన పుత్రరత్నానికి ఒక చురక తగిలించడానికే యీ అవకాశాన్ని వినియోగించుకున్నాడు. యింట్లో పెద్ద రభస అయిపోయింది. మలాన్యాని తుక్కు సామాన్ల గదిలో పెట్టి తాళం వేసేశారు. తండ్రి ముందు హాజరు కావాల్సిందిగా ఇవాన్ పెత్రోవిచ్‌ని పిలవనంపారు. యీ సంరంభంలో అన్నా పావ్‌లొవ్నా కూడా పరిగెత్తుకుంటూ వచ్చింది. ఆమె భర్తని శాంతపరచ ప్రయత్నించింది, కాని ఆయన ఆమె మంచి మాటని వినలేదు. కొడుకు మీద విరుచుకుపడ్డాడు. అతని నైతిక పతనానికీ, నాస్తికత్వానికీ, వంచనకీ శాపనార్థాలు కురిపించాడు. సందు చిక్కిందికదా అని చెప్పి కుబేన్స్కయా రాకుమారిమీద తనలో అణిగి వున్న ఆగ్రహాన్నంతట్నీ కొడుకుమీద వెళ్ల గక్కేశాడు, అతనిమీద తిట్లు కుమ్మరించేశాడు. మొదట్లో ఇవాన్ పెత్రోవిచ్ తండ్రికి యేమీ యెదురు చెప్పకుండా, నిగ్రహంగానే

వున్నాడు. కాని ఆయన అవమానకరమైన దండన విధిస్తానని బెదిరించేటప్పటికి యిక వుండ బట్టుకోలేకపోయాడు. ''ఓహో! 'నాస్తికుడైన' డిడెరాట్‌ని మళ్లీ యువతలికి లాగా రన్న మాట. సరే, చూస్తాను, డిడెరాట్ కసి తీర్చుకునేటట్టు చేస్తాను'' అనుకున్నాడతను. ఆపైన, లోపల కంపిస్తూ వున్నా, పైకి నిబ్బరమైన శాంతమైన గొంతుకతోటి, తనని నైతిక విలువలు లేనివాడిగా నిందించడం అనుచితం అని అన్నాడు. తన నేరాన్ని సమర్థించు కునే ఉద్దేశం లేకపోయినా, దానికి ప్రాయశ్చిత్తం చేసుకోడానికి తను సంసిద్ధుడై వున్నట్టూ, తను అన్ని దురభిప్రాయాలకీ అతీతంగా వున్నట్టూ, వాస్తవంలో, మలాన్యాని వివాహం చేసుకోడానికి సిద్ధంగా వున్నట్టూ చెప్పాడు. యీ మాటలు అనడంతోటి ఇవాన్ పెత్రోవిచ్ నిస్సందేహంగా తన లక్ష్యాన్ని సాధించాడు. ప్యోత్ర్ అంద్రేయెవిచ్‌కి యెంత ఆశ్చర్యం కలి గిందంటే ఓ క్షణం పాటు ఆయన నోట మాటరాలేదు. మరుక్షణం తెప్పరిల్లి, ఉడతగీతల చొక్కాతోటీ, తొడుక్కున్న పట్టీ ఆకు చెప్పులతోటీ వున్నవాడు వున్నట్టుగా కొడుకుమీదకి ముష్టి బిగించి లంఘించాడు. అందుకు భిన్నంగా కావాల్సికి అలా వున్నాడా అన్నట్టు ఇవాన్ పెత్రోవిచ్ ఆ రోజున టిటస్* ఫాషన్‌లో తల ఉడుపు ధరించాడు, కొత్త ఇంగ్లీషు ఫ్రాక్ కోటూ చిన్న కుచ్చులున్న యెత్తు బూట్లూ, బిగుతుగా ముద్దుగా వుండే జింకతోలు లాగు వేసుకున్నాడు. వెంటనే అతను యింట్లోనుంచి దూసుకుపోయి, పెరట్లో పరిగెత్తి, యింటి తోట గుండా రివ్వున పోయి, అలా అలా పార్కులోనుంచి రోడ్డుకడ్డంబడి తండ్రి పద ఘట్టనలు సోకటం లేదు అని ఖాయంగా అనిపించేదాకా, వగురుస్తూ అరుస్తూ పరిగెడు తూనే వుంటే అన్నా పావ్‌లొవ్నా పెంకులు లేచిపోయేటట్టు అరుస్తూ, ముఖం చేతులతో కప్పుకుంది. ''ఆగు!'' అని ఆయన గర్జించాడు. ''ఆగరా, శుంఠవెధవా, ఆగు, లేకపోతే నీ అంతు చూస్తాను!'' అన్నాడు. ఇవాన్ పెత్రోవిచ్ పొరుగున వున్న భూస్వామి యింట్లో శరణుజొచ్చిపోయాడు. ప్యోత్ర్ అంద్రేయిచ్ అలిసిపోయి, చెమటలు కక్కుతూ యింటికి పోయాడు. యింకా ఆయాసంతో వగురుస్తూనే ఆయన, తన కొడుక్కి ఆస్తిలో చిల్లి గవ్వ కూడా యివ్వటం లేదనీ, అతనికి తన పోషణ లేదని ప్రకటించి, ఆ తుక్కు పుస్త కాలన్నిటినీ తగలబెట్టాలనీ, తక్షణం ఆ పిల్ల మలాన్యాని సుదూర గ్రామానికి బహిష్కరించా లనీ ఆజ్ఞాపించాడు. కొంతమంది పరోపకారులు ఇవాన్ పెత్రోవిచ్‌ని వెతికి పట్టుకుని యీ విషయమంతటినీ చెవిని వేశారు. అవమానంతోటీ, ఆగ్రహంతోటీ రెచ్చిపోయి తండ్రిమీద పగ తీర్చుకోడానికి ఒట్టుపెట్టుకుని, ఆ రాత్రే మలాన్యాని తీసుకుపోయే రైతు బండిని అటకాయించి, ఆమెని లేవదీసుకుని దగ్గర్లో వున్న పట్టణానికి దౌడెత్తిపోయి ఆమెని పెళ్లి

---

*ఫ్రాన్సులో 18వ శతాబ్దపు చివర్లో ఫాషన్‌గా వున్న హెయిర్‌స్టైయిల్. — సం.

చేసుకున్నాడు. అతనికి పొరుగాయన ధన సహాయం చేశాడు. ఆ పొరుగాయన రిటైరైన ఉన్నత నావికోద్యోగి, యెప్పుడూ ఛషకం దింపనివాడు, కాని ''సాహసోపేత కృత్యా''లని తను అనే వాటన్నిటిపట్ల ఆనందం ప్రకటించేవాడు. మర్నాడు ఇవాన్ పెత్రోవిచ్ తండ్రికి పరుషమైన, నిరాదరపూర్వకమైన, సభ్య ఉత్తరం ఒకటి రాశాడు. తన రక్తసంబంధీకుడు ద్మీత్రియ్ పేస్తొవ్, అతని సోదరి అయిన మార్ఫ తిమొఫేయెవ్నా (పాఠకుడికి యీమె యిదివరకే పరిచయం అయింది) వుంటున్న గ్రామానికి బయల్దేరి వెళ్లాడు. వాళ్లకి జరిగిన విషయం యావత్తూ చెప్పి, పీటర్స్‌బుర్గ్‌కి పోయి యేదేనా ఉద్యోగం సాధించాలన్న తన సంకల్పాన్ని చెప్పి, కొంతకాలం వరకూ తన భార్యని ఆదరించవలసిందిగా అభ్యర్థించాడు. ''భార్య'' అనే మాట రాగానే బిగ్గరగా యేడ్చాడు. తన పట్టణ విద్యాభ్యాసం, తత్వశాస్త్రం యెలా వున్నా సామాన్యమైన రష్యన్ అర్థితుడు లాగా మోకరిల్లాడు, తన నుదుటిని నేల మీద మోదుకున్నాడు కూడా. జాలీ, సానుభూతీ వున్న వాళ్లైన పేస్తొవ్ కుటుంబీకులు సంతోషంగా అతని కోరికని మన్నించారు. అతను వాళ్లతోటి మూడు వారాలు గడిపాడు, తన తండ్రి సాయం చేస్తాడని రహస్యంగా ఆశిస్తూ. కాని ఆయన్నుంచి బదులు రాలేదు, రాదుకూడానూ. కొడుకు పెళ్లిచేసుకున్నాడన్న వార్త వినగానే ప్యోత్ర్ అంద్రేయిచ్ మంచం పట్టి, కొడుకు ప్రస్తావన చెవిని పడకూడదని శాసించాడు. కాని తల్లి మాత్రం గుంభనగా అయిదు వందల రూబుళ్లని పురోహితుడి దగ్గర అప్పు తీసుకుని, కోడలికి ఒక పూజా విగ్రహంతో బాటుగా, కొడుక్కి పంపించింది. ఆమె ఉత్తరం రాయడానికి సాహసించ లేదు. కాని, రోజుకి పదిహేను కోసులు నడవగలిగిన దారుఢ్యవంతుడైన రైతుతోటి నోటి మాటగా కొడుకుకి కబురుపెట్టింది. కొడుకు మరీ మనసులో పెట్టుకుని బాధ పడనవసరం లేదనీ, దేవుడి దయవల్ల అన్నీ సద్దుకుంటాయనీ, తండ్రి క్షమిస్తాడనీ, తనకి కూడా వేరే కోడలైతే బాగుంటుం దనిపించిందనీ కాని యిది భగవత్సంకల్పంగా కనిపిస్తోం దనీ అందుచేత మలాన్యా సెర్గేయెవ్నాకి ఆశీర్వాదాలు అందచేస్తున్నాననీ తెలియచేసింది. ఆ దారుఢ్యవంతుడైన రైతుకి, పడ్డ కష్టానికిగాను, ఒక రూబులు ముట్టింది. ఆ రైతు కొత్త కోడలిని చూడాలని కోరి, తను ఆమెకి హితుడవబట్టి, ఆమెని చూసి వందన పురస్సరంగా చేతిని ముద్దుపెట్టుకుని తిరుగు ముఖం పట్టాడు.

ఇవాన్ పెత్రోవిచ్ తర్వాత తేలికపడిన హృదయంలో సెయింట్ పీటర్స్‌బుర్గ్‌కి ప్రయాణం అయ్యాడు. భవిష్యత్తు మసకగా వుంది; బహుశా దారిద్ర్యం రాసిపెట్టి వుండవచ్చు. కాని దుర్భరమైన పల్లెటూరి జీవితాన్ని అతను వదిలేశాడు, అన్నిటినీ మించి తన గురువులని దగా చెయ్యలేదు, వాస్తవానికి రూసో, డిడెరాట్ యింకా 'లా డిక్లరస్యోఁ డె ద్రువా డె

లొమ్'*లని ''ఆచరణలోకి తీసుకువచ్చి'', అస్తిత్వాన్ని నిరూపించాడు. ఒక విధిని నిర్వ ర్తించినట్లు, ఒక ఉల్లాసం, గర్వంతోకూడిన భావం అతని హృదయం అంతా నిండిపోయింది. భార్యా వియోగం అతన్ని పెద్దగా కలత బెట్టలేదు. ఆ మాట కొస్తే అదే కొంపలో అస్త మానూ ఆవిడతో వుండటమే అతన్ని యెక్కువ యిబ్బంది పెట్టి వుండేది. ఆ పని పూర్త యింది కాబట్టి యిప్పుడు వేరే పనులు చూసుకోవాల్సి వుంది. అతని భయాలెలా వున్నా సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో అతనికి అదృష్టం కలిసివచ్చింది. కుబేన్స్కయా రాకుమారి, అప్పటికే భర్తృ పరిత్యక్త అయినా, సజీవంగా వుంది. ఆమె తన మేనల్లుడిని తన మిత్రు లందరికీ చూపించి సిఫారసు చేసి, అతనికి అయిదు వేల రూబుళ్ల పారితోషికాన్నీ — వాస్త వానికి ఆమె వద్ద మిగిలిందల్లా అంతే — మన్మథ రూపాలతో అలంకృతమై అతని పేరులో మొదటి అక్షరాలు చెక్కిన లెపిక్ గడియారాన్నీ యిచ్చి నిష్కృతి చేసుకుంది. మూణ్ణెల్లు తిరక్కుండానే అతనికి లండన్‌లోని రష్యన్ రాయబారి కార్యాలయంలో ఉద్యోగం లభించి, అతను మొదటి ఇంగ్లీషు ఓడలో రేవు దాటి ప్రయాణమయ్యాడు (అప్పట్లో పొగ ఓడలు వూహల్లోకి కూడా రాలేదు). కొన్ని నెలల తర్వాత అతనికి పేస్తొవ్‌నుంచి ఉత్తరం వచ్చింది. ఆ సహృదయుడు ఇవాన్ పెత్రోవిచ్‌ని తండ్రి అయినందుకు అభినందించాడు. ఆ మగ శిశువు ఆగస్టు 20, 1807న చేటలో పడ్డాడనీ, వాడికి పవిత్ర అమరజీవి గౌరవార్థం ఫ్యొదొర్ అని పేరుపెట్టారనీ రాశాడు. మలాన్యా సెర్గేయెవ్నా చాలా నీరసపడిపోతూ కొద్ది మాటలు మాత్రం తన వంతుగా అందులో రాసింది. కాని ఆ కాసిని మాటలూ కూడా ఇవాన్ పెత్రోవిచ్‌ని ఆశ్చర్యచకితుణ్ణి చేసాయి — మార్ఫ తిమొఫేయెవ్నా తన భార్యకి చదువనూ రాయనూ నేర్పిందని అతనికి తెలియనే తెలియదు. ఏమైనా ఇవాన్ పెత్రోవిచ్ తండ్రి నయ్యాననే ఆనందానికి యెక్కువ పొంగిపోలేదు; అప్పట్లో ప్రఖ్యాతులైన ఫైర్‌నెస్ లనిగాని, లైయిన్‌లనిగాని (అప్పటికి యింకా జమీందారీ సాంప్రదాయిక నామాలు మోజుగా వుండేవి) యెవళ్లో ఒకళ్లని వలలో వేసుకునే ప్రయత్నంలో వుండేవాడు. టిల్సిట్ శాంతి సంధి** అప్పుడే జరిగి, ప్రపంచం ఆనంద పారావారంలో మునిగి తేలుతూ, సంతోషంతో

---

* 'మానవుల హక్కుల ప్రకటన.' జన్మతః మానవులందరూ సమానులే అనేది యిందులో ప్రధాన సూత్రం. — సం.

** టిల్సిట్ శాంతి సంధి: 1806–1807 సంవత్సరంలో ఫ్రాన్స్ — ప్రష్యా — రష్యాల మధ్య జరిగిన యుద్ధంలో నెపోలియన్ సేనలు విజయం సాధించాయి. అప్పుడు టిల్సిట్‌లో ఫ్రాన్స్‌కీ ప్రష్యాకీ, ఫ్రాన్స్‌కీ రష్యాకీ మధ్య జరిగిన శాంతి సంధి. — సం.

తల తిరిగిపోయివుంది. అతని తల కూడా చురుకైన అందాల రాణి నల్లని కళ్లతోటి తిరిగి పోయింది. అతని దగ్గర ధనం స్వల్పంగా వుంది. కాని అదృష్టపరీక్ష జూదం పేకాట ఆడాడు. యెన్నో పరిచయాలు చేసుకున్నాడు, ప్రతి వినోదంలోనూ పాల్గొన్నాడు — ఒక్క ముక్కలో, రెపరెప లాడిపోయాడు.

## 9

వృద్ధ ల్రవేత్‌స్కీ హృదయంలో కొడుకు వివాహంతోటి కలిగిన అవమానభరిత ఆగ్రహం చాలా కాలం సలుపుతూనే వుంది. ఇవాన్ పెత్రోవిచ్ కనక ఆర్నెల్లు తర్వాత పశ్చాత్తప్త హృదయంతో తిరిగివచ్చి, తండ్రి కాళ్లమీద పడి శరణు వేడికొని వుంటే, మొదటగా కొంచెం మందలించీ, తర్వాత తన బుడుపుల చేతి కర్రతోటి భయపెట్టడానికన్నట్టు ఒకటి, రెండు మెల్లిగా వడ్డించీ క్షమించివుండేవాడే. కాని ఇవాన్ పెత్రోవిచ్ విదేశంలో వుండి, యీ బాపతు ఆలోచన యేదీ మనసు చొరనిచ్చినట్టు కనిపించలేదు. ప్యోత్ర్ అంద్రేయిచ్ తన భార్య తనని శాంతింపచెయ్యాలని ప్రయత్నించినప్పుడల్లా కేకలు వేసేవాడు. "చేసారుగా! చాలు! యెంత ధైర్యం! ఆ కుక్క వెధవ, నేను వాడి వినాశనం కోరనందుకు సంతోషించాలి. మా నాన్నయితే యిలాంటి వెధవని తన చేతులతో పీక నులిమేసి వుండేవాడు, అసలు అదే తగిన శాస్తి" అనేవాడు. యీ దారుణమైన మాటలకి ఆన్నా పావ్‌లొవ్నా దొంగచాటుగా "శివ, శివా" అనుకునేది. యిక కొడుకు భార్యకి సంబంధించి ప్యోత్ర్ అంద్రేయిచ్ యేనాడో చేతులు దులిపేసుకున్నాడు. తన కోడలిని గురించి పేస్తొవ్‌లు ప్రస్తావిస్తూ రాసిన ఉత్త రానికి జవాబుగా తనకే కోడలూ లేదనీ, పారిపోయిన భూస్వామ్యదాసులకి రక్షణ యివ్వడం నేర మని వాళ్లకి గుర్తుచెయ్యడం తన ధర్మమనీ కబురుచేశాడు. కాని తర్వాత, మనవడు పుట్టా డన్న వార్త చెవినిబడగానే, మెత్తబడి, బాలెంతరాలు యెలా వున్నదీ యేమిటీ అని రహస్యంగా వాకబు చేయించి, తను పంపించినట్టు ఆమెకి తెలియకుండా కొంత సొమ్ము అందచేయిం చాడు. ఆన్నా పావ్‌లొవ్నాకి తీవ్రమైన సుస్తీ చేసినప్పుడు వైద్యకి యేడాది కూడా నిండలేదు. మంచంపట్టి యిక కొద్ది రోజులకి చనిపోతుందనగా, మసగ్గా వుండే కళ్లల్లో బెరుగ్గా కన్నీళ్లు చెమ్మగిల్లుతూ వుంటే, పాప నివేదనం చేసుకునే గురువు వుండగానే, భర్తతోటి కోడలిని చూడాలని వుందనీ, ఆవిడదగ్గర సెలవు తీసుకొని, మనవడికి ఆశీర్వాదం అంద చెయ్యాలని వుందనీ చెప్పింది. వ్యాకులచిత్తుడైన ఆ ముసలాయన ఆమెని వూరడించి, తన కోడల్ని — మొట్టమొదటి సారిగా ఆవిడని మలాన్యా సెర్గేయెవ్నా అని పేరుతో పిలుస్తూ — తీసుకురావడానికని తన సొంత బగ్గీని పంపించాడు. ఆమె కొడుకుని తీసుకుని మార్ఫ తిమొ ఫేయెవ్నాతో కలిసి వచ్చింది. ఆమెని ఒక్కత్తినీ పంపించడానికి మార్ఫ తిమొఫేయెవ్నా యిష్టపడక, అవసరమైతే తన పాత్ర కూడా నిర్వహించాలని వచ్చింది. భయంతోటి సగం

చచ్చిపోయి మలాన్యా సెర్గేయెవ్నా, ప్యోత్ర్ అంద్రేయిచ్ గదిలోకి ప్రవేశించింది. ఫేద్యని యెత్తుకుని ఒక దాది అనుసరించింది. ప్యోత్ర్ అంద్రేయిచ్ నిశ్శబ్దంగా ఆమెని చూశాడు. ఆమె అతనికి అభివాదం చెయ్యడానికి ముందుకు వెళ్లింది. ఆమె వణికే పెదాలు ఆయన చేతిని చుంబించడానికి అతికష్టంమీద కలిశాయి.

''బాగుంది, కొత్తగా గొప్ప వంశీకురాలైన అమ్మాయ్'' అన్నాడాయన మొత్తానికి మాట మొదలేసి. ''బాగున్నావా? నడు, మీ అత్తగార్ని చూద్దాం.''

ఆయన నుంచుని ఫేద్యమీదకి వంగాడు. ఆ శిశువు చిరునవ్వు నవ్వి ఆయనకేసి చేతులు అందించాడు. యిది ఆ ముసలాయన గుండెని కదిలించేసింది.

''ఓహో!'' అని ఆయన గొణిగాడు. ''బుల్లి భడవా? మీ నాన్నని వెనకేసుకొస్తున్నావురా? నిన్ను వదలనులే, బుజ్జి'' అన్నాడు.

మలాన్యా సెర్గేయెవ్నా అత్తగారి పడకగదిలోకి అడుగు పెడుతూనే గుమ్మం వార మోకరిల్లింది. అన్నా పావ్లొవ్నా ఆమెని తన మంచం దగ్గరికి రమ్మని సైగ చేసి, ఆమెని కౌగలించుకుని, మనవణ్ణి ఆశీర్వదించింది. అప్పుడు కఠోరమైన బాధతోటి నలిగిపోయిన తన మొహం భర్తకేసి తిప్పి మాట్లాడబోయింది.

''తెలుసు, నాకు తెలుసు నువ్వు యేం చెబుదామనుకుంటున్నావో. నువ్వేం బెంగపడకు. ఆమె యిక్కడే వుంటుంది. యీమె ముఖం చూసి నేను ఇవాన్ని క్షమిస్తాను'' అని గొణిగాడు.

కష్టపడి అన్నా పావ్లొవ్నా భర్త చేతిని అందుకుని తన పెదాల దగ్గరికి తీసుకుంది. ఆ సాయంత్రం ఆమె ప్రాణవాయువులు అనంతంలో లీనమైపోయాయి.

ప్యోత్ర్ అంద్రేయిచ్ అన్నమాట నిలబెట్టుకున్నాడు. చనిపోయే తల్లి కోరిక తీర్చడం కోసమూ, పసివాడు ఫ్యోదొర్ కోసమూ అతన్ని మళ్లీ అనుగ్రహిస్తున్నట్టూ, మలాన్యా సెర్గేయెవ్నాకి తన యింట్లో వసతి కల్పిస్తున్నట్టూ కొడుక్కి తెలియచేశాడు. పై అంతస్తులో ఆమెకి రెండు గదులు యిచ్చారు. ఆయన ఆమెని తన ఘనత వహించిన అతిథులు ఏకాక్షి బ్రిగేడీర్ స్కురేఖిన్కీ, ఆయన భార్యకీ చూపించాడు. యిద్దరు పరిచారికల్నీ, ఒక వార్తాహరుడైన బాలుణ్ణీ ఆమె సేవకి నియోగించాడు. మార్ఫ తిమొఫేయెవ్నా సెలవు తీసుకుని వెళ్లిపోయింది. ఆ వున్న ఒక్క రోజులోనూ గ్లఫీరతో మూడు సార్లు దెబ్బలాడి, ఆమె పట్ల యెంతో అసహ్యంతో నిండిపోయింది.

పాపం ఆ కోడలి పరిస్థితి కొత్తలో కష్టంగానూ యిబ్బందికరంగానూ వున్నా, ఆమె క్రమేపీ దానికీ, మామగారికీ అలవాటు పడిపోయింది. ఆయన కూడా ఆమెకి అలవాటు పడ్డాడు, యింకా చెప్పాలంటే అనురాగ భరితుడయ్యాడు, ఆమెతో దాదాపు యెప్పుడూ మాట్లాడకపోయినా, ఆయన దయాస్వభావంలో తెలియని ఉపేక్ష వున్నప్పటికీ కూడా.

మలాన్యా సెర్గేయెవ్నాకి పెద్ద వెన్నుపోటు ఆడపడుచు గ్లఫీర. తల్లి వుండగానే యింటి పెత్తనమంతా క్రమేపీ తన చేతిలోకి తీసుకునే కుట్రలోనే గ్లఫీర వుంది. ప్రతివాళ్ళూ, తండ్రితో సహా ఆవిడ కనుసన్నల్లో మెలిగారు. ఆవిడ అనుజ్ఞ లేకుండా పూచిక పుల్ల కదలడానికి లేదు. ఆవిడ యింకో యజమానురాలికి పెత్తనం ధారపోసేకంటే చావడానికేనా సిద్ధపడుతుంది — పైగా యేం యజమానురాలు! సోదరుని వివాహం ఆమెకి తండ్రికంటే కూడా యెక్కువ చింత తెచ్చిపెట్టింది. నండమంత్రపుసిరి పట్టిన ఆమెమీద కసి తీర్చు కోవడానికే నిశ్చయం చేసుకుంది. అడుగు పెట్టిన క్షణంనుంచీ మలాన్యా సెర్గేయెవ్నా ఆమెకి గులాం అయిపోయింది. నిజానికి తను, అంత అణకువగా, దారితప్పిన లేడిలా, భీతిగా, పిరికిగా అనారోగ్యంగా వుండే తను, మూర్ఖురాలు, పొగరుబోతు అయిన గ్లఫీరతో జగడం చెయ్యడం యెలాగ? తన పుట్టు పూర్వోత్తరాలు, తన స్థానం యేమిటో తెలుసుకొమ్మని గ్లఫీర గుర్తుచెయ్యని రోజు లేదు. యెంత కటువైనా యీ యెత్తి పొడుపుల్ని మలాన్యా సెర్గేయెవ్నా దిగ మింగేది.... కాని తన ఫేద్య దగ్గర లేడు — ఆ బాధ వుండిపోయింది. తను సరిగా పిల్లవాణ్ణి తీర్చిదిద్దలేదనే సాకుతోటి, ఆమెని అతణ్ణి చూడనిచ్చేవాళ్ళు కూడా చూడనిచ్చే వాళ్ళు కాదు; ఆ విషయం గ్లఫీర తనే చూసింది. పిల్లవాడు పూర్తిగా ఆమె అజమాయిషీలో వుండిపోయాడు. తన దుఃఖంలో మలాన్యా సెర్గేయెవ్నా ఇవాన్ పెత్రో విచ్‌ని త్వరగా యింటికి రమ్మని ఉత్తరాల్లో అర్థించేది. ప్యోత్ర్ అంద్రేయెవిచ్ కూడా కొడుకుని చూడాలని వున్నాడు. కాని కొడుకు మాత్రం యేవోసాకులు చెపుతూ, తన భార్యని గురించి శ్రద్ధ చూపించినందుకూ, సొమ్ము పంపించినందుకూ తండ్రికి కృతజ్ఞతలు తెలియ జేస్తూ, త్వరలోనే వస్తానని వాగ్దానం చేస్తూ ఉత్తరాలు రాసేవాడు; కాని రాలేదు. యెట్టకేలకి 1812వ సంవత్సరం అతన్ని యింటికి తెచ్చింది. ఆరేళ్ల తర్వాత మొదటి సారి కలుసుకున్నప్పుడు తండ్రీ కొడుకూ పాత గొడవలని ఒక్క ముక్క ప్రస్తావించకుండా ఒకళ్ల నొకళ్లు ఆలింగనం చేసుకున్నారు. వాస్తవానికి అది అలా చేసేందుకు సందర్భమూ కాదు. మొత్తం రష్యా అంతా శత్రువు మీదకి ఒక్కటిగా కత్తిపట్టి వుంది; రష్యన్ రక్తం తమ నాడుల్లో ప్రవహిస్తోందని యిద్దరూ భావించారు. మొత్తం ఒక పటాలపు జాతీయ సైన్యాన్ని తన సొంత ఖర్చుతో సంసిద్ధం చేశాడు ప్యోత్ర్ అంద్రేయెవిచ్. కాని యుద్ధం ముగిసిపోయింది; ప్రమాదం గడిచిపోయింది. ఇవాన్ పెత్రోవిచ్‌కి యింకో సారి విసుగు కలిగింది, దూర ప్రాం తాల నిగనిగ అతన్ని ఆకర్షించింది. తను అలవాటు పడ్డ లోకంలోకి ఆకర్షితుడై, మళ్లీ కుదుటపడ్డాడు. మలాన్యా సెర్గేయెవ్నా అతన్ని ఆపలేకపోయింది. అతని జీవితంలో ఆమె నలుసు. ఆమె వెర్రినమ్మకం పెట్టుకున్న ఆశలన్నీ ముక్కలైపోయాయి — ఆమె భర్త కూడా ఫేద్య పోషణ భారం గ్లఫీరకి అప్పగించడమే సబబు అన్నాడు. ఆమె యీ దెబ్బ తట్టుకో లేకపోయింది, మరోసారి భర్త వియోగాన్ని నిబ్బరించుకోలేకపోయింది. కొద్ది రోజుల తర్వాత

మాటా పలూకూ లేకుండా కన్ను మూసింది. తన జీవితమంతా ఆమె దేన్నీ ప్రతిఘటించ లేకపోయింది, యిప్పుడు కూడా జబ్బుకి వ్యతిరేకంగా పోరాడలేదు. మాట పడిపోయి, మృత్యు నీడలు ముఖంమీద పరుచుకుంటూ వుంటే, ఆమె కవళికలు పూర్వపు ఆశ్చర్యనిబిడ ఓర్మినీ, సాధుసత్వపు సౌమ్యతనీ కోల్పోలేదు. మృత్యు శయ్యమీద భర్త హస్తాన్ని ముద్దు పెట్టుకున్న అన్నా పావ్‌లొవ్నా లాగా అదే తితిక్షతోటి ఆమె గ్లఫీర చేతిని ముద్దుపెట్టుకుని, ఆమెకి తన ఒక్కగా నొక్క కొడుకునీ అప్పచెప్పింది. ఆ రకంగా లేత మొక్కని స్వస్థలంనుంచి పీకేసి వేళ్లతో సహా సూర్యగోళంలోకి విసిరేసినట్టుగా, యీ దయాపూరిత సాధుప్రాణి ఐహిక జీవితం ముగిసింది. ఆమె విస్మృతపథంలోకి జారి, మరుగున పడిపోయింది, యెవళ్లూ ఆమె కోసం చింతించలేదు. మలాన్యా సెర్గేయెవ్నా పరిచారికలూ, ప్యోత్ర్ అంద్రేయెవిచ్‌లు మాత్రమే ఆవిడకోసం దుఃఖించిన వాళ్లు. ఆ ముసలాయనకి ఆమె దయాన్విత వదనమూ, నిశ్శబ్దమైన ఉనికీ కోల్పోయినట్టయింది. చర్చిలో కడసారి ఆమె ముందు మోకరిల్లుతూ ''నీకు శాంతి కలుగుగాక, వెరితల్లీ'' అని ఆయన గొణిగాడు. ఆమె సమాధిలోకి పిడికెడు మట్టి వేస్తూ ఆయన విలపించాడు.

ఆమె పోయాక ఆయనా యెక్కువ కాలం జీవించలేదు – అయిదేళ్లు బతికాడేమో. 1819 నాటి శీతకట్టులో ఆయనా మాస్కోలో ప్రశాంతంగా కన్ను మూశాడు. మాస్కోకి ఆయన గ్లఫీరతోటీ, మనవడితోటీ మకాం వచ్చేశాడు. అన్నా పావ్‌లొవ్నా, మలాన్యాల సమాధుల పక్కనే తననీ సమాధి చెయ్యమని ఆయన కోరాడు. ఆ సమయంలో దిలాసాగా గడుపుతూ ఇవాన్ పెత్రోవిచ్ పారిస్‌లో వున్నాడు. 1815 తర్వాత కొద్ది కాలానికి అతను తన ఉద్యోగానికి రాజీనామా చేశాడు. తండ్రి చనిపోయాడన్న వార్త విన్నాక రష్యాకి తిరిగిరావడానికే అతను నిశ్చయం చేసుకున్నాడు. జమీ అజమాయిషీకి యేర్పాట్లు చేసుకోవాలి, గ్లఫీర ఉత్తరం ప్రకారం ఫేద్యకి పదమూడేళ్లు వస్తున్నాయి, అతని చదువుని గురించి గట్టిగా శ్రద్ధపట్టాలి.

## 10

ఇవాన్ పెత్రోవిచ్ రష్యాకి ఇంగ్లీషు దొరలాగా తిరిగివచ్చాడు. పొట్టిగా క్రాపు చేసిన జుట్టేమిటి, గంజిపెట్టిన కాలరేమిటి, అనేక అగ్రాలున్న బఠాణీ ఆకుపచ్చరంగు పొడుగాటి కుచ్చెళ్లు వున్న కోటేమిటి, మోటుగానూ ఉదాసీనంగానూ వుండే ప్రవర్తనేమిటి, వుండుండి నిశ్చలంగా నవ్వే నవ్వేమిటి, ముడుచుకుని వుండే ముఖమేమిటి, రాజకీయాల గురించో, రాజకీయ అర్థశాస్త్రం గురించో యే మార్పులేకుండా వుండే అదే సంభాషణా విషయమేమిటి, బాగా పక్వం గాని ఆవు మాంసపు వేపుడు అన్నా, పోర్ట్ వైన్ అన్నా పడి చచ్చిపోవడమేమిటి – మొత్తం సమస్తమూ కూడా గ్రేట్ బ్రిటన్ వాతావరణపు వాసన

కొడుతూ వుంటాయి. కాని, చిత్రంగా, అంత ఆంగ్ల వ్యామోహితుడైనా ఇవాన్ పెత్రోవిచ్ దేశభక్తుడు కూడా అయాడు, కపీసం అలా అని తనకితాను చెప్పుకునే వాడు, అతనికి రష్యాని గురించి యేం తెలీదు, ఒక్క రష్యన్ అలవాటు లేదు, యాసగా వుండే రష్యన్ భాష మాట్లాడేవాడు. మామూలు సంభాషణలో అతని భాష అసహ్యంగా, విసుగ్గా వుండేది. కాని సంభాషణ ముఖ్యమైన విషయాలమీదకి మళ్లేటప్పటికి ఇవాన్ పెత్రోవిచ్, "స్వయం కుశలతకి నూతన పరీక్షలు ఒసగు," "వున్న విషయాల స్వభావంతోటి యిది పొసగదు" లాంటి పదబంధాలు వాడేవాడు. ప్రభుత్వ వ్యవహారాల నిర్వహణ మెరుగుదల గురించి ఇవాన్ పెత్రోవిచ్ కొన్ని లిఖిత ప్రణాళికలని దిగుమతిచేశాడు. అతనికి కనిపించేదేదీ అతనికి నచ్చలేదు. ఒక పద్ధతి అంటూ లేకపోవడం అనేది అతని కడుపులో తిప్పేసింది. తన అక్కని చూసిన మరుక్షణం అతను చేసిన మొదటి పని యేమిటంటే, మౌలిక సంస్కరణలని ప్రవేశ పెట్టాలనే తన నిర్ణయాన్ని ప్రకటించడం, యికపైనుంచి అన్నీ కూడా నూతన రీతిలో నడుస్తుందని ఆమెని హెచ్చరించడం. గ్లఫీర పెత్రోవ్నా యేమీ అనలేదు, గాని పళ్లు బిగ పట్టి అనుకొంది, "నాకు యేం మూడుతుందో?" అని. కాని తమ్ముడితోటే, మేసల్లుడి తోటే కలిసి గ్రామానికి వచ్చిన కొద్ది కాలానికే ఆమె భయాలు తగ్గాయి. యింట్లో నిజం గానే కొన్ని మార్పులు జరిగాయి. వూరికే పడిమేసే సోమరిపోతులకీ, పరాన్నభుక్కులకీ ఉద్వా సన జరిగింది. వాళ్లల్లో యిద్దరు ముసలమ్మలు వున్నారు, ఒకామె గుడ్డిది, యింకో ఆవిడకి పక్షవాతం; ఒచాకొవ్* రోజులనాటి ఒక మేజరు వున్నాడు. పాపం ఆయన వృద్ధాప్యపు మతి మరుపులో వెర్రి ఆకలితో దహించుకుపోయే కారణంగా రై రొట్టీ, అలసందలూ తప్ప తినేవాడే కాదు. పూర్వపు అతిథులని ఆహ్వానించ నవసరంలేదని ఆజ్ఞ ఒకటి జారీ అయింది. ఒక చుట్టం, పెద్దింటివాడు, రాగిజుట్టు, పీలగా, అనారోగ్యంగా వున్న జమీందారు, చాలా మృదు స్వభావుడు, బుద్ధావతారం అయిన పెద్ద మనిషి అందర్నీ కూడా కొట్టిపారేశాడు. మాస్కో నుంచి కొత్త కుర్చీలూ, మేజాలూ వగైరాలు వచ్చాయి. తమ్మపడగలూ, చేతులు కడు క్కునే తొట్టెలూ, వాషింగ్ స్టాండులూ వచ్చాయి. నాస్తా నూతన పద్ధతిలో వడ్డన అయేది. స్వదేశీ వోద్కా సారాయిల స్థానంలో విదేశీ మద్యాలు వచ్చాయి. నౌకర్లందరికీ కొత్త యూని ఫారం, బిళ్లా వచ్చాయి. వంశ చిహ్నానికి కొత్త సూక్తిజత అయింది: "ఇన్ రెక్టో

---

* ఒచాకొవ్ – నల్లసముద్ర తీరంలో 18వ శతాబ్దంలో వున్న ఒక దుర్గం. ఆ ప్రాంతంలో టర్కీవాళ్ల ఆధిపత్యానికి యిది స్థావరం. 1787–91 మధ్య టర్కీకి, రష్యాకి జరిగిన యుద్ధంలో రష్యా నౌకాదళం యీ దుర్గాన్ని ముట్టడించి, టర్కీ నౌకా దళాన్ని ఓడించింది. అదే సమయంలో రష్యన్ సైన్యం యీ దుర్గాన్ని స్వాధీనం చేసుకుంది. — సం.

విర్తస్''* అని. వాస్తవానికి గ్లఫీర అధికారం యే విధంగానూ తగ్గలేదు. వెచ్చాలు తెప్పించడం నుంచి వ్యయం చెయ్యడం దాకా సర్వమూ ఆవిడ అజమాయిషీలోనే వున్నాయి. విదేశం నుంచి దిగుమతీ చేసుకున్న ఆల్సేషియన్** యింటినౌకరు ఆవిడ అధికారాన్ని యెదిరించబోయి, చెడువు తెచ్చుకున్నాడు, తన యజమాని అభిమానాన్ని చూరగొన్నప్పటికీ. యిక సేద్యానికీ, జమీ నిర్వహణకీ సంబంధించి — గ్లఫీర పెత్రోవ్నాకి యీ విషయాల్లో కూడా పెత్తనం వుంది — అంతా పూర్వం వున్నట్టే వుండిపోయింది. యీ అరాచకంలోకి నూతన జీవితాన్ని స్పందింపచెయ్యాలని ఇవాన్ పెత్రోవిచ్ యెన్నో సార్లు వ్యక్తం చేసిన కోరిక వున్నప్పటికీ కూడా. యేదో యిక్కడా అక్కడా కాస్త శిస్తు పెంచడం, కార్వీని బిగించడం, రైతులు నేరుగా ఇవాన్ పెత్రోవిచ్‌ని సమీపించకూడదనే శాసనం తప్ప మిగతాదంతా పూర్వంలాగే వుండిపోయింది. యీ దేశభక్తుడికి స్వదేశస్థులంటే మహా అసహ్యం అని తేలింది. ఇవాన్ పెత్రోవిచ్ పథకం అంతా సర్వశక్తితోటీ ఫేద్య మీదే అమలు జరిగింది. అతని విద్యాభ్యాసం నిజంగా ''మౌలికమైన మార్పు'' పొందింది. అతని తండ్రి మిగిలిన అన్నీ వదిలి యిందులోనే నిమగ్నం అయాడు.

## 11

ఇవాన్ పెత్రోవిచ్ విదేశాల్లో వుండగా ఫేద్య గ్లఫీర పెత్రోవ్నా పెంపకంలో వున్నాడు. తల్లి చనిపోయే నాటికి అతనికి ఎనిమిదేళ్లు కూడా లేవు. యెప్పుడేనా ఆవిడని చూసేవాడు, ఆమె అంటే విపరీతమైన ఆపేక్షతో వుండేవాడు. ఆమె పాలిన మృదువైన ముఖం, విచారపూర్వక దృక్కు, బెరుకుగా తనని లాలించడం మిళితమై వున్న ఆమె స్మృతి అతని హృదయంమీద చెరగని ముద్రవేసింది. ఆ యింట్లో ఆమెకున్న స్థానం గురించి అతనికి అస్పష్టమైన జ్ఞానమే వుంది. తమ మధ్య వున్న అడ్డుగోడని గురించి, ధ్వసంచెయ్యడానికి సాహసంగాని, శక్తిగాని ఆమెకి లేని ఆ అడ్డుగోడ గురించి, అతనికి తెలుసు. అతను తండ్రిని తప్పించుకుని తిరిగేవాడు. తండ్రి యెప్పుడూ అతన్ని లాలించలేదు. తాతగారు యెప్పుడేనా అతని తల నిమిరేవారు, గారం కుడవ నిచ్చేవారు కాని శుంఠ అని పిలిచేవారు, బుద్ధావతారం అని భావించేవారు. మలాన్యా సెర్గేయెవ్నా చనిపోయిం తర్వాత అతను పూర్తిగా మేనత్త కబంధ హస్తాల్లో చిక్కిపోయాడు. ఫేద్యకి ఆవిడంటే భయం, ఆవిడ కొరకొర చూసే చూపులంటే భయం, ఆవిడ పరుషమైన కంఠమంటే భయం. ఆవిడ ముందు

---

* ''సదాచారమే ధర్మము'' (లాటిన్).

** రైన్ నదికి పశ్చిమంగా వున్న రాష్ట్రం. — సం.

ఒక్క ముక్క అనడానికి నోరు పెగిలేది కాదు. కుర్చీలో పీసరు కదిలితే ఆమె బుస కొట్టేది. ''యేమైంది? కదలకుండా కూర్చో!'' అని గదమాయించేది. ఆదివారాల్లో, ప్రార్థన అయిపోయాక అతన్ని ఆడుకోనిచ్చేవారు, అంటే యెవరో మక్సీమోవిచ్ – అంబోదిక్ అనే ఆయన మాయా పుస్తకం ''చిహ్నలూ, గుర్తులూ'' అనే దాన్ని యిచ్చేవారు. ఆ పుస్తకంలో దాదాపు అన్నీ గజిబిజిగా వుండే బొమ్మలు సుమారు వెయ్యి వున్నాయి. అయిదు భాషల్లో, అంతే నిగూఢమైన అర్థాలు వుండేవి. బొద్దుగా దిగంబరంగా వున్న మన్మథుడి బొమ్మ వాటిలో ప్రముఖంగా వుండేది. వాటిల్లో ఒక దానికి ''కాషాయరంగూ ఇంద్రధనుస్సూ'' అని పేరున్న దానికింద ''యిక యీ ప్రభావం విస్తృతమైంది'' అని వివరణ వుంది. ''ముక్కులో నల్లకలువతోటి యెగురుతున్న నారాయణ పక్షి'' అన్న యింకో బొమ్మ కింద ''నీకు సర్వమూ తెలుసు'' అని రాసివుంది. ''మన్మథుడూ, గోముగా బిడ్డను నాకే ఎలుగుబంటి'' అనేది ''కొంచెం కొంచెంగా'' అనే దాన్ని సూచించింది. ఫేద్య యీ బొమ్మలని అధ్యయనం చేశాడు. ప్రతి చిన్న వివరంతోటీ అవి అతనికి పరిచయమే. వాటిలో కొన్ని, అస్తమానూ అవే రకంవి, అతన్ని ఆలోచించేటట్టు చేసి అతని వూహని యెగరేసేవి. యితర సరదాలు అతను యెరగడు. అతనికి భాషలూ, సంగీతమూ నేర్చుకోవాల్సిన వయసు రాగానే గ్లఫీర పెత్రోవ్నా ఒక వృద్ధకన్యని పరమ చవగ్గా కుదిర్చింది. ఆవిడ గబగబా బెరుకు చూపులు చూసే స్వీడిష్ ఆవిడ. ఆవిడ ఫ్రెంచ్, జర్మన్ భాషా పాండిత్యం స్వల్పం. వూ: అంటే పియానో వాయించగలదు. ఆవిడ అన్నిటికీ తలమానికంగా చేయగలిగింది, దోసకాయలని అద్భుతంగా వూరేయడం. యీ ఉపాధ్యాయిని సాంగత్యంలో అతని అత్త, వృద్ధపరిచారిక వసీల్యెవ్నా, ఫేద్యలు అద్భుతంగా నాలుగు సంవత్సరాలు గడిపారు. తరచుగా అతను తన ''చిహ్నలూ, గుర్తులూ'' పుస్తకంతో ఓ మూల కూర్చునేవాడు; అలా యెన్నో దీర్ఘదినాలు అతను కూర్చున్నాడు; యెత్తు తక్కువ వున్న కప్పు జెరేనియం పువ్వు వాసన కొట్టేది. బిక్కుబిక్కుమంటూ ఒక కొవ్వొత్తి మసకగా వెలిగేది. కీచురాయి మత్తుగా, అలసటగా గీ మనేది. గోడ నున్న చిన్న గడియారం గబగబా టిక్కుమనేది. గోడకి వున్న చెక్క పలక వెనకనుంచి యెక్కణ్ణో ఒక చుంచు బరికి, కొరికేది. ఆ ముగ్గురు వృద్ధ స్త్రీలూ గబగబా తమ అల్లికసూదుల్ని ఆడిస్తూ, వాళ్ల చేతుల నీడలు ఆ మసకలే భయంకరమైన వూగులాడే ఆకారాల్ని ప్రసరింపచేస్తూ వుంటే, పిశాచాల్లా కూర్చుని వుండేవాళ్లు. యిక ఆ పిల్లవాడి మనసులో చెలరేగే వూహలు కూడా అంతే భయంకరంగా, మసకగా వుండేవి. ఫేద్యని ఆసక్తికరమైన కుర్రాడని అనలేం. అతను ఓరకంగా పాలిపోయి, అయినా దుక్కలా, మందంగా మోటుగా – గ్లఫీర పెత్రోవ్నా అన్నట్టు అసలైన రైతులా వుండేవాడు. అతన్ని యింకొంచెం తరచుగా తాజాగాలిలోకి బయటికి పోనిచ్చి వుంటే బుగ్గలకి రంగువచ్చి వుండేది. తరచుగా బద్ధకంగా వున్నా అతను బాగానే చదివేవాడు. అతనెప్పుడూ యేడవ లేదు. కాని ఒకో అప్పుడు పిచ్చి మంకుతనం

అతన్ని ఆవహించేసేది. అప్పుడు అతన్ని యెవరూ సద్దలేకపోయేవాళ్లు. తన చుట్టుపక్కల వుండే యెవర్నీ ఫేద్య అభిమానించలేదు. బాల్యంలో అభిమానం లేని హృదయం యెంత దురదృష్టకరమైంది!

ఇవాన్ పెత్రోవిచ్ కొడుకుని చూసేటప్పటికి అదీస్థితి. యిక యెంత మాత్రమూ కాలహరణం చెయ్యకూడదని తన విధానాన్ని అతను అమలు జరపదలచుకున్నాడు. "మొట్ట మొదటగా వాణ్ణి మనిషిగా తయారుచెయ్యాలి నేను, మనిషిగానే కాదు, స్పార్టన్* లాంటి వాడిగా చెయ్యాలి అని అతను గ్లఫీర పెత్రోవ్నాతోటి అన్నాడు. మొదటగా కొడుక్కి స్కాచ్ పద్ధతిలో** వేషధారణ చేయించడంతో తన పథకానికి ప్రారంభోత్సవం చేశాడు. ఆ పన్నెం డేళ్ల కుర్రాడు నెత్తిమీద యీకల స్కాచ్ టోపీతోటి, మోకాళ్లదగ్గర్నుంచి కింద దాకా ఆచ్ఛాదన యేమీ లేకుండా, ఆడంబరంగా నడిచాడు. ఆ స్వీడిష్ ముసలావిడ బదులు యువ స్విస్ ఉపాధ్యాయుడు వచ్చాడు. అతను జిమ్నాస్టిక్స్‌లో సిద్ధహస్తుడు. సంగీతం పురుషులు అభ్యసించదగింది కాదని చెప్పేదానికి స్వస్తి జరిగింది. ప్రకృతిశాస్త్రాలు, అంతర్జాతీయ న్యాయశాస్త్రం, గణితం, వడ్రంగం, జాన్ జాక్ రూసో బోధనానుసారంగా వున్నవీ, శౌర్య వంతమైన లక్షణాలని పెంపొందించే మార్గంగా వంశావళి చిహ్నాలు, యివన్నీ "మనిషి"గా రూపొందబోయే అతని చదువులోకి ప్రవేశించాయి. అతన్ని తెల్లవారకట్ల నాలుగింటికి లేపేవాళ్లు. వెంటనే చన్నీళ్లతో కడిగేవాళ్లు, పరిగెత్తించేవాళ్లు; రోజుకి ఒక పూటే భోజనం పెట్టేవాళ్లు, అది కూడా ఒక ఆధరువుతోటే. గుర్రంమీద స్వారీ చేసేవాడు. బాణంతో గురిచూడ్డం నేర్చేవాడు. సందర్భం వున్నప్పుడల్లా తండ్రి మాదిరిగా స్థిర సంకల్ప సాధనకి అభ్యాసం యిచ్చేవాళ్లు. ప్రతిరోజూ సాయంత్రం ఆ రోజు దినచర్య, తనకి కలిగిన అనుభూతులు ఒక ప్రత్యేక పుస్తకంలో రాయమనే వాళ్లు. యిక తనకిగా ఇవాన్ పెత్రోవిచ్ అతనికి ఫ్రెంచ్‌లో లిఖిత సూచనలు అందజేస్తూ వుండేవాడు. వాటిల్లో కొడుకుని మొం ఫిస్*** అని పిలిచేవాడు, వూ**** అని సంబోధించేవాడు. రష్యన్‌లో ఫేద్య తండ్రిని "నువ్వు" అని సంబోధించేవాడు గాని, ఆయనదగ్గర కూర్చునే ధైర్యం చేసేవాడు కాదు. యీ "విధానం" కుర్రవాణ్ణి నిశ్చేష్టుణ్ణి చేసింది, బుర్రలో గందరగోళం రేపింది, మనసుకి తిమ్మిరెక్కించింది. యేమైనా నూతన జీవిత విధానంవల్ల ఆరోగ్యం మెరుగయింది; మొదట్లో

---

* దృఢంగా, క్రమశిక్షణాయుతంగా, నిర్భీతిగా వుండే స్పార్టన్ దేశస్థుడి మాదిరిగా అని అర్థం. — అను.

** నడుందగ్గరనుంచి మోకాలివరకు వుండే వున్ని బట్ట. — అను.

*** మా అబ్బాయి (ఫ్రెంచి).

**** మీరు (ఫ్రెంచి).

జ్వరంతో బాధపడ్డాడు గాని, త్వరలోనే కుదుటపడి, దృఢకాయుడైన కుర్రాడిగా తయారయాడు. కొడుకంటే తండ్రికి గర్వం కలిగింది, అతన్ని ''ప్రకృతి పుత్రుడు, నేను నా చేతులతో మలచిన వాడు'' అనేవాడు తండ్రి. ఫేద్యకి పదహారేళ్లు వచ్చాక, అదనులో, మగువలపట్ల విముఖత కలిగించవచ్చని తండ్రికి తోచింది. మన యువ స్పార్టన్ మనసులో సిగ్గు తోటీ, నూనూగు మీసాల నూత్న యౌవ్వనంలో, తొణికిసలాడే వయసు, శక్తి, ఉడుకురక్తం వున్నప్పుడు ఉదాసీనత్వాన్నీ, దూరంగా వుండటాన్నీ, గర్వాన్నీ నటించ ప్రయత్నించాడు.

యీ లోపున కాలం సాగుతోంది. ఇవాన్ పెత్రోవిచ్ సంవత్సరంలో చాలా భాగం లావ్రికి (ప్రధాన పైతృక జమీ గ్రామ నామం అది)లో గడిపేవాడు. శీతాకాలంలో మాస్కోకే వెళ్లేవాడు. అక్కడ ఒక బసలో మకాం వుండి మహాశ్రద్ధగా క్లబ్బుకి పోయేవాడు, తన పథకాలని డ్రాయింగ్ రూంలలో సమర్ధించుకుంటూ వివరిస్తూ వుండేవాడు, యెప్పటికంటే కూడా యెక్కువగా ఆంగ్లేయ ధోరణిలో, అసంతృప్తుడుగా, ప్రముఖుడుగా వుండేవాడు. అప్పుడు 1825వ సంవత్సరం దుఃఖాన్నీ బాధనీ మోసుకొస్తూ సరంజామాతో సిద్ధమైంది.* ఇవాన్ పెత్రోవిచ్ ఆంతరంగిక మిత్రులు, పరిచయస్థులు చేదు ఛషకాన్ని ఖాళీ చేశారు. ఇవాన్ పెత్రోవిచ్ వెంటనే పల్లె యింటికి యేకాంత వాసంలోకి పోయి, ప్రపంచానికి దూరంగా వుండిపోయాడు. ఇంకో సంవత్సరం గడిచింది. ఇవాన్ పెత్రోవిచ్ ఆరోగ్యం హఠాత్తుగా క్షీణించ నారంభించింది. అతను దుర్బలంగా, జబ్బు మనిషిగా అయిపోయాడు. స్వేచ్ఛాయుత ఆలోచనాపరుడు చర్చికి వెళ్లడం, ఆరోగ్యంకోసం పూజలు చేయించడం మొదలుపెట్టాడు. యూరపియన్ అలవాట్లున్న మనిషి రష్యన్ ఆవిరి స్నానాలు చెయ్యడం, రెండు గంటలకి భోజనం చెయ్యడం, తొమ్మిదింటికి ముసలి కసాయివాడు వాగుతూ వుంటే వింటూ నిద్రపోవడం మొదలెట్టాడు. యీ ప్రముఖ వ్యక్తి తన పథకాలన్నిటినీ తగలబెట్టేసి, ఉత్తరాలన్నిట్నీ తగల బెట్టేసి గవర్నరు ముందు గజగజ వణికాడు, పోలీసుల ముందు మోకరిల్లాడు. దృఢచిత్తుడైన మనిషి ఒంటిమీద సెగ్గడ్డ వేసినా, పులుసు చల్లారిపోయినా జంకిపోయి, వలవల యేడ్చేశాడు. ఇంకో సారి గ్లఫీర పెత్రోవ్నా యింటి పెత్తనం చేజిక్కించుకుంది. మళ్లీ పాలేర్లు, పెత్తందార్లు నానారకాల అలగా జనం దొడ్డిదారిన ''ముసలి పిసినారి''తో మాట్లాడ్డానికి వచ్చేవాళ్లు. పరిచారకులు ఆమెని అలా పిలిచేవాళ్లు. ఇవాన్ పెత్రోవిచ్‌లో వచ్చిన మార్పు కొడుకుమీద దారుణమైన ప్రభావం చూపించింది. యిప్పుడతనికి పందొమ్మిదేళ్లు వస్తున్నాయి. ఆలోచించడం, అణగదొక్కే తండ్రి పెత్తనంనుంచి బయటపడ్డంకోసం ప్రయత్నించడం మొదలుపెట్టాడు. తండ్రి

---

* డిసెంబరు 1825లో ''డిసెంబరిస్టులు'' తిరుగుబాటుని అణిచివేసిం తర్వాత ప్రభుత్వం తీసుకున్న పీడక చర్యలకి యిది ప్రస్తావన. — సం.

మాటలకీ చేతలకీ మధ్య వున్న తేడాని, యెముకలేని నాలికతోటి ధారాళంగా ఉదారవాదం పట్ల మంచిగా ప్రకటనలు చెయ్యడం, కటువైన నియంతృత్వంతో వుండటం మధ్య తేడాని గమనించాడు. కాని అంత తీవ్రమైన మార్పు వస్తుందని వూహించలేదు. ముదిరిపోయిన అహంభావి అసలు రంగుతో బయటపడ్డాడు. కుర్రవాడు మాస్కోకి యూనివర్సిటీ చదువుకి వెళ్లడానికి సిద్ధమవుతూ వుండే సమయంలో ఇవాన్ పెత్రోవిచ్ నెత్తిమీద యింకో దెబ్బ పడింది: అతను అంధుడైపోయాడు, ఒక్క రోజులో పరమ గుడ్డివాడైపోయాడు.

రష్యన్ డాక్టర్ల శక్తిమీద నమ్మకం లేక విదేశాలకి పోవడానికి అనుమతిని అడిగాడు. అనుమతి లభించలేదు. అప్పుడు అతను కొడుకుని తీసుకుని వరసగా మూడేళ్లు చూసిన డాక్టర్ని చూడకుండా, యీ వూరినుంచి ఆ వూరికి వూపిరి పీల్చుకోకుండా తిరుగుతూ, డాక్టర్లని, కొడుకుని తన నీచత్వంతోటీ, చిర్రుబుర్రులాడే స్వభావంతోటీ యేడిపించుకు తినేశాడు. నీచప్రాణిగా, యేడుపుగొట్టుగా, నెత్తిమీద నీళ్లకుండ వుండే పిల్లాడిగా తిరిగి మళ్లీ లావ్రికి చేరుకున్నాడు. కొంపలో అందరికీ కష్టకాలం దాపురించింది. ఇవాన్ పెత్రో విచ్ భోజనం దగ్గరున్న కాసేపూ శాంతంగా వుండేవాడు. అంతకు ముందెప్పుడూ అంత ఆశగొడ్డులాగా అతను తిని యెరగడు; మిగిలిన రోజంతా తనకిగాని, మిగిలిన వాళ్లకిగాని క్షణం తెరిపి యిచ్చేవాడు కాదు. జపం చేసేవాడు, కర్మని నిందించుకునేవాడు; తనని, రాజకీయాలని, తన విధానాన్ని తిట్టుకునేవాడు. యిదివరకు తను స్తోత్రం చేసి, ఘనంగా భావించిన వాటి నన్నిటినీ, తన కొడుకుని నేర్చుకొమ్మని బోధించిన వాటినన్నిటినీ దుమ్మెత్తి పోసేవాడు. తనకి యెందులోనూ నమ్మకం లేదని ప్రకటించి మళ్లీ జపం మొదలెట్టే వాడు. ఒక్క క్షణం ఒంటరిగా వుండలేకపోయేవాడు, యిల్లంతా తన దగ్గర రాత్రింబగళ్లు హాజరుగా వుండి కథలూ, కబుర్లూ చెబుతూ తనకి ఉల్లాసం కలిగించాలని శాసించేవాడు. యిక ఆ చెప్పే కథలని మాట మాటకీ ''నువ్వు పచ్చి అబద్ధాల కోరువి – యేం వెర్రిమాటలు మాట్లాడతావు'' అంటూ అడ్డం కొట్టేవాడు.

యీ భారమంతా గ్లఫీర పెత్రోవ్నా భరించింది. ఆమె లేకుండా అతను వుండలేకపోయేవాడు. యీ జబ్బు మనిషి తిక్కకోరికలన్నీ ఆవిడ తీర్చేది, ఒకో అప్పుడు ఆవిడ కోపగాఢ్గదికమైన గొంతుక యెక్కడ బయట పడిపోతుందో అని తక్షణం బదులు చెప్పకపోయినా కూడా. ఆరకంగా అతను రెండేళ్లు యీడ్చుకొచ్చి, మే నెల ఆరంభంలో, యెండకోసమని బాల్కనీలోకి తీసికెళ్లమని చెప్పి వచ్చి, చనిపోయాడు. ''గ్లాష్కా, గ్లాష్కా! యేదీ నా తిండి? నువ్వు పిచ్చిపీను....'' అని గొణుగుతూ, పూర్తికేక వెయ్యక ముందే, శాశ్వతంగా నిశ్శబ్దంగా అయిపోయాడు. గ్లఫీర పెత్రోవ్నా, బట్లర్ చేతిలోనుంచి గిన్నె లాక్కుని, నిశ్చలంగా నుంచుండిపోయి, తమ్ముడి ముఖంకేసి మెల్లిగా చూసి, తటాల్న శిలువ గీసుకుని, మాట్లాడకుండా వెళ్లిపోయింది. అక్కడే వున్న కొడుకు కూడా యేమీ మాట్లాడలేదు.

ప్రగాదిమీద ఆనుకుని చాలా సేపు వసంతశోభలో మెరిసే సువాసన లీనే పువ్వులకేసీ, పచ్చటి ఆకుల కేసీ చూస్తూ వుండిపోయాడు. అతనికి యిరవై మూడో యేడు. యెంత నిర్దాక్షిణ్యంగా, వేగంగా ఆ యిరవై మూడేళ్ళూ యెగిరిపోయాయి! జీవితద్వారాలు అతని ముందు తెరుచుకుంటున్నాయి.

## 12

తండ్రి అంత్యక్రియ అయింతర్వాత యింటి వ్యవహారాలూ, జమీ ఉద్యోగులమీద అజమాయిషీ స్థిరంగా వుండే గ్లఫీర పెత్రోవ్నాకి అప్పచెప్పి యువ లవ్రేత్‌స్కీ మాస్కోకి వెళ్ళిపోయాడు. యేదో, నామరహితమైన పటువైన శక్తి అతన్ని అక్కడికి లాగింది. తన విద్యాభ్యాసంలోని లొసుగులు యేమిటో అతను గ్రహించాడు. నష్టపోయిన కాలాన్ని యెంత వీలైతే అంతగా భర్తీ చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు. గత అయిదేళ్ల కాలంలోనూ అతను యెంతో చదివాడు, యెన్నిటినో చూశాడు; అతని బుర్రలో పులిసిపోయిన వూహాలు బోలెడు. కొన్ని విషయాల్లో అతని పాండిత్యం ఒక ప్రొఫెసరుకి కూడా అసూయ కలిగించి వుండేది, అయినా ప్రతిబడిపిల్లాడికీ తెలిసినవికూడా కొన్ని అతనికి తెలియవు. తను స్వేచ్ఛాయుతుడు కాడని లవ్రేత్‌స్కీ గుర్తించాడు. ఆ విషయం లోపల్లోపల గుర్తించి అతను చిత్రమైన వ్యక్తిగా తయారయేడు. ఆ ఆంగ్ల తరహా తండ్రి కొడుకుమీద చెడ్డ ప్రయోగం చేశాడు. అతని తిక్క చదువు ఫలితానికి వచ్చింది. అనేక సంవత్సరాలు అతను తండ్రి యేది చెబితే దాన్ని శిరసా వహించాడు. ఆఖరికి, విషయావలోకనం చేసేటప్పటికి జరగాల్సిన ముప్పు జరిగే పోయింది. అతని అలవాట్లు వంటబట్టిపోయాయి. మనుషులతో ససిపడేది కాదు; ఇరవై మూడేళ్ల ప్రాయంలో, సిగ్గుపడే హృదయంలో ఆర్పలేని ప్రేమజ్యోతి వెలుగుతూ వుంటే, అతను ఆడపిల్లకేసి మొహం యెత్తి చూడలేకపోయేవాడు. కొంచెం భారమైనా స్పష్టమైన బుద్ధితోటీ, లోకజ్ఞానంతోటీ, మంకుగా వుండే స్వభావంతోటీ, పరాకూ, సోమరితనంతోటీ యెంతో ముందుగానే అతను జీవిత సుడిగుండంలోకి పడివుండాల్సింది, కాని తద్భిన్నంగా అతను ఒక కృతకమైన యేకాకితనంలో వుండిపోయాడు. ఆ కనికట్టు యిప్పుడు విడిపోయినా అతను అదే చోట ముభావంగా, తనలో తను అణిగి వుండిపోయాడు. అతని వయస్సులో విద్యార్థుల వేషం వెయ్యడం పరిహాసంగా వుంటుంది. కాని అతను దానికి భయపడలేదు — అతని స్పార్టన్ శిక్షణ యితరులు తనని గురించి యేమనుకుంటున్నారో అనే దాన్ని పట్టించుకోకుండా వుండేటట్టు చేసింది కనీసం — అంచేత యే జంకూ లేకుండా అతను విద్యార్థి వేషం వేశాడు. ఫిజిక్సు, గణిత శాఖల్లో ప్రవేశించాడు. దృఢకాయం, ఎరుపు వదనం, మాట్లాడకుండా ముడుచుకుపోయి, బాగా పెరిగిన గడ్డంతోటి అతనుతోటి విద్యా

ర్థులకి వింతగా కనిపించాడు. భయం కలిగించే ముఖం వున్న యీ మనిషి, క్రమం తప్పకుండా జోడు గుర్రాల బగ్గీమీద పొతాలకి హాజరయ్యే యీ మనిషి ఒఠ్ఠి పసివాడని వాళ్లకి తెలీదు కదా. పండితమ్మన్యుడైన వింత మనిషి అని అతన్ని గురించి వాళ్లు అనుకున్నారు. వాళ్లు అతని స్నేహాన్ని అపేక్షించలేదు, వాళ్లకి అవసరమూ లేదు, అతను దూరంగా వుండిపోయాడు. యూనివర్సిటీలో వున్న మొదటి రెండు సంవత్సరాల్లోనూ అతను ఒకే ఒక్క విద్యార్థితో స్నేహం చేశాడు. అతని దగ్గర లాటిన్ నేర్చుకున్నాడు. మిహాలేవిచ్ అనే ఆ విద్యార్థి అత్యుత్సాహవంతుడూ, కవీనీ. అతను హృదయపూర్వకంగా లవ్రేత్‌స్కీకి సన్నిహితం అయాడు, అతని జీవితంలో అతిముఖ్యమైన మలుపుకి అమాయకంగా కారణం అయ్యాడు.

ఒక రోజున థియేటరుదగ్గర (అప్పటికి మొచాలొవ్* ప్రభ వెలిగిపోతూవుంది, లవ్రేత్‌స్కీ ఆయన నాటకం ఒకటి కూడా మానలేదు) అతను ఒక అమ్మాయిని చూశాడు. అతని గుండెని వేగంగా స్పందింప చెయ్యకుండా, ముభావంగా వుండే అతని ముందునుంచి కూడా యే యువతీ వెళ్లకపోయినా, యింత దడదడగా వేగంగా మాత్రం యింతకుముందు అతని గుండె కొట్టుకోలేదు. ఆమె కదలకుండా కూచుంది. ఆమె మోచేతులు బాక్స్ మఖమల్‌మీద ఆనుకుని వున్నాయి. యౌవనోల్లాసం ఆమె ఆకర్షణీయ, చంద్రవదనపు ప్రతి కవళికలోనూ తొణికిసలాడుతోంది. ముచ్చటైన కనుబొమల కిందనుంచి మృదువైన తదేక దృష్టిగల అందమైన కళ్లల్లో, భావవ్యక్తీకరంగా వుండే పెదవులమీద త్వరిత లాస్యంలో, తలని హుందాగా వంచిన తీరులో, భుజాల్లో, మెడలో ఆమె సొంపైన మనసు ప్రతిబింబిస్తోంది. ఆమె అద్భుతంగా అలంకరించుకుని వుంది. ఆమె పక్కన వడిలిపోయి, నల్లగా వున్న ఒకామె కూర్చుని వుంది. ఆమె వయస్సు దాదాపు నలభై ఐదేళ్లు. వాలు మెడ దుస్తులు, నల్లని అంచున్న మడవని టోపీ, ఆతృతగా యేకాగ్రతతో వున్న శూన్య వదనంమీద బోసి చిరునవ్వు వున్న వనిత ఆమె. ఆ వెనక, ముడతలు వేలాడే ఫ్రాక్‌కోటూ మెడకి చుట్టుకున్న గుడ్డ, ఒక విధమైన మంద గంభీరత్వం, పూసల్లాంటి కళ్లల్లో జిడ్డు అనుమానానికి దగ్గరగా వుండే భావం, రంగేసిన మీసాలూ, చెంపలూ, యోచనా మగ్నంగా వుండే సాదా నుదురు, ముడతలు పడ్డ బుగ్గలు — సర్వవిధాలా రిటైరైన జనరల్ లాగా వున్న ఒకాయన వున్నాడు. లవ్రేత్‌స్కీ ఆ అందమైన వదనంనుంచి చూపు మళ్లించుకోలేదు. హఠాత్తుగా బాక్స్ తలుపు తెరుచుకుంది, మిహాలేవిచ్ ప్రవేశించాడు. మాస్కో మొత్తానికి తనకి వున్న ఒక్కగా నొక్క పరిచయస్థుడు, తన సర్వస్వాన్నీ తదేకంగా ఆకర్షించుకున్న ఆడపిల్ల సరసన కనిపించడం లవ్రేత్‌స్కీకి చిత్రంగా, ప్రముఖంగా కనిపించింది. బాక్స్ కేసే చూసి, అక్కడున్న

---

* 1830–1840ల మధ్య ప్రఖ్యాతి వహించిన రంగస్థలనటుడు. — సం.

వాళ్ళు మిహాలేవిచ్‌ని పాత మిత్రుని లాగా చూస్తున్నట్టు లవ్రేత్‌స్కీ గమనించాడు. అక్కడ రంగస్థలంమీద ప్రదర్శన లవ్రేత్‌స్కీకి ఆసక్తికరంగా లేదు. మొచాలొవ్ కూడా, ఆవేళ మంచి పట్టులో వున్నా, అతనికి ఆసక్తి కలిగించలేకపోయాడు. వేదికమీద ఒక జాలిగొలిపే సన్నివేశంలో లవ్రేత్‌స్కీ ఆ సుందరి కేసి చూశాడు. ఆమె ముందుకి వంగింది, బుగ్గలు కెంపెక్కాయి. ఆమెని తదేకంగా చూడ్డంలో, వేదికకి అతుక్కుపోయిన ఆమె కళ్ళు మెల్లిగా అతనిమీదకి తిరిగినట్లయింది... రాత్రంతా ఆ కళ్ళే అతన్ని వెన్నాడాయి. కృత్రిమంగా కట్టుకున్న ఆనకట్ట ఆఖరికి బద్దలైపోయింది. అతను మొత్తం వణికిపోతున్నాడు, ఉద్రేక జ్వరంతో వున్నాడు. ఆ మర్నాడే మిహాలేవిచ్‌ని చూడ్డానికి వెళ్ళాడు. ఆ అందగత్తె పేరు వర్వార పావ్‌లొవ్నా కొరోబ్యినా అనీ, ఆమెతో వున్న వృద్ధ దంపతులు ఆమె తల్లీ, తండ్రీ అనీ, ఒక సంవత్సరంకితం మాస్కోదగ్గర వున్న జమీందారిణి ఎన్—గారి దగ్గర, తను శిక్షణ యిచ్చే సమయంలో, ఆమె పరిచయం అయిందనీ చెప్పాడు. ఆ ఔత్సాహికుడు వర్వార పావ్‌లొవ్నాని ఆకాశానికి యెత్తేశాడు. మెత్తగా అన్నాడతను, "ఆ అమ్మాయుందేం, అద్భుతం అనుకో. చాలా తెలివైంది, సిసలైన కళాకారిణి, యెంత దయగా వుంటుందనుకున్నావ్" అని. అతను ఆమెని గురించి గుచ్చిగుచ్చి అడగడంబట్టీ వర్వార పావ్‌లొవ్నా లవ్రేత్‌స్కీమీద కలిగించిన ప్రభావం గమనించి, అతను లవ్రేత్‌స్కీని ఆ అమ్మాయికి పరిచయం చేస్తానని అన్నాడు. తను ఆ కుటుంబ సభ్యుల్లో ఒకడిగానే వుంటాననీ, జనరల్‌కి పిసరు కూడా స్వాతిశయం లేదనీ, తల్లి మాత్రం శుద్ధమొద్దు అనీ చెప్పాడు. లవ్రేత్‌స్కీ సిగ్గుపడిపోయి, యేదో గొణిగి, పరిగెత్తిపోయాడు. అతను ధైర్యం చిక్కబట్టుకోవడానికి అయిదు రోజులు పెనుగులాడాడు. ఆరో రోజున ఆ యువ స్పార్టన్ మంచి వేషం బిగించి మిహాలేవిచ్ ముందు వాలాడు. మిహాలేవిచ్, ఆ కుటుంబ సభ్యుడే కాబట్టి వూరికే తల దువ్వుకున్నాడు. యిద్దరూ కలిసి కొరోబ్యిన్‌ల యింటికి వెళ్ళారు.

## 13

వర్వార పావ్‌లొవ్నా తండ్రి పావెల్ పెత్రోవిచ్ కొరోబ్యిన్, రిటైరైన మేజర్ జనరల్. తన జీవితమంతా సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో కొలువులో గడిపాడు. యువకుడుగా వున్నప్పుడు మంచి బాగా నాట్యం చేసే వాడనీ, చక్కని సైనికుడనీ పేరు పొందాడు. పరిస్థితులు క్షీణించడం వల్ల ఆయన యిద్దరు, ముగ్గురు సాదా జనరల్స్‌దగ్గర అడ్జుటెంటుగా పని చేశాడు. వాళ్ళల్లో ఒకాయన కూతుర్ని యిరవై అయిదు వేల రూబుళ్ల కట్నంతోటి పెళ్లి చేసుకున్నాడు. సైనిక కవాతులోనూ, సైనిక డ్రిల్లుకళలోనూ మహా సొంపుగా ప్రావీణ్యం సంపాదించి, పాటుపడి చివరకి యిరవై యేళ్ల కొలువు తర్వాత జనరల్ హోదానీ, ఒక

దళ అజమాయిషీనీ అందుకున్నాడు. యీ దశలో ఆయన తన కృషిని సడలించి, యిల్లు చక్కబెట్టుకోడానికి తీరిగ్గా అంకితం అయివుండేవాడు, ఆయన పథకాలు కొంచెం చితికి పోకుండా వుంటే. ఆయన వాస్తవానికి చెయ్యదలచుకున్నది కూడా అదే. ప్రజా ధనం విని యోగించడంలో ఆయన సరి కొత్త పద్ధతిని రూపొందించుకున్నాడు — ఆ పద్ధతి దాని కిగా అది అద్భుతమైందే, కాని అమిత వ్యయం చెయ్యకూడని చోట ఆయన చెయ్యడంవల్ల పైకి ఫిర్యాదు పోయింది. అది సబబైన వ్యవహారం కాదు, ఆ మాట కొస్తే రోత వ్యవహారం కూడానూ. జనరల్‌గారు అందులోనుంచి యెలాగో బయట పడగలిగారు గాని ఆయన జీవితం నాశనం అయిపోయింది. ఆయన్ని రిటైరు కమ్మన్నారు. పనిలేకుండా జీతం వచ్చే లాయికీ యేదేనా తగుల్తుందేమోనని సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో యింకో రెండేళ్లు చెప్పులు అరక్కొట్టు కున్నాడు గాని, అలాంటిదేమీ సిద్ధించలేదు. యీ లోపున ఆయన కూతురు ఆడ పిల్లల కళాశాలలో చదువు పూర్తిచేసింది. నిత్యం ఖర్చులు పెరుగుతూనే వున్నాయి. యిష్టం లేకపోయినా చవకగా బతకవచ్చని మాస్కోకి మకాం మార్చి, స్తారొ — కొన్యుష్నెన్నీ వీధిలో, యెదర వంశ సంబంధమైన డాలు వగైరా చిహ్నాలున్న, పల్లపు చిన్న యింటిని అద్దెకి తీసు కున్నారు. రిటైరైన జనరల్‌గా సాలుకి 2,750 రూబుళ్ల ఆదాయంతోటి మాస్కోలో స్థిరపడ్డారు. ముతకా ముక్కాతోసహా అందర్నీ, ఆదరించే నగరం మాస్కో, జనరల్ సంగతి చెప్పాలా. ఆరకంగా మందంగా, యింకా సైనిక వాలకం వున్న పావెల్ పెత్రోవిచ్ విగ్రహం మాస్కోలోని అత్యుత్తమ డ్రాయింగ్ రూంలలో దర్శనం యిస్తూ వుండేది. రంగేసిన పొడి వెంట్రుకలు జారి వూగులాడే మెడ వెనక భాగమూ, కారునలుపు మెడ గుడ్డ పైగా కట్టుకున్న మురికి సెయింట్ అన్నా ఆర్డర్ రిబ్బనూ, పాలిపోయి, నిస్త్రాణగా, జూదపు బల్లల వెనకాల నాట్యం జరిగే సమయాల్లో నిరుత్సాహంగా తిరిగే యువకులం దరికీ అలవాటు అయిపోయాయి. సంఘంలో తన వంతు రాబట్టుకోవడం పావెల్ పెత్రో విచ్‌కి తెలుసు. ఆయన తక్కువ మాట్లాడేవాడు. అలవాటు వల్ల నాసికాస్వరంతో మాట్లాడే వాడు, పై అధికారులతో మాట్లాడుతూ గొంతు తగ్గించేవాడు. జాగ్రత్తగా పేకాట ఆడేవాడు. యింటిదగ్గర పొదుపుగానూ, యెక్కడేనా అయితే ఆరుగురికి సరిపడగానూ తినేవాడు. ఆయన భార్యకి సంబంధించి ఆవిడ పేరు కల్లియోప కార్లొవ్నా అని తప్ప చెప్ప డానికేమీ లేదు. ఆమె యెడం కంట్లో చిరు చెమ్మ వుండటం వల్ల కల్లియోప కార్లొవ్నా (ఆఁ, ఆవిడలో జర్మన్ రక్తం వుంది) భావోద్వేగం వున్న మనిషిగా తనని భావించుకునేది. ఆమె తరచూ, తగినంత తిండి లేనిదానిలాగా, యేదో ఆందోళనతో కొట్టు మిట్టాడుతూ వుండేది. బిగుతుగా వుండే ముఖమల్ బట్టలు వేసుకునేది. అంచులేని చిన్న టోపీ, మాసి పోయిన బోలు మురుగులు ధరించేది. పావెల్ పెత్రోవిచ్, కల్లియోప కార్లొవ్నాల యేకైక తనయ వర్వార పావ్‌లొవ్నాకి చదువు పూర్తయేటప్పటికి పదిహేడేళ్లు మాత్రమే నిండాయి.

ఆ కాలేజీలో అతి సాంప్రైనదిగా కాకపోయినా యెంతో తెలివైన విద్యార్థిని అనీ, చక్కని సంగీత జ్ఞానం వున్నది అనీ గుర్తింపు పొందింది. ఆమెకి అక్కడ పూర్ణ* పతకం లభించింది. లవ్రేత్స్కీ ఆమెని వీక్షించేనాటికి ఆమెకి యింకా పంధొమ్మిది నిండలేదు.

## 14

మిహాలేవిచ్ తనని కొర్యోబ్యిన్ల యింటిలో అంత యింపుగా లేని డ్రాయింగ్ రూంలోకి తీసికెళ్లి పరిచయం చేసేటప్పటికి మన స్పార్టన్‌కి వణుకు పట్టుకుంది. కాని అతని కంగారు త్వరలోనే పోయింది. కీర్తి కొంచెం వన్నెతగ్గిన వాళ్లందరిలోనూ చిత్రంగా వుండే ఆప్యాయతతోటి, రష్యన్లందరిలోనూ సహజంగా వుండే కలుపు గోలుతనం మిళితమై ఆ జనరల్ గారిలో అతిశయించింది. ఆయన గారి భార్య అక్కడి సంభాషణలో అంత ముఖ్యురాలు కాదని త్వరలోనే బయటపడిపోయింది. వర్వార పావ్‌లొవ్నా నిబ్బరంగా ప్రశాంతంగా వుంది. యెవరేనాగానీ ఆమె ముందు యిబ్బంది పడకుండా వుండగలరు. నిజానికి ఆమె రమ్యమైన విగ్రహం, మందహాసం చేసే కళ్లు, సరసమైన ఆమె భుజాల వంపులు, గులాబీరంగు తేలిన చేతులు, మందగమనం, సమ్మోహకం చేసేటట్టుగా, అందీ అందకుండా సున్నితమైన సుగంధంలాగా వుండే యెంతో మధురమైన కంఠస్వరం కూడా, మృదువుగా లేతగా వున్నా సిగ్గు దొంతరలతో వుండే సున్నిత మనస్థితి — దాన్ని మాటలలో వర్ణించడం కష్టం — కదిలించి ప్రేరేపించేవే, కాని, ఖాయంగా బెరుకుని మాత్రం కాదు. థియేటరు గురించీ, అంతకు ముందు రోజు జరిగిన ప్రదర్శన గురించీ లవ్రేత్స్కీ సంభాషణ మొదలెట్టాడు. ఆమె మొచాలొవ్‌ని గురించి మాట్లాడ్డం మొదలుపెట్టింది. వూరికే నిట్టూర్చి ఓహో, ఆహా అనడమే కాదు, అతని నటనని, ఆడదానిలాగా అంచనా వేస్తూ కొన్ని సమంజసమైన వ్యాఖ్యలు చేసింది. మిహాలేవిచ్ సంగీత ప్రస్తావన చేశాడు. ఆమె యే జంకూ లేకుండా పియానో దగ్గర కూర్చుని, అప్పట్లో ఫేషన్ అవుతూ వున్న షోపెన్ మజుర్కా సరిగ్గా వాయించింది. భోజనాలవేళ అయేటప్పటికి లవ్రేత్స్కీ సెలవు తీసుకుని వెళ్లిపోదామనుకున్నాడు గాని వాళ్లు బలవంతం చెయ్యడంతోటి ఆగిపోయాడు. జనరల్‌గారు లాఫీత్** తెప్పించి రాజభోజనం

---

*ప్రభులాంఛనం చెక్కిన నామాక్షర ముద్రని కళాశాల చదువుపూర్తయి పట్టా అందుకొనే, హోదాగల కుటుంబాల ఆడపిల్లలకి యిచ్చేవాళ్లు. ప్రతిభకి చిహ్నంగా యిచ్చే పతకం. — సం.

** ఒక రకం రెడ్ వైన్. — సం.

యేర్పాటు చేశాడు. ఆ వైన్‌ని నుంచున్న పళంగా తేవడం కోసమని చెప్పి తన నౌకర్ని అద్దె బండిలో ప్రసిద్ధమైన వర్తకుడు డెప్రే దుకాణానికి పంపించాడు. లవ్రేత్‌స్కీ రాత్రి బాగా పొద్దుపోయిం తర్వాత యింటికి తిరిగివచ్చాడు. ఆ బట్టలు విప్పుకోకుండా చాలా సేపు అలానే కూర్చుండిపోయాడు. మంత్ర ముగ్ధమైపోయినట్టుగా కళ్లని చేతుల్తో కప్పుకున్నాడు. జీవితాన్ని అర్థవంతం చేసిందేమిటో అతను మొదటి సారిగా గుర్తించాడు. తన వూహలు, నిర్ణయాలు, అదంతా, పనికి మాలినది అంతా, తక్షణం తేలిక గాలిలో అదృశ్యమైపోయింది. అతని మనస్సంతా ఒకే ఒక అనుభూతిలో, కోరికలో — ఆనందం అనే కోరికలో, స్వాయత్తం చేసుకోవాలనే కోరికలో, ప్రేమ అనే కోరికలో స్త్రీపట్ల మధుర ప్రేమ అనే కోరికలో లీనమైపోయింది. ఆనాటినుంచీ అతను కొరోబ్యిన్ల యింటికి తరచూ వెడుతూ వుండేవాడు. ఆరు నెల్ల తర్వాత వర్వార పావ్‌లొవ్నాకి తన ప్రేమని వెల్లడించి, తనని వివాహం చేసుకొమ్మని అర్థించాడు. అతని ప్రతిపాదనకి ఆమోదం లభించింది. ఆ జనరల్‌గారు యేనాడో, లవ్రేత్‌స్కీ తొలి సందర్శనం రోజునే లవ్రేత్‌స్కీకి యెంతమంది భూస్వామ్యదాసులు వున్నారని మిహలేవిచ్‌ని అడిగాడు. వర్వార పావ్‌లొవ్నా, ఆ యువకుడు తన వెంటబడి వున్నంత కాలమూ, అతను అలా అడిగే సమయంలో కూడా తన నిబ్బరాన్ని మనఃస్థైర్యాన్నీ కోల్పోలేదు. తనని ప్రేమించేవాడు మంచి స్థితిమంతుడే నన్న విషయం వర్వార పావ్‌లొవ్నాకి తెలుసు. కలియోపా కార్ల్లొవ్నాకి సంబంధించి "మాయినె తాఖ్తర్ మాఖ్త్ ఐన షోయిక పార్త్"* అనుకొంది, యింకో కొత్త టోపీ కొనుక్కుంది.

## 15

ఆ విధంగా అతని ప్రతిపాదనని ఒప్పుకోవడం జరిగింది, కాని కొన్ని షరతులతోటి అలా జరిగింది. మొదటగా లవ్రేత్‌స్కీ యూనివర్సిటీకి స్వస్తి చెప్పాలి. చదువుకునే కుర్రాణ్ణి యే పిల్ల పెళ్లాడుతుంది? పైగా భూస్వామి, ధనవంతుడు అయినవాడు ఇరవై ఆరు యేళ్ల వయస్సులో బడి పిల్లాడి లాగా బుద్ధిగా కూచుని ఆ చదువేమిటి? రెండవదిగా, పెళ్లి కూతురి దుస్తులు వగైరా సరంజామానీ, పెళ్లికొడుకు వివాహ కానుకలనీ కొనే భారం వర్వార పావ్‌లొవ్నా తనే వహించింది. ఆమెకి పుష్కలమైన లోకజ్ఞానం, మంచి అభిరుచి, సౌఖ్యప్రదంగా వుండేదానిపట్ల ప్రేమ, దాన్ని సంపాదించుకోవడానికి తగ్గ సామర్థ్యమూ వున్నాయి. ఆవిడకి వున్న యీ సామర్థ్యంతోటి లవ్రేత్‌స్కీ ప్రత్యేకంగా చకితుడైపోయాడు. వివాహం అయిన తక్షణం, వాళ్లిద్దరూ కూడా చాలా హాయిగా వుండే బండిలో లావ్రికికి ప్రయాణం కట్టారు. ఆ బండిని ఆవిడే కొంది. అతనికి సంబంధించిన ప్రతిదాంట్లోనూ వర్వార పావ్

---

* "మా అమ్మాయికి అద్భుతమైన సంబంధం కుదిరింది" (జర్మన్).

లొవ్నా యెంత ముందు చూపు, జాగ్రత్త సంసిద్ధత కనబర్చింది! గదుల్లోని అనేక జాగాల్లో యెంత ముచ్చటైన డ్రెస్సింగ్ బల్లలు, అద్భుతమైన ముస్తాబు సామాన్లు, కాఫీ సెట్లు వచ్చాయి! వర్వార పావ్‌లొవ్నా తనే స్వయంగా యెంత చక్కగా ఉదయం కాఫీ తయారుచేసేది!

అప్పట్లో లవ్రేత్‌స్కీ శ్రద్ధ కనిపింపచేసే మానసిక స్థితిలో లేడు. ఆనంద మధువు తాగి పరమానంద భరితుడై వున్నాడు. ఒక పసివాడిలాగా తను దానికి లొంగిపోయాడు. అతను నిజంగా పసివాడి లాగానే అమాయకంగా వుండేవాడు. తన సంస్తవనీయ నూతన అర్థాంగి కన్నుల పండుగ కాదూ! మోహంతో వివశం చేసి, వ్యక్తీకరించలేని ఆనందపు రహస్య భవిష్యత్తుని ఆమె ఆశపెట్టడం లేదూ? ఆమె ఆశపెట్టిన దానికంటే యెక్కువ అందించింది. నడి వేసవి కాలంలో లావ్రికికి వచ్చినాక, యిల్లు మబ్బుగా మకిలిగా వుండటమూ, పనివాళ్లు పాత ఫక్కీలో యెబ్బెట్టుగా వుండటమూ ఆమె చూసింది. కాని భర్తకి పిసరు కూడా తెలియనివ్వలేదు. లావ్రికిలోనే స్థిరపడే ఉద్దేశం వుండి వుంటే ఆమె యింటితోటే ప్రారంభించి, ప్రతిదాన్నీ మార్చేసి వుండేది. కాని ఆ పాడు పచ్చిక బీళ్లల్లో వుండే వూహే ఒక్క క్షణం కూడా ఆమె బుర్రలోకి రాలేదు. యేదో గుడారంలో వున్నట్టుగా, అసౌకర్యాలన్నిటినీ మారు మాట్లాడకుండా భరిస్తూ, చిత్తం వచ్చినట్టు వాటిని వేళాకోళం చేస్తూ వున్నట్టుగా ఆమె అక్కడ వుంది. పూర్వం తను సాకిన వాణ్ణి చూడ్డానికి మార్ఫ తిమొఫేయెవ్నా వచ్చింది. వర్వార పావ్‌లొవ్నాకి ఆవిడ యెంతో నచ్చింది. కాని ఆవిడకి మాత్రం యీ అమ్మాయి నచ్చలేదు. అలాగే కొత్త కోడలికి గ్లఫీర పెత్రోవ్నాతోటీ సరిపడలేదు. వృద్ధ కొరోబ్యిన్‌కి అల్లుడిగారి వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోవాలనే కోరికలేకపోయి వుండినట్లయితే ఆవిడ మానాన ఆవిడ వుండేది. అంతటి దగ్గరి బంధువు జమీని అజమాయిషీ చెయ్యడం జనరల్ హోదాకి భంగం కాదు అని ఆయన అన్నాడు. అసలు ముక్కూ మొహం తెలియని వాడి ఆస్తిని అజమాయిషీ చెయ్యడానికి పావెల్ పెత్రోవిచ్ దిగివచ్చి వుండే వాడనేది వూహాతీతమైన విషయం కాదు. వర్వార పావ్‌లొవ్నా దాడిని జాణతనంగా నడిపించింది. తను మాత్రం ముగ్గులోకి రాకుండా, కొత్త పెళ్లి సంబరంలో మునిగిపోయినట్టూ, పల్లెప్రాంతపు మాధుర్యం ఆస్వాదిస్తున్నట్టూ, తన పాటల్లో ఆటల్లో మునిగిపోయినట్టూ పైకి కనిపిస్తూ ఆమె గ్లఫీరకి వ్యతిరేకంగా ఒక్కొక్క మెట్టే పని జరిపించింది. కడకి ఒక రోజు ఉదయం గ్లఫీర పొగలు కక్కుతూ దూసుకుని, లవ్రేత్‌స్కీ గదిలోకి వచ్చి తాళాలగుత్తి బల్లమీదకి గిరవాటు పెట్టి, తనింక యింటి వ్యవహారాలని సంబాళించలేననీ, అక్కడ వుండననీ ప్రకటించింది. యీ బాపతు పరిస్థితి సంభవిస్తుందని ముందే సిద్ధపడివున్న లవ్రేత్‌స్కీ వెంటనే ఆవిడ నిష్క్రమణకి వూ అన్నాడు. దాన్ని గ్లఫీర పెత్రోవ్నా వూహించలేదు. మొహం నల్లబడిపోతూ వుంటే ఆమె "చాలా బాగుంది. ఆవిడకి నేనే కొరకరాని కొయ్యనయినట్టు కనిపిస్తోంది. నన్ను యిక్కడి నుంచి, నా యింటినుంచి, యెవరు గెంటెయ్యాలను కుంటున్నారో నాకు తెలుసు. ఒరే,

అబ్బాయ్, నా మాట గుర్తుంచుకో, నీకెక్కడా నిలవనీడ వుండదు, ఆగమ్మకాకిలా యెప్పుడూ అలా తిరుగుతూనే వుంటావు. అదే నేను చెప్పదలచుకున్నది'' అంది. ఆ రోజే ఆవిడ పల్లె టూర్లో వుండే తన యింటికి పోయింది. ఓ వారం తర్వాత జనరల్ కొరోబ్యిన్ దిగాడు. సంతోషంతో కలిసిన విచార రేఖలతోటీ, కవళికలతోటీ మొత్తం జమీ వ్యవహారాలని ఆజ మాయిషీ చేసే కార్యభారం పైన వేసుకున్నాడు.

సెప్టెంబరు నెలలో వర్వార పావ్లొవ్నా తన పెనిమిటిని తనతోటి సెయింట్ పీటర్స్ బుర్గ్‌కి తీసుకునిపోయింది. రెండు శీతాకాలాలు అందంగా, విశాలంగా, హుందాగా అలం కరించి వున్న వాటాలో వున్నారు (వేసవికాలం జార్స్కొయె సెలో*లో వున్నారు); మధ్య తర గతివాళ్లల్లో, ఉన్నత వర్గాల వాళ్లల్లో కూడా వాళ్లు యెన్నో పరిచయాలు చేసుకున్నారు. వాళ్లనీ వాళ్లనీ చూడ్డానికి వెళ్లేవాళ్లు, సాయంకాలాలప్పుడు చక్కటి సంగీత కచేరీలూ, నృత్య వినోదాలూ యేర్పాటుచేశారు. దీపం శలభాలని ఆకర్షించినట్టుగా వర్వార పావ్లొవ్నా అతిథులని ఆకర్షించింది. యీ తరహా ఉరవడి జీవితం ఫ్యోదొర్ ఇవానిచ్ తత్వానికి సరిపడింది కాదు. ప్రభుత్వంలో ఉద్యోగం సంపాదించుకొమ్మని అతని భార్య సలహా యిచ్చింది. తండ్రి గారి జ్ఞాపకార్థమూ, తన ప్రవృత్తి రీత్యానూ కూడా ప్రభుత్వంవారి కొలువంటే అతనికి రోత కలిగింది, కాని వర్వార పావ్లొవ్నా కోసమని చెప్పి సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో వుండి పోయాడు. యేమైనా త్వరలోనే తను యేకాంతంగా వుండదలచుకుంటే యెవరూ అడ్డ గించడం లేదని అతనికి రూఢి అయింది. వాస్తవానికి సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో అతి ప్రశాంత, సౌకర్యవంతమైన అధ్యయన మందిరం లేదూ అతనికి? అతని కోసం బాధపడి పోయే భార్య అందుకు సహాయపడడానికి సిద్ధంగా లేదూ? యిక అక్కణ్ణుంచి అంతా దివ్యంగా జరిగిపోయింది. అసంపూర్తిగా వుండిపోయిందని తను భావించే అధ్యయనానికే అతను యింకోసారి అంకితం అయిపోయాడు. అతను మళ్లీ చదవడం ఆరంభించి ఇంగ్లీషు భాషని కూడా అధ్యయనం చెయ్యడం మొదలెట్టాడు. విశాలమైన భుజాలూ, లావుపాటి విగ్రహమూ రాతబల్లమీదకి వంగిపోయి, ఆ గడ్డం, యెర్రటి ముఖం నిఘంటువు చూడ్డంలోనో, నోటు పుస్తకం చూడ్డంలోనో సగం మునిగి పోయివుండటం చూడ్డానికి తమాషాగా వుండేది. ఉదయం పూట చదువులో గడిపేవాడు. అప్పుడు సుష్ఠుగా భోజనం చేసేవాడు (వర్వార పావ్లొవ్నా సాటిలేని యిల్లాలు). సాయంత్రాలప్పుడు ఉత్సాహంతో మెరిసిపోయే యువ వదనాలున్న రమ్యమైన, సువాసన లీనే, ధగద్ధగాయమానమైన ప్రపంచంలోకి అడుగుపెట్టే వాడు. సరే, ఆ ప్రపంచపు చుక్కల్లో చందమామ, యెంతో జాగ్రత్త వున్న యజమాను రాలు అతని భార్యే. ఒక పుత్రుణ్ణి కని ఆమె అతన్ని ఆనందపరవశుణ్ణి చేసింది, కాని పాపం

---

* పీటర్స్‌బుర్గ్ పరిసరాల్లో వున్న జార్‌ల వేసవి విడిది. — సం.

ఆ కుర్రాడు అల్పాయుష్కుడు. వాడు వసంతకాలంలో చనిపోయాడు. వేసవికాలంలో ల్రవేత్‌స్కీ వైద్యుల సలహానుసరించి విదేశాలకు, రోగుల చికిత్సకోసం ఉపకరించే ఖనిజస్రోతస్సు వున్న ప్రాంతానికి భార్యని తీసికెళ్లాడు. అలాంటి దురదృష్టం తర్వాత ఆమెకి యే మార్పు కావాల్సి వచ్చింది, ఆమె ఆరోగ్యానిక్కూడా వెచ్చటి శీతోష్ణస్థితి నిమిత్తం కలిగింది. వేసవినీ, ఆకురాలు కాలాన్నీ, వాళ్లు జర్మనీలోనూ, స్విట్జర్లెండ్‌లోనూ గడిపారు. శీతకాలంలో మామూలుగా అనుకునేటట్టే పారిస్‌కి వెళ్లారు. పారిస్‌లో వర్వార పావ్‌లొవ్నా గులాబీ పువ్వులా వికసించి, తనకిగా ఒక చిన్న గూటిని, వేగంగా యుక్తిగా సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో చేసినట్టే, నిర్మించుకుంది. ప్రశాంతమైన, అయినా ఫేషన్‌లో వున్న వీధిలో చక్కటి వాటా సంపాదించింది. భర్తకి, అంతకు ముందెన్నడూ అతను తొడుక్కుని యెరగని, డ్రెస్సింగ్ గౌను అమర్చింది. ముద్దుగా వుండే పనిపిల్లని, బ్రహ్మాండమైన వంటమనిషిని, చురుకైన పనివాణ్ణి నియమించింది. సుందరమైన బగ్గీనీ, అందమైన పియానోనీ కొంది. ఒక వారానికల్లా ఆవిడ అసలైన పారిసియన్లలాగా రోడ్లు దాటడం, శాలువా కప్పుకోవడం, గొడుగు మడవడం, గ్లవ్సు తొడుక్కోవడం పట్టేసింది. త్వరలోనే పరిచయస్థుల బృందం యేర్పడిపోయింది. మొట్టమొదట్లో రష్యన్లు మాత్రమే సందర్శనార్థం వచ్చేవాళ్లు. తర్వాత, చాలా నాగరీకమైన అలవాట్లూ, అద్భుతమైన మర్యాదలు, ఘనంగా కనిపించే పేర్లూ వుండే ఫ్రెంచ్ పురుషులు వచ్చేవాళ్లు. వాళ్లంతా కూడా బిరబిరా మాట్లాడేవాళ్లు, అల వోకగా వుండే లాలిత్యంతోటి వందనం చేసేవాళ్లు, యింపైన రీతిలో కళ్లని తిప్పేవాళ్లు. వాళ్ల గులాబీ పెదాల కింద తెల్లటి పళ్లవరస మెరిసేది. యిక చిరునవ్వు నవ్వడంలో వాళ్లకి వాళ్లేసాటి! ప్రతివాళ్లూ తమ మిత్రుల్ని తీసుకొచ్చేవాళ్లు. త్వరలోనే అందమైన శ్రీమతి ల్రవేత్‌స్కీ (లా బెల్ మదం దె ల్రవేత్‌స్కీ) షౌసె డన్‌తేన్ వీధినుంచి ర్యూ డె లీల్ వీధి దాకా తెలిసిపోయింది. ఆ రోజుల్లో (అంటే 1836లో) యివాళ లాగా చెల్లాచెదరైన పుట్టలోనుంచి బిలబిల్లాడుతూ ఉబికి వచ్చే చీమల్లా పత్రికా విలేకరులు పుట్టుకురాలేదు. కానీ, అప్పుడు కూడా శ్రీమాన్ జూల్ అనే ఒకాయన, నదురుగా వుండని వదనం, నలుగురూ నోళ్లు నొక్కునే కీర్తి ప్రతిష్ఠలూ, ద్వంద్వ యుద్ధాల్లో వాళ్ల మాదిరీ శిక్ష పడ్డవాళ్ల మాదిరీ పొగరు మోత్తనం, నీచత్వం వున్న ఒకాయన, వస్తూవుండేవాడు. వర్వార పావ్‌లొవ్నాకి యీ శ్రీమాన్ జూల్ అంటే వికారంగానే వుండేది, కాని ఆయన అనేక వార్తాపత్రికలకి రాస్తూ వుండటం బట్టీ, యెడతెగకుండా ఆవిడ నామప్రస్తావన చెయ్యబట్టీ, ఆమెని మదాం డె ల...స్కీ అనీ, మదాం డె...., సెత్ గ్రాండ్ దామ్ ర్యూస్ సి దిస్తెంగె, కి దెమ్యోర్ ర్యూ డె పి....*

---

*పి ... అనే వీధిలో వుండేటువంటి, రష్యన్ ఉన్నత వంశానికి చెందిన యీ సొగసైన వనిత... (ఫ్రెంచి.)

అనీ పిలుస్తూ వుండటం వల్లా అతన్ని రానిచ్చేది; విశాల ప్రపంచానికి, అంటే కొన్ని వందలమంది చందాదారులకి, మదాం డె ల...స్కీని గురించి యే ఆసక్తీ లేనివాళ్లకి ఆవిడ యెంతటి మనోహరమైందీ, దయాళువు అయిందీ, ఆమె ఫ్రెంచి వనితలకుండేలాంటి బుద్ధి కుశలతని కలిగి వున్నదీ, యున్ ప్రె ఫ్రంసె పర్ లెస్ప్రి* — ఫ్రెంచి వాళ్లల్లో అంతకి మించిన పొగడ్తలేదు — యెంతటి అద్భుతమైన సంగీత జ్ఞానం ఆవిడకి వున్నదీ, యెంత అందంగా ఆమె వాల్ట్జ్ నృత్యం చేసేదీ (నిజంగా యెగిరే తన చెంగు అంచులదాకా హృదయాలని పరవశింప చేసేటట్టు ఆమె నృత్యం చేసేది).... ఒక్క ముక్కలో చెప్పా లంటే అతను ఆవిడ కీర్తిని నలుదెసలా కర్పూర దీపంలా వెలిగించేశాడు. అది మరి ఆనంద దాయకమైన విషయమే కదా. అప్పటికి కుమారి మార్స్ నాటకరంగాన్ని వదిలిపెట్టింది, కుమారి రాఛెల్ యింకా రంగ ప్రవేశం చెయ్యలేదు. అయినప్పటికీ కూడా వర్వార పావ్లొవ్నా క్రమం తప్పకుండా థియేటర్‌కి వెడుతూనే వుండేది. ఆమె ఇటాలియన్ సంగీతంతోటి పరవశించిపోయింది, ఒద్రీ** భగ్నంకావడం చూసి నవ్వేది, "కామెడీ ఫ్రెంసె" అనే థియే టర్‌లో మర్యాదగా ఆవలించేది, అతి శృంగార సంచలనాత్మక నాటకంలో మదాం దొర్వాల్ నటన చూసి కళ్లల్లో నీళ్లు తిరిగేటట్టు చలించిపోయేది — అన్నిటినీ మించి, తన ఇంట్లో లిస్ట్ తనే రెండు సార్లు వాయించాడు, యెంత సాదాగా, ముచ్చటగా వున్నాడని — వూరికే అద్భుతం! అలాంటి చక్కని అనుభూతులతో శీతకట్టు గడిచింది. శీతాకాలం ముగుస్తుందనగా వర్వార పావ్లొవ్నాని రాజదర్బారులోకి తీసుకెళ్లడం జరిగింది. ఫ్యోదొర్ ఇవానిచ్‌కి సంబం ధించి ఒకో అప్పుడు జీవితం అతనికి భారంగా కనిపించినా — అంత శూన్యంగా వుండేది, గానీ అతను విసుగు చెందలేదు. అతను పత్రికలు చదువుకునేవాడు, సార్‌బోన్‌లోనూ, కాలేజీ డి ఫ్రాన్స్‌లోనూ ఉపన్యాసాలకి హాజరవుతూ వుండేవాడు, ఛాంబర్స్‌లో చర్చలు గమ నిస్తూ వుండేవాడు, నీటి పారుదలకి సంబంధించిన ఒక ప్రసిద్ధ శాస్త్రీయ వ్యాసాన్ని అను వదించ మొదలుపెట్టాడు. "నేను పని జరక్కుండా జాప్యం చెయ్యడం లేదు" అనుకునే వాడతను. "అంతా అందుబాటులోకి వస్తుంది. కాని మళ్లీ శీతకట్టుకి రష్యాకి వెళ్లిపోవాలి నడుం బిగించి పని చేసుకోవాలి" అనుకున్నాడు. అసలు తన పని అనేదాన్ని గురించి అతనికి స్పష్టమైన అవగాహన వుందా అనేది చెప్పడం కష్టం. మళ్లీ శీతకట్టులో రష్యాకి వెళ్ల గలడా అనేది భగవంతుడికి తెలియాలి. కాని యీలోపున భార్యతో కలిసి బాడెన్-బాడెన్‌కి ప్రయాణం అవుతున్నప్పుడు అనుకోని సంఘటన ఒకటి అతని పథకాలన్నిటినీ తలకిందులు చేసింది.

---

*ఫ్రెంచి వనితలు బుద్ధికుశలత కలవారు (ఫ్రెంచి).

**ప్రఖ్యాత ఫ్రెంచ్ కామెడీ యాక్టరు. — సం.

16

ఒక రోజున వర్వార పావ్‌లొవ్నా మందిరంలోకి యథాలాపంగా వెళ్లి, అక్కడ జాగ్రత్తగా మడిచి వున్న కాగితం ఒకటి నేలమీద పడివుండటం లవ్రేత్‌స్కీ చూశాడు. యాంత్రికంగా దాన్ని తీసి, యాంత్రికంగా మడతలు విప్పి, చదివాడు. అది ఫ్రెంచ్‌లో వుంది:

''నా ప్రియమైన సౌందర్యాధి దేవతా బెట్సీ! (నిన్ను బార్బ్ అనీ వర్వార అనీ పిలవలేను.) చౌకు మొగదగ్గర నీకోసం వృథాగా నిరీక్షించాను. రేపు ఒంటిగంటన్నర తర్వాత మా గదికిరా. నీ అనుకూలుడైన బొండాం భర్త (తోన్ గ్రొ బొనామ్ డె మరీ) మామూలుగానే పుస్తకాలతో కుస్తీ పడుతూ వుంటాడు. మనం మళ్లీ నువ్వు నేర్పిన మీ కవి పూష్కిన్ పాట పాడుకుందాం: 'ముసలి మొగుడా, చండశాసనుడా!' నీమీద ముద్దుల వర్షం కురిపిస్తూ, నీకోసం నిరీక్షించే

ఎర్నెస్ట్.''

తను చదివిన దాని భావం లవ్రేత్‌స్కీ బుర్రలోకి దిగడానికి కొంత వ్యవధి పట్టింది. అతను దాన్ని మళ్లీ చదివాడు — అతని తల తిరిగిపోయింది, కాళ్లకింద భూమి దొలుచుకుపోతున్నట్టయింది. గట్టిగా అరిచాడు, ఆవురుమన్నాడు, ఒక్క సారి భోరున యేడ్చాడు.

అతని బుర్ర పూర్తిగా చెడిపోయింది. అతను భార్యని గుడ్డిగా నమ్మాడు; ఆమె మోసం చేస్తుందనిగాని, అవిధేయంగా వుంటుందని గాని అతనికి కలలో కూడా అనిపించలేదు. యీ ఎర్నెస్ట్ అనేవాడు, తన భార్య ప్రియుడు, రాగిజుట్టూ, దుడుకు వాలకమూ వుండే యిరవై మూడేళ్ల కుర్రాడు. చప్పిడి ముక్కూ, చక్కగా కత్తిరించిన మీసం వున్న అతను ఆమె పరిచయస్థుల్లో కల్లా బొత్తిగా అముఖ్యుడు. కొన్ని క్షణాలు గడిచాయి. అరగంట దాటింది. ఆ కాగితం ముక్కని కసిగా నలిపేస్తూ, నేలకేసి శూన్యంగా చూస్తూ నిశ్చలంగా వుండిపోయాడు లవ్రేత్‌స్కీ. సుళ్లు తిరిగే చీకటి చిక్కు దారిగుండా పాలిపోయిన ముఖాలు భయంకరంగా తనకేసి చూస్తున్నట్టుగా వుంది. అతని గుండె బాధతో మూలిగింది. అతను పడిపోతున్నట్టు, అడుగులేని అగాథంలోకి జారిపోతున్నట్టు వున్నాడు. పరిచయమైన సిల్కు బట్టల రెపరెప యీ మాంద్యంనుంచి అతన్ని స్పృహలోని తెచ్చింది. టోపీ పెట్టుకుని, శాలువా కప్పుకున్న వర్వార పావ్‌లొవ్నా అప్పుడే షికారునుంచి తిరిగివచ్చింది. లవ్రేత్‌స్కీ ఆపాదమస్తకం కంపించిపోయి, గదిలోనుంచి బయటికి దూసుకుపోయాడు. ఆ క్షణంలో ఆమెని యే కీలుకి ఆ కీలు వూడబీకేసి, ఆవిడని చావు దెబ్బలు కొట్టేసి, తన చేతులతోటే పీకనులిమి చంపేసి వుండేవాడు అతను. వర్వార పావ్‌లొవ్నా నిశ్చేష్టురాలైపోయింది. అతన్ని ఆపడానికి ప్రయత్నించింది. ''బెట్సీ'' అని గొణిగి, యింటిలోనుంచి దూసుకుపోవడమే అతను చెయ్యగలిగినదంతా.

ల్వ్రేత్‌స్కీ ఒక బగ్గీని కుదుర్చుకుని, తోలేవాడితోటి వూరి అవతలికి తనని తీసుకు పొమ్మని చెప్పాడు. యిక మిగిలిన రోజంతా, రాత్రంతా అతను దిక్కుతోచక తిరుగుతూనే వున్నాడు, బాధతోటి చేతులు విసిరేస్తూ విసుగూ విరామం లేకుండా నిలబడిపోతూనే వున్నాడు. ఒక క్షణంలో పిచ్చివాడిలాగా యీడ్చుకుంటూ పోయేవాడు. మళ్లీ వెంటనే అన్నీ కూడా అతనికి తమాషాగా కనిపించి, అతను సంబర పడేవాడు కూడా. ఉదయం వేళకి చలి అని పించి నగరశివారులో వున్న ఒక మురికి సత్రం దగ్గరికి వెళ్లి ఒక గది అద్దెకి తీసుకుని, కిటికీ దగ్గరికి కుర్చీ లాక్కుని కూలబడ్డాడు. వెర్రిగా నోరువెళ్లబెట్టే వుండిపోయాడు. సరిగ్గా కాళ్లమీద నిలబడలేకపోయాడు. శారీరకంగా అలిసిపోయి, దిమ్మ తిరిగి పోయి వున్నాడు — కాని అలసట అనిపించలేదు అతనికి. కాని అలసటకి దాని ప్రభావం దానికి వుంది. అతను కూర్చుని శూన్యంలోకి చూస్తూనే వున్నాడు, యేమీ అర్థం కావడంలేదు. తనకి యేం జరిగిందీ, యెవరూ లేని కొత్త గదిలో ఒళ్లంతా నొప్పిగా బాధపెడుతూ వుంటే, నోరంతా చేదుగా వుండి, గుండెల్లో గునపాలు గుచ్చుకుంటూ వుంటే తను ఒక్కడూ యెందుకు వున్నదీ యేమీ అర్థం కాలేదు. తన వర్వారని, ఆ ఫ్రెంచి వాడికి లొంగి పోయే టట్టు చేసింది యేమిటీ అతనికి అర్థం కాలేదు. ఆమె భర్తని మోసం చేస్తున్నానని తెలిసీ యెప్పటి లాగానే నిబ్బరంగా, ఆప్యాయం వొలకబోస్తూ నంగనాచిలా యెలా వుండగలిగింది! "నాకిది అర్థం కాదు!" అని యెండిపోయిన అతని పెదాలు గొణిగాయి. "యేమో యెవరు చెప్ప గలరు సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో కూడా ఆమె యిలా..." అతను దాన్ని అసంపూర్తిగానే వదిలేశాడు. మళ్లీ ఆవలించాడు, ఆపాదమస్తకం వణికిపోయాడు. కాంతివంతమైనవీ, మబ్బుగా వున్నవీ కూడా జ్ఞాపకాలు అతన్ని అదే చురుకుతోటి గుచ్చుకున్నాయి. కొన్ని రోజులకితం ఆమె పియానో దగ్గర కూర్చుని, తనూ ఎర్నెస్ట్ వుండగానే, "ముసలి మొగుడా, చండ శాసనుడా" అని పాడిన సంగతి అతనికి హఠాత్తుగా గుర్తువచ్చింది. ఆమె ముఖంమీద కనిపిం చిన భావం, ఆమె కళ్లల్లో వింత తళుకు, బుగ్గలమీద సిగ్గు అతనికి గుర్తువచ్చాయి. అతను యెగిరి నుంచున్నాడు. వాళ్ల దగ్గరికి వెళ్లి చెపుదామనుకున్నాడు: "మీరు నాతో వేళాకోళాలాడ వద్దు. మా ముత్తాత రైతుల్ని చేతులు విరిచికట్టి యెగరేసేవాడు. మా తాత తనే రైతు" — అప్పుడు యిద్దర్నీ చంపుదామనుకున్నాడు. అప్పుడు మళ్లీ అదంతా యేదో కలగా అతనికి కనిపించింది — వుహుఁ, కలకాదు, అదో రకమైన హాస్యం అనిపించింది, అతను చెయ్యవల సిందల్లా ఒక్క సారి తనని తను కుదుపుకుని చుట్టూతా చూడడం.... అతను చుట్టూతా చూశాడు. తన యెరలోకి గోళ్లని గుచ్చే గద్ద లాగా అతని గుండెలోకి బాధ యింకా యింకా లోతుగా గుచ్చుకుంది. అన్నిటినీమించి, ల్వ్రేత్‌స్కీ కొద్ది నెలల్లో తండ్రి కాబోతున్నాడు. గతం, భవిష్యత్తు మొత్తం అతని జీవితం అంతా విషపూరితమైపోయింది. ఆఖరికి అతను

పారిస్‌కి వచ్చి హోటల్‌లో గది తీసుకుని, వర్వార పావ్‌లొవ్నాకి ఎర్నెస్ట్ రాసిన ఉత్తరం, తను రాసిన ఉత్తరంతో కలిపి పంపాడు.

''దీనితో జత చేసిన కాగితం నీకు సమస్తమూ తెలియచేస్తుంది. కాని నీకు ఒక విషయం చెప్పాలి. యెప్పుడూ యెంతో జాగ్రత్తగా వుండే నువ్వు, యిలాంటి ముఖ్యమైన కాగితాన్ని జారవిడుచుకోవడం, నీ జాగ్రత్తకి తగ్గట్టుగా లేదు.'' (పాపం లవ్రేత్‌స్కీ గంటల కొద్దీ ఆలోచించి ఆ మాటని కూర్చాడు.) ''నేను నిన్ను యిక చూడలేను. నువ్వు కూడా నన్ను కలుసుకోవాలని ఒత్తిడి చెయ్యవనే అనుకుంటున్నాను. నీకు సాలుసరి భరణం కింద పదిహేను వేల ఫ్రాంకులు యేర్పాటు చేస్తున్నాను. అంతకంటే యెక్కువ యివ్వలేను. నీ చిరునామా వూరికి పంపించు. నీ యిష్టం వచ్చినట్టు చేసుకో; నీ యిష్టం వచ్చిన చోట వుండు. నీకు ఆనందం కలగాలని కోరుతున్నాను. దీనికి జవాబు రాయనక్కర్లేదు.''

జవాబు రాయనక్కర్లేదని లవ్రేత్‌స్కీ రాశాడు, కాని జవాబు కోసం యెదురుచూశాడు; తహతహ లాడిపోయాడు, యీ అర్థం కాని, వూహించలేని వ్యవహారానికి సంజాయిషీ రావాలని. వర్వార పావ్‌లొవ్నా అతనికి తిరుగు టపాలో ఫ్రెంచిలో పెద్ద ఉత్తరం రాసింది. అదీ ముక్తాయింపు దెబ్బ; అతని కడపటి శంకలు అదృశ్యం అయిపోయాయి. అసలు శంకలు కలిగించుకున్నందుకు సిగ్గు పడిపోయాడు. వర్వార పావ్‌లొవ్నా తనని తను సమర్థించుకోలేదు. ఆమె అడిగిందల్లా అతన్ని చూడాలని, తిరుగులేని నిర్ణయాన్ని తీసుకోవద్దని ఆమె అతన్ని అర్థించింది. ఆ ఉత్తరం ఆప్యాయత లేకుండా, పట్టినట్టు వుంది అక్కడా అక్కడా కన్నీటి జాడలు కనిపిస్తూ వున్నప్పటికీ. లవ్రేత్‌స్కీ వికటంగా చిరునవ్వు నవ్వి, అంతా బాగానే వుందని చెప్పమని చెప్పి ఆ నౌకరుకి పురమాయించాడు. మూడు రోజుల తర్వాత అతను పారిస్‌లో లేడు. కాని అతను ఇటలీకి వెళ్ళాడు, రష్యాకి కాదు. ఇటలీకి యెందుకు పోవాలనుకున్నాడో అతనికి తెలీదు. అతను యెక్కడికి వెళ్ళినా యేమీ లేదు — అది తన యిల్లు కానంత కాలం. అతను తన జమీ మేనేజరుకి భార్య భరణం గురించి రాశాడు. అందులోనే జనరల్ కొరోబ్యిన్‌నుంచి జమీ వ్యవహారాల నిర్వహణ స్వాధీనం చేసుకొమ్మనీ, పద్దులు పూర్తిచేసుకొనేందుకు ఆగక్కర లేదనీ, ఘనత వహించిన ఆ దొరగారు లావ్రికినుంచి నిష్క్రమించేందుకు యేర్పాట్లు చెయ్యమనీ రాశాడు. నిర్వాసితుడైన జనరల్‌గారి ఓటమినీ, బిత్తరపోయిన ఆయన హుందానీ అతను వూహించుకుని, ఆయనకి కలగబోయే దుఃఖం తలచుకుని ఒక రకమైన వికట తృప్తిని అనుభవించాడు. ఆ చేత్తోటే లావ్రికికి తిరిగి రమ్మని గ్లఫీర పెత్రోవ్నాకి రాసి, ఆమె పేర పవర్ ఆఫ్ అటార్నీని రాశాడు. గ్లఫీర పెత్రోవ్నా లావ్రికికి తిరిగి రాలేదు సరికదా, ఆ పవర్ ఆఫ్ అటార్నీ రద్దయినట్టుగా పేపర్లలో ప్రకటించింది. ఆ పని ఆవిడ చెయ్యవలసిన అవసరంలేదు. ఒక చిన్న ఇటాలియన్ పట్టణంలో అజ్ఞాతంగా వుండి భార్య చాలా కాలం చేసే సంచారాలన్నీ కనిపెట్టాలనే కుతూహలం లవ్రేత్‌స్కీకి

కలిగింది. ఆమె పారిస్‌నుంచి బాడెన్-బాడెన్‌కి ముందు అనుకున్నట్టుగానే వెళ్లిందని వార్తా పత్రికల సమాచారం బట్టి సేకరించాడు. మన మిత్రుడు ఎమ్. జూల్‌గారు రాసిన ఒక దాంట్లో ఆవిడ పేరు కనపడింది. రచయితకి అలవాటుగా వున్న తేలిక శైలిని బట్టి మిత్రుని విచారపు ఛాయని అందులో చూడవచ్చు. ఆ పంక్తులు చదివేటప్పటికి ఫ్యోదొర్ ఇవానిచ్‌లో విపరీతమైన వికారం ఉబికి వచ్చింది. ఆ తర్వాత తనకి ఒక ఆడపిల్ల పుట్టిందని అతనికి తెలిసింది. రెండు నెలల తర్వాత వర్వార పావ్‌లొవ్నా తన భరణం తాలూకు మొదటి ఫసలీ తీసుకున్నట్టు అతని జమీ మేనేజరు తెలియజేశాడు. తర్వాత పుకార్లు యింకా యింకా దిగజారి ఆఖరికి విషాదమోద కథగా పరిణతి చెందాయి. ఆ కథ అన్ని పత్రికలలోనూ దేశా లన్నిటా వెలిగిపోయింది. అందులో తన భార్య అనన్యమైన పాత్ర వహించింది. అంతా కూడా ముగిసింది: వర్వార పావ్‌లొవ్నా యిప్పుడు ''పేరు మోసిపోయింది.''

లవ్రేత్‌స్కీ యిక ఆవిడ యెటుపోయినా పట్టించుకోలేదు. కాని చాలా కాలం వరకూ స్థిమిత పడలేకపోయాడు. ఒకో అప్పుడు అతను భార్యకోసం యెంత బెంగపెట్టుకుపోయా డంటే అన్నిటినీ వదిలిపెట్టేద్దామనీ, వూరికే ఆమె లాలించే కంఠం వినడం కోసమూ, ఆమె చేతి స్పర్శ అనుభూతం చేసుకునేందుకు, బహుశా ఆమెని క్షమిద్దామని కూడా అను కున్నాడు. కాని కాలం తన దారిన గడుస్తోంది. బాధతో అమరుడయ్యే గీత అతనికి లేదు. ఆయన దృఢమైన చిత్తం మళ్లీ పుంజుకుంది. అతని కళ్లు విడ్డాయి: అతను భరించిన దెబ్బ కూడా వూహించనిదిగా కనిపించలేదు; తను భార్యని అర్థం చేసుకున్నాడు — మన దగ్గర వాళ్లని, వాళ్లు దూరంగా విడిపోయినప్పుడే మనం అర్థం చేసుకోగలం. అతను మళ్లీ తన అధ్యయనం కొనసాగించి, తన పనిని చేపట్టాడు, అంతకు ముందటి ఉత్సాహం లేకపోయి నప్పటికీ. జీవిత పరీక్షవల్లా, తొలి శిక్షణవల్లా వచ్చిన సంశయాత్మకత చిరస్థాయిగా హృద యంలో చోటు చేసుకుంది. అతను దేన్నీ పట్టించుకోకుండా తయారయాడు. నాలుగేళ్లు గడిచాయి. ఆఖరికి యింటికి తిరిగివచ్చి, తన వాళ్లని చూడగల శక్తి చిక్కినట్టు అతనికి అనిపించింది. సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో కాని, మాస్కోలో గాని ఆగకుండా అతను ఓ— పట్టణానికి వచ్చాడు. మనం అతన్ని అక్కడ వదిలిపెట్టాం, యిప్పుడు పాఠకుడు మమ్మల్ని అనుసరించుగాక.

## 17

మర్నాడు ఉదయం పది గంటల ప్రాంతాల్లో లవ్రేత్‌స్కీ కలీతిన్ యింటి గుమ్మం మెట్లు యెక్కుతున్నాడు. లీజా టోపీ పెట్టుకుని, గ్లవ్సు తొడుక్కుని యివతలికి రావడం చూశాడు.

''ఎక్కడికి బయల్దేరారు?'' అని అతను అడిగాడు.

''ప్రార్థనకి. యివాళ ఆదివారం.''

''మీరు చర్చికి వెడతారా?''

లీజా అతనికేసి నిర్ఘాంతపోయిన నిశ్శబ్దంలో చూసింది.

''మరేం అనుకోకండి'' అన్నాడు లవ్రేత్స్కీ. ''నేను.... అంటే నా ఉద్దేశం అదికాదు. మీదగ్గర సెలవు తీసుకుని పోదామని వచ్చాను. యింకో గంటలో వూరికి వెళ్లిపోతాను.''

''వూరు యిక్కడికి దూరం కాదు కదా?'' అడిగింది లీజా.

''ఆరు కోసులు వుంటుంది.''

లేనొచ్కా వచ్చింది. వెనకాల పనిమనిషి వుంది.

''సరే, మమ్మల్ని మర్చిపోకండి'' అంది లీజా, మెట్లు దిగుతూ.

''మీరు నన్ను మర్చిపోవద్దు. సరేగాని, యెలాగూ చర్చికి వెడుతున్నారు కాబట్టి నాకోసం కూడా ప్రార్థన చెయ్యండి'' అన్నాడతను.

లీజా ఆగి, అతని కేసి తిరిగింది.

''అలాగే, మీరు కావాలంటే'' అందామె నేరుగా చూస్తూ. ''మీకోసం కూడా ప్రార్థన చేస్తాను. రావే, లేనొచ్కా.''

డ్రాయింగ్ రూంలో లవ్రేత్స్కీకి మార్య దీమ్త్రియెవ్నా కనిపించింది. ఆమె ఒక్కత్తీ వుంది. ఆమె దగ్గర ఉడికులాం, మరువం సువాసన వస్తోంది. ఆమె తలనొప్పిగా వుందనీ, రాత్రి నిద్రపట్టలేదనీ అంది. ఆమె అతన్ని తన మామూలు నిరుత్సాహ ధోరణి ఆప్యాయతతోటే ఆహ్వానించి సంభాషణలోకి దిగింది.

''వ్లదీమిర్ నికొలాయెవిచ్ సరసుడైన యువకుడే—యేమంటారు?'' అని ఆమె అతన్ని అడిగింది.

''ఏ వ్లదీమిర్ నికొలాయెవిచ్?''

''ఇంకెవరూ? పాన్షిన్, నిన్న యిక్కడికి రాలేదూ అతను. మీరంటే మహా యిదై పోతున్నాడు. యీ మాట కడుపులో వుంచుకోండి, మోన్ షేర్ కుజిన్*—లీజా అంటే వల్లమాలిన ప్రేమ. బాగానే వుంది, వాళ్ల కుటుంబమూ మంచిది. మంచి భవిష్యత్తు వున్న కుర్రాడు. తెలివైనవాడు, కామేర్ జుంకర్ కూడానూ. దైవానుగ్రహం వుంటే—యేమో, తల్లిగా నేను చెప్పేది, నాకు చాలా ఆనందంగా వుంటుంది. యిది పెద్ద బరువేకదా. పిల్లల సుఖ సంతోషాలు తల్లిదండ్రులమీదే ఆధారపడి వుంటాయి. ఆ బాధ్యత తప్పదు కదా. యిక్కడ యింత కాలమూ ఒక్కత్తినీ యీడ్చుకొస్తున్నాను,

---

* మై డియర్ కజిన్ (ఫ్రెంచి).

అన్నీ నేనే సందడించుకుంటున్నాను. పిల్లలని పెంచి పెద్ద చేశానా, చదువు సంధ్యలు చెప్పించానా? యిప్పుడు కూడా ఒక ఫ్రెంచి ఆయాని పెట్టాను...."

మార్య దీమ్రిత్రియెవ్నా తన బాధలు, కష్టాలు, బాధ్యతలు తల్లిగా తన అనుభూతులు యేకరువు పెట్టింది. టోపీ చేత్తో తిప్పుతూ లవ్రేత్స్కీ మాట్లాడకుండా ఆవిడ చెప్పేది విన్నాడు. అతని భారమైన, నిరాశావహమైన చూపు దడదడా మాట్లాడే ఆవిడని యిబ్బంది పెట్టింది.

"లీజా అంటే మీ అభిప్రాయం చెప్పారు కాదు" అంది.

"ఎలిజవేతా మిహైలొవ్నా చాలా మంచి పిల్ల" జవాబు చెప్పాడు లవ్రేత్స్కీ. అతను లేచినుంచుని వందనం చేసి, సెలవు తీసుకుని మార్ఫ తిమొఫేయెవ్నాని చూడ్డానికి లోపలికి వెళ్లాడు. వెళ్లిపోయే అతని విగ్రహంకేసి అసంతృప్తిగా చూస్తూ "యేం మోటు మనిషి, అసలైన రైతు. పెళ్లాం యెందుకు కాపరం చెయ్యలేకపోయిందో యిప్పుడు అర్థమవుతోంది నాకు" అనుకొంది మార్య దీమ్రిత్రియెవ్నా.

మార్ఫ తిమొఫేయెవ్నా తన గదిలో కూర్చుని వుంది. ఆమె చుట్టూతా ఆమె గృహ పరివారం వుంది. ఆ పరివారం మొత్తం సంఖ్య అయిదు. మొత్తం ఆవిడకి ప్రీతిపాత్రమైనవే. గొంతు తిత్తి బాగా పాటలుపాడే బుల్‌ఫించ్ – కూతపెట్టడం, నీళ్ల చిమ్మడం మానేసిం దగ్గర్నుంచీ ఆవిడకి దాని పట్ల అభిమానం యెక్కువైపోయింది. బెరుగ్గా, ముడుచుకుపోయే రోస్కా అనే పేరున్న చిన్న కుక్క, చిరచిరలాడే పిల్లి మాత్రోసూ, కుదురుగా కూర్చోని తొమ్మిదేళ్ల వయసుండి, పెద్ద కళ్లూ, సూటిగా వుండే చిన్న ముక్కూ నలుపు ఛాయ వున్న షూరొచ్కా అనే పిల్ల, ఒక యాభై యేళ్ల వయసు వుండి తెల్లటి టోపీ, నల్లని బట్టలమీద చిన్న గోధుమరంగు జాకెట్టు తొడుక్కుని నస్తాస్య కార్పొవ్నా ఒగార్‌కొవా అనే పేరున్న పెద్దావిడ అందులో సభ్యులు. షూరొచ్కా అడుగు వర్ణం పిల్ల, అనాధ. మార్ఫ తిమొఫేయెవ్నా ఆ పిల్లని, జాలిపుట్టి, కుక్క రోస్కాని చేరదీసినట్టే చేరదీసింది. ఆవిడ కుక్కనీ, యీ పిల్లనీ యిద్దర్నీ కూడా దిక్కు లేకుండా రోడ్డుమీద పడి వున్నప్పుడే చూసింది. యిద్దరూ కూడా శుష్కించిపోయి, మాడిన పేగులతో వున్నారు. యిద్దరూ ఆకురాలు కాలపు వానలో తడిసిపోయి వున్నారు. రోస్కాని యెవరూ వదిలెయ్యలేదు. షూరొచ్కాని మాత్రం ఆ పిల్ల తాగుబోతు మేనమామ పరమానందంగా వదిలిపెట్టేశాడు. అతనికే రెండు పూట్లా తినడానికి యింతలేదు. మేనకోడలికి తిండి పెట్టేదానికి బదులుగా తన చెప్పుల దిమ్మతో దెబ్బలు వడ్డించేవాడు. నస్తాస్య కార్పొవ్నా, మార్ఫ తిమొఫేయెవ్నాకి ఒక సన్యాసుల మఠం దగ్గర పరిచయం అయింది. ఆమె యీవిడకి చర్చిదగ్గర అభివాదం చేసింది (మార్ఫ తిమొఫేయెవ్నాకి ఆమె అంటే యిష్టం కలిగింది, యేమంటే ఆమె ఆస్వాద యోగ్యంగా ప్రార్థన చేస్తున్నదట), ఆవిడ ఆమెతో మాట్లాడి, ఫలహారానికి రమ్మని పిలిచింది. అప్పటి

నుంచీ ఆమె యీావిడని విడిచిపెట్టలేదు. నస్తాస్య కార్పొవ్నా చాలా ఉల్లాసంగా, మెతక స్వభావంతో వుండే మనిషి. సంతులేని వితంతువు. బతికిచెడ్డ గొప్పకుటుంబీకురాలు. నెరిసిన జుట్టు ఉన్న గుండ్రటి తల, తెల్లని మృదువైన చేతులు, దయాన్విత లక్షణాలున్న మృదువైన వదనం, తమాషాగా పైకి వంపు తిరిగిన ముక్కూ వున్న మనిషి ఆమె. ఆమె మార్ఫ తిమొఫేయెవ్నాని ఆరాధించేది. తన మెతక మనసు గురించి యెన్ని పరాచికాలాడినా ఆవిడ అంటే అభిమానం. ఆమెకి యువకులంటే కొంచెం సరదా, అతి అమాయకమైన పిల్లలాగా సిగ్గుపడుతుంది. ఆమె మొత్తం మూలధనం అంతా నోట్ల రూపంలో వున్న 1200 రూబుళ్లు. ఆమె మార్ఫ తిమొఫేయెవ్నా ఖర్చుమీదే బతికేది, కాని సమాన స్థాయిలో వుండేది — యేమంటే మార్ఫ తిమొఫేయెవ్నాకి ఊడిగం చేసే వాళ్లంటే అసహ్యం.

''ఆయ్! ఫేద్య!'' అని అతన్ని చూడగానే ఆమె అరిచింది. ''నిన్న రాత్రి మా పటాలాన్ని నువ్వు చూడలేదు కదూ — యిదిగో మొత్తం యిక్కడ వున్నాం — యిది మా ఆదివారం టీ సమావేశం రెండోది. నువ్వు అందర్నీ నిమరవచ్చు. ఒక్క షూరొచ్కా ఒప్పుకోదు, పిల్లేమో గీరుతుంది. యివాళ వెళ్లి పోతున్నావా?''

''వూఁ!'' అన్నాడు లవ్రేత్స్కీ కురచ పీటమీద కూర్చుంటూ. ''మార్య ద్మీత్రియెవ్నా దగ్గర సెలవు తీసేసుకున్నాను. ఎలిజవేతా మిహైలొవ్నాని కూడా చూశాను.''

''దాన్ని లీజా అని పిలు. పరాయిదాని లాగా నీకు మిహైలొవ్నా యేమిటి? కదలకుండా కూర్చో, లేకపోతే షూరొచ్కా పీట విరగ్గొట్టగలవు.''

''ఆమె చర్చికి వెడుతోంది. ఆమె అంత భక్తిపరురాలని నాకు తెలీదు'' అన్నాడు లవ్రేత్స్కీ.

''అవును, ఫేద్య, దానికి భక్తి యెక్కువ. నా కంటే, నీ కంటే కూడా యెక్కువ, ఫేద్య.''

''మీకు భక్తి లేదూ?'' అంది నస్తాస్య కార్పొవ్నా, చిన్న పిల్లల్లాగ మాట నోట పట్టీ పట్టకుండా. ''యివాళ ఉదయం ప్రార్థనకి వెళ్లలేదుగాని, సాయంత్రం ప్రార్థనకి వెడతారు.''

''లేదమ్మా; నువ్వొక్కత్తివే వెళ్లాలి — నాకు బద్ధకంగా వుంది'' అంది మార్ఫ తిమొఫేయెవ్నా. ''టీ నీళ్లతోటే యీాద్చుకొస్తున్నాను.'' తనతో సమానంగా ఆమెని చూసినా, నస్తాస్య కార్పొవ్నాని ఆవిడ ''నువ్వు'' అనేది — యెంత చెడ్డా ఆవిడ పేస్తొవ్ కదా: ఇవాన్ టెరిబుల్ మడత చిత్రంలో ముగ్గురు పేస్తొవ్‌లు వున్నారు. మార్ఫ తిమొఫేయెవ్నా దాన్ని మరిచిపోలేదు.

''నేనొకటి అడగాలను కుంటున్నాను'' అని మొదలుపెట్టాడు లవ్రేత్స్కీ. ''మార్య ద్మీత్రియెవ్నా యిప్పుడే అతన్ని గురించి — అతని పేరేమిటి? ఆఁ! — పాన్‌షిన్ గురించి చెప్పింది. ఎవరతను?''

''ఓరి నాయనో! ఏం వాగుడు పిట్ట అది!'' గొణిగింది మార్ఫ తిమొ ఫేయెవ్నా. ''యెలాంటి వరుడు విజయం చేస్తూ వున్నాడో కూడా నీతోటి గుట్టుగా చెప్పేవుంటుంది. ఆ గ్రామ పాచకుడి కొడుకుతోటి తన యేదుపేదో తను యేడవకుండా మిగతావాళ్ల గొడవ దానికెందుకు. దేవుడి దయవల్ల, ఆలూ లేదు, చూలూ లేదు! అప్పుడే టముకు వేసే స్తోందన్న మాట.''

''దేముడి దయ యేమిటి?'' అని అడిగాడు ల్రవేత్స్కీ.

''వాడంటే నాకిష్టం లేదు. యేమైనా అందులో మురిసి ముప్పందుం అయిపోవ డానికి తగ్గది యేముంది?''

''మీకు అతనంటే యిష్టం లేదా?''

''వుహుఁ, లేదు. వాడు అందర్నీ ఆకట్టుకోలేదు. చాలు, నస్తాస్య కార్ప్రొవ్నాకి వాడంటే ప్రేమ, చాలు.''

పాపం ఆ వితంతువు నిశ్చేష్టు రాలైంది.

''రామ, రామ! యేమిటి, మార్ఫ తిమొ ఫేయెవ్నా! మీకు పాపభీతి లేదూ?'' అంది ఆమె, ముఖమూ, మెడా యెరుపు వన్నె తిరుగుతూ వుంటే.

''ఆ సంగతి వాడికీ తెలుసు'' అడ్డం వచ్చింది మార్ఫ తిమొ ఫేయెవ్నా. ''ఆడదాని మనసు వాడికి తెలుసు, దొంగ వెధవ. వాడు యీామెకి ముక్కు పొడుం డబ్బా బహుమతీ యిచ్చాడు. ఆమెని ఓ పొడుం పిసరు యిమ్మని అడుగు, ఫేద్య. నువ్వే చూస్తావు అది యెంత బాగుందో. దాని మూతమీద చిన్న కత్తి చేత పట్టుకున్న అశ్వికుడు గుర్రంమీద స్వారీ చేసే బొమ్మ వుంటుంది. వ్వూఁ, కుంటిసాకులు చెల్లవు, ఏవమ్మోయ్.''

తన చేతుల్ని విచారంగా పైకి యెత్తగలిగింది నస్తాస్య కార్ప్రొవ్నా, అంతే.

''లీజా సంగతేమిటి? లీజాకి అతనంటే యిష్టమేనా'' అని అడిగాడు ల్రవేత్స్కీ.

''దానికీ యిష్టమేమో — కాని, దేవుడికి తెలియాలి. పరాయి మనసు చీకటి అడివి లాంటిది, తెలుసా. ఆడపిల్ల మనసు మరీనీ. మాటకి షూరొచ్కాని తీసుకో — దాని మన సులో యేముందో వూహించు! అది నువ్వు వచ్చినప్పటినుంచీ, అవతలికి పోకుండా నక్కి వుంది యెందుకని?''

షూరొచ్కా యికిలించడం అణగదొక్కుకుని గదిలోనుంచి బయటకి దూసుకుపోయింది. ల్రవేత్స్కీ కూర్చున్న చోటనుంచి లేచాడు.

''అవును. ఆడపిల్ల మనసు పద్మవ్యూహం'' అన్నాడు.

అతను సెలవు తీసుకుని వెళ్లిపోవడానికి తయారయాడు.

''సరే, మళ్లీ దర్శనం త్వరలో వుంటుందా?'' అని అడిగింది మార్ఫ తిమొ ఫేయెవ్నా.

''వుండచ్చు నత్తా. అదేం పెద్ద దూరం కాదు కదా.''

''కాదులే. నువ్వు వసీల్యెవ్‌స్కాయెకి వెడుతున్నావు. లావ్రికిలో వుండవన్న మాట. సరే, అదేదో నీ గొడవ. వూరికే గుర్తుంచుకో మీ అమ్మ సమాధి దగ్గరకి వెళ్ళు, మీ మామ్మ సమాధి దగ్గరకు కూడా. దేశాలు తిరిగి తిక్కతిక్క వూహలన్నీ బుర్రకి పట్టించుకుని వుంటావు. కాని నువ్వు వచ్చావని వాళ్ల ఆత్మ తృప్తి పడుతుంది, యెవరు చెప్పగలరు. ఫేద్య, గ్లఫీర పెత్రోవ్నాకోసం పూజలు చేయించడం మర్చిపోకు. యిదిగో యీ రూబులూ దాని కోసం వుంచు. రా, రా, తీసుకో. నేనే ఆ పని చేయించాలను కుంటున్నది. ఆమె బతికి వున్నప్పుడు నాకూ ఆవిడకీ పడేది కాదు. కాని మనిషి స్వతంత్రం వున్న వ్యక్తి, ఆ మాటే చెప్పాలి. ఆమె గయ్యాళిగంపే. కాని నిన్ను చెడ్డగా చూడలేదు. సరే, వెళ్లి రా. నీకు విసుగు తెప్పిస్తున్నానేమో.''

మార్ఫ తిమొఫేయెవ్నా మేనల్లుణ్ణి ఆలింగనం చేసుకుంది.

''లీజా పాన్‌షిన్‌ని పెళ్లి చేసుకోవడం లేదులే. నువ్వేం బెంగపడకు. దానికి యింత కంటే మంచి మొగుడు వస్తాడు.''

''నాకే బెంగాలేదు'' అని లవ్రేత్‌స్కీ జవాబిచ్చి వెళ్లిపోయాడు.

## 18

నాలుగు గంటల తర్వాత అతను యింటికి వెళ్లే దారిలో బండిలో వున్నాడు. అతని నాలుగు చక్రాల బండి మట్టి రోడ్డుమీద వేగంగా జారిపోతోంది. ఒక పక్షం రోజులుగా వాన పడలేదు. గాలిలో పాలలాగా చక్కని పొగమంచు వూగుతూ, దూరాన వున్న అడవుల్ని తెర కమ్ముతోంది. అక్కడినుంచి కాలుతూ వున్న వాసన వస్తోంది. మసక నీలపు ఆకాశంలో అస్పష్టంగా అచ్చుకొట్టి కొట్టినట్టు వున్న మబ్బుతునకలు విస్తరించుకుని వున్నాయి. ఓ మాదిరి హోరుగాలి వీస్తోంది, వేడిమాత్రం తగ్గలేదు. బాలీసుమీద తల ఆన్చి, గుండెల మీద చేతులు వుంచుకుని లవ్రేత్‌స్కీ విసన కర్ర విచ్చుకున్నట్టుగా విస్తరించిన పొలాల్నీ, మెల్లిగా అటూ యిటూ జారిపోయే చీపురు పొదల్నీ, వెళ్లిపోయే ఆ బండి కేసి పక్కలగా అనుమానంగా చూసే బొంత కాకులనీ, మామూలు కాకులనీ, వసనాభి దుబ్బులూ కొండ చెట్లూ యెక్కువ పెరిగిపోయి కంచెకొట్టేసిన విశాలమైన క్షేత్రాల్నీ చూస్తూ వుండిపోయాడు. నిర్జన పచ్చికమైదానాల తాజా, పూర్ణనగ్నత్వం కేసీ, పచ్చిక తివాసీకేసీ, పొడవాటి యేటవాలు ప్రదేశాలకేసీ, ఒక్ చెట్ల గుబుర్లు వుండే కొండలమధ్య దారులకేసి, మందకొడిగా వుండే గ్రామాలకేసి, బక్కచిక్కిన బర్చ్ చెట్లకేసి, తను యేనాటినుంచో దర్శించని యీ రష్యన్ దృశ్యం మొత్తంకేసీ అతను చూస్తూ వుంటే, మధుర విచారానుభూతులు మిళితమై అతన్ని కదిలించి వేసి అతని హృదయంమీద పూర్తిగా సంతోషదాయకమైన అనుభూతితో

కాకుండా ఒత్తిడి చేశాయి. పైన కదలాడుతున్నట్టు కనిపించే మేఘాల ఆకారాల్లాగా మసక మసకగా అతని ఆలోచనలూ కదలాడాయి. తన బాల్యాన్ని, తన తల్లిని, ఆమె మృత్యుశయ్యని అక్కడికి తనని తీసుకెళ్లడాన్ని, ఆమె యెలా తన తలని గుండెలకి హత్తుకున్నదీ దాన్ని, నీరసంగా తనకోసం రోదించడాన్ని, అప్పుడు గ్లఫీర ప్రెతోవ్నాకేసి చూసి సంబాళించుకోవడాన్ని అతను గుర్తుచేసుకొన్నాడు. మొదట్లో ఉల్లాసంగా, యెప్పటికీ అసంతృప్తుడుగా, యిత్తడిలా మోగే గొంతుకతో, తర్వాత అంధుడై, దయనీయంగా, జీబురు గడ్డంతో వున్న తండ్రిని గుర్తు చేసుకున్నాడు. ఒక రోజున భోజనాల దగ్గర ఒక చుక్క యెక్కువ పడి, పులుసు బట్టమీద ఒలక బోసుకున్నాక ఆయన హఠాత్తుగా చూపులేని కళ్లు యెరుపెక్కిపోయి చికిలిస్తూ వుంటే స్త్రీలమీద తన విజయాలని గురించి యెలా చెప్పుకుపోయిందీ గుర్తుకు తెచ్చుకున్నాడు. అతను వర్వార పావ్‌లొవ్నాని గుర్తుకు తెచ్చుకుని అప్రయత్నంగానే నొప్పితో జంకాడు. లోపల్లోపలి బాధతో హఠాత్తుగా చేసే మనిషిలాగా తల పంకించాడు. అప్పుడు అతని ఆలోచనలు లీజా మీదకి మళ్లాయి.

''జీవితంలోకి యిప్పుడే అడుగు పెడుతూ వున్న పిల్ల యిదిగో. మంచి పిల్ల, ఆవిడకేం జరుగుతుందో! మనిషి కూడా ఆకర్షణీయంగానే వుంది. పల్చగా, నేవళింపుగా వున్న ముఖం, గంభీరంగా వుండే నోరూ కళ్లూ, అమాయకంగా తిన్నగా చూసే చూపులు. పాపం మరీ తన్మయత్వం చెందే పిల్లలా వుంది. చక్కని ఆకారం, లేడి పిల్లలా గెంతుతోంది, కంఠం యెంత మృదువుగా వుంది. ఆ పిల్ల వున్నట్టుండి ఆగడం, శ్రద్ధగా వినడం, చిరునవ్వు నవ్వకుండా, అప్పుడు యేదో ఆలోచిస్తున్నట్టు అయిపోయి, జుట్టు వెనక్కి యెగరెయ్యడం నాకు మరీ నచ్చాయి. ఆ పాన్‌షిన్ ఆమెకి తగ్గవాడని అనిపించడం లేదు. యింతకీ, అతనిలో లోపం యేమిటీ? అసలింతకీ నాకీ వూహలన్నీ యేమిటి? లోకంలో అందరి మాదిరిగానే ఆ పిల్లా తన దారిన పోతుంది. నాకెందుకు ఓ కునుకు తీస్తాను.'' అలా అనుకుని లవ్రేత్‌స్కీ కళ్లు మూసుకున్నాడు.

అతను నిద్రపోలేకపోయాడుగాని, జోగుతూ వుండే మగతలోకి జారిపోయాడు. గందరగోళంగా యితర స్మృతులతో మిళితమైపోతూ గతకాలపు దృశ్యాలు తొందర లేకుండా అతని మనసులో యెగిరాయి. యెందుకనో తెలియకుండా లవ్రేత్‌స్కీ వూహలు రాబర్ట్ పీల్‌కేసి, ఫ్రెంచి చరిత్రకేసీ, తను సైన్యాధిపతి అయితే ఒక యుద్ధం యెలా నెగ్గుతాడో దానికేసీ, మళ్లాయి – తుపాకీల కాల్పులూ, యుద్ధారావాలూ వింటున్నట్టు కూడా అతను అనుకున్నాడు. అతని తల ఒరిగింది, అతను కళ్లు తెరిచాడు. అవే పొలాలూ, అవే పచ్చిక మైదానాల దృశ్యాలూ. దౌడు తీసే గుర్రాల నాడాలు యెగసే ధూళిలో ఒక దాని తర్వాత ఒకటి మెరుస్తున్నాయి. బండి తోలేవాడి పసుపు అంగీ ఎర్రటి అతుకు అంచులు గాలితోబాటుగా అలలుగా లేస్తున్నాయి. ''యిలా చక్కగా యింటికి తిరిగిరావడం, భేష్'' లవ్రేత్‌స్కీ మన

సులో యీ ఆలోచన మెరిసింది. ''హేయ్, అదిగో!'' అని అరిచి పై బట్ట చుట్టూ కప్పు కుని మెత్తమీదకి మరీ ముడుచుకుపోయాడు. బండి ఒక కుదుపు యిచ్చింది. ల్రవేత్స్కీ కూర్చుని కళ్లు తెరిచాడు. అతని ముందు కొండ వార ఒక గ్రామం ఒదిగిపోయివుంది. కుడి వేపున కొంచెం దూరంలో విసిరేసినట్టుగా భూస్వామి చిన్న గృహం వుంది. షట్టర్లు మూసేసి వున్నాయి, ముందు వసారా ఒక క్రమంలో లేదు. విశాలమైన పెరడునిండా గేటు దగ్గరనుంచీ జనపమొక్కల్లాగా దట్టంగా, పచ్చగా వుండే దురదగొండిలాంటి మొక్కలు పెరిగిపోయి వున్నాయి. ఓక్‌తో కట్టిన గాదె ఒకటి వుంది. అది యింకా గట్టిగానే వుంది. అది వసీల్యెవ్‌స్కాయె.

బండి తోలేవాడు గేటు దాకా వచ్చి ఆగాడు. ల్రవేత్స్కీ నౌకరు బండి తొట్టిలో నుంచుని ఉరకడానికి సిద్ధంగా వున్నవాడిలా ''హేయ్!'' అని అరిచాడు. ఎదో కఠోరమైన కుక్క అరుపు వినిపించింది కాని యెవరూ, ఆఖరికి కుక్క కూడా, కనిపించలేదు. నౌకరు యెగరడానికని యింకో సారి నుంచుని మళ్లీ ''హేయ్!'' అని అరిచాడు. ఆ వీరసపు అరుపు మళ్లీ వినిపించింది. ఓ క్షణం తర్వాత పసుపుపచ్చని నూలు లాగు, నడుము పట్టీ తొడు క్కుని తలంతా ముగ్గుబుట్టలా వున్న ఒకతను, యేదో శూన్యంలోనుంచి వూడిపడ్డట్టుగా పరిగెత్తుకుంటూ పెరట్లోకి వచ్చాడు. కళ్లకి పైన నీడగా చెయ్యిపెట్టి బండికేసి పరీక్షగా చూసి, వున్నట్టుండి తొడలు చరుచుకుని, అటూ యిటూ పరిగెత్తడం మొదలుపెట్టి, అప్పుడు గేటు తెరవడానికి పరిగెత్తాడు. బండి లోపలికి వెళ్లింది. దాని చక్రాల కింద దురద గొండి మొక్కలు గలగల్లాడుతూ వుంటే వసారా దగ్గర ఆగింది. ఆ ముగ్గుబుట్ట తల మనిషి చురుకుకాలివాడై వుంటాడు, అప్పటికే బండి మెట్ల చివరికి వచ్చి, కాళ్లు యెడంగా వంకరగా పెట్టి నుంచున్నాడు. అతను బండి ముందు భాగం విప్పదీసి, పడిగెని వెనక్కి తోసేసి, యజమాని దిగడానికి చెయ్యి ఆసరా యిచ్చి, అతని చేతిని అభివాదపూర్వకంగా ముద్దు పెట్టుకున్నాడు.

''బాగున్నావా, పెద్దాయనా?'' అన్నాడు ల్రవేత్స్కీ. ''నీ పేరు యేమిటీ అన్‌తోన్ కదూ? యింకా బాగున్నావన్నమాట!''

ఆ ముసలతను వంగి వందనం చేసి, తాళాలు తీసుకు రావడానికి పరుగెత్తి వెళ్లిపోయాడు. అతను వెళ్లాక, బండి తోలేవాడు కదలకుండా, చేతులు నడుంమీద ఆన్చుకుని, మూసేసిన తలుపు కేసి చూస్తూ కూర్చున్నాడు. పై నుంచి కిందికి వురికిన నౌకరు, అక్కడ్నే అంద మైన భంగిమలో పాతుకుపోయి, ఓ చెయ్యి బండిమీద ఆన్చినుంచున్నాడు. ఆ ముసలతను తాళాలు తెచ్చి, మోచేతులు ముందరికి పెట్టి, అనవసరంగా పాములాగా మెలికలు తిరుగుతూ తలుపు తీసి, అప్పుడు పక్కకి వెళ్లి మళ్లీ వందనం చేశాడు.

''మొత్తానికి మళ్లీ యింటికి వచ్చానన్న మాట'' అనుకున్నాడు ల్రవేత్స్కీ, హాలు లోకి ప్రవేశిస్తూ. యీలోపున కిర్రుమనీ ధనామనీ చప్పుడు చేస్తూ షట్టర్లు తెరుచుకు న్నాయి, నిర్మానుష్యమైన ఆ గదుల్లోకి పగటి వెలుతురు భళ్లున వచ్చింది.

## 19

ల్రవేత్స్కీ ప్రవేశించిన ఆ యిల్లు చిన్నది. అంతకు ముందు రెండేళ్ల కితమే గ్లఫీర పెత్రోవ్నా అక్కడ చనిపోయింది. ఆ యింటిని గడిచిన శతాబ్దంలో దృఢమైన పైను చెక్కతో కట్టారు. క్షీణించినట్టు కనిపిస్తోంది గాని యింకో యాభై యేళ్లూ, అంతకు పై బడీ వుంటుంది. ల్రవేత్స్కీ అన్ని గదుల్లోకీ వెళ్లాడు. దుమ్ము కొట్టుకుపోయిన చెక్కలమీద నిశ్చలంగా, నిర్దాణంగా విశ్రాంతి తీసుకుంటూ వుండిపోయిన యీగలకి భంగం కలిగించేట ట్టుగా అన్ని కిటికీలనూ తెరిపించాడు. గ్లఫీర పెత్రోవ్నా చనిపోయిన దగ్గర్నుంచీ యెవరూ వాటిని తెరవలేదు. యింట్లో వున్న ప్రతీదీ యెలా వుండేది అలానే వుండింది. డ్రాయింగ్ రూంలో నాజూకైన కాళ్లున్న చిన్న సోఫాలు, లతల బొమ్మలున్న శెల్లా పట్టు కప్పినవి, జాళ్లు పడిపోతూ, యీసులు లేచిపోయి, కాథరిన్ రాణీవారి కాలాన్ని జ్ఞప్తికి తెస్తున్నాయి. యిక్కడనే యజమానురాలి ప్రియమైన చేతుల కుర్చీ వుంది. వీపు ఆనుకునే దాని వెనక చట్టి నిటారుగా వుంది. కాని యజమానురాలు వార్ధక్యంలో కూడా యెన్నడూ దానికి ఆనుకో లేదు. ముందు గోడమీద ఫ్యోదొర్ ముత్తాత అంద్రేయ్ ల్రవేత్స్కీ పాత పటం వేళ్లాడుతూ వుంది. వంగిపోయి, నల్లబడిపోయిన వెనక భాగంనుంచి ఆయన చిరచిరలాడే ముఖం కనిపించీ కనిపించకుండా వుంది. భారంగా మూసుకుపోతూవున్న కనురెప్పల కిందనుంచి ముటముటలాడే చిన్న కళ్లు భయం కలిగించేటట్టు చూస్తున్నాయి, ఆలోచనామగ్నమైన మోటు కనుబొమలపైన చమురులేని నల్లని జుట్టు పెళుసుగా వుంది. ఆ చట్రపు ఒక మూలనుంచి యెప్పటికీ రంగుపోని పువ్వుల గుత్తి ఒకటి వేలాడుతూవుంది. ''గ్లఫీర పెత్రోవ్నా తనే స్వయంగా ఆ గుత్తిని తయారుచేశారు'' అని చెప్పాడు అన్‌తోన్. యేదో పాత కాలపు వస్తువుమీద చారల చాందినీ వున్న మంచం ఒకటి పడక గదిలో వుంది. మాసిన తలగడాల గుట్ట, పల్చటి పలంగుపోషు మంచంమీద వున్నాయి. దానిమీద చివర ''పవిత్ర కన్య సాక్షాత్కారాన్ని'' చిత్రించే పవిత్ర చిత్రం వుంది. ఆ చిత్రాన్నే ఒంటరిదై, అందరూ మరిచి పోయిన ఆ వృద్ధకన్య కడసారిగా మృత్యుశయ్యమీద బిగుసుకుపోయే తన పెదాలకి తాకించు కుంది. ఇత్తడి తాపడాలతోటి, చెక్కడం పని చేసి, మకిలి చట్రంలో వంగిపోయిన అద్దం వున్న డ్రెస్సింగ్ టేబుల్ కిటికీ వార వుంది. పడక గదిని ఆనుకునే విగ్రహాల గది వుంది. ఒట్టిగోడలు, ఒక మూల పెద్ద విగ్రహాల పెట్టె వున్న గది; నేలమీద కొవ్వు కరిగిధారిన మరక

లున్న పల్చటి తివాసీ వుంది; దానిమీద గ్లఫీర పెత్రోవ్నా ప్రార్థనా సమయంలో మోకరిల్లేది. గుర్రపుశాలనీ, బండిశాలనీ తెరవడానికని అన్‌తోన్ లవ్రేత్‌స్కీ నౌకరుతోటి కలిసి అవతలికి వెళ్లాడు. అతని బదులుగా, అదే వయసు వున్న చిన్న ముసలావిడ వచ్చింది. ఆమె కనుబొమలకి తగులుతూ వుండేట్టుగా రుమాలు కట్టుకుంది. ఆమె తల వణుకుతోంది, ఆమె కళ్లు శూన్యంగా చూస్తున్నాయి. కాని ఒక రకమైన ఆదుర్దాని వ్యక్తం చేస్తున్నాయి. మారు మాట్లాడకుండా సేవ చేయడమనే యెన్నో యేళ్ల అలవాటు ఫలితం అది. అదే సమయంలో వినయపూర్వకమైన చింత కనిపిస్తోంది. ఆమె అభివాదం చెయ్యడానికి లవ్రేత్‌స్కీ చేతిమీద ముద్దు పెట్టుకుని, అతని ఆజ్ఞలకోసం నిరీక్షిస్తూ గుమ్మంలో నుంచుంది. యెంతగా గింజుకున్నా ఆమె పేరుగాని, ఆమెని చూసిన జాడగాని అతనికి గుర్తు రాలేదు. ఆమె అప్రాక్సేయా కామోసు. నలభై యేళ్లనాడు గ్లఫీర పెత్రోవ్నా ఆమెని యింటినుంచి బహిష్కరించి కోళ్లకానా దగ్గరికి పంపేసింది. యేమైనా, మతిపోయినట్టుగా, ఆమె కొంచెం మాట్లాడింది, అదే ఒదిగి ఒదిగిపోయివున్న చూపులతో అతని కేసి అలా చూస్తూ వుండిపోయింది. యీ యిద్దరు ముసలి జీవాలతోటీ, పొడుగాటి అంగీలు తొడుక్కుని బానల్లా కడుపులు వున్న అన్‌తోన్ మునిమనవలతోటి బాటుగా, ఆ జమీలో ఒంటి చెయ్యి చిన్న రైతు కూడా వున్నాడు. అతన్ని భూస్వామ్యదాస్యం నుంచి విముక్తం చేశారు. అతను వడ్రంగి పిట్ట టక్కుటక్కుమని కొట్టినట్టుగా గొణుగుతూ వుండేవాడు, యెందుకూ పనికి రాడు. అలాగే లవ్రేత్‌స్కీకి తన మొరుగుడు తోటి స్వాగతం చెప్పిన శక్తి ఉడిగిపోయిన వేటకుక్క కూడా యెందుకూ పనికిరానిదే. గ్లఫీర పెత్రోవ్నా ఆజ్ఞమేరకి కొన్న బరువైన గొలుసుతోటే అది పదేళ్లుగా వుంది. ఆ బరువు లాగుతూ అది సరిగా కదలను కూడా కదలలేదు. యిల్లంతా చూశాక లవ్రేత్‌స్కీ తోటలోకి వెళ్లాడు. దాని దృశ్యం అతనికి సంతోషం కలిగించింది. తోటంతా కలుపు మొక్కలతోటీ, ముళ్లమొక్కలతోటీ, గూస్‌బెర్రీ, రాస్ప్‌బెర్రీ పొదలతోటీ పెరిగిపోయివుంది. కాని చక్కని నీడ యిచ్చే యెన్నో పాత కాలపు లైమ్ చెట్లూ వున్నాయి. వాటి పరిమాణమూ, ఒకే తరహాగా వుండే కొమ్మలూ వాటి ప్రత్యేకత. వాటిని మరీ దగ్గరగా పాతారు. యెప్పుడో ఒకప్పుడు, బహుశా ఒక వంద యేళ్ల కితం, వాటిని కత్తిరించి వుంటారు. తోట చివర తేటగా వుండే చిన్న చెరువు వుంది. దాని చుట్టూతా రెల్లు పెరిగివుంది. మానవ జీవితపు జాడలు త్వరగా మాసిపోతాయి; గ్లఫీర పెత్రోవ్నా యిల్లూ, తోటా యింకా నిర్జనం కాలేదు కాని, క్షుభిత మానవాళి యింకా స్పృశించి మలినం చెయ్యకుండా భూమ్మీద వుండే ప్రతిదీ నిర్గమించే ఆ ప్రశాంత సుషుప్తిలోకి జారినట్టు వుంది. ఫ్యోదొర్ ఇవానిచ్ వూళ్లోకి కూడా ఒకసారి వెళ్లాడు. చెక్కిళ్లు అరచేతుల్లో పెట్టుకున్న రైతు స్త్రీలు యిళ్ల గడపల దగ్గర్నుంచి అతన్ని చూశారు; మగాళ్లు దూరంనుంచే శిరఃకంపనం చేశారు; పిల్లలు అటూ యిటూ పరిగెత్తిపోయారు. కుక్కలు యేమిటో పట్టనట్టుగా మొరిగాయి. అతనికి

ఆకలి వేసింది. కాని అతని పరిచారకులూ, వంటమనిషీ సాయంత్రందాకా రారు. ల్వ్రివికి నుంచి సామాన్ల బండి యింకా రాలేదు — అతను అన్‌తోన్ మీదే ఆధారపడాల్సివచ్చింది. అన్‌తోన్ యజమాని కోరికని తీర్చడానికి హుటాహుటిన తయారయ్యాడు: అతను ఒక ముసలి కోడి పెట్టని పట్టి, చంపి, శుద్ధిచేశాడు. అప్రాక్సేయా దాన్ని గీకి, శుభ్రం చేసి, గుడ్డని ఉతికినట్టుగా కడిగి అప్పుడు పెనంమీద వేసింది. అది తయారయాక అన్‌తోన్ బల్లమీద గుడ్డ పరచి సిద్ధం చేసి, కత్తీ ఫోర్కూ పెట్టి, ఉప్పు వేసుకునే మకిలి ముక్కాలి గిన్నెనీ, గుండ్రటి గాజు చిరడా వున్న సన్నమూతి గాజు పాత్ర నొకదాన్ని దానిమీద వుంచాడు. అప్పుడు యజమాని దగ్గరికి వెళ్లి కీచుకంఠంతోటి భోజనం సిద్ధంగా వుందని చెప్పి, కుడి చేతిని రుమాలుతో కట్టుకుంటూ ఒక రకమైన ముసలి వాసన, తమాల వృక్షంలాంటి వాసన, కొడుతూ కుర్చీ వెనక్కాల నిలబడ్డాడు. లవ్రేత్‌స్కీ కొంచెం సూప్ తిని కోడికూర అందుకున్నాడు. దాని తోలు అంతా బొడిపెలతో వుంది. ప్రతి కాలిమీదా ముదురునరాలు వున్నాయి. మాంసం కొయ్య, శారద్రావకం వాసన కొడుతూ వుంది. భోజనం చేసిం తర్వాత తనకి కొంచెం టీ వుంటే ఫరవాలేదనీ అయితే.... అని చెప్పబోతూవుండగానే ''యిదిగో యిప్పుడే తెస్తున్నా''నని ఆ ముసలాడు మాటకి అడ్డం వచ్చి, అన్నట్టే టీ తెచ్చాడు. వెదుకులాడి ఎర్ర కాగితం ముక్కలో వేసిన ఓ పిసరు టీని సంపాదించి పొట్లం కట్టి, డబడబలాడే చురుకైన సమోవార్‌నీ, అలాగే చెమ్మగా వున్నట్టు కనిపించే పంచదార బిళ్లల్నీ మొత్తం మీద తవ్వితీసి పట్టుకుని వచ్చాడు. లవ్రేత్‌స్కీ ఒక పెద్ద కప్పులో టీ తాగాడు. ఆ కప్పు అతని చిన్ననాటి నుంచీ అతనికి గుర్తుంది. దానిమీద పేకముక్కల బొమ్మలున్నాయి. దాన్ని అతిధుల కోసమే వాడేవాళ్లు — తనిప్పుడు దాంట్లోనుంచి టీని అతిథిలాగా తాగాడు. పని వాళ్లు సాయంత్రం వచ్చారు. లవ్రేత్‌స్కీకి మేనత్త మంచంమీద పడుకో బుద్ధి వెయ్య లేదు. భోజనాల గదిలో మంచం వేయించుకున్నాడు. కొవ్వొత్తిని ఆర్పేసిం తర్వాత చాలా సేపు విచారకరమైన ఆలోచనలతో కూర్చుండిపోయాడు. యెంతో కాలం యెవరూ కాపరం వుండని యింట్లో ఒక రాత్రి గడిపేవాడి అనుభూతుల్లాంటి అనుభూతులు అతనికి కలి గాయి. నాలుగు దిక్కులనుంచీ కమ్ముకు వచ్చే చీకటి నూతనంగా కాపరం చెయ్యవచ్చిన యితన్ని ప్రతిఘటిస్తున్నట్టుగా వుంది. ఆ గోడలే భయంతో బెదిరిస్తున్నట్టుగా వున్నాయి. కడకి అతను నిట్టూర్చి, దుప్పటీ లాక్కుని, నిద్రపోయాడు. యిల్లంతా సద్దుమణిగాక చాలా సేపు అన్‌తోన్ మెలుకువగా వున్నాడు. అతను అప్రాక్సేయాతోటి మెల్లిగా గుస గుసలు చేస్తున్నట్టు మాట్లాడి, లోగొంతుకతో మూలిగి, ఒకటి, రెండు సార్లు శిలువ గీసుకున్నాడు. దగ్గర్లోనే అన్ని హంగులూ వున్న రాజభవనాన్ని వదిలిపెట్టి తమ యజ మాని వసీల్యెవ్‌స్కొయెలో స్థిరపడతాడని వాళ్లు అనుకోలేదు. ఆ స్థలం అతనికి అసహ్యం కలిగిస్తుందనీ, యెన్నో బాధాకరమైన జ్ఞాపకాలతోటి నిండిపోయి వున్నదనీ వాళ్లకి తోచనే

లేదు. గుసగుసలు ముగిసాక అన్‌తోన్ కర్ర తీసుకుని యెంతో కాలంగా వాయించకుండా గాదెపక్కనే వున్న రాత్రి కాపలా వాడి గంటని వాయించి, పెరట్లోనే, తలకి యేమీ కప్పుకోకుండా, పడుకోడానికి ఉపక్రమించాడు. మేనెల రాత్రి మృదువుగా, హాయిగా వుంది. ముసలతను కమ్మగా నిద్రపోయాడు.

## 20

మర్నాడు లవ్రేత్‌స్కీ కొంచెం పెందరాళే లేచాడు. జమీ పెత్తందారుతో మాట్లాడి, ధాన్యం నూర్చే స్థలం దగ్గరికి వెళ్ళి, కుక్క గొలుసు తీసెయ్యమని పురమాయించాడు. కాని అది వున్న చోటునుంచి కదలకుండా యధాలాపంగా మొరిగింది. అతను తిరిగి యింటికి వచ్చి ప్రశాంతమైన మగతలో పడి, రోజంతా అలానే వుండిపోయాడు. ''యిక్కడా అడుగుకి చేరింది'' అని యెక్కువ సార్లు అనుకున్నాడు. కదలకుండా, చుట్టూతా ప్రవహించే ప్రశాంత జీవితపు ప్రవాహశబ్దాన్నీ, పల్లె యేకాంతపు అరుదైన ధ్వనులనీ వింటూ కిటికీవారే కూర్చున్నాడు. దూలగొండి దుబ్బుల కింద యెక్కడినుంచో నీరసపు మంద్రస్వరం వచ్చింది. ఒక దోమ వంత అందుకుంది. ఆ ధ్వని మణిగింది కాని దోమ రొద చేస్తూనే వుంది. యీగల తాళబద్ధమైన, యెడతెగని విచారకరమైన రొదనుంచి, కప్పుకేసి ఆగకుండా కొట్టుకుంటూ వుండే కందిరీగ జోరు వినవచ్చింది. బయట కోడి కొక్కొరోకో అంది, కడపటి స్వరాన్నే కటువుగా సాగదీస్తూ. ఒక బండి దడదడ చప్పుడు చేస్తూపోయింది; వూళ్లో యెక్కణ్ణో ఒక గేటు కిర్రుమంది. ''అః, యేంటీ'' అంది బొంగురు పోయిన ఒక రైతు స్త్రీ కంఠం. ''అమ్మా, బుజ్జీ'' అంటున్నాడు అన్‌తోన్ తను చేతులతో ఆడిస్తున్న రెండేళ్ల పిల్లని పట్టుకుని. ''క్వాస్ తీసుకురా'' అంది ఆడగొంతుక – మళ్లీ గాఢమైన నిశ్శబ్దం ఆవహించింది. పిసరుధ్వని కాని, చప్పుడు కాని వినిపించలేదు. గాలిలో ఒక్క ఆకు కదలలేదు. మంగలపక్షులు నేలబారుగా ఒక దాని తర్వాత ఒకటి నిశ్శబ్దంగా యెగురుతున్నాయి. అవి నిశ్శబ్దంగా యెగిరిపోవడం విచారకరంగా వుంది. ''యిక్కడా అడుగుకి చేరింది'' అనుకున్నాడు మళ్లీ లవ్రేత్‌స్కీ. ''యిక్కడ జీవితం యెప్పుడూ శాంతంగా, తొట్రుపాటు లేకుండా వుంటుంది'' అనుకున్నాడు. ''యీ పరిధిలోకి యెవరు వచ్చినా కూడా దీని సమ్మోహక శక్తికి లొంగిపోవాల్సిందే. యిక్కడ చీకూ చింతా బహిష్కారమయ్యాయి. కాడి వెనకాల చాలు వెంబడే వచ్చే సేద్యగాడులాగా తన జీవిత పథాన్ని యేర్పాటు చేసుకున్న వాడికి అంతా యిక్కడ సక్రమంగానే సాగుతుంది. యీ ప్రశాంత యేకాంతంలో యే శక్తీ, జవం దాగి వున్నాయో కదా. దట్టమైన గడ్డి పొరల్లోనుంచి యిక్కడ గట్టి బర్డన్ మొక్క మొలకెత్తుతోంది. దానిమీద లోవేజ్ రసకాండం వస్తుంది, యింకా పైన అందమైన తీగ గులాబీ తంతులతో సాగుతుంది. దూరంగా పొలంలో పండిన రై మెరుస్తోంది, ఓట్లు

యిప్పటికే పైకి వస్తున్నాయి. ప్రతి చెట్టుమీది ప్రతి ఆకూ, తొడిమని వుండే ప్రతి గడ్డిపోచా పూర్ణజీవితంతో వికసిస్తున్నాయి. నా జీవితంలో అత్యుత్తమమైన కాలం అంతా ఒక స్త్రీ ప్రేమలోనే గడిచిపోయింది'' లవ్రేత్‌స్కీ ఆలోచించుకుంటూ పోతూనే వున్నాడు. ''యిక్కడి విసుగ్గా వుండే నిశ్చలత్వం నన్ను సాపు చేస్తుంది. యీ జీవితాన్ని తీరికగా నన్ను నా కర్తవ్యాన్ని చేపట్టేటందుకు సిద్ధం కానివ్వాలి.'' మళ్లీ యింకోసారి యేమీ ఆశించకుండానే, అయినా యేదో జరగాలని కోరుకుంటూ, దేనికోసమో నిరీక్షిస్తూ, ఆ నిశ్శబ్దాన్ని ఆలకించాడు. అన్ని వేపులనుంచీ ఆ నిశ్శబ్దం అతన్ని ముంచెత్తింది. సూర్యుడు మెల్లిగా ప్రశాంత వినీలాకాశంలో జారుతున్నాడు. మేఘాలు మందంగా పోతున్నాయి. ఎందుకు, యెక్కడికి పోతున్నదీ వాటికి తెలిసినట్టే వుంది. అదే సమయంలో మరోచోట జీవితం కుత కుత ఉడుకుతోంది, ఉరవళ్లు తొక్కుతోంది, దారిలో ఢీకొడుతోంది, యిక్కడ బాడవ గడ్డిమీద నీళ్లల్లా నిశ్శబ్దంగా జారిపోతోంది. గడిచిపోయే, ప్రవహించే జీవితాన్ని గురించిన ఆలోచనలనుంచి లవ్రేత్‌స్కీ సాయంత్రం దాకా బయట పడనేలేకపోయాడు. గడిచిపోయిన దినాలకోసం విచారం అతని హృదయంలో వసంత కాలపు మంచులా కరిగిపోయింది. చిత్రంగా, అంతకు ముందెన్నడూ తన మాతృదేశం కోసం ప్రేమ అతని హృదయంలో అంత గాఢంగా, దృఢంగా ప్రతిష్ఠితమవలేదు.

## 21

తర్వాత కొద్ది రోజుల్లోనే ఫ్యోదొర్ ఇవానిచ్ లవ్రేత్‌స్కీ, గ్లఫీర పెత్రోవ్నా చిన్న యింటిని కంజాయింపుచేశాడు. పెరడు, తోట శుభ్రం చేయించాడు. లావ్రికినుంచి సౌకర్యంగా వుండే కుర్చీలనీ వగైరాలనీ తెప్పించాడు. పట్టణంనుంచి వైన్, పుస్తకాలు, పత్రికలు తెప్పించాడు. శాలల్లో గుర్రాలు ప్రత్యక్షమయ్యాయి. మొత్తంమీద ఫ్యోదొర్ ఇవానిచ్ తన అవసరాలన్నిటికీ యేర్పాటుచేసుకుని జీవితంలో స్థిరపడ్డాడు, అది గ్రామీణ భూస్వామి జీవితమా, సన్యాసి జీవితమా అనేది చెప్పలేం. రోజులు ఒకేరీతిగా గడుస్తున్నాయి. అతను యెవర్నీ కలుసుకోకపోయినా అతనికి విసుగ్గా వుండటం లేదు. అతను బహుజాగ్రత్తగా తన జమీ వ్యవహారాలు చూసుకొనేవాడు. గుర్రంమీద ఆ చుట్టు పక్కల అంతా తిరిగేవాడు, కొంచెం చదువుకునేవాడు. అతను తక్కువే చదివేవాడు; ముసలి అన్‌తోన్ చెప్పే కథలు వినడానికి యెక్కువ యిష్టం చూపించేవాడు. లవ్రేత్‌స్కీ నోట్బో పైపు, పక్కన చల్లారిన టీ పెట్టుకుని కిటికీ దగ్గర కూర్చునేవాడు. అన్‌తోన్ చేతులు వెనక్కి కట్టుకుని గుమ్మందగ్గర నుంచుని అలా సాగిపోయే తన కథలు మొదలుపెట్టేవాడు. ఆ పాత కాలపు రోజుల గురించీ, బంగారు గతం గురించీ, ఓట్సూ, రై కుంచాల లెక్కనగాక పెద్దపెద్ద

బస్తాల్లో బస్తా రెండు మూడు కోపెక్కులకి అమ్మిన రోజుల గురించీ, పట్టణానికి నాలుగు వేపులా దట్టమైన అడవులూ, యెవళ్లూ పోలేని పచ్చిక బీళ్లూ వున్న రోజుల గురించీ చెబుతూ వుండేవాడు. "యిప్పుడా" అనేవాడు, ఎనభయ్యోపడిలో వున్న ఆ ముసలతను, "చెట్లన్నిట్నీ కొట్టేసి యెక్కడ పడితే అక్కడ దున్నేశారు. గట్టిగా బండి వెళ్లే దారిలేదు." తన యజమానురాలు గ్లఫీర పెత్రోవ్నా గురించి కూడా అన్‌తోన్ చాలా కథలు చెప్పేవాడు. ఆవిడ యెంత లౌకికంగా పొదుపుగా వుండేదో, పొరుగున వుండే పడుచాయన అయిన ఓ పెద్దమనిషి ఆవిడ అనుగ్రహం సంపాదించాలని యెలా చూడవచ్చేవాడో, తన అమ్మగారు అతని కోసమని ముదురు ఎరుపు రిబ్బన్లు కట్టిన పండగ టోపీ పెట్టుకొని, ట్రు-ట్రు-లివాంట్ పసుప్పచ్చ గౌను తొడుకుని యెలా అనుగ్రహం చూపిందో, కాని తర్వాత ఆ పెద్ద మనిషి తెలివితక్కువగా తన ఆస్తి పాస్తుల భోగట్టా చేసాడని తెలిసి కించపడి అతన్ని దరిచేరకుండా చేసిందో, తను చనిపోయాక ప్రతిదీ పూచికపుల్లతో సహా ఫ్యోదొర్ ఇవానిచ్‌కి చెందాలని యెలా ఆజ్ఞ జారీచేసిందో అన్నీ చెప్పేవాడు. నిజానికి లవ్రేత్‌స్కీ తన మేనత్త వస్తువులన్నీ ముదురు యెరుపు రిబ్బన్లు కట్టిన పండగ టోపీనుంచి, ట్రు-ట్రు-లివాంట్ పసుప్పచ్చ గౌనుతో సహా అన్నీ భద్రంగా వున్నట్టు చూశాడు. లవ్రేత్‌స్కీకి తను ఆశించిన పాత కాగితాలూ, ఆసక్తికరమైన పత్రాలూ యేమీ కనిపించలేదు. ఒక్క పాత పుస్తకం మాత్రం కనిపించింది. అందులో ఒక మూల తన తాతగారు, ప్యోత్ర్ అంద్రేయిచ్, "సెయింట్ పీటర్స్‌బుర్గ్ నగరంలో ఘనత వహించిన యువరాజా అలెక్సాందర్ అలెక్సాంద్రొవిచ్ ప్రొజో రోవ్‌స్కీ టర్కీ సామ్రాజ్యంతో చేసుకున్న శాంతి ఒప్పందపు ఉత్సవం" అని రాశాడు. యింకో చోట హృదయ సంబంధమైన జబ్బులకి ఔషధం వుండి కింద యీ మాటలు వున్నాయి: "యీ సూచనలు జనరల్‌గారి భార్య ప్రస్కోవ్య ఫ్యోదొరొవ్నా సాల్తికోవాగారికి హోలీట్రినిటీ చర్చి ప్రధాన పురోహితులు ఫ్యోదొర్ అవ్క్సెంత్యెవిచ్ యిచ్చినవి." మరో చోట రాజకీయ వార్తలో ఒక ముక్క "ఫ్రెంచ్ పెద్దపులుల గురించి యింకేం మాటలు వినబట్టం లేదు" అని వుండి, పక్కనే యీ విషయం వుంది: "'మొస్కోవ్‌స్కియె వేదొమొస్తి' పత్రిక సీనియర్ మేజర్ మిహాయిల్ పెత్రోవిచ్ కోలిచెవ్ మరణ వార్త ప్రచు రించింది. ప్యోత్ర్ వసీల్‌యెవిచ్ కొడుకా యితను?" లవ్రేత్‌స్కీకి కొన్ని పాత పంచాంగాలూ, స్వప్నశాస్త్రగ్రంథాలూ, అంబోదిక్ రాసిన నిగూఢ పుస్తకం కనిపించాయి. ఎన్నడో మరిచి పోయిన యీ "చిహ్నాలూ, గుర్తులూ" అన్న పరిచిత పుస్తకం అతనిలో మేల్కొల్పిన జ్ఞాప కాలు యెన్నో. గ్లఫీర పెత్రోవ్నా డ్రెస్సింగ్ టేబిల్ లోపల నల్లని రిబ్బనుతోటి కట్టేసి, నలుపు మైనంతోటి అతికించేసి, సొరుగులో ఒక మూలకంటా పెట్టేసిన పొట్లం ఒకటి కనిపించింది. ఆ పొట్లంలో యెదురు బొదురుగా రెండు బొమ్మలు పెట్టివున్నాయి. ఒకటి పడుచువాడుగా వున్న తన తండ్రిది. ఆ బొమ్మ రంగుల కణికెలతో గీసింది. నుదురు

పైన వుంగరాలు తిరిగివూగే మెత్తని జుట్టూ, బాదం కాయల్లా వుండి అలిసిపోయిన ట్లున్న కళ్ళూ, తెరిచిన పెదాలూ వున్న రూపం అది. రెండవది తల్లిది. తెల్లని దుస్తుల తోటి, చేతిలో తెల్ల గులాబీ పువ్వుని పట్టుకుని పాలిపోయిన ముఖంతోటి, దాదాపు మాసి పోయిన బొమ్మ అది. గ్లఫీర పెత్రోవ్నా మాత్రం యెప్పుడూ తన బొమ్మని గియ్యనివ్వ లేదు. ''బాబూ, ఫ్యోదొర్ ఇవానిచ్, నేను అప్పట్లో యీ యింట్లో వుంటూ వుండక పోయినా, నా మట్టుకి నాకు మీ ముత్తాతగారు అంద్రేయ్ అఫనాస్‌యెవిచ్ బాగా జ్ఞాపకం వున్నారు'' అని అన్‌తోన్ లవ్రేత్‌స్కీకి చెపుతూ వుండేవాడు. ''యింతకీ ఆయన పోయే నాటికి నాకు పద్దెనిమిది జరుగుతున్నాయి. ఓ సారి ఆయన నాకు తోటలో తగిలారు. నాకు ఒకటే దడా, వణుకూనూ, నిజం నమ్మండి. కాని ఆయన యేం అనలేదు, వూరికే నా పేరు అడిగి, తన గదికి వెళ్లి చేతి రుమాలు తెమ్మని నన్ను పంపించారు. అబ్బో, ఆయన యేం గొప్ప మనిషి, ఆయనకి సాటి యెవరండీ. ఆయనకి అదంతా ఆ తాయెత్తు వల్లనే నండి. దాన్ని ఆయనకి ఆఫోన్ పర్వతంనుంచి వచ్చిన సన్యాసి యిచ్చాడండి. 'ప్రభూ, మీ ఆదరణకి బదులుగా యీ బహుమతీ మీకు యిస్తున్నాను. దీన్ని కట్టుకోండి, మీకే భయమూ వుండదు' అన్నాడండి. ఆ రోజులెలాంటివో మీకు తెలుసు కదు, దొరా. అయ్యగారు యేమనుకుంటే అది చేసేవాడు. ఒకో పాలి పెద్దోళ్లల్లో ఒకాయన ఆయన్ని యెదిరించడానికి చేసేవాడండి. కాని అయ్యగారు వూరికే ఆ మడిసికేసి చూసి, 'పిచ్చివాడా' – అనేవారండి, అది ఆయన వూతపదం. ఆయనండీ, చచ్చిపోయి యేలోకంలో వున్నారో కానండీ, చిన్న కొయ్య యింట్లో వుండేవారండి. యిక ఆయన సామాన్లేమిటండి, వెండెపళ్లేలు వగైరా ఒహటేమిటి, మొత్తం అలమారాలన్నీ నిండిపోయాయండి! ఆయన పొదుపుగా వుండేవాడండి. మీరన్నారే గాజు నీళ్లపాత్ర బాగుందని, అదీ ఆయనదేనండి. దాంతో ఆయన వోద్కా తాగేవారండి. మీ తాతగారోనండి? ప్యోత్ర్ అంద్రేయిచ్ – ఆయనా రాతి యిల్లు కట్టించారండి. ఆయనకి అంత కలిసి రాలేదండి. ప్రతిదీ అవకతవకగానే వుండేదండి. తండ్రిగారికంటే తీసికట్టుగా వుండేదండి. బతుకులో ఆయనకి యే సుఖమూ లేదండి. డబ్బంతా దుర్వ్యయం చేసేసారండి. పాపం, 'యిదీ ఆయన మంచిపనీ' అనేది లేకపోయిందండి. ఒక్క వెండి చెంచా కూడా ఆయ నదీ అన్నది మిగల్లేదండి – యేదేనా పోకుండా వుందీ అంటే అంతా గ్లఫీర పెత్రోవ్నా గారి పొదుపూ, జాగ్రత్తా పుణ్యమేనండి.''

''అవునూ, యింతకీ'' అని అడ్డం వచ్చాడు లవ్రేత్‌స్కీ, ''ఆవిడని 'ముసలి పిసి నారి' అనేవాళ్లు, నిజమేనా?''

''ఆఁ, అలా అని ఆవిడని యెవరండీ అంట!'' అన్నాడు అన్‌తోన్, వ్యతిరేకత తెలియ చేస్తున్నట్టు, అసంతృప్తిగా.

ఓ సారి ఆ ముసలాడు ధైర్యం చేసి అడిగాడు, ''బాబూ, అమ్మగారి సంగతేంటి? ఆమెగారు యెక్కడుంటున్నారు?''

''మా ఆవిడకి విడాకులు యిచ్చేశాను'' అన్నాడు లవ్రేత్‌స్కీ కొంచెం ప్రయత్నం మీద. ''దయచేసి ఆ విషయం అడక్కు.''

''చిత్తం, బాబూ'' అన్నాడా ముసలాడు విచారంగా.

మూడు వారాలు గడిచాక లవ్రేత్‌స్కీ గుర్రంమీద ఓ– పట్టణానికి, కలీతిన్‌లని చూడ్డానికి వెళ్ళాడు. ఆ సాయంత్రం వాళ్ళతో గడిపాడు. లెమ్ అక్కడే వున్నాడు. లవ్రేత్‌స్కీ అతనంటే యెంతో యిష్టపడ్డాడు. అతను, తండ్రి పుణ్యమా అని, యే వాయిద్యాన్నీ వాయించడం నేర్చుకోకపోయినా, సంగీతం అంటే, శాస్త్రీయ సంగీతం అంటే చెవికోసుకునే వాడు. ఆ సాయంత్రం పాన్‌షిన్ కలీతిన్ల యింటికి రాలేదు. అతన్ని యేదో పనిమీద గవర్నరుగారు గ్రామాంతరం పంపారు. లీజా తనే సొంతంగా వాయించింది, అదీ యెంతో కచ్చితంగా. లెమ్‌కి హుషారు వచ్చేసి, ఒక కాగితాన్ని గొట్టంలాగా చుట్టి దాన్ని పట్టుకుని చేతి కర్రలాగా ఆడిస్తూ దర్శకత్వం చేశాడు. ఆ దృశ్యం చూసి మొదట మార్య ద్మీత్రియెవ్నా నవ్వింది. తర్వాత పడుకోవడానికని వెళ్ళిపోయింది. ఆమెకి బీథోవిన్ సంగీతం చిరాకు తెప్పి స్తుందట. అర్ధరాత్రి లవ్రేత్‌స్కీ లెమ్‌ని అతని యింటిదాకా తీసికెళ్ళి అక్కడ తెల్లవార కట్ల మూడింటిదాకా వుండిపోయాడు. లెమ్ బోలెడు మాట్లాడాడు. ఆయన వంకర విగ్రహం నిటారుగా అయింది. ఆయన కళ్ళు వెడల్పుగా, కాంతిగా అయ్యాయి. ఆఖరికి ఆయన జుట్టు కూడా నుదుటిపైన నిబ్బరంగా వుండింది. ఆయన పట్ల యెవళ్ళూ శ్రద్ధ చూపించి యెరగరు. లవ్రేత్‌స్కీకి ఆయనంటే చాలా ఆసక్తి కలిగింది. ఆయన్ని ఆత్రుతగా జాలిగా ప్రశ్నలు వేశాడు. యిది ఆ ముసలాయన్ని కదిలించివేసింది. తన అతిథికి తన సంగీత ప్రావీణ్యాన్ని చూపించి, తను రాసిన కృతులనుంచే కొన్ని ఖండికలని నిర్జీవమైన గొంతు కతో పాడి, వాయిద్యం వాయించాడు. షిల్లర్ పాట ''ఫ్రీదొలిన్'' మొత్తం అంతా, తనే స్వరకల్పన చేసినదాన్ని కూడా పాడాడు. లవ్రేత్‌స్కీ అతన్ని పొగిడి, కొన్ని పాటలు మళ్ళీ పాడించుకుని, వెళ్ళిపోయేముందు, లెమ్‌ని వచ్చి తనతో కొన్ని రోజులు గడపవలసిందిగా ఆహ్వానించాడు. అతన్ని సాగనంపడానికి వీధిలోకి వచ్చిన లెమ్, తక్షణం ఆ ఆహ్వానాన్ని స్వీకరించి తృప్తిగా మనసారా కరచాలనం చేశాడు. కాని తాజా, చెమ్మ గాలిలో, తొలివేకువ కిరణాల్లో ఒక్కడూ వెనక వుండిపోయి అతను చుట్టూతా చూసి, కళ్ళు లగ్నంచేసి, వణుకుతూ, యేదో నేరస్థునిలాగా తన గదిలోకి వెళ్ళిపోయాడు. ''ఇష్ బిన్ వోల్ నిష్ట్ క్లుగ్'' (''నాకు మతిపోయిందేమిటి'') అని గొణుక్కుంటూ గట్టిగా వుండే పక్కమీదకి చేరుతూ అనుకున్నాడు. కొన్ని రోజుల తర్వాత తన చిన్న బండిలో లవ్రేత్‌స్కీ అతన్ని తన గ్రామానికి తీసుకురావడానికి వచ్చినప్పుడు వంట్లో బాగా లేదని నటించాడు. కాని ఫ్యోదొర్

ఇవానిచ్ అతని గదిలోకి వెళ్లి అతన్ని వచ్చేదాకా బలవంతం చేశాడు. అన్నిటికంటే లెమ్‌కి ముచ్చట కలిగించిందేమిటంటే ల్రవేత్‌స్కీ అతని కోసమని ప్రత్యేకం ఒక పియానోని పట్టణంనుంచి పురమాయించాడు. వాళ్లిద్దరూ కలిసి కలీతిన్‌ల యింటికి వెళ్లి ఆ సాయంత్రం అక్కడ గడిపారు, కాని ముందటి సారంత బాగా గడవలేదు. పాన్‌షిన్ వచ్చాడు; యిటీవలి తన ప్రయాణం గురించి బోలెడు మాట్లాడాడు; తను కలుసుకున్న పల్లెటూరి సంపన్నులని సరదాగా అనుకరించాడు. ల్రవేత్‌స్కీ నవ్వాడు. కాని లెమ్ ముటముటలాడుతూ నిశ్శబ్దంగా, ముడుచుకుపోయి సాలెపురుగులా కదులుతూ తను కూచున్న చోటనే వుండిపోయాడు. ల్రవేత్‌స్కీ సెలవు తీసుకుని వెళ్లిపోబోయినప్పుడు అతనిలో కదలిక వచ్చింది. బండిలో కూడా ఆ ముసలాయన ముభావంగా ముడుచుకుపోయి వున్నాడు. కాని మెత్తని, వెచ్చని గాలి, పరిమళకరమైన తెమ్మెర, అస్పష్టపు నీడలు, గరిక, బర్చ్ మొగ్గల వాసన, చంద్రుడులేని నిశీధిలో తారకల ప్రశాంతశోభ, లయబద్ధంగా వున్న గుర్రపు గిట్టల చప్పుడూ, గుర్రాల యికిలింపులూ మొత్తం దారి సమ్మోహకంగా వుండటం, వసంతరుతు మనోహరత్వం, నిశీధి సౌందర్యం ఆ ముసలి జర్మన్ ఆయన హృదయంమీద ముద్రవేశాయి. దాంతోటి మొదట ఆయనే మాట కదిపాడు.

## 22

ఆయన సంగీతం గురించీ, తర్వాత లీజా గురించీ, మళ్లీ సంగీతం గురించీ మాట్లాడ్డం మొదలుపెట్టాడు. లీజా గురించి మాట్లాడినప్పుడు మాటలని యింకొంచెం మెల్లిగా అంటున్నట్టు కనిపించింది. ల్రవేత్‌స్కీ అతను కూరుస్తున్న స్వరకల్పనల ప్రసంగం తెచ్చి, సగం వేళాకోళంగా, స్వరకల్పనకనువైన కృతిని రాయమన్నాడు.

''హుమ్, సంగీతకృతి!'' జవాబిచ్చాడు లెమ్. ''ఉహూఁ, అది నావల్ల కాదు. ఓపెరా కవసరమైన స్పష్టమైన స్పందన, భావనాత్మకత నాకు లేవు యిక. నా శక్తులు కళతగ్గుతున్నాయి. యింకా నేను యేమేనా చెయ్యగలిగితే — రొమాంజా ప్రేమగీతంతో తృప్తిపడతాను. అందులోనేనా పదాల పొంకం సరిగ్గా వుండాలనుకోండి.''

కళ్లు పైకి యెత్తి చూస్తూ అతను అలానే చాలా సేపు నిశ్శబ్దంగా, నిశ్చలంగా కూర్చుండిపోయాడు.

''ఉదాహరణకి'' అన్నాడతను వున్నట్టుండి. ''యే తారక, యే పరిశుద్ధ తారక!... లాంటిదేదేనా అన్నమాట.''

ల్రవేత్‌స్కీ కొంచెం అతనికేసి తిరిగి, చూశాడు.

''యే తారక, యే పరిశుద్ధ తారక'' మళ్లీ అన్నాడు లెమ్. ''ధర్మాధర్మాలని సమంగా

చూస్తారు మీరు.... కాని అమాయక హృదయం — లేకపోతే అలాంటి మాట యింకోటి — అర్థం చేసుకోగలదు — వుహుఁ, ఆ మాట కాదు — ప్రేమించగలదు మిమ్మ. కాని నేను కవినిగాను, చూశారూ! అంచేత అలాంటిదింకోటి, యింకొంచెం ఘనమైందైనా సరే.''

లెమ్ టోపీ నెత్తిమీద వెనక్కి తోసుకున్నాడు. తేటగా వున్న ఆ రాత్రి మసక వెలుతురులో అతని ముఖం యింకా పాలిపోయినట్టు, యింకా పడుచుదనంతో కనిపించింది.

''మరి మీరు కూడా'' అతను అంటూనే వున్నాడు, కాని అతని గొంతుక క్రమేపీ సన్నబడుతూవుంది. ''మీకు తెలుసు యెవరు ప్రేమించేదీ, ప్రేమించగలిగేదీ. యేమంటే మీరు పరిశుద్ధులు, మీరే ఉపశాంతి కలిగింతురు.... అబ్బే, బాగా లేదు! నేను కవిని గాను'' అన్నాడతను. ''యేమైనా యింకోటేదేనా అదే శైలిలో.''

''ప్చ్, నేనూ కవిని కాదండీ'' అన్నాడు లవ్రేత్స్కీ.

''వృథా స్వప్నాలు'' అన్నాడు లెమ్. బండిలో ఓ మూల ఒదిగిపోయాడు. అతను కళ్ళు మూసుకున్నాడు, నిద్రకి ఉపక్రమిస్తున్నట్టుగా.

కొన్ని క్షణాలు గడిచాయి. లవ్రేత్స్కీ విన్నాడు. ''తారకలారా, పరిశుద్ధ తారకలారా, ప్రేమ'' లోగొంతుకలో అన్నాడు ముసలాడు.

''ప్రేమ'' అని తనకి తనే అనుకున్నాడు లవ్రేత్స్కీ. అతను ఆలోచనలో మునిగిపోయాడు. అతని హృదయం బరువెక్కింది.

''మీరు ప్రీదొలిన్‌కి కూర్చిన సంగీతబాణీ అద్భుతమైంది, క్రిస్టఫర్ ఫ్యోదొరిచ్'' అన్నాడతను పైకి. ''యీ ప్రీదొలిన్, ఆ కౌంట్ అతన్ని తన భార్యకి పరిచయం చేసిం తర్వాత, అతను ఆమె ప్రేమికుడు అయ్యాడు కదా, యేం, యేమనుకుంటారు మీరు?''

''బహుశా మీరు అనుకునేది అది'' అన్నాడు లెమ్, ''యెందుకంటే మీరు బహుశా అనుభవించారు....'' అతను హఠాత్తుగా ఆగిపోయి, తికమకపడి పక్కకి తిరిగిపోయాడు. లవ్రేత్స్కీ తెచ్చిపెట్టుకున్న నవ్వునవ్వి, తనూ పక్కకి తిరిగిపోయి, రోడ్డుకేసి చూశాడు.

నక్షత్రాలు యింకా మసకగా అయ్యాయి. బండి వసీల్యెవ్‌స్కాయె చిన్న ఇంటి సింహద్వారం దగ్గరికి చేరేటప్పటికి ఆకాశం బూదిరంగు తిరుగుతోంది. లవ్రేత్స్కీ తన అతిథిని గదిలోకి తీసికెళ్ళి దిగబెట్టి, తను తన గదిలోకి తిరిగివచ్చి కిటికీవార కూర్చున్నాడు. బయట తోటలో నైటింగేల్ వేకువముందు తన కడసారి పాటని పాడుతోంది. కలీతిన్‌ల యింటి దగ్గర తోటలో పాడిన నైటింగేల్ లవ్రేత్స్కీకి గుర్తుకువచ్చింది. దాని తొలి స్వరం వినిపించినప్పుడు, చీకటి కిటికీకేసి తిరిగి, మృదువుగా కదిలిన లీజా కళ్ల కదలికలు కూడా అతనికి గుర్తుకువచ్చాయి. అతను ఆమెని గురించీ మళ్లీ వూహించుకున్నాడు, అతని హృదయం తేలిక పడింది. ''పరిశుద్ధమైన పిల్ల'' అతను సగం పైకి గొణిగాడు. ''పరిశుద్ధ నక్షత్రాలు'' అని దానికి చిరునవ్వునవ్వుతూ జతచేసి, మంచంమీదకి జారాడు.

కాని లెమ్ సంగీతం పుస్తకం ఒకదాన్ని మోకాళ్ళమీద పెట్టుకుని మంచంమీద చాలా సేపు కూర్చుండిపోయాడు. మధురమైన, అద్భుతమైన శ్రావ్యస్వరం అతన్ని వెంబడిస్తోంది; అతన్ని కదుపుతోంది, ఉత్తేజితం చేస్తోంది, దాని సోలిన సోగనీ, మాధుర్యాన్నీ తచ్చాడే దాని ఉనికినీ అతను అనుకోగలుగుతున్నాడు, కాని దాన్ని అందుకోలేకపోతున్నాడు.

"కవినీ కాదు, సంగీతకారుణ్ణీ కాదు" అని గొణుక్కున్నాడు.

అలసిన అతని శిరస్సు భారంగా దిండుమీద వాలింది.

## 23

ఆ మర్నాడు తోటలో పాత లైమ్‌చెట్టుకింద కూచుని లవ్రేత్‌స్కీ, అతిథీ టీ తాగారు.

"సంగీతదర్శకులుగారూ!" అన్నాడు లవ్రేత్‌స్కీ. "మీరు త్వరలో విజయోత్సవ గేయ నాటిక రాయాలి."

"సందర్భం యేమిటి?"

"పాన్‌షిన్‌కీ లీజాకీ పెళ్ళి. అతను ఆమె అంటే చూపించే ప్రేమని నిన్న మీరు గమనించలేదా? అన్నీ సక్రమంగానే జరుగుతున్నట్టున్నాయి అక్కడ."

"అలా యెన్నటికీ జరగదు!" అని అరిచాడు లెమ్.

"ఏం, యెందుకని?"

"అది అసంభవం, కనుక" కొంచెం సేపాగి అతను మళ్ళీ మొదలుపెట్టాడు. "యీ ప్రపంచంలో యేదేనాగానీ సాధ్యమే అయినప్పటికీ. ముఖ్యంగా మీ రష్యా వాళ్ళతోటి."

"యిప్పుడు రష్యా గొడవెందుకు లెండి మనకి. యీ పెళ్ళికి సంబంధించి దోషమేమిటిట?"

"అంతానూ. అంతా దోషమే. ఎలిజవేతా మిహైలొవ్నా ఉన్నత భావాలున్న నిర్మోహమాటమైన, గంభీరమైన పిల్ల. అతను.... అతను వూరికే ఔ-త్సా-హి-కు-డు మాత్రమే."

"కాని ఆమె అతన్ని ప్రేమిస్తోంది, కదా?"

లెమ్ లేచినుంచున్నాడు.

"వుహుఁ, ఆమె అతన్ని ప్రేమించడం లేదు. అంటే నా ఉద్దేశం ఆమె అమాయకురాలు, ప్రేమంటే యేమిటో ఆమెకి తెలీదు. అతను మంచి యువకుడు అని మదాం కలీతినా ఆమెకి చెపితే, ఆమె యింకా, పంథొమ్మిదేళ్ళన్నా, చిన్న పిల్ల కాబట్టి మదాం కలీతినా చెప్పింది వింటుంది. ఆమె ఉదయం, సాయంత్రం ప్రార్థనచేస్తుంది — అదంతా బాగానే వుంది. కాని ఆమె అతన్ని ప్రేమించడం లేదు. అందమైనదాన్నే ఆమె ప్రేమించగలదు. అతను అందమైన వాడు కాదు, అంటే అతని మనసు అందమైంది కాదు."

లెమ్ టీ బల్లముందు కొంచెం అటూ యిటూ పచారుచేస్తూ, కళ్ళు నేలమీదే చూస్తూ వుంటే, ధారాళమైన ఉత్సాహంతోటి యీ చిన్న ఉపన్యాసాన్ని యిచ్చాడు.

"ఏమండోయ్, సంగీతదర్శకులుగారూ!" హఠాత్తుగా అన్నాడు లవ్రేత్‌స్కీ. "మా మేన కోడలితోటి మీరే ప్రేమలో వున్నట్టుంది."

లెమ్ ఆగాడు.

అతను వణికే గొంతుకతో అన్నాడు, "దయచేసి నన్ను అలా వేళాకోళం చెయ్యకండి. నేను వెర్రిగాలేను. నేను అవతలి అంధకారంకేసి చూస్తున్నాను, రంగురంగుల భవిష్యత్తు కేసి కాదు."

లవ్రేత్‌స్కీ పశ్చాత్తాపపడ్డాడు. ముసలతన్ని క్షమించమని అడిగాడు. టీ అయిపోయిం తర్వాత లెమ్ తన సంగీతకృతిని వాయించాడు. భోజనాల వేళప్పుడు, మళ్ళీ లవ్రేత్‌స్కీ ప్రస్తా వించినమీదట, లీజాని గురించి మాట్లాడ్డం మొదలుపెట్టాడు. లవ్రేత్‌స్కీ శ్రద్ధగా, ఆసక్తిగా విన్నాడు.

"ఏమండీ, క్రిస్టఫర్ ఫ్యోదొరిచ్‌గారూ" అన్నాడతను చివరికి. "యిక్కడ అంతా ఓపద్ధతిగా దారిలోపడింది, తోటలో వువ్వులు పూస్తున్నాయి. కాబట్టి ఓ రోజు ఆమెనీ, వాళ్లమ్మనీ, మా అత్తనీ యిక్కడికి పిలిస్తే యెలా వుంటుందంటారు, వూఁ? మీకిష్టమేనా అది?"

లెమ్ ప్లేటుమీదకి తల వంచుకున్నాడు.

"బాగానే వుంటుంది" అన్నాడతను, దాదాపు వినిపించనట్టు.

"పాన్‌షిన్ లేకపోయినా ఫరవాలేదు కదూ?"

"ఫరవాలేదు" అన్నాడు ఆ ముసలాయన పసిపిల్లలా చిరునవ్వు నవ్వి.

రెండు రోజుల తర్వాత ఫ్యోదొర్ ఇవానిచ్ కలీతిన్లని చూడ్డానికి పట్నానికి వెళ్లాడు.

## 24

అతనికి యింటిదగ్గర అందరూ కనిపించారు. కాని వెంటనే తన మనసులో వున్నది చెప్పదలచుకోలేదు. మొదటగా లీజాతోటి యీ విషయం ప్రస్తావించాలనుకున్నాడు. దానికి అవకాశం కలిసొచ్చింది. డ్రాయింగ్ రూంలో వాళ్లిద్దరే మిగిలిపోయారు. వాళ్లు మాటల్లోకి దిగారు. ఆమెకి అతనికి అలవాటు పడుతోంది — అ మాట కొస్తే ఆమెకి యెవళ్లతోటీ కొత్తలేదు. అతను ఆమె చెప్పేది విన్నాడు. ఆమె ముఖాన్ని బాగా పరకాయించి పరిశీలించాడు. లెమ్ మాటలని గుర్తుచేసుకుని, అవి ఒప్పేననుకున్నాడు. సన్నిహితంగా లేని యిద్దరు పరిచయస్థులు హఠాత్తుగా, ఆ క్షణంలో దగ్గరికి రావడం, యీ సన్నిహితత్వపు

గుర్తింపు పరస్పరదృక్కుల్లో, వూరికే స్నేహపూర్వకమైన చిరునవ్వులో, కదలికల్లో కూడా, తక్షణం రావడం జరగవచ్చు. లవ్రేత్‌స్కీ, లీజాలకి సంబంధించి సరిగ్గా జరిగింది యిదే. ''అంచేత, అతనలాంటి వాడన్న మాట'' అదీ అతనికేసి దయానిత్వంగా చూసేటప్పుడు ఆమెకి వచ్చిన ఆలోచన. ''అంచేత నువ్వు అలాంటి దానివన్న మాట'' అని అతనూ అను కొంటున్నాడు. అందుకని, ఆమె నిస్సంకోచంగా, తను యెంతో కాలంగా కొన్ని అడిగి మనసు తేలిక పరచుకుందామని భావిస్తున్నట్లూ, కాని అతన్ని కష్టపెట్టాల్సివస్తుందేమోనని భయపడ్డట్లూ, చెప్పగానే అతను పెద్దగా ఆశ్చర్యపడలేదు.

''భయం అక్కర్లేదు, చెప్పండి'' అన్నాడతను ఆమెముందు ఆగి.

లీజా తేటగా వుండే తన కళ్లని అతనికేసి తిప్పింది.

''మీరు యింత మంచివారు'' అని మొదలుపెట్టింది ఆమె. ఆమె మనసులో యితను నిజంగా మంచివాడు అనే భావన మెరిసింది. ''మరేం అనుకోకండి, నిజానికి నేను యీ విషయం గురించి మీతో మాట్లాడకూడదనుకోండి... కాని మీరు.... మీరు యెందుకని మీ ఆవిడతో సంబంధాలు తెంచుకున్నారు?''

లవ్రేత్‌స్కీ జంకాడు. లీజాకేసి చూసి ఆమె పక్కనే కూర్చున్నాడు.

''పాపా'' అన్నాడతను. ''ఆ పుండుని కెలక్కండి. మీ చేతులు మృదువైనవే, అయినా కాని నొప్పి పెట్టక మానదు కదా.''

''నాకు తెలుసు'' లీజా అతను చెప్పింది విననట్టుగానే అంది. ''ఆమె మీకు అన్యాయం చేసింది. నేను ఆమెని సమర్థించడం లేదు. కాని భగవంతుడు దగ్గర చేసిన ఒకర్ని దూరంగా యెలా విడదీశారు మీరు?''

''ఆ విషయంమీద మన అభిప్రాయాలు చాలా యెడంగా వుంటాయి ఎలిజవేతా మిహైలొవ్నా'' లవ్రేత్‌స్కీ కొంచెం ఘాటుగానే బదులు చెప్పాడు. ''మనం ఒకళ్లనొకళ్లం అర్థం చేసుకోలేం.''

లీజా మొఖం పాలిపోయింది. వళ్లంతా చిన్నగా కుదుపు కలిగినట్లైంది. కాని ఆమె మాట్లాడకుండా వూరుకోలేదు.

''మీరు క్షమించాలి'' అని మెల్లిగా గొణిగింది, ''యితరులు మిమ్మల్ని క్షమించాలని కోరుకుంటే.''

''క్షమించడం!'' అన్నాడు లవ్రేత్‌స్కీ. ''మీరు యెవరి తరఫున మాట్లాడుతున్నారో ఆ మనిషిని గురించి ముందు తెలుసుకోవాలి. ఆ ఆడదాన్ని క్షమించడమా, ఆ జాలిలేని, హృదయంలేని ఆడదాన్ని మళ్లీ యింట్లోకి చేరదియ్యడమా! ఆమెకి వెనక్కి రావాలని వుందని మీతో యెవళ్లు అన్నారు? ఆమెకి తన పరిస్థితి హాయిగా వుంది.... అబ్బ, దాన్ని గురించి మాట్లాడుకోవడం వల్ల యేమిటి లాభం? ఆమె పేరు మీ నోటినుంచి రాకూడదు.

మీరు చాలా పరిశుద్ధమైన వారు. ఆమె యెలాంటి మనిషో మీకు తెలియను కూడా తెలియదు.''

''మీరు ఆమెని నిందిస్తారా?'' అంది లీజా ప్రయత్నంమీద. ఆమె చేతులు యిప్పుడు స్పష్టంగా వణుకుతున్నాయి. ''మీ అంతట మీరే ఆమెని వదిలేశారు, ఫ్యోదొర్ ఇవానిచ్.''

''కాని నే చెబుతున్నాను'' లవ్రేత్స్కీ వుండబట్టలేక అరిచాడు, ''ఆమె యెలాంటి మనిషో మీకు తెలియను కూడా తెలియదు.''

''అలాంటప్పుడు యెందుకు పెళ్లిచేసుకున్నారు?'' అని లీజా మెల్లిగా అంది, కళ్లు వాలుస్తూ.

లవ్రేత్స్కీ గబగబా నుంచున్నాడు.

''నేను పెళ్లెందుకు చేసుకున్నానా? నేను కుర్రాణ్ణి, అనుభవంలేనివాణ్ణి. పైపై పూత మెరుగులు చూసి మురిసిపోయి వలలో పడిపోయాను. నాకు ఆడవాళ్లని గురించి తెలియదు, నాకు యేమీ తెలియదు. దేముడు మీకు మంచి భర్తని ప్రసాదించుగాక! కాని, నా మాట నమ్మండి యేం రాబోతోందో మనకి తెలియదు.''

''నేను కూడా దురదృష్టవంతురాలినే కావచ్చు'' అంది లీజా (ఆమె గొంతుక పట్టినట్టు అయింది). ''కాని మీరు మీ కర్మకి సమాధానపడిపోవాలి; యెలా చెప్పాలో నాకు తెలీదు, కాని మనం సర్దుకుపోలేకపోతే....''

లవ్రేత్స్కీ చేతులు బిగించి, కాలితో నేలమీద తన్నాడు.

''దయచేసి కోప్పడకండి, నన్ను క్షమించండి'' అంది లీజా గబగబా.

ఆ సమయంలో మార్య దీమ్త్రియెవ్నా గదిలోకి వచ్చింది. వెళ్లిపోవడానికని లీజా లేచింది.

''ఒక్క నిముషం'' అని లవ్రేత్స్కీ ఆమెని పిలిచాడు. ''మిమ్మల్నీ, మీ అమ్మనీ ఒకటి అడగాలనుకుంటున్నాను. మీరు మా యింటికి వచ్చి, గృహప్రవేశ ఉత్సవం జరిపించరూ? నేను ఒక పియానో సంపాదించాను తెలుసా? లెమ్‌గారు నాతోనే వుంటున్నారు. లైలాక్ పువ్వులు పూస్తున్నాయి. ఒక్క సారి పల్లెటూరి గాలి పీల్చి మళ్లీ ఆ పూటే వచ్చేద్దురుగాని — యేమంటారు?''

లీజా తల్లికేసి చూసింది, మార్య దీమ్త్రియెవ్నా జబ్బు పడ్డట్టు కనిపించింది. కాని లవ్రేత్స్కీ ఆమెకి మాట్లాడే వ్యవధి యివ్వకుండా చేసి, అక్కడనే ఆ క్షణంలోనే ఆమె రెండు చేతులూ ముద్దుపెట్టుకున్నాడు. కదిలించివేసే అలాంటి ప్రదర్శనలకి అస్తమానూ లొంగిపోయే మార్య దీమ్త్రియెవ్నా ఆ ''మోటు'' మనిషినుంచి అలాంటి మర్యాదని అసలు ఆశించకపోవడంవల్ల, వెంటనే అంగీకరించింది. యే రోజు రాగలమని చెప్పాలా అని ఆమె అనుకొంటూ వుండగా, లవ్రేత్స్కీ లీజా దగ్గరికి వెళ్లి, యింకా యెక్కువగా ఆవేశపడిపోయి,

ఆమెతోటి మెల్లిగా ''కృతజ్ఞుణ్ణి, మీరు మంచి పిల్ల. మరేం అనుకోకండి'' అని అన్నాడు. ఆమె పాలిన వదనం ఆనందపు చిరునవ్వుతో విరిసింది. ఆమె కళ్లు కూడా చిరునవ్వు నవ్వు తున్నాయి; అతన్ని కష్టపెట్టానేమోనని ఆమె భయపడింది.

''వ్లదీమిర్ నికొలాయెవిచ్ కూడా మాతో రావచ్చా?'' అని వాకబుచేసింది మార్య దీమ్త్రియెవ్నా.

''రావచ్చు'' అన్నాడు లవ్రేత్స్కీ. ''కాని యిది కుటుంబ సంబంధమైన పండగగా వుంటే బాగుంటుందేమో.''

''అబ్బే, నేను వూరికే అనుకున్నాను....'' అని మార్య దీమ్త్రియెవ్నా యేదో చెప్ప బోయింది. ''....సరే, కానివ్వండి మీ యిష్టప్రకారమే'' అంది.

లేనొచ్కానీ, షూరొచ్కానీ తీసికెళ్లాలని అనుకున్నారు. మార్ఫ తిమొఫేయెవ్నా వెళ్ల డానికి యిష్టపడలేదు.

''నేను రాలేనురా నాయనా. యీ వయసులో నాకు కదలడం కష్టం. అక్కడ గట్టిగా నడుం వాల్చడానికి జాగా లేదనుకుంటాను. అయినా కొత్త చోట నాకు నిద్రపట్టి చావదు. పిల్లలు కాబట్టి సరదాగా తిరుగుతారు'' అందామె.

లీజాతో యేకాంతంగా వుండే అవకాశం లవ్రేత్స్కీకి మళ్లీ రాలేదు. ఆమెని ఓ విధంగా అతను చూశాడు, అది ఆమెకి ఆనందంగా వుండింది, కొంచెంగా సిగ్గుగా, అతని కోసం బాధపడుతున్నట్టూ వుండింది. వెళ్లిపోయేటప్పుడు ఆమె చేతిని నొక్కాడు. ఆమె ఒక్కత్తీ వుండిపోయి ఆలోచనలో పడిపోయింది.

## 25

లవ్రేత్స్కీ యింటికి వెళ్లేటప్పటికి డ్రాయింగ్ రూం గుమ్మంలో ఒక పొడుగాటి పల్చని మనిషి యెదురయాడు. అతను మాసిపోయిన నీలం కోటు తొడుక్కున్నాడు. ముఖం ముడతలు పడివుంది, కాని కళగా వుంది. అతని మీసాలు చింపిరిగా పండిపోయి వున్నాయి. అతని ముక్కు పొడుగ్గా కొతారేసినట్టు వుంది. కళ్లు చిన్నవి. ఎర్రగా వున్నాయి. అతను మిహాలేవిచ్, తన పాత యూనివర్సిటీ మిత్రుడు. లవ్రేత్స్కీ మొదట అతన్ని గుర్తుపట్ట లేదు. పేరడిగి తెలిసికోగానే ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. మాస్కో రోజులనాటినుంచీ వాళ్లు ఒకొళ్లనొకళ్లు చూసుకోలేదు. ప్రశ్నల పరంపర, జవాబులూ శరపరంపరగా వచ్చేశాయి. యేనాడో అడుగున పడిపోయిన జ్ఞాపకాలన్నీ పైకి తవ్వుకువచ్చాయి. గబగబా పైపుమీద పైపు కాలుస్తూ, మధ్య మధ్యన టీ చప్పరిస్తూ, చేతులు అటూ యిటూ వూపుతూ మిహాలే విచ్ లవ్రేత్స్కీకి తన సాహసకృత్యాల్ని వివరించాడు. వాటిల్లో చెప్పుకోదగ్గ ఉత్సాహం కలి

గించేది యేదీ లేదు, తను చేపట్టిన వాటిల్లో నెగ్గుకొచ్చి గొప్ప చెప్పుకోవడానికీ యేమీ లేదు. కాని అతను ఆపకుండా బొంగురుపోయి, ఉద్రేకంతో వున్న నవ్వు నవ్వుతూనే వున్నాడు. ఓ— పట్టణానికి డెబ్బై అయిదు కోసుల దూరంలో ఒక ధనికుడైన రైతు ఆయవ్యయ కార్యాలయంలో కొలువు కుదిరిందనీ, ల్రవేత్‌స్కీ విదేశాలనుంచి తిరిగివచ్చాడని తెలిసి, తన పాత మిత్రుణ్ణి చూడాలని వచ్చినట్టూ చెప్పాడు. మిహాలేవిచ్, వయసులో వున్నప్పటి లాగానే అదే పట్టుతో ఉత్సాహంతో ఉరవడిగా మాట్లాడుతూనే వున్నాడు. ల్రవేత్‌స్కీ తన పరిస్థితిని గురించి చెప్పబోయాడు గాని, మిహాలేవిచ్ తొందరగా గొణుగుతూ, అడ్డం వచ్చాడు: "నే విన్నాను, బాబూ, విన్నాను. ఎవరు అనుకోగలరు అలా జరుగుతుందని?" వెంటనే విషయాన్ని వేరే వాటిమీదకి మళ్లించేశాడు.

"నేను రేపు వెళ్లిపోవాలి" అన్నాడతను. "యివాళ యేమైనా, నువ్వు వూఁ అంటే యివాళ చాలా పొద్దుపోయేదాకా మెలుకువగా వుందాం. నువ్వెలా మారిపోయావో, నీ అభిప్రాయాలేమిటో, నీ విశ్వాసాలేమిటో, నువ్వెలా తయారయేవో అన్నీ తెలుసుకోవాలని ఆత్రుతగా వుంది." (మిహాలేవిచ్ యింకా ముప్పైయవ దశకం నాటి పరిభాషనే వాడుతున్నాడు.) "నాకు సంబంధించి నేను కొంచెం మారిపోయాను. జీవిత తరంగాలు నా హృదయంమీద దొర్లిపోయాయి — ఎవరీ మాటలన్నది? — మౌలికంగా నేను మారలేదనుకో. నాకింకా మంచిమీదా, సత్యంమీదా నమ్మకం వుంది. కాని నేను వూరికే నమ్మడమే కాదు, నాకు విశ్వాసం వుంది, విశ్వాసం. చూడు, నీకు తెలుసు కదా నేను కవిత్వం గీకుతానని. నా గీతాలు కవిత్వం కావనుకో, కాని అవి నిజం. నేను యిటీవల రాసిన గేయం చదివి వినిపిస్తాను. ఇందులో నా మనసా నమ్మే విశ్వాసాలని వ్యక్తంచేశాను."

మిహాలేవిచ్ తన పద్యం చదవడం మొదలుపెట్టాడు. అది కొంచెం పెద్దదే. యీ పాదాలతో అది ఆఖరవుతుంది:

> నా హృదయం నూతన అనుభూతులకి సొంతం లొంగిపోయింది,
> పిల్లవానికి వోలే హృదయ గతాభివృద్ధిని పొందితిని నేను:
> నేను ఆరాధించిన సమస్తమూ దగ్ధమొనర్చితి,
> దగ్ధమొనర్చిన సమస్తమూ యిప్పుడు ఆరాధింతును.

యీ పాదాలు చదవగానే మిహాలేవిచ్ కళ్ల నీళ్ల పర్యంతం అయాడు; ఒక చిన్న మెలిక — గాఢమైన అనుభూతి సూచిక — అతని వెడల్పాటి నోటిమీద కనిపించింది. అతని నిరాడంబర వదనం వెలిగిపోయింది. ల్రవేత్‌స్కీ అలా వింటూనే కూర్చున్నాడు. యేదో యెదిరింపు శక్తి అతనిలో కదిలింది. యీ నిర్మోహమాటపు మాస్కో విద్యార్థి నిరంతర ఉద్విగ్న

ఉత్సాహం అతన్ని విసిగించింది. వాళ్ల మధ్యన ఒక వాదం మొదలై ఒక పావుగంట గడవ లేదు, రష్యన్ ప్రజలు మాత్రమే చెయ్య సమర్థులైన ఒక వాదం. యెన్నో యేళ్ల యిద్దరూ రెండు భిన్న ప్రపంచాల్లో గడిపాక, మిగతా వాళ్ల అభిప్రాయాల సంగతి సరేసరి, తమ అభి ప్రాయాల గురించే స్పష్టమైన అవగాహనలేక, వాళ్లు జుట్టు పీక్కుని మాటలు నూరుతూ పరమ నైరూప్య విషయాలకి సంబంధించి, అదేదో యిద్దరికీ జీవన్మరణ సమస్య అయినట్టు హుటాహుటీగా వాదంలోకి దిగిపోయారు. వాళ్లు ఒకళ్లనొకళ్లు కేకలేసుకుని, యెంత గట్టిగా అరిచారంటే యింట్లో వున్న వాళ్లు అదిరిపోయారు. పాపం లెమ్, మిహాలేవిచ్ వచ్చినప్పటి నుంచీ, తన గదిలో గడియపెట్టుకుని కూర్చున్న ఆయన, నిర్ఘాంతపోయాడు, ఆయనకి తెలియని వణుకుపుట్టింది.

''తర్వాత యేమయ్యావు? నీరసపడిపోయావా?'' అని మిహాలేవిచ్ అర్ధరాత్రి దాటాక అరిచాడు.

''నేను అలాంటి మనిషిలా కనిపిస్తున్నానా?'' యెదురు ప్రశ్న వేశాడు లవ్రేత్‌స్కీ. ''అలాంటి వాళ్లు యెప్పుడూ పాలిపోయి జబ్బుగా వుంటారు—నిన్ను ఒక్క చేత్తో యెత్తమంటావా?''

''నువ్వు నీరసపడిపోయిన మనిషివి కేకపోతే, నువ్వు సందేహాత్ముడవయి వుంటావు, అది యింకా అధ్వాన్నం'' (మిహాలేవిచ్ యాస అతని స్వస్థలం ఉక్రేయిన్ వాసనతో వుంది). ''సందేహ భావుకుడుగా వుండడానికి మీకు యేం హక్కు వుంది? అదృష్టం వక్రించింది —ఒప్పుకున్నాం. నీ తప్పు కాదు—నువ్వు తీవ్రమైన, ప్రేమించే హృదయుడివి. మరి నువ్వు బలవంతంగా ఆడవాళ్లనుంచి దూరం అయావు. సహజంగానే నీకు తటస్థపడిన తొలి ఆడది నిన్ను గాడిదని చేసింది.''

''నిన్నూ గాడిదని చేసింది'' అన్నాడు లవ్రేత్‌స్కీ మబ్బుగా.

''ఒప్పుకున్నాం, ఒప్పుకున్నాం; నేను విధి చేతిలో పావునయ్యాను —దాన్ని తీసెయ్యి, చెత్త—విధి యేమీ లేదు; తోచకపోతేవాడే పాత అలవాటు. కాని అది యేం రుజువుచేస్తుంది?''

''నా చిన్నతనంలో సరిగా పెరగలేదని రుజువుచేస్తుంది.''

''అయితే, యిప్పుడు సరిగ్గా అవు!—నువ్వు మనిషివి, కాదా? నువ్వు దేన్నో సాయం తెచ్చుకోవల్సిన అవసరం లేదు. ఏమైనా, నువ్వు ఒక ప్రత్యేకమైన సందర్భాన్ని ఒక సామాన్య సూత్రంగా, మార్చలేని నియమంగా, కుదించలేవు.''

''దీనికి నియమంతో పనేమిటి?'' అడ్డం వచ్చాడు లవ్రేత్‌స్కీ. ''నేను ఒప్పుకోను....''

''వుహుఁ, అది నీ నియమం, నీ నియమం....'' అన్నాడు మిహాలేవిచ్.

''నువ్వు స్వాతిశయం వున్న వాడివి, అదీ నువ్వు!'' ఓ గంట తర్వాత అతను అరుస్తు న్నాడు. ''నీ సుఖంకోసం తంటాలుపడ్డావు. నువ్వు జీవితంలో ఆనందంకోసం వెంపరలా డావు, నీకోసమే నువ్వు బతకాలనుకున్నావు.''

''సొంత ఆనందమనేది ఏమిటి?''

''అన్ని చోట్లా మురిగిపోయావు; దభేలుమని ప్రతిదీ నేల కూలింది.''

''సొంత ఆనందమంటే యేమిటి, చెప్పు.''

''అది కింద పడితీరుతుంది. ఆధారం యేమీ లేని చోట కాలు నిలపాలనుకున్నావు కాబట్టి. బులబులాగ్గా వుండే యిసకమీద నీ యిల్లు కట్టుకున్నావు కాబట్టి.''

''కొంచెం తిన్నగా చెప్పు. ఉపమానాలతో చెప్పద్దు, యేమంటే నాకర్థం కావడం లేదు.''

''యెందుకంటే — సరే, నవ్వితే నవ్వు — యెందుకంటే నీకు విశ్వాసం లేదు, హృద యార్ద్రత లేదు; నీకు మెదడు తప్ప, ఒట్టి మెదడు తప్ప యేమీ లేదు.... నువ్వు నీచమైన, పాత పడిపోయిన వోల్టేరియనువి — నువ్వు అంతే.''

''యేమిటీ, నేను — వోల్టేరియన్నా?''

''ఆఁ, మీ నాన్న లాగానే, నీకు ఆ అనుమానం కూడా లేదు.''

''నువ్వు మూర్ఖుడవనే నేను చెప్ప గలిగిందల్లా'' అరిచాడు లవ్రేత్‌స్కీ.

''అయ్యో!'' అన్నాడు మిహాలేవిచ్ అనుతాపంతో. ''నేనింకా, దురదృష్టవశాత్తూ ఆ కీర్తి సంపాదించుకోలేదు.''

''నిన్నేమని పిలవాలో నాకు తెలుసు'' అని రాత్రి రెండు గంటల తర్వాత చించుకున్నాడు మిహాలేవిచ్. ''నువ్వు సందేహభావుకుడివీ కాదు, నీరసపడిపోయిన వాడివీ కాదు, వోల్టేరి యనువీ కాదు — నువ్వు మందుడివి, ఆఁ, అంతే మందుడివి — అసలైన మందుడివి, పాండిత్య మందుడివి. పాండిత్యం లేని మందుడు గాళ్లు యేం చెయ్యాల్సింది తోచక చాచుకు పదు కుంటారు, వాళ్ళు యేం చేసే దానికీ శక్తి లేని వాళ్లు కనక. వాళ్లు ఆలోచించను కూడా ఆలోచించలేరు. నువ్వు ఆలోచనకల మనిషివి — యేం, పనిలో జాగు చేస్తావు, నువ్వు చెయ్య గలవు కాని చెయ్యవు; బోర్లపడుకుని యిది యిలాగే వుండాలి అంటావు, యేమంటే మను షులు చేసేది అంతా చెత్తచెదారమూనూ, దానివల్ల యేం ఒరగదు.''

''నేను నిర్వ్యాపారంగా వున్నానని నీకెలా తోచింది?'' అభ్యంతరం చెప్పాడు లవ్రేత్‌స్కీ. ''నాకలాంటి వూహలు వున్నాయని నీకెలా అనిపించింది?''

మిహాలేవిచ్ యేం జంకకుండా అంటూనే వున్నాడు, ''అదీగాక, మీరంతా, మీ బాపతు వాళ్లంతా, బాగా చదువుకున్న మందులు. జర్మన్ల బలహీనత లేమిటో మీకు తెలుసు; ఇంగ్లీషు వాళ్లనీ, ఫ్రెంచివాళ్లనీ పీడించేదేమిటో మీకు తెలుసు. పాపం ఆ చదువుని లజ్జాకరమైన సోమరితనాన్నీ, మీ పాడు బద్ధకాన్నీ సమర్థించుకోవడానికి వుాతం చేసుకుంటారు. మీలో కొంతమంది నిర్వ్యాపారంగా వున్నామని సంబరపడిపోతూ వుంటారు, మిగతా వాళ్లు తెలివి తక్కువగా నొల్లుకుని పోతూవుంటే, తెలివైన వాళ్లల్లాగా యేమీ చెయ్యకుండా వుండి

పోతారు. అవునండీ! కొంత మంది ఘనులున్నారు — నేను నిన్ను ఉద్దేశించే అంటం లేదు, గుర్తుంచుకో — బతుకంతా విసుపెత్తిన మగతలో కూరుకుపోయి, దానికి అలవాటు పడి పోతారు, అందులో యెలా చెప్మా.... తుమ్మచెట్టుని బంకలాగా, అంటి పెట్టుకుపోతారు'' వెళ్లగక్కేశాడు మిహాలేవిచ్, తన ఉపమానానికి తనే నవ్వుతూ. ''అబ్బ, విసుపెత్తిన మగత — అది మన పాలిటి, రష్యన్ల పాలిటి, వినాశనం. జుగుప్సావహమైన మందుడు పనికి సిద్ధ పడ్డంకోసం యెప్పటికీ నిర్ణయం చేసుకుంటూనే వున్నాడు.''

''దేనికి గింజుకుంటావు?'' యిప్పుడు అరవడం ల్రవేత్‌స్కీ వంతు అయింది. ''పని చెయ్యాలి అని పేలడం బాగానే వుంటుంది.... పనులు చెయ్యడం. పాల్తావా డెమాస్థనీస్ గారూ, తిట్టే బదులుగా యేమిటి చెయ్యాలో చెప్పు.''

''అదా నీకు కావలసింది? అది నేను చెప్పలేను, బాబూ. యెవడి మట్టుకి వాడు తెలుసుకోవాలి'' డెమాస్థనీస్ బదులుచెప్పాడు. ''జమీందారుట! గొప్పకుటుంబంవాడట! యేం చెయ్యాలో తెలీదట! నీకు విశ్వాసం లేదు, లేకపోతే నీకు తెలిసి వుండేది. విశ్వాసం లేని చోట జ్ఞానోదయం కాదు.''

''నాకు కనీసం విశ్రాంతి తీసుకునే వ్యవధి యియ్యి, శాస్తి జరగనీ; కాస్త పరకాయించి నాలుగూ చూడనీ'' అర్థించాడు ల్రవేత్‌స్కీ.

''లేదు, ఒక్క ఘడియ విశ్రాంతి లేదు, ఒక్క క్షణం విశ్రాంతి లేదు'' ఒక నియంత లాగా వాలకం పెట్టి అన్నాడు మిహాలేవిచ్. ''ఒక్కగానొక్క క్షణం కూడా లేదు! యే ఒక్కడి కోసమూ మృత్యువు ఆగదు, జీవితం కూడా ఆగడానికి లేదు!''

''మనుషులు సోమరిపోతులుగా తయారవడానికి యేం సమయం, యేం ప్రదేశం!'' తెల్లవారకట్ల నాలుగ్గంటలకి అతను అరిచాడు. అరవడం వల్ల యిప్పుడు గొంతుక కొంచెం బొంగురు పోయింది. ''యిక్కడ! యిప్పుడు! రష్యాలో! ప్రతి వ్యక్తికీ చెయ్యవలసిన విధి ఒకటి వుండగా, భగవంతుడికి, దేశానికి, తనకిగా తనకి నిర్వర్తించాల్సిన గంభీరమైన బాధ్యతలు వుండగా! కాలం జారిపోతూవుంటే, మనం నిద్రపోతున్నాం, మనం నిద్రపోతున్నాం.''

''చూడు నాయనా మనం యిప్పుడు ఖాయంగా నిద్రపోవటం లేదు, నిద్రపోయే వాళ్లని చెడగొడుతున్నాం. రెండు కోడిపుంజుల్లా అరుస్తున్నాం. విను, మూడోది కూస్తున్నట్టు వుంది'' అన్నాడు ల్రవేత్‌స్కీ.

యీ పరిహాసం మిహాలేవిచ్‌కి నవ్వు తెప్పించింది, అతన్ని మెల్లిగా అయేటట్టు చేసింది. ''అవును, రేపటిదాకా'' అన్నాడు అతను చిరునవ్వు నవ్వుతూ. పైపు పక్కన పెట్టాడు. ''రేపటిదాకా'' రెట్టించాడు ల్రవేత్‌స్కీ. కాని మిత్రులు యింకో గంట మాట్లాడు కుంటూనే వున్నారు. యేమైనా వాళ్ల గొంతుకలు స్థాయి పెరగలేదు, వాళ్లు మెల్లిగా, విచారంగా, మృదువుగా మాట్లాడుకున్నారు.

మిహాలేవిచ్ ఆ మర్నాడు వెళ్లిపోయాడు. లవ్రేత్‌స్కీ అతన్ని అపుచేద్దామని యెంత బలవంతం చేసినా లాభం లేకపోయింది. ఫ్యోదొర్ ఇవానిచ్ అతన్ని వుండమని బలవంతం చెయ్యలేకపోయాడు, కాని యిద్దరూ తృప్తిగా మాట్లాడుకున్నారు. మిహాలేవిచ్ యినప గజ్జెల తల్లి ఆశీస్సుతో వున్నట్టు కనిపించింది. దీర్ఘకాలపు దారిద్ర్యం వల్ల సంభవించే అల వాట్లని లవ్రేత్‌స్కీ అతనిలో ముందు రోజు సాయంత్రమే గమనించాడు. మిహాలేవిచ్ బూటు మడమలు అరిగిపోయి వున్నాయి. కోటుకి వెనక బొత్తాం ఒకటి లేదు, అతని చేతులకి గ్లవ్సు తొడుక్కుంటున్నట్టు లేదు. అతని జుట్టు సన్నగా రాలిపోతోంది. యింట్లోకి రాగానే చేతులు కడుక్కుంటానని మాటకి కూడా అనలేదు, భోజనాల దగ్గర అవురావురు మంటూ చేతుల్తో మాంసం పీక్కుంటూ, యెముకల్ని గట్టి, నల్లని పళ్లతో కొరుకుతూ తిన్నాడు. పౌర ఉద్యోగం అతనికేమీ ఒరగబెట్టలేదనీ, అతని ఆశలన్నీ, వ్యూరికే ''చదువుకున్నవాడు'' కావాలని తనని పనిలో పెట్టుకున్న ప్రస్తుత యజమానిమీదే లగ్నం అయివున్నాయనీ తేలింది. అయినా కూడా మిహాలేవిచ్ గుండె దిటవుపోలేదు, యెప్పటి లాగానే తాత్విక నిరాశావాదిగా, భావవాదిగా, కవిగా వుండిపోయాడు. నిజాయితీగా మానవుణ్ణి గురించీ, తన వ్యావృత్తి గురించీ ఆదుర్దాపడుతూ, తను పైకి తేలివుండాలనే దానికి సంబంధించి అసలు ఆలోచన చెయ్యకుండానే వుండిపోయాడు. మిహాలేవిచ్ వివాహం చేసుకోలేదు, కాని లెక్కలేనన్ని సార్లు ప్రేమించాడు, తనకి వ్యామోహం కలిగించిన అందరిమీదా కవిత్వం రాశాడు. ప్రత్యే కంగా ఉత్తేజితం చేసిన పారవశ్య గీతం నల్లని కురులున్న ఒక ''పోలిష్ స్త్రీ''కి అంకితం అయింది. యీ ''పోలిష్ స్త్రీ'' సాదా యూదు ఆవిడ అనీ, చాలా మంది ఆశ్వికదళ అధికా రులకి అందుబాటులో వుండేదనీ అంటారు.... అయినా, దాన్ని గురించి అనుకోవడం, అబ్బే, అది లెక్కలోకి రాదు.

మిహాలేవిచ్‌కి లెమ్‌తో సరిపడలేదు. అతను దడదడ మాట్లాడ్డం, అతని మోటు అలవాట్లు ఆ జర్మన్‌కి భయం కలిగించాయి, ఆయన అలాంటి వాటికి అలవాటు పడలేదు. ఒక బీద ముష్టివాడు యింకొకణ్ణి దూరంనుంచి చూడవచ్చును గాని, వార్ధక్యంలో వాళ్లు స్నేహితులు కాలేరు – అందులో వింత లేదు. వాళ్లిద్దరికీ ఉమ్మడిగా యేం వుండదు, కడకి ఆశలు కూడా.

వెళ్లిపోయే ముందు మిహాలేవిచ్ లవ్రేత్‌స్కీతోటి మరో సారి దీర్ఘంగా మాట్లాడాడు. అతను యిప్పటికేనా మత్తు వదిలించుకోకపోతే వినాశనం తప్పదని జోస్యం చెప్పాడు. అతను తన రైతుల శ్రేయస్సుకోసం గట్టిగా శ్రద్ధపట్టాలని కోరాడు. బాధల కొలిమిలో కాలి నిగ్గుదేరిన మనిషిగా తను ఆదర్శప్రాయం కావాలని అర్థించాడు. అదే వూపులో మిహాలేవిచ్ తను ఆనందంగా వున్నాననీ చెప్పి, పక్షులతోటీ, కలువలతోటీ తనని పోల్చుకున్నాడు.

''నల్ల కలువ, యేమైనా'' అన్నాడు లవ్రేత్‌స్కీ.

''సర్లేవయ్యా, పనికిమాలిన గొడ్డుగా వుండద్దు'' బదులు చెప్పాడు మిహాలేవిచ్. నీ అదృష్టవశాత్తూ వీలో నిజాయితీగల సామాన్య రక్తం ప్రవహిస్తోంది. యిప్పుడు నీకు అవసరమైందల్లా స్వచ్ఛమైన పరిశుద్ధమైన దేవత యెవరో వచ్చి నిన్నీ ఉదాసీనతనుంచి బయట పడెయ్యడం.''

''చాలు, నాయనా, చాలు'' అన్నాడు లవ్రేత్‌స్కీ. ''యీ స్వచ్ఛమైన దేవతలు, తగిలినవాళ్లు, చాలు.''

''ఛవ్. నిరాశవాదీ!'' అని అరిచాడు మిహాలేవిచ్.

''నా నిరాశావాది'' అని లవ్రేత్‌స్కీ అతన్ని సవరించాడు.

''కచ్చితంగా నిరాశవాది'' మళ్లీ అదే అన్నాడు మిహాలేవిచ్, సిగ్గుపడకుండా.

అతను నాలుగు చక్రాల బండిలో కూర్చున్నాక కూడా యింకా మాట్లాడుతూనే వున్నాడు. అతని చదునైన, పసుప్పచ్చని, తోలుపెట్టెని వాళ్లు అక్కడికి తెచ్చారు. అది ఆశ్చ ర్యకరంగా తేలికగా వుంది. స్పానిష్ అంగీ మాదిరీ వుండి మాసిపోయిన గోధుమరంగు కాలర్లూ సింహం పంజాల్లాగా వుండే కొక్కెం వున్న అంగీని కప్పుకుని అతను రష్యా భవిష్యత్తు గురించి తన అభిప్రాయాలు చెపుతూనే వున్నాడు. భవిష్యత్తు శ్రేయస్సుకి విత్తనాలని చల్లుతున్నట్టు నల్లని చేతులని వూపాడు. ఆఖరికి గుర్రాలు కదిలాయి. ''నా ఆఖరి మూడు మాటలూ జ్ఞాపకం వుంచుకో'' అని అతను అరిచాడు, బండిలోనుంచి శరీరం యివతలికి పెట్టి, పట్టుదప్పిపోకుండా ఆనుకుంటూ, ''మతం, అభివృద్ధి, మానవత్వం! సెలవు!'' కళ్లదాక టోపీ లాక్కుని అతని తల అదృశ్యమైపోయింది. లవ్రేత్‌స్కీ ఒక్కడూ మెట్లమీద నిలబడి పోయి నాలుగు చక్రాల బండి కనుమరుగైపోయేదాకా చూస్తూ వుండిపోయాడు. ''అతను చెప్పింది నిజమేనేమో!'' అని తిరిగి యింట్లోకి పోతూ అనుకున్నాడు అతను. ''నేను సోమరిపోతునేమో.'' తను యెంత వాదించినా, యెంత అతను చెప్పిందాంతో ఒప్పుకోక పోయినా మిహాలేవిచ్ చెప్పింది చాలా భాగం అతని హృదయంమీద ముద్రవేసింది. మనిషి మంచివాడైతే యెవరూ అతన్ని నిరోధించలేరు.

## 26

అన్నట్టుగానే రెండు రోజుల తర్వాత మార్య దీమ్రితియెవ్నా కుర్రకారునంతటినీ తీసుకుని వసీల్యెవ్‌స్కొయెకి వచ్చింది. ఆడపిల్లలు తిన్నగా తోటలోకి వెళ్లిపోతే మార్య దీమ్రితి యెవ్నా అలసత్వంతో గదులన్నీ తిరిగి అలసత్వంతోటే అన్నిటినీ మెచ్చుకుంది. తను లవ్రేత్ స్కీని సందర్శించరావడం యేదో అనుగ్రహపూర్వకమైన చర్యగా, దాదాపు దయగా ఆమె భావించింది. అన్‌తోన్, అప్రాక్సేయాలు పాతకాలపు రాజప్రాసాద పరిచారకుల్లాగా తన

చేతిని అభివాదపూర్వకంగా చుంబించినప్పుడు, ఆమె చిరునవ్వు నవ్వి, నిరుత్సాహపూర్వకంగా నానుస్తూ కొంచెం టీ కావాలని అంది. ఆ సమయానికి తగ్గట్టు వుండాలని తెల్లని అల్లిక గ్లవ్సు తొడుక్కున్న అన్‌తోన్‌కి ఆశాభంగం కలిగించేటట్టుగా ఆ మహిళా అతిథికి ల్రవేత్‌స్కీ జీతగాడు నౌకరు టీ సిద్ధం చేశాడు. అన్‌తోన్ అభిప్రాయంలో అతనికి పడికట్లు తెలియవు. భోజనాల సమయంలో మాత్రం అన్‌తోన్ తన స్థానం తను పట్టేశాడు. మార్య దీమ్రిత్రి యెవ్నా కుర్చీ వెనక్కాల దృఢంగా నిలబడి, మరి యెవరికీ ఆ స్థానాన్ని యివ్వలేదు. వసీల్యెవ్ స్కాయెలో అతిథుల సందర్శన అలవాటు లేదు. అది ఆ ముసలతన్ని ఆందోళన పెట్టింది, సంతోష పెట్టిందీ కూడా. తన యజమాని యెలాంటి భేష్నైన పెద్దలతోటి భుజం భుజం కలిపి తిరుగుతూ వుండేదీ చూడ్డం అతనికి సంతోషం కలిగించింది. ఆవేళ మంచి ఉత్సా హంగా వున్నది అతనొక్కడే కాదు. లెమ్ కూడా కలవర పడిపోయాడు. పొట్టిగా, మొండి తోక, ముక్కుపొడుం రంగు వుండే కోటు తొడుక్కున్నాడు, మెడ రుమాలు బిగిగా మెడ చుట్టూ కట్టుకున్నాడు, అస్తమానూ గొంతు సవరించుకుంటూనే వున్నాడు, యెంతో ఆదరపూర్వకంగా యితరులకి దారి యిచ్చేవాడు. తనకీ లీజాకీ మధ్యన యేర్పడిన ఆత్మీ యతా భావం యింకా కొనసాగుతూనే వున్నట్టు ల్రవేత్‌స్కీ గమనించాడు. ఆమె వచ్చిన మరుక్షణం అతనికేసి స్నేహపూర్వకంగా చెయ్యి చాపింది. భోజనాల తర్వాత లెమ్ తనంత సేపూ తడుములాడుకుంటూన్న కోటు జేబులో చెయ్యిపెట్టి, చిన్న సంగీతకృతి కాగితం చుట్టని తీసి, పెదాలు బిగించి, మెల్లిగా పియానోమీద పెట్టాడు. తారకలకి సంబంధిం చిన ప్రస్తావనతోటి పాత జర్మన్ పదాల కూర్పుతో అంతకు ముందు రోజు సాయంత్రం అతను తయారు చేసిన రొమాంజా ప్రేమగీతం అది. లీజా వెంటనే పియానో దగ్గర కూర్చుని దాన్ని వాయించడం మొదలుపెట్టింది. కాని పాపం! ఆ సంగీతం మెలికలు తిరిగి పోయి భారంగా తయారైంది. కృతికర్త యేదో గాఢమైందాన్ని, ఆవేశభరితమైన దాన్ని కూర్చ ప్రయత్నించినట్టు తెలుస్తోంది, గాని విఫలుడయ్యాడు. ల్రవేత్‌స్కీ, లీజా యిద్దరూ అలానే భావించారు, లెమ్ కూడా దాన్ని గమనించాడు. అందుకనే మారు మాట్లాడకుండా ఆ కాగితాన్ని తీసి జేబులో పెట్టుకుని, లీజా మళ్ళీ వాయిద్దామని అన్నా తల వంకించి, ''అది అంతే'' అని అర్థవతుగా అని, భుజాలు ముడుచుకుని కుంచించుకుపోయి వెళ్ళి పోయాడు.

సాయంత్రం మొత్తం అంతా కలిసి చేపల వేటకి వెళ్ళారు. తోట చివర చెరువులో గండుమీనులు, పరిగెలు నిండుగా వున్నాయి. మార్య దీమ్రిత్రియెవ్నాని నీళ్లవార చెట్టు నీడలో, పడక కుర్చీలో కూర్చోబెట్టారు, ఆవిడ కాళ్లకి దుప్పటి కప్పారు, ఆమెకి మంచి గాలం యిచ్చారు. అనుభవజ్ఞుడైన మత్స్యకారుడిగా అన్‌తోన్ ఆమె సేవలో వుండిపోయాడు. అతను గాలాన్ని అటూ యిటూ కదిపాడు, కొక్కేనికి ఎరని పెట్టాడు, ఎరని కొట్టి, ధూ

అని ఉమ్మేసి, శరీరం మెలికలు తిరుగుతూ తాటిని విసిరాడు కూడా. ఆ రోజున అతన్ని గురించి ల(వేత్‌స్కీతో, తను బళ్లో నేర్చుకున్న ఫ్రెంచిలో మాట్లాడుతూ, మార్య దీమ్త్రి యెవ్నా అంది: ''ఇల్ న్యా ప్లూ మెత్‌నాన్ డె సె జన్ కొమ్ స కొమ్ వ(తెపువా.''* లెమ్ ఆడపిల్లలిద్దరితోటీ యింకా కొంచెం కిందకి కట్టదగ్గరికి వెళ్లాడు. ల(వేత్‌స్కీ లీజా పక్కన చేరాడు. చేపలు యేకటాకీన కదులుతున్నాయి. గాలాలు అటూ యిటూ కదులుతూ వుంటే గండుమీనులు తళతళ మెరుస్తూ తిరిగాయి. ఆ ఆడపిల్లలు సంతోషంతో అరుస్తూనే వున్నారు. మార్య దీమ్త్రియెవ్నా కూడా రెండు సందర్భాల్లో సున్నితమైన రెండు కేకలు వేసింది. అసలు సరిగా గాలం వెయ్యని వాళ్లు ల(వేత్‌స్కీ, లీజాలే. వాళ్లకి బహుశా మిగతా వాళ్లకంటే చేపలు పట్టడంలో తక్కువ ఆసక్తిగా వుండటం వల్ల కావచ్చు. వాళ్ల చేపలు తగిలే బెండ్లు వడ్డుకి కొట్టుకుని వచ్చాయి కూడానూ. వాళ్ల చుట్టూతా వున్న పొడుగాటి, ఎర్రని తుంగలు మెల్లిగా వూగాయి. ముందున్న నిశ్చలమైన నీళ్లు తళతళ మృదువుగా మెరిశాయి. వాళ్లు మాట్లాడుకునే గొంతులు కూడా మృదువుగా వున్నాయి. లీజా ఒక దుంగమీద నిలబడింది. ల(వేత్‌స్కీ విల్లోచెట్టు వంగిన బోదెమీద కూర్చున్నాడు. లీజా తెల్లటి బట్టలు ధరించింది. ఆమె బట్టలకి తెల్లని లేసు పట్టీ వుంది. ఆమె ఒక చేతితో గడ్డిటోపీ తిప్పుతోంది. రెండో చేతిలో బిగ్గా వుండే తాడున్న గాలం వుంది. ల(వేత్‌స్కీ స్పష్టంగా వుండే ఆమె ఆకృతికేసీ, చెవుల వెనక్కి మడుచుకున్న జుట్టుకేసీ, చిన్న పిల్లల బుగ్గల్లా ఎండపడుతూ వున్న ఆమె బుగ్గలకేసీ చూసి ''ఓహో, యీ చెరువు పక్కన నిలుచున్న నువ్వు యెంత మధురంగా వున్నావు'' అని అనుకున్నాడు. తలపక్కకి తిప్పకుని నుంచుంది లీజా. ముడుచుకుని వున్నట్టూ, లేకపోతే చిరునవ్వు నవ్వుతున్నట్టూ వుండే కళ్లతోటి నీళ్లకేసే చూస్తూ వుంది. పక్కనే వున్న లైమ్‌చెట్టు నీడ వాళ్లమీద పడుతోంది.

''యిది తెలుసా'' అని మొదలుపెట్టాడు ల(వేత్‌స్కీ. ''మనం మొన్న మాట్లాడుకున్న విషయాల గురించే నేను యెంతో అనుకుంటూ మీరు చాలా మంచి పిల్లే అనే నిర్ధారణకి వచ్చాను.''

''అసలు మీకు అలాంటి అభిప్రాయం కలిగించాలని నేను అనుకోలేదు...'' అంది లీజా, కొంచెం యిబ్బంది పడుతున్నట్టు.

''మీరు మంచి వాళ్లు'' రెట్టించాడు ల(వేత్‌స్కీ. ''నేను మోటు మనిషిని. కాని మిమ్మల్ని ప్రేమించకుండా ఎవరూ వుండలేరని, నా భావం. మాటకి లెమ్‌ని తీసుకోండి. అతను వూరికే మీరంటే పడిచస్తాడు.''

---

* ''పాత రోజులలో వున్న సేవకులు ఇప్పుడు లేరు'' (ఫ్రెంచి).

లీజా బొమలు మెలితిప్పినంతగా, ముడుచుకోలేదు. తనకి యిష్టం లేనిది విన్నప్పుడల్లా ఆమె అలానే చేస్తుంది.

''పాపం ఆయన్ని చూస్తే యివాళ జాలేసింది'' అని అతను మాట కలపడానికి త్వరపడ్డాడు. ''పాపం ఆ సంగీత కృతితోటి. పడుచుదనంతో వుండి, తప్పు చేస్తే పోనీ సర్దుకోవచ్చు; కాని వార్ధక్యంలో వుండి అశక్తంగా వుండట మనేది విచారకరంగా వుంటుంది. అన్నిటి కంటే బాధగా వుండేది మీ శక్తులు ఉడిగిపోతున్నాయని మీరు గుర్తించకపోవడం. ఆ ముసలాయనకి చాలా కష్టంగా వుంది. చూడండి, చేప గాలానికి తగులుతూ వుంది... నాకు తెలిసింది'' కొంచెం సేపు ఆగి లవ్రేత్స్కీ అన్నాడు ''వ్లదీమిర్ నికొలాయెవిచ్ మంచి పాట రాశాడుట కదా.''

''అవును'' అంది లీజా. ''అదో ట్రుమీ. అయినా ఫరవాలేదు.''

''మీ ఉద్దేశ్యం యేమిటి? అతను మంచి సంగీతకారుడేనా'' అని అడిగాడు లవ్రేత్స్కీ.

''అతనికి సంగీత జ్ఞానం పుష్కలంగా వుందనుకుంటాను. కాని దానిమీద యింత వరకూ తగినంత ధ్యాస పెట్టినట్టులేదు.''

''అలాగా, మనిషిగా అతను మంచి వాడేనంటారా?''

లీజా నవ్వి, ఫ్యోదొర్ ఇవానిచ్ కేసి చురుగ్గా చూసింది.

''యేం చిత్రంగా అడుగుతారు!'' అందామె, గాలాన్ని యివతలికి లాగి, మళ్లీ విసురుతూ.

''చిత్రం యెందుకు? యీ మధ్యనే యిక్కడికి వచ్చిన వాడిగా, బంధువుగా అడుగుత న్నాను.''

''బంధువుగా?''

''అవును. నేను మీకు మామయ్య వరస అవుతాను.''

''వ్లదీమిర్ నికొలాయెవిచ్ మనసు మంచిది. అతను తెలివైనవాడు; అమ్మకి అతనంటే చాలా యిష్టం'' అంది లీజా.

''మీకూ యిష్టమేనా?''

''అతను మంచివాడు. నాకెందుకు యిష్టం వుండదు?''

''ఆహా'' అని లవ్రేత్స్కీ గొణిగి, మళ్లీ గమ్మున అయిపోయాడు. కొంచెం విచారం, కొంచెం వేళాకోళం కలిసిన దృక్కు అతని ముఖంమీద పాకిపోయింది. తదేకంగా అతను చూడ్డం లీజాకి యిబ్బంది కలిగించింది, కాని చిరునవ్వు నవ్వుతూనే వుంది. ''వూ, బాగానే వుంది. దేవుడు వాళ్లకి ఆనందం యిచ్చుగాక!'' అని అతను తనకి తనే అనుకుంటున్నట్టు గొణిగాడు. దృష్టి పక్కకి తిప్పుకున్నాడు.

లీజా సిగ్గుపడింది.

''మీరు పారబడ్డారు, ఫ్యోదొర్ ఇవానిచ్'' అందామె. ''మీరు అనుకోకూడదు.... కాని వ్లదీమిర్ నికొలాయెవిచ్ అంటే మీకు యిష్టం లేదూ?'' అని హఠాత్తుగా అడిగింది.

''వుహుఁ! ఇష్టం లేదు.''

''ఎందుకని?''

''అతనికి లేనిది సరిగ్గా హృదయమేమని నా అనుమానం.''

లీజా ముఖంమీద చిరునవ్వు పోయింది.

''మీరు మనుషుల్ని గురించి మరీ కటువుగా అంచనా వేస్తారు'' అందామె చాలా సేపు అయింతర్వాత.

''నేను అలా అనుకోను. మనుషుల్ని గురించి కటువుగా అంచనా వేసే అధికారం నాకేం వుంది? అదీ, నాకే మానసిక తృప్తి అవసరమైనప్పుడు? లేకపోతే నేను నవ్వుల పాలైన సంగతి మరిచిపోయారా?... ఆఁ, అవును'' అన్నాడతను ''మీరు మీ వాగ్దానం నిలబెట్టు కున్నారా?''

''ఏ వాగ్దానం?''

''నాకోసం ప్రార్థన చేసారా?''

''ఆఁ, చేశాను. నేను మీకోసం రోజూ ప్రార్థన చేస్తాను. కాని దాన్ని గురించి తేలికగా మాట్లాడవద్దండీ.''

అలా చేయడం తన స్వభావం కాదనీ, యితరుల విశ్వాసాల పట్ల తనకి యెంతో గౌరవం వుందని లవ్రేత్స్కీ హామీ యివ్వ ప్రయత్నించాడు. అప్పుడు మతాన్ని గురించీ, మానవ చరిత్రలో దాని స్థానం గురించీ, క్రైస్తవ మత ప్రాముఖ్యం గురించీ మాట్లాడాడు.

''ప్రతివాళ్లూ క్రైస్తవులుగా వుండటం దేనికోసం అవసరం'' అంది లీజా, కొంచెం ప్రయత్నంతోటి ''దైవ సామీప్యం గ్రహించడానికి కాదు.... వూఁ.... ఐహికమైనదాని కోసమూ కాదు, కాని ప్రతి వాళ్లూ చనిపోవాలి కాబట్టి.''

లవ్రేత్స్కీ ఆమెకేసి ఆశ్చర్యకరంగా చూసి, ఆమె చూపుతో చూపు కలిపాడు.

''యిప్పుడు మీరన్న మాట యేమిటి?''

''ఆ మాట నాది కాదండీ'' అందామె.

''మీది కాదు లెండి. కాని చావుని గురించి మాట్లాడాల్సిన అవసరం మీకేం వచ్చింది?''

''నాకు తెలీదు, కాని నేను తరచుగా దాన్ని గురించి అనుకుంటూ వుంటాను.''

''తరచుగా?''

''వూఁ.''

''మిమల్ని చూస్తే అసలు యెవడూ అలా అని నమ్మడు. మీ ముఖం అంత కళగా, సంతోషంగా, చిరునవ్వు నవ్వుతూవుంటుంది.''

''అవును, యిప్పుడు నాకు చాలా ఆనందంగా వుంది'' అందామె అమాయకంగా.

లవ్రేత్‌స్కీ ఆమె రెండు చేతుల్నీ లాక్కుని, గట్టిగా నొక్కుదామనుకున్నాడు.

''లీజా, లీజా. యిలా రా. చూడు యెలాంటి గండుమీను నా గాలానికి చిక్కిందో'' అని అరిచింది మార్య దీమ్రితియెవ్నా.

''ఆఁ, వస్తున్నానమ్మా'' అని లీజా ఆమె దగ్గరికి వెళ్లింది. లవ్రేత్‌స్కీ విల్లో బోదెమీద ఒక్కడూ వుండిపోయాడు. ''అసలు యింత జీవితమూ జీవించనట్టే నేను ఆమెతో మాట్లాడు తున్నాను'' అనుకున్నాడు లవ్రేత్‌స్కీ. వెళ్లేముందు లీజా తన టోపీని ఓ కొమ్మకి తగిలించింది. లవ్రేత్‌స్కీ ఆ టోపీకేసీ, కొంచెం ముడతలు పడిన దాని రిబ్బన్లకేసీ ఓ చిత్రమైన, సున్నితమైన అనుభూతితో చూశాడు. వెంటనే లీజా తిరిగివచ్చి మళ్లీ దుంగ మీద నుంచుంది.

''వ్లదీమిర్ నికొలాయెవిచ్ మనసున్న మనిషి కాదని మీరు యెందుకు అనుకున్నారు?'' అడిగింది ఆమె.

''నేను పొరపాటు పడివుండవచ్చని మీతో చెప్పనే చెప్పాను. యేమైనా కాలమే రుజావు చేస్తుంది.''

లీజా ఆలోచనలో పడిపోయింది. లవ్రేత్‌స్కీ వసీల్యెవ్‌స్కొయెలో తను గడుపుతూ వున్న జీవితం గురించీ, మిహలేవిచ్ గురించీ, అన్‌తోన్ గురించీ మాట్లాడేడు. లీజాతో మాట్లాడాలనే అవసరం యేదో అతనికి అనిపించింది, తన హృదయంలో వున్న ప్రతీదాన్నీ గురించీ చెప్పాలనిపించింది. ఆమె అంత ముచ్చటైన, ఓపికైన శ్రోత. మధ్య మధ్య ఆమె చేసే వ్యాఖ్యలు, చెప్పే అభిప్రాయాలూ అతనికి తేలికైనవిగా, యుక్తిగా కనిపించాయి. అలా అని ఆమెతో అన్నాడు.

లీజాకి ఆశ్చర్యం కలిగింది.

''నిజమా?'' అందామె. ''మా పనిమనిషి నాస్త్యా లాగానే నాకూ నా సొంత మాటలు లేవని అనుకునే దాన్ని అస్తమానూ. ఓ సారి ఆమె తనని ప్రేమించేవాడితో అందిట — 'నీకు నాతోటి విసుగ్గా వుంటుందేమో; నువ్వెప్పుడూ నాతో చక్కగా మాట్లాడతావు. మరి నాకుగా నాకు <u>సొంత</u> మాట ల్లేవు' అని.''

''దేవుడి దయవల్ల అలా జరిగిందనుకోండి'' అనుకున్నాడు లవ్రేత్‌స్కీ.

## 27

యీ లోపున సాయంత్రం అవుతోంది. యింటికి తిరిగి వెళ్లి పోయే వేళ అయిందని మార్య దీమ్రితియెవ్నా ప్రకటించింది. ఆ చిన్న పిల్లల్ని బలవంతంగా లాగాల్సివచ్చింది, సిద్ధం చెయ్యాల్సి వచ్చింది. తను వాళ్లని సగందాకా తీసికెళ్లి దిగబెడతాననీ, గుర్రం సిద్ధం

చెయ్యమని లవ్రేత్‌స్కీ పురమాయించాడు. మార్య దీమ్త్రియెవ్నాకి చెయ్యి ఆసరా యిచ్చి బండిలోకి యెక్కించాడు. అతనికి హఠాత్తుగా లెమ్ గుర్తుకొచ్చాడు. కాని యెక్కడా ఆ ముసలాయన జాడలేదు. చేపలు పట్టడం అయిపోయిన వెంటనే అతను మాయమైపోయాడు. తన వయసుకి అలాంటి శక్తి వుండటం గొప్పగా కనిపించిన అన్‌తోన్ బండి తలుపులు ధనాల్న మూసి, "పోనీ, బండాయనా" అని బింకంగా అరిచాడు. బండి బయల్దేరింది. వెనక్కాల సీట్లలో మార్య దీమ్త్రియెవ్నా, లీజాలు కూర్చున్నారు, ముందు సీట్లలో ఆడ పిల్లలూ, పనిపిల్లా కూర్చున్నారు. వెచ్చగా ప్రశాంతంగా వున్న సాయంత్రం అది, బండి కిటికీలు తీసే వుంచారు. లవ్రేత్‌స్కీ చెయ్యి కిటికీ తలుపుమీద వేసి లీజా వేపున బండి పక్కన గుర్రంమీద స్వారీ చేస్తున్నాడు. అతను మెల్లిగా నడిచే గుర్రం మెడమీద కళ్లెం వేసాడు. అడపా దడపా ఆ అమ్మాయితో మాట్లాడుతున్నాడు. సూర్యాస్తమయానంతర దీప్తి తగ్గింది. చీకటి పడింది. కాని గాలి యింకొంచెం వెచ్చబడినట్లుంది. మార్య దీమ్త్రియెవ్నా త్వరలోనే జోగ నారంభించింది. ఆ చిన్నపిల్లలూ, పనిపిల్లా కూడా జోగుతున్నారు. బండి వేగంగా, కుదుపు లేకుండా పోతోంది. లీజా ముందుకి ఆనుకుంది. ఉదయిస్తున్న చంద్రుని కాంతి ఆమె ముఖంమీద ప్రకాశిస్తోంది. నెత్తావినిండిన రాత్రి గాలి ఆమె కళ్లనీ, బుగ్గల్నీ విసురుతోంది. ఆమె సంతోషంగా వుంది. ఆమె చెయ్యి బండి తలుపుమీద, లవ్రేత్‌స్కీ చెయ్యి పక్కన ఆనుకుని వుంది. అతను కూడా సంతోషంగా వున్నాడు. రాత్రి నిశ్చలమైన వెచ్చదనంలో అలా పోతూ, ఆమె వదనంనుంచి చూపులు మళ్లించకుండా, ఆమె మెల్లిగా మధురంగా అనే సాదా మంచి మాటలు వింటూ తెలియకుండానే అతను సగం దూరం వెళ్లిపోయాడు. మార్య దీమ్త్రియెవ్నాని లేపడం యిష్టంలేక, అతను లీజా చేతిని మెల్లిగా నొక్కి "యిప్పుడు మనం స్నేహితులం, అవునా?" అన్నాడు. ఆమె తల పంకించింది. అతను గుర్రాన్ని ఆపాడు. బండి వూగుతూ, అలా అలా కదులుతూ వెళ్లి పోయింది. లవ్రేత్‌స్కీ మెల్లిగా యింటి దారి పట్టాడు. వేసవి రాత్రి అందం అతన్ని అలరి స్తోంది. చుట్టూతా వున్న ప్రతీదీ హఠాత్తుగా కొత్తగా కనిపించింది, అయినా యెంతో కాలంగా, మధురంగా పరిచయమైనట్టూ కనిపించింది. దూరంలోనూ దగ్గర్లోనూ వున్న ప్రతిదీ గాఢమైన శాంతిలో వుంది. మరి యెవళ్లేనా దూరం చూడవచ్చు, యెదర వున్న దాన్నంతటినీ కన్ను పట్టకపోయినా. ఆ నిశ్చలతే వికసించే జీవితంతో పూర్ణంగా వున్నట్టు వుంది. లవ్రేత్‌స్కీ గుర్రం చురుగ్గా, అటూ యిటూ సౌమ్యంగా వూగుతూ అడుగేస్తోంది. దానిని అనుసరించే దాని పొడుగాటి నీడ వస్తోంది. దాని గిట్టల తాడనంలో యేదో వింత అందం, పురిడిపిట్టల కూతలో ఉత్సాహభరితం, ఆకర్షకం అయింది యేదో వున్నాయి. ప్రకాశమానమైన మసకలో నక్షత్రాలు కనిపించడం లేదు. ఆకాశంలో చంద్రవంక మసక

వెన్నెల కాస్తోంది. అది ఆకాశాన్ని నీలపు కాంతితో నింపి, జారుకుంటూ పోయే పల్చటి మేఘాలమీద బంగారు ముత్యాల్లా పడుతోంది. బలకరమైన రాత్రిగాలి వల్ల కళ్లకి చెమ్మ పొర కమ్ముతోంది, అవయవాల్లోకి మెల్లిగా విస్తరిస్తోంది. వూపిరితిత్తుల్లోకి స్వేచ్ఛగా జారుతోంది. లవ్రేత్‌స్కీ యీ ఆనందాన్ని తాగాడు, దానితో సంతోషపడ్డాడు. ''మనకింకా కొరత లేదు. వాళ్లకి చూపిద్దాం...'' అనుకున్నాడు. ఎవరికో యేమిటో అతను చెప్పలేదు. అతను లీజాని గురించి ఆలోచనలో మునిగిపోయాడు. ఆమె పాన్‌షిన్‌ని ప్రేమించడం లేదనే అనుకున్నాడు, తనే కనక ఆమెని వేరే పరిస్థితుల్లో కలుసుకొని వుంటే — యెమో యేం జరిగి వుండేదో యెవరు చెప్పగలరు అనుకున్నాడు; ఆమెకి ''సొంత మాటలు'' లేక పోయినా లెమ్ ఆమెని గురించి అనుకున్నట్టే అతనూ అనుకున్నాడు. అదీగాక ఆ మాట నిజం కాదు, — ఆమెకి సొంత మాటలు వున్నాయి. ''దాన్ని గురించి తేలిగ్గా మాట్లాడకండి'' — అనే మాటలు లవ్రేత్‌స్కీకి గుర్తు వచ్చాయి. తల వాల్చుకుని అలా చాలా సేపు స్వారీ చేశాడు, అప్పుడు కొంచెం కూడదీసుకుని అన్నాడు:

''నేను ఆరాధించిన సమస్తమూ దగ్ధమొనర్చితి,
దగ్ధమొనర్చిన సమస్తమూ యిప్పుడు ఆరాధింతును.''

గుర్రాన్ని చురుక్కుమని అదిలించి, దౌడు తీయిస్తూ యింటికి వెళ్లిపోయాడు.

గుర్రం దిగి, అప్రయత్నపూర్వకమైన కృతజ్ఞతతోటి చుట్టూతా చూశాడు. నిశీధి — దయాన్విత, నిశ్శబ్ద నిశీధి కొండలమీదా, లోయలమీదా పరుచుకుంది. దూరంనుంచి, సుగంధపు లోతులనుంచి — అది స్వర్గంనుంచో, యిలమీదనుంచో యెవరూ చెప్పలేరు — ఒక మృదువైన, మెత్తటి వెచ్చదనం నాచికొంది. లవ్రేత్‌స్కీ లీజాకి ఆఖరి నిశ్శబ్ద అభినందన పంపి, మెట్లెక్కిపోయాడు.

ఆ మర్నాడు కొంచెం విసుగ్గా గడిచింది. ఉదయం చిరువాన మొదలైంది. లెమ్ ముఖం ముడుచుకుని వున్నాడు, యెప్పుడూ మాట్లాడకూడదని ఒట్టుపెట్టుకున్న వాడిలాగా పెదాలు బిగించుకు కూచున్నాడు. పడక గదిలోకి పోతూ లవ్రేత్‌స్కీ పక్షం రోజాలుగా తెరవకుండా పడివున్న ఫ్రెంచ్ పత్రికల్ని తీసుకువెళ్లాడు. యథాలాపంగా పై కవరు కాగితం చింపి వార్తాపత్రికల కాలమ్‌లని చూశాడు, వాటిల్లో కొత్త యేమీ లేదు. వాటిని పక్కన పడేద్దామా అనుకునే సమయంలో, హఠాత్తుగా యేదో కుట్టినట్టుగా అతను మంచం మీదనుంచి పైకి యెగిరాడు. ఒక వ్యాసంలో, (మన పాత మిత్రుడు) మూషే జూల్ పాఠకులకి ఒక ''విచారకరమైన వార్త''ని అందజేశాడు. ముగ్ధమోహనమైన, సుందర మాస్కో వనిత, ఫాషన్ల రాణీ, పారిస్ మందిరాలని అలరించిన మహిళ, మదాం లవ్రేత్‌స్కీ అకస్మాత్తుగా

మరిణించింది. ఆ వార్త, అయ్యో! పచ్చి నిజమా! తనకి, అంటే జూల్‌కి, చేరింది. తను — అతను రాసుకుపోయాడు — మరణించిన ఆమె మిత్రుడు, ఆ మాట కొస్తే....

ల్రవేత్‌స్కీ బట్టలు వేసుకుని తోటలోకి వెళ్ళాడు. తెల్లవారేదాకా అటూ యిటూ పచారుచేస్తూనే వున్నాడు.

## 28

మర్నాడు ఉదయం టీ తాగేటప్పుడు లెమ్ పట్టణానికి తిరిగివెళ్లిపోవడానికి తనకి గుర్రాలని యిమ్మని ల్రవేత్‌స్కీని అడిగాడు. ''నేను మళ్లీ పని మొదలుపెట్టే టైము అయింది. అంటే నా పాఠాలని. యిక్కడ వూరికే వృథాగా గడిపేస్తున్నాను'' అన్నాడా ముసలాయన. ల్రవేత్‌స్కీ వెంటనే జవాబివ్వలేదు. యేదో పరధ్యానంగా కనిపించాడు. ''సరే నేనూ మీతో వస్తా'' అన్నాడు కాసేపాగి లెమ్. గొణుక్కుంటూ, కోపంగా సామన్లని నౌకర్లు యెవళ్లూ లేకుండానే సర్దుకుని, కొన్ని సంగీతం కాగితాలని చింపేసి అంటించేసేడు. గుర్రాలని బళ్లకి కట్టేరు. గదిలోనుంచి యివతలికి వస్తూ ల్రవేత్‌స్కీ జూల్ వ్యాసం వున్న పత్రికని జేబులో కుక్కుకున్నాడు. లెమ్, ల్రవేత్‌స్కీలు దారిలో యేమంత మాట్లాడుకోలేదు. ఎవళ్ల ఆలోచనల్లో వాళ్లుండిపోయి, అవతలివాడు జోక్యం చేసుకోలేదనే సంతోషపడ్డాడు. యిద్దరూ మొక్కుబడిగా, మామూలుగా రష్యాలో మిత్రుల మధ్య వుండేటట్టుగానే, ఒకళ్లనుండి ఒకళ్లు సెలవు తీసుకుని వెళ్లిపోయారు. ఆ ముసలాయన్ని ల్రవేత్‌స్కీ ఆయన చిన్న యింటిదగ్గర దిగబెట్టాడు. ఆయన దిగి, పెట్టె తీసుకుని, మిత్రుడికి కరచాలనం కోసం చెయ్యి అందివ్వకుండా (అతను సామానుని గుండెకి అదిమిపెట్టి రెండు చేతులతోటీ పట్టుకున్నాడు) అతనికేసి చూడను కూడా చూడకుండా, రష్యన్‌లో ''సెలవు!'' అన్నాడు. ''సెలవ్!'' అని ల్రవేత్‌స్కీ బదులు చెప్పి తన బస దగ్గరికి పోనిమ్మని బండివాడితో చెప్పాడు. యేదేనా అవసరం వస్తే వుంటాయని అతను పట్టణంలో గదుల్ని అద్దెకి తీసుకున్నాడు. ల్రవేత్‌స్కీ కొన్ని ఉత్తరాలని రాసి, గబగబా యింత కతికి, కలీతిన్ల యింటికి వెళ్లాడు. డ్రాయింగ్ రూంలో అతనికి పాన్‌షిన్ కనిపించాడు. మార్య దీమ్రితియెవ్నా త్వరలోనే వస్తుందని చెప్పి, పాన్‌షిన్ యెంతో ఆత్మీయతతోటి సంభాషణలోకి దింపాడు. ఆ రోజుదాకా పాన్‌షిన్ ల్రవేత్‌స్కీని పొగరు మొత్తనంగా కాకపోయినా, అధికమైన ఓర్మితో చూసేవాడు. కాని లీజా పాన్‌షిన్‌తోటి ల్రవేత్‌స్కీ యింటికి తాము వెళ్లిన విషయం చెబుతూ అతను తెలివైన వాడనీ, లెక్కల్లో మనిషనీ చెప్పింది. అది పనిచేసింది: ఆ ''లెక్కల్లో మనిషిని'' తను ఆకట్టుకోవాలి. పాన్‌షిన్ పొగడ్తలతో ప్రారంభించాడు, వసీల్యెవ్‌స్కాయెని సందర్శించడం వల్ల మార్య దీమ్రితియెవ్నా మొత్తం కుటుంబమంతా యెంత సంతోషపడిందీ వర్ణిస్తూ, అప్పుడు తన అలవాటు చొప్పున, తనని గురించే దడదడా మాట్లాడ్డం

మొదలుపెట్టాడు. తన అభిరుచుల గురించి చెప్పాడు. జీవితాన్ని గురించీ, ప్రపంచాన్ని గురించీ, ప్రభుత్వ ఉద్యోగాన్ని గురించీ తన అభిప్రాయాలని వివరించాడు, రష్యా భవిష్యత్తుని గురించి ఒకటి, రెండు మాటలు చెప్పాడు, స్థానిక గవర్నర్లని యెలా అందుబాటులో వుంచాల్సిందీ చెప్పాడు. తనని కలుపుకునే కొన్ని పరిహాసమైన మాటలు అని, సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో తనకి "లె పాపులరైజ్ లె అయిడియా జు కాడాస్టర్"* బాధ్యతలని అప్పగించినట్టు జతచేశాడు. అతను కొంచెం వివరంగా సమస్యలని ఉదాసీనపూర్వక ఆత్మవిశ్వాసంతో పరిష్కరించడం గురించీ, అవి యెన్నో బంతులు అయినట్టుగా బరువైన పాలనా సంబంధమైన, రాజకీయ సంబంధమైన సమస్యలతో గారడీ చేస్తూ వున్నట్టూ మాట్లాడాడు. "నేనే ప్రభుత్వం అయితే అలా చేసి వుండేవాణ్ణి;" "తెలివైన వ్యక్తిగా మీరు నాతో ఏకభవిస్తారు" అనే లాంటి పదబంధాలు అతని నోట్లో నానుతూనే వుంటాయి. పాన్‌షిన్ మాటల ప్రవాహాన్ని లవ్రేత్‌స్కీ నిరుత్సాహంగా విన్నాడు. యీ స్ఫురద్రూపి అయిన, తెలివైన, చిరునవ్వు నవ్వుతూ వుండే సభ్యమైన యువకుడూ, మృదువైన అతని గొంతుకా, పరిశీలనగా చూసే అతని కళ్ళూ లవ్రేత్‌స్కీకి నచ్చలేదు. వెంటనే పట్టేసే పాన్‌షిన్, తను మాట్లాడుతూ వున్న వ్యక్తి తను చెప్పేదాంట్లో పెద్ద ఆసక్తి కనబర్చడం లేదని త్వరలోనే గ్రహించి యేదో సాకు చెప్పి బయటికి జారుకుని, లవ్రేత్‌స్కీ లెక్కల్లో మనిషైతే కావచ్చుకాని, అంత సరసుడుగాడనీ అతను "ఎగ్రీ, అన్ సామ్"** కొంచెం పరిహాసాస్పద వ్యక్తి అని మనసులో నిశ్చయించుకున్నాడు. మార్య దీమ్త్రియెవ్నా గెదెయొనోవ్‌స్కీ యిద్దరూ కలిసి వచ్చారు. తర్వాత మార్ఫ తిమొఫేయెవ్నా, లీజా వచ్చారు, తర్వాత పరివారం అంతా వచ్చారు. తర్వాత సంగీత ప్రియురాలైన మదాం బెలనీత్సినా వచ్చింది. చిన్న పిల్లల్లా ముచ్చటైన అలిసిపోయిన ముఖం, గరగరలాడే నల్లని గౌను, బరువైన బంగారు మురుగులు తొడుక్కుని, డాబుగా వుండే విసన కర్ర చేత్తో పట్టుకున్న సన్నని చిన్న మనిషి ఆవిడ. ఆమె భర్త కూడా అక్కడికి వచ్చాడు. గుండ్రని యెర్రని ముఖం, పెద్ద కాళ్ళూ చేతులూ, సొగసైన కనుబొమలు దళసరి పెదాలమీద స్థిరమైన చిరునవ్వు వున్న మనిషి అతను. అతని భార్య నలుగురిలోనూ అతన్నెప్పుడూ పలకరించదు, గాని యింటిదగ్గర, ఆర్ద్ర పూరితమైన ఘడియల్లో నా పిచ్చిమొద్దూ అని ముద్దుచేస్తుంది. పాన్‌షిన్ తిరిగివచ్చాడు. ఆ గదుల్లో గుంపులు చేరి, సరంభంగా వుంది. ఆ బాపతు మంద లవ్రేత్‌స్కీ అభిరుచికి

---

* "కాడాస్టర్ భావాలని ప్రచారం చెయ్యడంకోసం" (ఫ్రెంచి). 1830–1840లలో రష్యాలో యూరపియన్ దేశాలలో మాదిరీ భూపరిమాణాన్నిబట్టి పన్నులు వేయడం ప్రవేశపెట్టారు. (కాడాస్టర్ — భూపరిమాణం) — సం.

** కోపంగా వున్నాడు, చివరకి (ఫ్రెంచి).

సరిపడలేదు. అతనికి కళ్లద్దాల్లోనుంచి తన కేసే చూస్తూ వుండే బెలనీత్సినా మంట తెప్పించింది. లీజా కోసం కాకపోయినట్లయితే అతను వెంటనే వెళ్లిపోయి వుండే వాడే. ఆమెతోటి యేకాంతంగా ఓ ముక్క చెబుదామని అతను అనుకున్నాడు గాని చాలా సేపటి దాకా అతనికా అవకాశమే చిక్క లేదు, అంచేత ఆమెని కళ్లతోటి రహస్య ఆనందంతో అనుగమిస్తూ తృప్తిపడాల్సి వచ్చింది. ఆమె ముఖం అంత మధురంగా ఉన్నతంగా అంతకు ముందు యెన్నడూ అతనికి కనిపించలేదు. బెలనీత్సినా పక్కన ఆమె యింకా ప్రకాశిస్తోంది. బెలనీత్సినా అస్తమానూ కుర్చీలో కదులుతూనే వుంది, చిన్న సన్నటి భుజాలని యెగరేస్తూనే వుంది, ముంగిలా యికిలిస్తూనే వుంది, కాసేపు కళ్లు ముడుచుకోవడం, అప్పుడు హఠాత్తుగా మళ్లీ పెద్దవి చెయ్యడం చేస్తూనే వుంది. లీజా నిశ్చలంగా కూర్చుంది; ఆమె మనుషుల కేసి మామూలుగానే చూసింది, అసలు నవ్వనే లేదు. ఆతిథేయురాలు మార్ఫ తిమొఫేయెవ్నా తోటీ, బెలనీత్సిన్‌తోటీ, గెదెయొనోవ్‌స్కీతోటీ పేకాటకి కూర్చుంది. గెదెయొనోవ్‌స్కీ చాలా నెమ్మదిగా ఆడుతూ, అస్తమానూ తప్పులు చేస్తూ, కళ్లు చిట్లించుకుంటూ, ముఖాన్ని జేబురుమాలుతోటి వత్తుకుంటూనే వున్నాడు. పాన్‌షిన్ విచారవదనంతో వున్నాడు. పొడిగా, అర్థవంతమైన మబ్బు మాటలని అంటూ — ప్రపంచం యేమన్నా భంగపడ్డ మేధావిలాగా వున్నట్టు — వుండిపోయాడు. సిగ్గులేకుండా అతనితో సరసాలాడుతూ వున్న మదాం బెల నీత్సినా యెంత బతిమాలినా కూడా పాట పాడడానికి అతను యిష్టపడలేదు: లవ్రేత్‌స్కీ వుండటంవల్ల బంధితుడై పోయినట్టు అతను భావించాడు. ఫ్యోదొర్ ఇవానిచ్ కూడా తక్కువ మాట్లాడేడు. అతని వింత వాలకం లీజా అతన్ని చూడగానే కనిపెట్టింది. తనతో యేదో చెప్పాలని అతను అనుకుంటున్నాడని ఆమెకి అనిపించింది కాని, యెందుకనో ఆమెకి తెలియకుండానే, అడగడానికి భయపడింది. ఆఖరికి, ఆమె పక్క గదిలోకి కప్పుల్లో టీ పొయ్యడానికి వెడుతూ అనుకోకుండానే అతనికేసి చూసింది. అతను వెంటనే ఆమెని అనుసరించి అవతలికి వెళ్లాడు.

''ఏమిటి అలా వున్నారు?'' అందామె టీ పాత్రని సమొవార్‌మీద పెడుతూ.

''ఏం, మీ కెలా కనిపిస్తున్నట్టు?'' అని అతను అడిగాడు.

''మీరు నేనిది వరకు చూసిందానికంటే యేమిటో తేడాగా వున్నారు.''

లవ్రేత్‌స్కీ బల్లమీదకి వంగాడు.

''మీకు ఒక వార్త చెప్పాలని అనుకున్నాను. కాని యిప్పుడు అసాధ్యం. ఏమైనా యిక్కడ గుర్తుపెట్టిన యీ పేరాగ్రాపు చదవండి'' అన్నాడతను, తను తెచ్చిన వార్తాపత్రికని ఆమెకి అందిస్తూ. ''కాని దయచేసి యెక్కడా అనకండి. నేను రేపు ఉదయం వస్తాను.''

లీజాకి అంతా అయోమయంగా వుంది. కాని అప్పుడు పాన్‌షిన్ గుమ్మం దగ్గరికి వచ్చాడు. ఆమె పత్రికని జేబులో దాచేసుకుంది.

''మీరు ఆ పుస్తకం 'ఓబెర్‌మాన్' చదివారా, ఎలిజవేతా మిఖైలొవ్నా?'' అని యేదో ఆలోచిస్తూ అడిగాడు పాన్‌షిన్.

లీజా యేదో గొణిగి మేడమీదకి వెళ్లింది. ల్రవేత్‌స్కీ డ్రాయింగ్ రూంలోకి తిరిగి వచ్చి పేకాట బల్ల దగ్గరికి వెళ్లాడు. ముఖం యెర్రబడిపోయి, టోపీ తాళ్లు వూడిపోయి వేలా డుతూ వుంటే మార్ఫ తిమొఫేయెవ్నా తన జోడీ ఆటగాడు గెదెయొనోవ్‌స్కీని గురించి అతనితో ఫిర్యాదు చేసింది, గెదెయొనోవ్‌స్కీ యెందుకూ పనికిరాడని ఆమె అంది.

''పేకాడ ఆడ్డం చాడీలు చెప్పడం అంత సులభం కాదు'' అందామె.

చిన్నబుచ్చుకున్న అతను కళ్లు చికిలిస్తూ, ముఖం తుడుచుకుంటూనే వున్నాడు. లీజా వచ్చి ఓ మూల కూర్చుంది. ల్రవేత్‌స్కీ ఆమెకేసి చూశాడు, ఆమె ల్రవేత్‌స్కీకేసి చూసింది. యిద్దరూ కూడా భయభ్రాంతులైపోయారు. ఆమె ముఖంలో గందరగోళం, ఒకరకమైన నిగూఢ దూషణ అతనికి కనిపించాయి. అతను యెంత అనుకున్నా ఆమెతో మాట్లాడలేకపోయాడు. ఆమెతోబాటుగా అదే గదిలో మిగతా అతిథులతో కలిసి వుండటం అతనికి మరీ బాధనిపించింది, దాంతోటి వెళ్లిపోదామని నిశ్చయించుకున్నాడు. ఆమె దగ్గర సెలవు తీసుకుని వెళ్లిపోయేటప్పుడు, మర్నాడు వస్తానని మళ్లీ అనగలిగాడు, తను ఆమె స్నేహంమీద ఆధారపడ్డానని జతచేశాడు.

''రండి'' అందామె, ముఖంలో అదే అయోమయభావం కనిపిస్తూ వుండగా.

ల్రవేత్‌స్కీ వెళ్లిపోయాక పాన్‌షిన్‌కి హుషారు వచ్చింది. అతను గెదెయొనోవ్‌స్కీకి సలహా యివ్వడం మొదలుపెట్టాడు, మదాం బెలనీత్సినాకేసి కొంటెగా చూడ్డం మొదలు పెట్టాడు, ఆఖరికి పాట పాడాడు. కాని లీజాతోటి ముందరిలానే మాట్లాడి, చూశాడు — అర్థవంతంగా, విచారంగా.

ల్రవేత్‌స్కీ రాత్రంతా నిద్రపోలేదు. అతనికి విచారమూ లేదు. ఉద్రేకమూ లేదు — అతను శాంతంగా వూరికే వున్నాడు. అయినా అతను నిద్రపోలేకపోయాడు. గత స్మృతులు కూడా అతను స్మరించుకోలేదు. అతను వూరికే తన జీవితాన్ని దర్శించాడు. అతని గుండె భారంగా, లయబద్ధంగా కొట్టుకుంది. గంటలు గడిచిపోయాయి, అయినా నిద్రని గురించి అనుకోనే లేదు. వుండుండి ఒక ఆలోచన అతని మనసులో దూసుకుపోయింది. ''యిది నిజంగాదు, యిదంతా చెత్త'' — అప్పుడు మళ్లీ ఆగేవాడు, తలవంచి, మళ్లీ తన జీవితాన్ని సింహావలోకనం చేసుకునేవాడు.

## 29

మర్నాడు ఉదయం ల్రవేత్‌స్కీ వచ్చేటప్పటికి మార్య ద్మీత్రియెవ్నా అంత ఆదరంగా లేదు. ''అస్తమానూ వస్తున్నాడే'' అనుకొంది ఆవిడ. ఆమె అతన్ని గురించి అంతగా పట్టించుకోలేదు. పాన్‌షిన్ ముందు రోజు రాత్రి కపటంగా, నామమాత్రపు పొగడ్త మాట

అతన్ని గురించి అన్నాడు. ఆమెకి పాన్‌షిన్ అంటే గురిగా వుండింది. ఆమె వ్రేవేత్‌స్కీని అతిథిగా చూడకపోవడంచేతా, ఒక చుట్టంగా దాదాపు యింట్లో ఒకడిగా మర్యాద చెయ్యాల్సిన అవసరం గుర్తించకపోవడంచేతా, అరగంట వ్యవధిలోనే అతను తోటలో ఒక మూల లీజాతో నడుస్తూ వుండటం తటస్థించింది. వాళ్ళకి కొన్ని అడుగుల దూరంతోనే లేనొచ్కా, షూరొచ్కాలు పువ్వుల మళ్ళల్లో పరిగెడుతున్నారు.

లీజా మామూలుగానే తొణక్కుండా వుంది. కాని మామూలు కంటే యెక్కువగా పాలిపోయి వుంది. ఆమె చిన్నగా మడిచిన ఆ పత్రిక పేజీని జేబులోనుంచి తీసి వ్రేవేత్‌స్కీకి యిచ్చింది.

''దారుణం!'' అంది.

వ్రేవేత్‌స్కీ మాట్లాడలేదు.

''బహుశా యిది నిజం కాదేమో'' అందామె.

''అందుకనే దీన్ని గురించి యెక్కడా అనద్దని మిమ్మల్ని అడిగింది.''

లీజా కొంచెం నడిచింది.

''చెప్పండి'' అని మొదలుపెట్టింది ఆమె. ''మీరు బాధ పడలేదూ? కొంచెం కూడా?''

''నేను యే మనుకుంటున్నానో నాకే తెలీదు'' అన్నాడు వ్రేవేత్‌స్కీ.

''కాని యిదివరలో మీరు ఆమెని ప్రేమించారు. ప్రేమించలేదూ?''

''వూఁ!''

''చాలా యెక్కువగా?''

''ఆఁ!''

''మరి ఆవిడ చనిపోతే బాధ కలగడం లేదూ?''

''ఆమె నాకు సంబంధించి యిదివరకే చచ్చిపోయింది.''

''అలా అనడం పాపం. నామీద కోప్పడకండి. మీరు నన్ను మీ స్నేహితురాలంటారు. స్నేహితులు యేమేనా అనచ్చు. నాకు నిజంగా యిది దారుణంగా వుంది. నిన్న మీ ముఖం మీద కనిపించిన ఛాయ నాకు నచ్చలేదు.... అంతకు ముందు మీరు ఆవిడ గురించి నిష్ఠూరంగా మాట్లాడారు గుర్తుందా? బహుశా ఆమె అప్పటికే చచ్చిపోయి వుంటుంది. అది భయంకరంగా వుంది. యేదో మీకు శాస్తి జరిగినట్టుంది.''

వ్రేవేత్‌స్కీ కటువుగా చిరునవ్వు నవ్వాడు.

''మీరు అలా అనుకుంటారా? యేమైనా యిప్పుడు నేను విముక్తుణ్ణి.''

లీజా కొంచెం కదిలింది.

''దయచేసి అలా అనకండి. మీ స్వేచ్ఛ యిప్పుడు మీకు యేమి లాభం? మీరు యిప్పుడు దాన్ని గురించి అనుకోకూడదు, కాని క్షమ గురించి...''

''ఆమెని నేను యేనాడో క్షమించాను'' అని ల(వేత్‌స్కీ అడ్డం వచ్చాడు, నివారిస్తు న్నట్టు చెయ్యి తిప్పుతూ.

''వుహుం, అది కాదు'' అంది లీజా, ముఖం యెర్రబడి. ''నేను చెప్పింది సరిగా అర్థం చేసుకోలేదు మీరు. మీరు క్షమ అర్థించాలి.''

''ఎవర్నుంచి?''

''దేముడినుంచి. భగవంతుడు తప్ప మనల్ని యెవరు క్షమిస్తారు?''

ల(వేత్‌స్కీ ఆమె చేతిని లాక్కున్నాడు.

''ఆ, ఎలిజవేతా మిహైలొవ్నా, నన్ను నమ్మండి'' అన్నాడు. ''నాకు యిప్పటికి పడ్డ శిక్ష చాలు. నేను ప్రతిదానికీ ప్రాయశ్చిత్తం చేసుకున్నా ననుకుంటున్నాను, నమ్మండి.''

''ఆ విషయం గురించి మీరు నమ్మకంగా వుండలేరు'' లీజా లోగొంతుతో అంది. ''మీరు మరిచిపోయారు — మొన్నీ మధ్యనే, ఆమెని గురించి నాతో మాట్లాడేటప్పుడు, మీరు ఆమెని క్షమించడానికి సుముఖంగా లేరు.''

వాళ్లు నిశ్శబ్దంగా నడిచారు.

''మీ అమ్మాయి సంగతి యేమిటి?'' అని లీజా హఠాత్తుగా అడిగింది, ఆగుతూ.

ల(వేత్‌స్కీ చలించాడు.

''ఓ, దాన్ని గురించి యేం బాధపడకండి! నేను అన్ని వేపులకీ ఉత్తరాలు పంపించాను. మీరు పిలిచినట్టు.... మీరు అన్నట్టు.... మా అమ్మాయి భవిష్యత్తుకి యేర్పాట్లు జరి గాయి. యేం బాధపడకండి.''

లీజా విచారంగా నవ్వింది.

''కాని మీరు చెప్పింది నిజమే'' ల(వేత్‌స్కీ మళ్లీ అన్నాడు. ''నా స్వేచ్ఛ నాకేం ఉపయోగం? నాకేమిటి దానివల్ల లాభం?''

''ఆ వార్తాపత్రిక మీకు యెప్పుడు అందింది?'' అని అడిగింది లీజా, ల(వేత్‌స్కీ ప్రశ్నకి జవాబు చెప్పకుండా.

''మీరు వచ్చివెళ్లిన మర్నాడు.''

''అంటే మీరు.... మీరు యేడవను కూడా యేడవలేదా?''

''వుహుం. నిశ్చేష్టుణ్ణయిపోయాను; రావడానికి కన్నీళ్లు యేవి? గతం గురించి ఏడవడానికి, అంతా నా హృదయంనుంచి దగ్ధం అయిపోయాక? ఆమె దుర్ప్రవర్తన నా సంతోషాన్ని ధ్వంసం చెయ్యలేదు, అది యెన్నడూ లేదనే యిది చూపించింది. యేడవడానికి యేం వుంది? యేమో, యెవరికి తెలుసు? — యింకో రెండు వారాల ముందు యీ వార్త అంది వుంటే యెక్కువ విచారించేవాణ్ణేమో.''

''రెండు వారాల(కితమా?'' అని అడిగింది లీజా. ''యీ పదిహేను రోజుల్లోనూ యేం జరిగి వుంటుంది?''

ల్రవేత్స్కీ జవాబు చెప్పలేదు, లీజా హఠాత్తుగా యెర్రబడింది.

"ఆఁ, ఆఁ, మీరు వూహించారు" వున్నట్టుండి ల్రవేత్స్కీ అరిచాడు. "యీ రెండు వారాల్లోనూ స్వచ్ఛమైన స్త్రీ హృదయం విలువ నేను గుర్తించాను. నా గతం యింకా వెనక్కిపోయింది."

లీజాకి యిబ్బందిగా వుండింది. మెల్లిగా లేనొచ్కా, షూరొచ్కాలు ఆడుకుంటూ వున్న పువ్వుల మళ్ల దగ్గరికి వెళ్లింది.

"ఆ వార్తాపత్రిక మీకు చూపించినందుకు నాకు సంతోషంగా వుంది" అన్నాడు ల్రవేత్స్కీ ఆమెని అనుసరిస్తూ. "మీనుంచి యేదీ దాచుకోకుండా వుండే అలవాటు వచ్చింది నాకు, మీరు కూడా అదే నమ్మకం నేనంటే కలిగించుకుని బదులు తీర్చుకుంటారని ఆశ."

"అలా అనుకుంటున్నారా?" అని లీజా గొణిగింది, ఆగుతూ. "అలా అయితే నేను... వుహుఁ! అది అసాధ్యం!"

"ఏమిటది? చెప్పండి."

"నిజంగా, నేను అలా వుండాలని అనుకోను. సరే." అంది ఆమె ల్రవేత్స్కీకేసి తిరిగి చిరునవ్వు నవ్వుతూ. "అయినా సగం సగం నమ్మడంవల్ల లాభమేమిటి? యివాళ నాకో ఉత్తరం వచ్చింది."

"పాన్షిన్నుంచి కదూ?"

"అవును. మీకెలా తెలుసు?"

"పెళ్లి చేసుకొమ్మని అడిగాడు కదూ?"

"వూఁ" అంది లీజా, గంభీరంగా అతనికేసే చూస్తూ.

ల్రవేత్స్కీ తనూ లీజాకేసి గంభీరంగా చూశాడు.

"సరే, మరి జవాబేం చెప్పారు?" అని బయటపడ్డాడు ల్రవేత్స్కీ.

"యేం చెప్పాలో తోచలేదు" అంది లీజా, మడుచుకున్న చేతుల్ని జారవిడుస్తూ.

"అతనంటే మీకు ప్రేమే కదా?"

"అవును, అతనంటే నాకు యిష్టమే. అతను మంచివాడు లాగానే కనిపిస్తాడు."

"మీరు యిదే విషయాన్ని యిదే మాటల్లో మూడు రోజుల కితం చెప్పారు. నేనడిగేది, మీరు అతన్ని తీవ్రమైన కాంక్షతోటి, మనం ప్రేమ అని పిలిచేటట్టుగా, ప్రేమిస్తున్నారా అని."

"దాన్ని మీరు అనుకుంటున్న అర్థంలో – లేదు."

"మీరు అతన్ని ప్రేమించడం లేదా?"

"లేదు. కాని అది అవసరమా?"

"ఏమిటీ!"

''అమ్మకి అతను నచ్చాడు. అతను మంచి మనసు వున్నవాడు. అతనిలో కాని విషయ మేదీ నాకు కనిపించలేదు'' అంది ఆమె.

''అయినా మీరు తటపటాయిస్తున్నారు.''

''అవును.... బహుశా — మీవల్ల, మీరు చెప్పిందానివల్ల. మొన్న యేం అన్నారో మీకు గుర్తుందా? కాని యిది బలహీనత....''

''అయ్యో, పిల్లా!'' అని లవ్రేత్‌స్కీ అరిచాడు. అతని గొంతుక వణికింది. ''మరీ అమాయికంగా వుండకండి. నిజంగా మీ హృదయ కాంక్ష అయిన దాన్ని బలహీనత అన కండి, హృదయం ప్రేమ లేకుండా అర్పితం కాదు. మీరు ప్రేమించని వాడికి, మీరు చెందా లని కోరుకునే వ్యక్తికి సంబంధించి అంతటి బాధ్యత మీపైన మోపుకోకండి.''

''నన్ను యేం చెయ్యమని అడిగితే అది చేస్తాను. నామీద నేను యేదీ మోపుకోను'' అంది లీజా.

''మీ హృదయం యేది చెబితే అది చెయ్యండి. అది ఒక్కటే నిజం చెబుతుంది'' అన్నాడు లవ్రేత్‌స్కీ. ''అనుభవం, హేతుబద్ధత — అదంతా కూడా మట్టీ మశానం, శుద్ధ దంభం! అత్యుత్తమమైన, యీ ప్రపంచం అందిచ్చే ఒకేఒక్క ఆనందాన్ని తొలగదోసుకో వద్దు.''

''ఆ మాట మీరు అంటున్నారా ఫ్యోదొర్ ఇవానిచ్? మీరే ప్రేమ కోసం పెళ్లి చేసుకు న్నారు — మరి మీరు ఆనందంగా వున్నారా?''

లవ్రేత్‌స్కీ చేతులు పైకి విసిరాడు.

''ఓ, నా సంగతి మాట్లాడవద్దు! అమాయకంగా, అన్యాయంగా పెంచిన పసివాడు ప్రేమని యెంత అపార్థం చేసుకోగలడో మీకు అర్థం కాదు! అయినా నేను నాకే యెందుకు అన్యాయం చేసుకోవాలి? నేను యిప్పుడే మీకు చెప్పాను, ఆనందం అంటే యేమిటో నాకు తెలియదని. కాని అది నిజం కాదు! నేను ఆనందంగానే వున్నాను!''

''నేను అనుకోవడం, ఫ్యోదొర్ ఇవానిచ్'' అంది లీజా లోగొంతుకతో (ఎవళ్లు చెప్పిం దాంతోనేనా తను ఒప్పుకోకపోతే గొంతు తగ్గించడం ఆమె అలవాటు; అదీగాక ఆమె ఉద్రే కంతో నలిగి పోతోంది) ''భూమ్మీద ఆనందం అనేది మనమీద ఆధారపడి వుండదు అని.''

''కాని మనమీదే ఆధారపడుతుంది, నిజం, మనమీదే ఆధారపడి వుంటుంది'' (అతను ఆమె రెండు చేతుల్నీ తన చేతుల్లోకి లాక్కున్నాడు; లీజా పాలిపోయి అతనికేసి దాదాపు భయ కంపితురాలై, అయినా చేతులు వెనక్కి లాక్కోకుండా, చూసింది) — ''మన జీవితాన్ని మనమే నాశనం చేసుకోకపోతే. కొందరికి ప్రేమ వివాహం దురదృష్టం కావచ్చు. కాని మీకు కాదు, నిబ్బరమైన మనిషి మీరు, స్వచ్ఛమైన హృదయం మీది! మిమ్మల్ని అర్థిస్తు న్నాను, ప్రేమ లేకుండా పెళ్లి చేసుకోవద్దు, యేదో కర్తవ్యం కోసం, ఆత్మార్పణ కోసం,

లేకపోతే అలాంటి దేదేనా కానీ, వద్దు. విశ్వాసం లేకపోవడం కంటే యిది మెరుగ్గాదు, అవసరార్థం పెళ్లి చేసుకోవడం అవుతుంది, అంత కంటే అధ్వాన్నం కూడానూ. నన్ను నమ్మండి — అలా అనే హక్కు నాకు వుంది: ఆ హక్కు కోసం యెంత మూల్యం చెల్లించాను. మీ దేముడు గనక....''

లేనొచ్కా, ఘూరొచ్కాలు లీజా దగ్గర నుంచుని అతనికేసి నోరు వెళ్లబెట్టి ఆశ్చర్యంతో చూస్తున్నారని అప్పటికి లవ్రేత్స్కీకి చటుక్కున స్ఫురించింది. లీజా చేతులు వదిలేసాడు, గబగబ యిలా అంటూ: ''క్షమించండి,'' అని యింటికేసి తిరిగాడు.

''ఒక్క విషయమే మిమ్మల్ని అడుగుతాను'' అన్నాడు, మళ్లీ తిరిగివస్తూ. ''త్వరపడి నిర్ణయానికి రాకండి. కొంచెం ఆగండి. నేనేం చెప్పిందీ ఆలోచించండి. మీరు నన్ను నమ్మకపోయినా, మీరేదో అవసరార్థం పెళ్లి చేసుకుంటే కూడా — మీరు పాన్‌షిన్‌ని పెళ్లి చేసుకోకూడదు — అతను మీకు భర్తకాలేడు. తొందరపడను అని వాగ్దానం చెయ్యండి, చేస్తారా?''

లీజా లవ్రేత్స్కీకి బదులు చెపుదామనుకుంది, కాని ఒక్క మాట అనలేకపోయింది — ''తొందరపడతాను'' అని నిర్ణయించుకుందని కాదు, కాని ఆమె గుండె అంత దడదడ కొట్టుకుంటూ, భయ సదృశమైన అనుభూతి ఆమె కంఠాన్ని రుద్ధం చేసింది.

## 30

కలీతిన్ల యింట్లోనుంచి వెళ్లిపోతూవుంటే లవ్రేత్స్కీకి పాన్‌షిన్ యెదురుపడ్డాడు. యిద్దరూ ముక్తసరిగా ఒకళ్ల కొకళ్లు వందనం చేసుకున్నారు. లవ్రేత్స్కీ తన బసకి వెళ్లి తలుపు వేసుకున్నాడు. అతను అంతకు ముందెన్నడూ లేని ఉద్రేకపు తీవ్రతలో వున్నాడు. అతను ''ప్రశాంతమైకం''లో వున్నది చాలా కాలం కితమా? తనే అనుకున్నట్టు అడుగుకు చేరింది చాలా కాలం కితమా? అతని స్థితిని యేది మార్చేసింది? అతన్ని పై అంచులకి యేది తీసుకువచ్చింది? అతి సామాన్యమైన, తప్పించుకోలేని, అయినా అస్తమానూ వూహించని హఠాత్సంఘటన అయిన — మృత్యువా? అవును; కాని అతను లీజా పాన్‌షిన్‌కి యేం సమాధానం చెపుతుందా అని ఆలోచిస్తున్నట్టుగా తన భార్య చావుని గురించి గాని, తన స్వేచ్ఛని గురించి గాని ఆలోచించడం లేదు. గత మూడు రోజుల్లోనూ ఆమెను భిన్న పార్శ్వాల నుంచి పరికిస్తున్నట్టు అతనికి అనిపించింది. యింటికి తిరిగివచ్చాక, ఆ నిశీధి నిశ్శబ్దంలో ఆమెని గురించి ఆలోచిస్తూ తనకి తనే ''అయివుంటేనా!...'' అని అనుకొన్న మాటలు గుర్తుకు వచ్చాయి. ఆ ''అయివుంటేనా'' అన్నది, గతానికి అన్వయించుకున్న మాట, యిక అందుకోలేనిది, యిప్పుడు జరుగుతుంది, తను అనుకున్న రీతిలో కాకపోయినా — కాని తన

స్వేచ్ఛే సర్వమూ కాదు. ''ఆమె తల్లి మాట వింటుంది'' అనుకున్నాడతను. ''పాన్‌షిన్‌ని పెళ్ళి చేసుకుంటుంది. ఒక వేళ ఆమె అతన్ని కాదన్నా, దానివల్ల నాకేం ఒరుగుతుంది?'' అద్దం వారనుంచే వెడుతూ అతను తన ముఖం చూసుకుని భుజాలు యెగరేశాడు.

అలాంటి ఆలోచనలతోనే ఆ రోజు వేగంగా గడిచిపోయింది. సాయంత్రం అయింది. లవ్రేత్‌స్కీ కలీతిన్ల యింటికి వెళ్ళాడు. అతను గబగబా నడిచాడు కాని యింటి దగ్గర కొచ్చేటప్పటికి వేగం తగ్గించాడు. పాన్‌షిన్ నాలుగు చక్రాల పెట్టెబండి బయట వుంది. ''పోనీ'' అనుకున్నాడు లవ్రేత్‌స్కీ. ''నేను స్వార్థపరుణ్ణి కాకూడదు.'' యింట్లోకి వెళ్ళాడు. లోపల యెవరూ కనిపించలేదు. డ్రాయింగ్ రూంలో అలికిడి లేదు. తలుపు తీసి చూశాడు. మార్య దీమ్త్రియెవ్నా పాన్‌షిన్‌తోటి పేకాట ఆడుతోంది. పాన్‌షిన్ నిశ్శబ్దంగా అతనికి వందనం చేశాడు, యజమానురాలు ''ఓ! అనుకొనే లేదు!'' అని, కొంచెం కనుబొమలు ముడిచింది. లవ్రేత్‌స్కీ ఆమె పక్కన కూర్చుని, ఆమె పేకకేసి చూశాడు.

''మీరు ఆడతారా?'' అందామె చిరాకు పైకి కనపడకుండా వుండాలని, వెంటనే తను తప్పు ఆడానని అంది.

పాన్‌షిన్ తొంభై లెక్కపెట్టి మెల్లిగా, మర్యాదగా, హుందా అయిన భంగిమలో పాయింట్లు తీసుకోవడం మొదలుపెట్టాడు. దౌత్య వేత్తలు అలా ఆడతారేమో, బహుశా సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో తన స్థిరత్వం, ప్రజ్ఞలతోటి పై అధికారుల మెప్పు కోసం అతను అలా ఆడాడేమో. ''నూట ఒకటి, నూట రెండు, అరకు, నూట మూడు,'' అని అతను తూచితూచి మాటలు అన్నాడు. అవి ప్రసన్నంగా ధ్వనిస్తున్నట్టో, నిందాత్మకంగా ధ్వనిస్తున్నట్టో లవ్రేత్‌స్కీ తేల్చుకోలేకపోయాడు.

''మార్ఫ తిమొఫేయెవ్నాని చూడచ్చా?'' అన్నాడతను, పాన్‌షిన్ యింకా దర్జాగా తిరిగి కార్డులు కలపబోతూ వుంటే. అతనిలో కళాకారుడి అంశ యేమీ యిప్పుడు మిగల్లేదు.

''ఆఁ! ఆమె మేడమీద గదిలో వున్నట్టుంది. చూడండి'' అంది మార్య దీమ్త్రియెవ్నా.

లవ్రేత్‌స్కీ మేడమీదకి వెళ్ళాడు. మార్ఫ తిమొఫేయెవ్నా కూడా పేకాటలోనే వుంది. ఆమె నస్తాస్య కార్పొవ్నాతోటి గాడిద ఆట* ఆడుతోంది. రోస్కా అతన్ని చూసి మొరిగింది. కాని ఆ ముసలమ్మలిద్దరికీ అతన్ని చూడ్డం సంతోషం కలిగించింది. మార్ఫ తిమొఫేయెవ్నా ముఖ్యంగా హుషారుగా వున్నట్టు కనిపించింది.

''ఓ ఫేద్యా! రా, రా!'' అందామె. ''కూర్చో, నాయనా. యిదిగో అయిపోయింది యీ ఒక్క ఆటానూ. కొంచెం జామ్ తింటావా? షూరొచ్కా, ఆ జామ్ సీసా పట్రా. ఏం

---

* చేతిలో ముక్కలేమీ లేకుండా అన్నీ కింద పారెయ్యగలిగి వుండాలి. అలా కాకుండా చేతిలో ముక్కలు మిగిలినవాళ్ళు గాడిద అవుతారన్నమాట. — అను.

వద్దా? సరే, పోన్లే. అలానే కూర్చో. కాని సిగరెట్టు కాల్చకు. ఆ వెధవ పొగ నాకు వికారంగా వుంటుంది, మ్యాత్రోస్‌కి తుమ్ములు వస్తాయి.''

తనకి సిగరెట్టు కాల్చే కోరికలేదని ల్యవేత్‌స్కీ ఆమెకి భరోసా యిచ్చాడు.

''కిందకి వెళ్లావా?'' ఆ ముసలావిడ అడిగింది. ''ఎవరున్నారక్కడ? పాన్‌షిన్ అక్కడే వేలాడుతున్నాడా? లీజా కనిపించిందా? లేదూ? యిక్కడికి వస్తానందే. అదుగో రానే వచ్చింది — వెయ్యేళ్లాయుస్సు!''

లీజా గదిలోకి వచ్చి ల్యవేత్‌స్కీని చూసి సిగ్గుపడింది.

''వూరికే ఓ క్షణం చూసిపోదామని వచ్చాను, మామ్మా'' అందామె.

''ఓ క్షణం?'' అందా ముసలావిడ. ''యీ కుర్రకారుకి బొత్తిగా నిలకడలేదు! మనకో అతిధి వచ్చాడు, కనిపించడం లేదూ? కూర్చుని కాసేపు అతన్ని పలకరించి ఆ కబురూ యీ కబురూ చెప్పు.''

లీజా కుర్చీ అంచున కూర్చుని ల్యవేత్‌స్కీకేసి చూసింది. పాన్‌షిన్‌తోటి తన సంభాషణ పర్యవసానం చెపుదా మనుకొంది. కాని యెలా చెప్పాలి? వెంటనే మోటుగా, సిగ్గుగా అనిపించింది. అతన్ని తనేం చాలా కాలంగా యెరగదు, యెప్పుడో గాని చర్చికి వెళ్లని యీ మనిషికి, భార్య మృత్యువు వార్తని కలత పడకుండా విన్న మనిషికి, తను తన రహస్యాలని చెప్పుకుంటోంది. తనంటే అతను ఆసక్తి కనబరుస్తున్న మాట నిజమే. తనే అతన్ని నమ్మి అతనికి దగ్గరగా వచ్చింది. అయినా కాని ఆమె సిగ్గుపడింది, పరాయి వాడెవడో తన పరిశుద్ధ అభ్యంతరమందిరంలోకి అడుగెట్టినట్టు. మార్ఫ తిమొఫేయెవ్నా ఆదుకొంది.

''నువ్వు మాటా పలుకూ ఆడకపోతే, పాపం యెవరాడతారే? నేను అతని కంటే చాలా పెద్దదాన్ని, అతను నా కంటే బాగా తెలివైనవాడు. నస్తాస్య కార్పొవ్నాకి అతను చాలా పెద్దవాడు. దానికి పడుచు కుర్రాళ్లు కావాలి'' అందామె.

''అతనికి ఉబుసుపోవడానికి నేనేం చెయ్యను?'' అంది లీజా. ''అతని కిష్టమైతే కాసేపు పియానో వాయిస్తాను'' అంది యెటూ తోచక.

''సెభాష్; అదీ తెలివైన పిల్ల'' అంది మార్ఫ తిమొఫేయెవ్నా. ''వెళ్లండమ్మా కిందకి వెళ్లండి. అయిపోయాక, మళ్లీ రండి. నా పని అయిపోయింది. నేను గాడిదనయ్యాను. సిగ్గు. కసి తీర్చుకోవాలి.''

లీజా లేచినుంచుంది. ల్యవేత్‌స్కీ ఆమె వెనక్కాలే బయటికి వెళ్లాడు. కొన్ని మెట్లు దిగాక, లీజా ఒక్క పాటున ఆగింది.

''మనిషి మనసు యెన్నో వైరుధ్యాలతో వుంటుందని సరిగ్గానే అన్నారు. మీ అనుభవం నాకు భయం కలిగించి వుండాల్సింది. ప్రేమ వివాహం పట్ల అపనమ్మకం వచ్చి వుండాల్సింది, కాని నేను....''

''అతను అడిగిన దాన్ని కాదన్నారా?'' అడ్డం వచ్చాడు ల్రవేత్స్కీ.

''వుహుం! కాని ఒప్పుకోనూ లేదుగా. నేను అతనికి అన్నీ చెప్పాను. నేననుకున్న దంతా చెప్పాను. ఆగమని అడిగాను. ఏం, చాలా అది మీకు?'' అందామె వేగంగా చిరునవ్వు నవ్వుతూ. గ్రాదిని తేలికగా తాకుతూ, ఆమె మెట్లు దిగి తటాల్న వెళ్ళిపోయింది.

పియానో తెరుస్తూ ''యేం వాయించమంటారు?'' అని అడిగింది.

''మీ యిష్టం'' అన్నాడు ల్రవేత్స్కీ, ఆమెకేసి చూడ్డానికి వుంటుందని, కూర్చుంటూ.

లీజా వాయించడం మొదలుపెట్టింది. చాలా సేపు వేళ్ళమీదనుంచి దృష్టి తిప్పుకో లేదు. ఆఖరికి ఆమె ల్రవేత్స్కీకేసి తిరిగి, వాయించడం ఆపు చేసింది — అతని ముఖం యెంతో వింతగా, చిత్రంగా కనిపించింది.

''ఏమయింది మీకు?'' అని ఆమె అడిగింది.

''ఏమీ లేదు'' అన్నాడతను. ''నాకు చాలా సంతోషంగా వుంది. మీ కోసం ఆనందంగా వుంది. మిమ్మల్ని చూస్తే ఆనందంగా వుంది. — వూ, కానీండి.''

కొంచెం సేపాగి ఆమె మళ్లీ మొదలుపెట్టింది. ''నాకనిపిస్తోంది అతను నన్ను నిజంగా ప్రేమించే వుంటే ఆ ఉత్తరం రాసి వుండేవాడు కాదు. నేను అతనికి యిప్పుడు జవాబివ్వగలగ లేనని అతనికి అనిపించి వుండాలి'' అంది.

''అది ముఖ్యం కాదు'' అన్నాడు ల్రవేత్స్కీ. ''ముఖ్యమైంది మీరు అతన్ని ప్రేమించడం లేదు అన్నది.''

''లేదూ? మీరలా యెలా అనగలరు? చచ్చిపోయిన మీ ఆవిడని గురించి అనుకుం టాను, అది నాకు భయం కలిగిస్తుంది.''

''వాల్దెమార్, మా లిజ్జీ చక్కగా వాయిస్తుంది కదూ, యేమంటావ్?'' అని మార్య దీమ్రితియెవ్నా పాన్షిన్‌తోటి అంటోంది.

''అవును, నిజంగా చాలా బాగా వాయిస్తుంది'' అన్నాడు పాన్షిన్.

మార్య దీమ్రితియెవ్నా అతనికేసి మృదువుగా చూసింది. అతను యింకా గొప్పగా కని పించేటట్టు, యెందులోనో లగ్నమై పోయినట్టు వాలకం పెట్టి పద్నాలుగు రాజులు అన్నాడు.

## 31

ల్రవేత్స్కీ పడుచువాడేమీ కాదు; లీజా తనలో ఉత్తేజితం చేసిన అనుభూతికి సంబం ధించి యెక్కువ కాలం తనని మోసగించుకోలేదు. ఆమెని తను ప్రేమిస్తున్నట్టు ఆ రోజున కచ్చితంగా గుర్తించాడు. అలా కనిపెట్టిన దానితోటి అతను యేమీ పొంగిపోలేదు. ''ముప్పై అయిదేళ్ల వయసులో, మళ్లీ ఆడదానికే మనసు అర్పించుకునే దానికంటే వేరే యింకేమీ

చెయ్యలేనూ నేను?'' అనుకున్నాడు. ''కాని లీజా ఆమె లాంటిది కాదు. యీామె అవమాన కరమైన త్యాగాలని అపేక్షించదు. యీామె నన్ను నా చదువునుంచి మళ్లించదు. ఆమే నన్ను కష్టభరితమైన, నిజాయితీ పూర్వకమైన శ్రమకి నన్ను ఉత్తేజితుణ్ణి చేస్తుంది. మేమిద్దరం చేతిలో చెయ్యి వేసుకుని ఉన్నత ఆదర్శాల వేపు వెడతాం. అవును'' అని తన ఆలోచనలని ముగించాడు, ''అదంతా బాగానే వుంది. కాని చిక్కల్లా ఆమెకి నాతో వచ్చే కోరిక పిసరు కూడా లేదు. నేను తనని భయభరితురాల్ని చేస్తున్నానని ఆమె అనలేదూ? కాని ఆమె పాన్‌షిన్‌ని కూడా ప్రేమించడం లేదు. అదో రకం తృప్తి!''

లవ్రేత్‌స్కీ వసీల్యెవ్‌స్కాయెకి తిరిగివెళ్లాడు; కాని అక్కడ నాలుగు రోజుల కంటే యెక్కువ వుండలేకపోయాడు. అది అతనికి అంత విసుగనిపించింది. ఏమైనా అతను ఒక డోలాయమాన స్థితిలో వున్నాడు. శ్రీమాన్ జూల్స్‌గారు ప్రకటించిన వార్తకి యితర సాక్ష్యం కావాలి. మరి అతనికి యింకా ఉత్తరాలేమీ అందలేదు. అతను మళ్లీ పట్టణానికి వచ్చి ఆ సాయంత్రం కలీతిన్ల యింటి దగ్గర గడిపాడు. మార్య ద్మీత్రియెవ్నా తనని నిరాదరంగా చూస్తున్నదని కనిపెట్టడం పెద్ద కష్టం కాలేదు. కాని పేకాటలో ఆమెకి పదిహేను రూబుళ్లు ఓడిపోయి ఆమెని ప్రసన్నం చేసుకోగలిగాడు. ''కి అ ం సి గ్రాం రిడి క్యూల్''* అలాంటి వ్యక్తితోటి చనువుగా వుండద్దని తల్లి తొలి రోజు సాయంత్రం కేక లేసినా, లీజా అతనితోటి యేకాంతంగా దాదాపు అరగంట గడిపింది. అతనికి ఆమెలో మార్పు కనిపించింది. ఆమె కొంచెం యెక్కువ ఆలోచనా మగ్నం అయినట్లుంది. అతను కనిపించ కుండా వున్నందుకు ఆమె అతన్ని నిష్ఠూరమాడి, ఆ మర్నాడు ప్రార్థనకి (ఆ మర్నాడు ఆదివారం) వస్తాడేమో అడిగింది.

''తప్పక రండి'' అందామె అతను జవాబిచ్చే లోపునే. ''మనం యిద్దరం కలిసి ఆమె ఆత్మశాంతికి ప్రార్థన చేద్దాం.'' అప్పుడామె తనకి యేం చెయాల్సిందీ తోచటం లేదని — అంటే తన నిర్ణయం యే మాటా చెప్పకుండా పాన్‌షిన్‌ని అలా వుంచాలా యెక్కువ కాలం, అని అంది.

''ఎందుకు?'' లవ్రేత్‌స్కీ అడిగాడు.

''ఎందుకంటే ఆ నిర్ణయం యేమై వుండేదీ నాకిప్పుడు అనిపిస్తోంది'' అంది.

తల నొప్పిగా వుందని అని, సందేహంగా తన వేళ్లకొనలని లవ్రేత్‌స్కీకి అందించి, మేడమీద తన గదిలోకి వెళ్లింది.

ఆ మర్నాడు లవ్రేత్‌స్కీ ప్రార్థనకి వెళ్లాడు. అతను వచ్చేటప్పటికే లీజా చర్చిలో వుంది. తల అతనికేసి తిప్పకపోయినా అతన్ని గమనించింది. ఆమె తదేక దీక్షగా ప్రార్థన

---

* ''అందరిలోనూ నగుబాటు అయిన'' (ఫ్రెంచి).

చేసింది, ఆమె కళ్లల్లో మృదువైన తేజస్సు ప్రకాశించింది, మెల్లిగా ఆమె వంగి, తల పైకెత్తింది. ఆమె తన కోసం కూడా ప్రార్థన చేస్తున్నట్టు అతనికి అనిపించింది. అతని హృదయం మధురంగా కంపించింది. అతను ఒక్క క్షణంలోనే సంతోషంగానూ, పశ్చాత్తాపంగానూ కూడా అనుభూతి చెందాడు. నిశ్చలంగా చుట్టూ నుంచున్న మనుషులు, పరిచయమైన ముఖాలూ, పవిత్రమైన ప్రార్థనా గీతపు ఆలాపన, అగరు వత్తుల పరిమళ ధూపం, కిటికీలమీద ఏటవాలుగా పడే కిరణాలూ, గోడలని కమ్మిన మసక, యెత్తైన కప్పూ అన్నీ అతని హృదయంతో సంభాషించాయి. అతను చర్చికి వెళ్లి, దేవుడి సాయం అర్థించి చాలా కాలమైంది. యిప్పుడు కూడా అతను ప్రార్థనకి సంబంధించిన మాటలనేమీ అనలేదు — అలా అని మాటలు లేకుండానూ ప్రార్థించలేదు — కాని, ఒక క్షణం సేపు, శరీరంతో కాకపోయినా, మనస్ఫూర్తిగా వినయపూర్వకమైన అంజలి ఘటిస్తూ నేలమీద సాష్టాంగ పడ్డాడు. చిన్నతనంలో, నుదుటిమీద చల్లని స్పర్శ తగిలేటట్టు యెంతో సేపు చర్చిలో ప్రార్థన చెయ్యడం అతనికి గుర్తుకు వచ్చింది. కరుణామయురాలైన దేవత అందుకుని తనమీద కృప అనుగ్రహించినట్టు తను భావించుకోవడం గుర్తుకు వచ్చింది. అతను లీజాకేసి చూశాడు. "మీరే నన్ను యిక్కడికి తీసుకువచ్చారు. నన్ను తాకండి, నా మనసుని తాకండి" అనుకున్నాడతను. ఆమె యింకా మెల్లిగా ప్రార్థన చేస్తోంది. ఆమె వదనం ఆనందంతో నిండిపోయినట్టు అతనికి కనిపించింది. అతని హృదయం కనికరంతోటి నిండిపోయింది. అతను మరొక ఆత్మకి శాంతి కలగాలనీ, తనకి క్షమార్పణ లభించాలనీ ప్రార్థించాడు.

వాళ్లు ద్వారం బయట కలుసుకున్నారు. ఆమె అతన్ని ప్రకాశమానమైన, కరుణ పూరిత గాంభీర్యం వున్న చూపులతో పలకరించింది. ఎండ చర్చి ఆవరణలోని గరికనీ, ఆడవాళ్ల ఉల్లాస భరితమైన బట్టలనీ, రుమాళ్లనీ శోభింపచేస్తోంది. చుట్టు పక్కల చర్చిల గంటలు గాలిలో గింగుర్లెత్తుతున్నాయి. కంచెలమీద పిచికలు కిచకిచ లాడుతున్నాయి. ల్రవేత్స్కీ టోపీ లేకుండా, నవ్వుతూ నుంచున్నాడు. సన్నని తెమ్మెర అతని ముంగురుల్నీ, లీజా టోపీ కుచ్చుల్నీ వూపుతోంది. లీజానీ, లేనొచ్కానీ బండిలోకి యెక్కించి, దగ్గరున్న డబ్బంతా బీదలకి యిచ్చేసి, నెమ్మదిగా యింటి దారిపట్టాడు.

## 32

ఫ్యోదొర్ ఇవానిచ్‌కి కష్టకాలం వచ్చింది. అతను ఉద్రిక్తభరిత అనుమాన స్థితిలోనే నిరంతరం వుండేవాడు. ప్రతిరోజూ ఉదయం పోస్టాఫీసుకి వెళ్లడం, అసహనంగా ఉత్తరాలనీ, కవర్లనీ చింపడం. కాని దారుణమైన ఆ వార్తని అవునని గానీ, కాదని గానీ చెప్పేదేమీ అందులో లేకపోవడం. ఒకో అప్పుడు తనమీద తనకే చిరాకు కలిగేది. "యిక్కడ నేను

రక్తంకోసం కాసుకూర్చున్న రాబందులాగా, నా భార్య చావు వార్త నిజమా అబద్ధమా అని తెలుసుకోవడం కోసం వున్నాను!'' అనుకున్నాడు. ప్రతిరోజూ కలీతిన్ల యింటికి వెళ్లేవాడు. అక్కడ కూడా సౌకర్యంగా అనిపించలేదు. యజమానురాలు అతన్ని చూసి చిరచిరలాడుతూనే వుండేది. అతనికి యేదో అనుగ్రహం చూపిస్తున్నట్టే వుండేది. పాన్‌షిన్ అతనికి అతి మర్యాద చూపించేవాడు. లెమ్ ఒక రకమైన అయిష్టతని ప్రదర్శించేవాడు, సరిగ్గా అతన్ని చూసి తల పంకించేవాడు కూడా కాదు. అన్నిటికంటే దారుణం — లీజా అతన్ని తప్పించుకుంటున్నట్టు వుండటం. అతనితో యేకాంతంగా వున్నప్పుడు ఆమె అంతా తికమక పడిపోయినట్లు వుండేది, అంతకు ముందు లాగా యెంతో విశ్వాసపాత్రంగా వుండే స్థితి పోయింది. ఆమె మాటల కోసం తడుముకుంటున్నట్టు వుండేది. అతను కూడా యిబ్బంది పడ్డాడు. కొద్ది రోజుల వ్యవధిలో లీజా గుర్తు పట్టలేనట్టుగా మారిపోయింది. ఒక రకమైన నిగూఢ ఆందోళన, కదలికల్లో, గొంతుకలో, నవ్వులోనే అంతకు ముందులేని తొట్రుపాటు వచ్చాయి. యెప్పటి లాగానే మార్య దీమ్రితియెవ్నా తనలో తాను ముడుచుకుపోయి యేమీ అనుమానించలేదు. కాని మార్ఫ తిమొఫేయెవ్నా తన అభిమానపాత్రురాలిపైన ఒక కన్ను వేసివుంచింది. లీజాకి ఆ వార్తాపత్రిక చూపించినందుకు చాలా సార్లు లవ్రేత్‌స్కీ నొచ్చుకున్నాడు. స్వచ్ఛమైన తత్వానికి అతనున్న మానసిక స్థితిలో యేదో గాయపరచేది వుంది అనే స్పృహ కలిగించుకోకుండా వుండలేకపోయాడు. లీజాలో మార్పుకి కారణం ఆమె అంతరంగిక క్షోభ అనీ, పాన్‌షిన్‌కి యేం జవాబు చెప్పాలా అనీ అతను అనుకున్నాడు. ఒక సారి ఆమె అతనికి వాల్టర్ స్కాట్ నవలని తీసుకొచ్చింది. దాన్ని యిమ్మని ఆమే అడిగింది.

''చదివారా?'' అని అడిగాడతను.

''వుహుం. చదవ బుద్ధి పుట్టడం లేదు'' అందామె, వెళ్లిపోబోతూ.

''ఓ క్షణం ఆగండి. చాలా కాలంగా మిమ్మల్ని ఒంటరిగా కలుసుకోలేదు. నేనంటే మీరు భయపడుతున్నా రనుకుంటారెవరైనా.''

''భయమే.''

''బాప్‌రే! ఎందుకు?''

''నాకు తెలీదు.''

లవ్రేత్‌స్కీ మాట్లాడలేదు.

''చెప్పండి'' అని మొదలుపెట్టాడు. ''నిర్ణయించుకున్నారా?''

''ఏమిటి మీ ఉద్దేశం'' అందామె, కళ్లు నేలమీదకి వాలుస్తూ.

''మీకు తెలుసు నా ఉద్దేశమేమిటో.''

ఉన్నట్టుండి లీజా సిగ్గుపడింది.

''నన్నేం అడక్కండి'' అని గబగబా అంది. ''నాకేమీ తెలీదు. నన్ను నేనే ఎరగను.''

ఆమె వెళ్లిపోయింది.

మర్నాడు ల్రవేత్స్కీ కలీతిన్ల యింటికి మధ్యాహ్నం భోజనాల తర్వాత వచ్చాడు. సాయంకాలపు ప్రార్థనకి యేర్పాట్లు జరుగుతున్నాయి. భోజనాల గదిలో ఓ మూల, నలుచదరం మేజామీద శుభ్రమైన బట్ట కప్పి వుంది. దానిమీద బంగారు పూత చట్రాల్లో చిన్న దేవతల విగ్రహాలు వున్నాయి. వాటికి మెరుగు మాసిన నగలూ, పరివేషమూ వున్నాయి. అవి గోడకు ఆన్చివున్నాయి. కచిక రంగు ఫ్రాక్ కోటూ, బూట్లూ తొడుక్కున్న ముసలి సేవకుడొకడు మెల్లిగా, నిశ్శబ్దంగా గదిలోకి నడిచి వచ్చి, విగ్రహాలముందు నాజూకైన శెమ్మాలలో కొవ్వొత్తులు వుంచి, శిలువ గీసుకుని, వంగి, మెల్లిగా వెళ్లిపోయాడు. దీపం లేని డ్రాయింగ్ రూం ఖాళీగా వుంది. ల్రవేత్స్కీ భోజనాల గదిలోకి వెళ్లి ఆవేళ యెవరేనా సాధుపుంగవుని స్మృత్యర్థమైన పండుగా అని అడిగాడు. కాదనీ, ఎలిజవేతా మిహైలొవ్నా, మార్ఫ తిమొఫేయెవ్నాల కోరికమేరకి సాయం ప్రార్థనలు జరగబోతున్నాయనీ మెల్లగా అతనికి చెప్పారు. మంత్రమహిమలున్న విగ్రహాన్ని కిందకి తీసుకురావాల్సి వుందనీ, కాని ఎనిమిది కోసుల దూరంలో జబ్బుగా వున్న ఒక మనిషి దగ్గరికి దాన్ని తీసికెళ్లడం జరిగిందనీ కూడా అతనికి చెప్పారు. ఆ వెంటనే అనుచరులతో కలిసి పురోహితుడు అక్కడికి వచ్చాడు. అతను అరచెయ్యి వెడల్పు బట్టతల వున్న మధ్య వయస్కుడు. హాల్లో గట్టిగా దగ్గాడు. తాము కూర్చున్న గదిలోనుంచి ఆడవాళ్లు వరసగా వచ్చి, ఆశీర్వాదం పొందడానికి అతని దగ్గరికి వెళ్లారు. ల్రవేత్స్కీ వాళ్లకి నిశ్శబ్దంగా వందనం చేశాడు. వాళ్లు కూడా అలాగే తిరిగి నమస్కారం చేశారు. పురోహితుడు కొంచెం సేపు ఆగి, యింకోసారి దగ్గి, గుండె లోతుల్లో నుంచి అడుగుతున్నట్టు అడిగాడు.

''మొదలు పెడదామా?'' అని.

''మొదలుపెట్టండి, పితృదేవా'' అంది మార్య దీమ్రిత్రియెవ్నా.

అతను కర్మకాండ సంబంధమైన ఉడుపులు వేసుకోవడం మొదలుపెట్టాడు. వదులు చేతుల అంగీ తొడుక్కున్న అనుచరుడొకడు కర్తవ్య నిర్వహణ చేసే ధోరణిలో మండేనిప్పు కట్టె తెమ్మని అన్నాడు. సువాసన ధూపం లేచింది. ఆడ పరిచారికలూ, మగ సేవకులూ హాల్లోనుంచి వచ్చి గుమ్మం దగ్గర గుమి కూడారు. యెప్పుడూ కిందికి దిగి యెరగని కుక్క రోస్కా హఠాత్తుగా భోజనాల గదిలోకి దూసుకు వచ్చింది. వాళ్లు దాన్ని తరిమెయ్యనారంభించారు. కాని దానికి జంకు పుట్టి, అటూ యిటూ తిరిగి, వున్న పళంగా వున్న చోటనే కూర్చుండిపోయింది. ఒక పరిచారకుడు దాన్ని యెత్తి అవతలికి తీసికెళ్లిపోయాడు. ప్రార్థన మొదలైంది. ల్రవేత్స్కీ ఒక మూలకి ఒదిగిపోయాడు. అతని అనుభూతులు వింతగా, దాదాపు విచారంగా వున్నాయి. తన అనుభూతి యేమిటైందీ అతను యిదమిత్థంగా తేల్చుకోలేక పోయాడు. మార్య దీమ్రిత్రియెవ్నా ముందు వరసలో, కుర్చీల ముందు, నుంచుంది. ఆమె

అలసత్వంతోటి మహిళాయుక్తమైన ఉదాసీనతతోటి శిలువ గీసుకుని, అడపాదడపా చుట్టూతా చూస్తూ, అప్పుడు హఠాత్తుగా కప్పుకేసి చూసింది: ఆమెకి విసుగ్గా వుంది. మార్ఫ తిమొఫేయెవ్నా ఆందోళనగా వున్నట్టుంది. నస్తాస్య కార్పోవ్నా నేలబారుగా వంగిపోయి, తెలివిగా చటచట శబ్దం చేస్తూ లేచింది. నేలకి దిగేసినట్లు వుండిపోయింది లీజా, యే కద లికా లేకుండా. ఆమె ముఖంమీద కనిపించే తదేక ధ్యానముద్రే ఆమె దీక్షగా, నిశ్చలంగా ప్రార్థ నలో వున్నట్లు తెలియచేస్తోంది. ప్రార్థన అయిపోయిం తర్వాత శిలువని చుంబించేటప్పుడు ఆమె పురోహితుని పెద్ద ఎర్రని చేతిని కూడా చుంబించింది. మార్య ద్మీత్రియెవ్నా పురో హితుణ్ణి టీకి ఆహ్వానించింది. అతను ఉడుపులన్నీ తీసేసి, లౌకిక రూపం ధరించి, మగు వలతో కలిసి డ్రాయింగ్ రూంలోకి వెళ్లాడు. మెల్లిగా సంభాషణ మొదలైంది. పురోహి తులవారు యెడతెగకుండా జేబు రుమాలుతో బట్టతలని తుడుచుకుంటూ, నాలుగు కప్పుల టీ తాగి, ప్రసంగవశాత్తూ, వ్యాపారస్తుడైన ఆవోష్నికొవ్ చర్చి గుమ్మటానికి బంగారు పూత పెట్టించడానికి ఏడు వందల రూబుళ్లని దానం చేసిన విషయం వర్ణించి, ముఖంమీద మచ్చలు పోవడానికి నమ్మకమైన మందుని ఉద్బోధించారు. లవ్రేత్స్కీ లీజా దగ్గర కూర్చోవడం సాధించాడు గాని ఆమె బిగిసిపోయి కూర్చుని, దాదాపు కటువుగా దూరం అయిపోయి, అతనికేసి చూడను కూడా చూళ్లేదు. కావాల్సికి ఆమె అతన్ని నిర్లక్ష్యం చేస్తున్నట్టు వుంది. ఒక రకమైన ముభావమూ, గంభీరమైన ఉద్వేగమూ ఆమెని కమ్మినట్లు వున్నాయి. లవ్రేత్స్కీకి చిరునవ్వు నవ్వాలనే చెప్పలేని కోరిక, యేదేనా సరదాగా వుండే విషయం చెప్పా లనే కోరికా కలిగాయి. కాని అతని హృదయంలో గుబులు వుంది. ఆఖరికి అయోమయంగా వెళ్లిపోయాడు. తను చొచ్చుకుపోలేనిదేదో లీజాలో వుందని అతనికి అనిపించింది.

మరో సందర్భంలో లవ్రేత్స్కీ డ్రాయింగ్ రూంలో గెదెయొనోవ్‌స్కీ చెప్పే కథలు వింటున్నప్పుడు, హఠాత్తుగా, ఎందుకనో అతనికి తెలియకుండానే, తలని తిప్పి, తీక్ష్ణమైన ప్రశ్నార్థక దృక్కుని లీజా కళ్లలో చూశాడు. ఆ చూపు, నిగూఢమైన చూపు, అతనిమీదే లగ్నం అయివుంది. ఆ రాత్రంతా లవ్రేత్స్కీ దాన్ని గురించే ఆలోచించాడు. అతని ప్రేమ కుర్రాళ్ల ప్రేమ లాంటిది కాదు, నిట్టూర్చడం, దుఃఖించడం అతనికి తగవు. లీజా కూడా అతనిలో అలాంటి ఉద్రేకాలని ప్రేరేపించలేదు. కాని యే వయసులోనేనా ప్రేమకి దాని వ్యధలు వుంటాయి — అతనికి వాటిల్లో ఒక్కటీ తప్పలేదు.

## 33

ఒక రోజున లవ్రేత్స్కీ మామూలుగానే కలీతిన్ల యింటి దగ్గర కూర్చున్నాడు. రోజంతా యెండ పేల్చేశాక యెంత హాయి అయిన సాయంత్రం వచ్చిందంటే, వాయు సంచారం అంటే వ్యతిరేకత వున్నప్పటికీ కూడా మార్య ద్మీత్రియెవ్నా అన్ని కిటికీలూ,

తలుపులూ తెరవమనీ హుకుం జారీ చేసింది. తను పేకాట ఆడనవీ, అలాంటి వాతావరణం వుండగా ప్రకృతి శోభని ఆస్వాదించకుండా పేకాడ్డం అవమానమనీ ప్రకటించింది. వున్న అతిథి అల్లా పాన్షిన్ ఒక్కడే. ఆ సాయంత్రం వున్న మానసిక స్థితికి తగ్గట్టుగానే, కాని లవ్రేత్స్కీ యెదర పాడడానికి జంకుతూ, అతను కవిత్వం చదవడానికి తగ్గంత సుముఖత చూపే కళాత్మక కోరికలో వున్నాడు. అతను బాగానే చదివాడు కాని అతి తెలివిగానూ, అనవసరమైన చమత్కారంతోనూ లేర్మొన్తొవ్ పద్యాలని కొన్నిటిని (అప్పటికి పూష్కిన్ యింకా మోజు అయ్యేటట్టు తిరిగి రంగంలోకి రాలేదు) చదివాడు. అప్పుడు హఠాత్తుగా తన కావ్యగానానికి సిగ్గు పడిపోయినట్టు సమయానికి, ప్రఖ్యాతమైన "ఆలోచన"* అనే పద్యాన్ని అనుసరించి యువతరాన్ని విమరిస్తూ నిందించడం మొదలుపెట్టేడు. తన అధి కారం కనక చెల్లినట్లయితే తను ప్రతిదాన్నీ యెలా మార్చదలచుకున్నదీ తెలియచేసే అవ కాశాన్ని జారవిడుచుకోలేదు. "రష్యా యూరప్ కంటే వెనకబడి వుంది. యీ దేశానికి కొరడా దెబ్బలు తగలాలి. మనం యింకా వయసు రానివాళ్లం అని అంటారు. యిదంతా చెత్త. పైగా మనకి లేనిది కొత్త వాటిని కనిపెట్టే శక్తి. మనం ఒక ఎలక బోనుని కూడా కనిపెట్టలేదని ఖొమ్యకోవ్** తనే ఒప్పుకున్నాడు. తత్ఫలితంగా మనం వాళ్ల దగ్గర్నుంచీ, వీళ్లదగ్గర్నుంచీ అరువు తెచ్చుకోవాల్సి వస్తోంది. మనం జబ్బు మనుషులం అంటాడు లేర్మొన్ తొవ్ నేను ఒప్పుకుంటాను. మనం జబ్బు మనుషులం యెందుకంటే మనం సగం యూర పియన్లం మాత్రమే. మన చికిత్స అల్లా కడకంటా ఆ దారిలో..." ("కాడాస్టర్" అనుకున్నాడు లవ్రేత్స్కీ). "మనలో వుండే మహా మేధావులు (లె మెయ్లెర్స్ తెత్)" అంటూ అతను చెప్పకుపోయాడు, "ఆ విషయంమీద యెప్పుడో ఒప్పుకున్నారు. దేశాలన్నీ ప్రధానంగా ఒక్కలాగే వుంటాయి. వూరికే మంచి సంస్థలని ప్రవేశపెట్టండి, పనులు జరుగుతాయి. మనుతూ వున్న జాతీయ ఆచారాలకి అన్నిటినీ సరిపెట్టవచ్చు; అంటే మన వ్యవహారం, ప్రజల వ్యవహారం.... (అతను దాదాపు రాజనీతిజ్ఞులు అనేపదం అన్నాడు) — పౌర అధి కార్లు అన్నమాట; కాని, అవసరమైతే, మీకేం బెంగ అక్కర్లేదు, యీ సంస్థలే జాతీయ ఆచారాలని తిరిగి నిర్మిస్తాయి." మార్య దీమ్త్రియెవ్నా అతను చెప్పే ప్రతీదానికీ మర్యా దగా తల వూపుతూనే వుంది. "ఆహా యెంత తెలివైనవాడు మా యింట్లో వున్నాడు" అనుకుంది ఆమె. లీజా కిటికీకి ఆనుకుని నిశ్శబ్దంగా కూర్చుంది; లవ్రేత్స్కీ కూడా

---

* ప్రఖ్యాత రష్యన్ కవి, రచయిత లేర్మొన్తొవ్ రాసిన ఒక పద్యం. — సం.

** ఖొమ్యకోవ్ (1804–1860) — పంధొమ్మిదవ శతాబ్దం మధ్య కాలంలో రష్యాలో స్లావ్ జాతులకి విశిష్టత వుందన్న వాళ్లల్లో ఒకడు. — సం.

నిశ్శబ్దంగానే వున్నాడు. తను అనుచరురాలితోటి ఒక మూల పేకాట ఆడుతున్న మార్ఫ తిమొ ఫేయెవ్నా యేదో గొణుక్కుంది. పాన్‌షిన్ గదిలో అటూ యిటూ పచారుచేస్తూ, ధారా ళంగా పైకి తేలని కోపంతో మాట్లాడాడు. అతను ఒక తరాన్ని దుమ్మెత్తిపోస్తున్నట్టు లేదు, కొంతమంది తన పరిచయస్థుల్ని దుమ్మెత్తి పోస్తున్నట్టు వుంది. కలీతిన్ల తోటలో పెద్ద లైలాక్ పొదలో గూడుకట్టుకున్న నైటింగేల్ పక్షి సాయంత్రపు తొలి రావాలతో అతని వాగ్ధాటి విరామాలని నింపేసింది. నిశ్చలంగా వున్న లైమ్‌చెట్లపైన గులాబీ వర్ణపు ఆకాశంలో మొదటి నక్షత్రాలు మెరుస్తున్నాయి. లవ్రేత్‌స్కీ నుంచుని పాన్‌షిన్‌తోటి వాదించడం మొదలుపెట్టాడు. యిద్దరి మధ్యా వాదం రేగింది. లవ్రేత్‌స్కీ రష్యా యువ జనాన్నీ, స్వాతంత్ర్యాన్నీ సమర్థించాడు. తనూ, తన తరం త్యాగం చేసుకోవడానికి అతను సిద్ధంగానే వున్నాడు, కాని అతనికి కావాల్సింది నూతన మానవులు, వాళ్ల విశ్వాసాలు, వాళ్ల ఆకాంక్షలు. పాన్‌షిన్ వేడిగా, వాడిగా బదులు చెప్పాడు. తెలివైన వాళ్లే సమాజంలోని ప్రతీదాన్నీ మార్చాలని మళ్లీ అన్నాడు. ఒక సందర్భంలో యే దశకు పోయాడంటే తన కామేర్ జుంకర్ పదవిగానీ, అధికార జీవితంగాని మరచిపోయి లవ్రేత్‌స్కీని బూజుపట్టిన కన్సర్‌వేటివ్ అన్నాడు, ఆ మాట కొస్తే — నిజమే, చాలా దూరం నుంచేననుకోండి — అతనికి సమాజంలో వున్న అనుమానాస్పద పరిస్థితిని యెత్తిపొడిచాడు. లవ్రేత్‌స్కీ నిగ్రహం కోల్పోలేదు, గొంతుకా పెంచలేదు (మిహలేవిచ్ కూడా తనని బూజుపట్టిన వాడని అన్నట్టు — కాని వోల్టేరియన్ అన్నట్టు అతనికి స్ఫురించింది); అతను నింపాదిగా పాన్‌షిన్‌ని అన్ని పాయింట్లమీదా ఓడించేశాడు. మాతృదేశం గురించిన జ్ఞానంలేకుండా, సినలైన ఆదర్శంలో వ్యతిరిక్తమైనదైనా సరే నమ్మకం లేకుండా, పొగరు మోతు సంస్కరణల అసంభావ్యతని, గెంతుల అసంభావ్యతని అతనికి రుజావు చేశాడు. తన విద్యనే ఉదాహరణగా చూపించాడు, అన్నిటికంటే ముందుగా వినయసంపన్న భావంతో ప్రజల సత్యాన్ని గుర్తించాలని, అపేక్షిం చాడు — ఆ భావం లేకుండా అనృతాన్ని యెదిరించడం అసాధ్యం. కడగా తను కాలాన్నీ, శక్తినీ వృధా చేసానన్న నిందని కాదనలేదు.

''అదంతా బాగానే వుంది!'' అని అరిచాడు పాన్‌షిన్. యీ సరికి అతను బాగా చీదర పడిపోయాడు. ''మీ సంగతే చూడండి. మీరు రష్యాకి తిరిగి వచ్చారు — యేం చేద్దామను కుంటున్నారు?''

''భూమిని దున్నదామనుకుంటున్నాను, నాకు చేతనైనంత బాగా ఆ పని చెయ్య ప్రయ త్నించాలనుకుంటున్నాను'' అన్నాడు లవ్రేత్‌స్కీ.

''భేషుగ్గా వుంది, నిస్సందేహంగా'' అన్నాడు పాన్‌షిన్. ''మీరు ఆ కార్యక్రమంలో చాలా విజయవంతంగా వున్నారని విన్నాను; కాని ప్రతివాళ్లూ అలాంటి పనికి నప్పలేరని మీరు ఒప్పుకోవాలి.''

''ప్యున్ నట్యూర్ పొఎటిక్''* మొదలుపెట్టింది మార్య దీమ్రిత్రియెవ్నా, ''పొలం దున్నడానికి పనికి రారు.... ఎ ప్యుయా** యిది మీ వృత్తి వ్లదీమిర్ నికొలాయెవిచ్, చేసే ప్రతిదీ అం గ్రాం***గా చెయ్యడం.''

అది పాన్షిన్కి కూడా అతిగానే వుండింది. మాట తెంపేసి, విషయం మార్చేశాడు. నక్షత్రాకాశపు అందం గురించీ, షూబర్ట్ సంగీతం గురించీ మాట్లాడ్డం మొదలుపెట్టాడు — కాని సంభాషణ నీరసపడిపోయింది. ఆఖరికి అతను పేకాడదామని మార్య దీమ్రిత్రియెవ్నాతోటి అన్నాడు. ''ఏమిటి! యిలాంటి రాత్రప్పుడా?'' అని నీరసంగా అభ్యంతరపెట్టింది, గాని పేకని తెమ్మని పురమాయించింది.

పాన్షిన్ కొత్త పేకని టపామని తెరిచాడు. లీజా లవ్రేత్స్కీలు కూడబలుక్కున్నట్టుగా లేచి వెళ్లి మార్ఫ తిమొఫేయెవ్నా పక్కన చేరారు. వాళ్లు యిద్దరూ హఠాత్తుగా యెంత సంతోష పడ్డారంటే, యిద్దరూ యేకాంతంగా వుండటానికి కొంచెం భయపడ్డారు కూడా. గత కొద్ది రోజులుగా వున్న యిబ్బంది యేదో యిక యెన్నటికీ తొలగిపోయినట్లైంది. ఆ ముసలావిడ రహస్యంగా లవ్రేత్స్కీ బుగ్గలు నిమిరి, కొంటెగా కన్నుగిలికి, కొన్ని సార్లు తల పంకించి, మెల్లిగా అంది, ''ఆ పండితమ్మన్యుడికి గసిక దిగేశావు, చాలు,'' అని. ఒక రకమైన నిశ్శబ్దం గదిలో ఆవరించుకుంది. అడపాదడపా కొవ్వొత్తి చిట్లిన చప్పుడు, బల్లమీద చరిచే చప్పుడు, ఒక కేక, పాయింట్లు లెక్కపెట్టడం ధ్వనులు మాత్రమే వుండేవి. ఒక నైటింగేల్ పక్షి పాట బింకంగా, మధురంగా, తెరిచిన కిటికీ గుండా రాత్రి హిమశీతంతో కలిసి నిర్ఝరి లాగా వచ్చేది.

## 34

లవ్రేత్స్కీ, పాన్షిన్ల మధ్య వాగ్వాదంలో లీజా పిసరు కూడా జోక్యం చేసుకోలేదు, కాని శ్రద్ధగా అంతా గమనించింది, లవ్రేత్స్కీ పక్షమే వుండిపోయింది. రాజకీయాలంటే ఆమెకి ఆసక్తి లేదు, కాని ఆ లౌకిక అధికారి తల బిరుసు ధోరణి (అతను అంతకు ముందెన్నడూ అలా నిర్మొహమాటంగా మాట్లాడలేదు) ఆమెకి వెలపరం కలిగించింది. రష్యాపట్ల అతని ద్వేషం ఆమెని అదరగొట్టింది. తనకి దేశభక్తి వుందని లీజాకి యెన్నడూ తట్టనే లేదు. కాని రష్యను మనుషులతోటి కులాసాగా వున్నట్లు భావించేది. రష్యన్ మానసిక ధోరణి ఆమెకి ముచ్చటగా వుండేది. తన తల్లిగారి రైతు పర్యవేక్షకుడు పట్టణానికి వచ్చి

* ''కవితాత్మక ప్రాణి'' (ఫ్రెంచి).

** పైగా (ఫ్రెంచి).

*** భారీ యెత్తున (ఫ్రెంచి).

నప్పుడు అడ్డులేకుండా గంటల తరబడీ, సమానస్థుడిలాగా, ఒక పిసరు కూడా ఆధిక్యత లేనట్లుగా అతనితో మాట్లాడేది. లవ్రేత్స్కీ యిదంతా గమనించాడు. పాన్‌షిన్‌కి సమాధానం చెప్పడానికి మరోలా అయితే తంటాలు పడివుండే వాడు కాదు. అతను చెప్పింది లీజాని ఉద్దేశించే. వాళ్లిద్దరూ ఒకళ్లతో ఒకళ్లు మాట్లాడుకోలేదు, యిద్దరి చూపులూ సైతం దాదాపు కలియలేదు. కాని యిద్దరూ కూడా తాము ఆ సాయంత్రం సన్నిహితమైనట్టూ, ఒకే వాటిని అభిమానిస్తున్నట్టూ, అసహ్యించుకుంటున్నట్టూ ఆ సాయంత్రం అనుకొన్నారు. ఒక్క విషయంమీదే వాళ్లిద్దరూ విభేదించారు, కాని అతన్ని భగవత్సన్నిధానంలోకి తీసుకురాగలననే నిగూఢ ఆశ లీజాకి వుంది. వాళ్లు మార్ఫ తిమొఫేయెవ్నా పక్కన కూర్చుని, ఆటని చూస్తున్నట్టుగా వున్నారు. నిజంగా చూస్తున్నారు కూడా. యిద్దరి హృదయాలూ ఉప్పొంగి వున్నాయి, యేదీ పోగొట్టుకొన్నట్టు వాళ్లకి అనిపించలేదు. తమ కోసమే నైటింగేల్ పక్షి పాడుతున్నట్టూ, నక్షత్రాలు ప్రకాశిస్తున్నట్టూ, వేసవి బడలిక వల్ల వేసవి వెచ్చదనంవల్ల జోలపాటతో ఉపశాంతి పొంది, మెల్లిగా చెట్లు గుసగుసలాడుతున్నట్టూ వాళ్లకి అనిపించింది. తన హృదయాన్ని ముంచెత్తిన అనుభూతికే లవ్రేత్స్కీ పూర్తిగా లొంగిపోయాడు — పరవశించాడు. కాని ఆ బాలిక స్వచ్ఛమైన హృదయంలో యేం జరుగుతూ వున్నదో యే మాటా వ్యక్తం చెయ్యలేదు. అది ఆమెకే అవగతం కాదు. దాన్ని అందరికీ అలానే వుండనివ్వండి. జీవితానికి ఆమంత్రణం చేసినట్టుగా ఒక విత్తనం యెలా భూమాత గర్భంలోనుంచి యీరిక లెత్తుతుందో యెవరూ చూడలేదు, చూడలేరు.

పది గంటలైంది. మార్ఫ తిమొఫేయెవ్నా నస్తాస్య కార్పొవ్నాతోటి కలిసి పైకి వెళ్లిపోయింది; లవ్రేత్స్కీ, లీజాలు గది దాటి వచ్చి, తోటలోకి దారితీసే గుమ్మందగ్గర నుంచుని చీకట్లోకి చూశారు. అప్పుడు ఒకళ్ల నొకళ్లు చూసుకుని చిరునవ్వు నవ్వుకున్నారు. చేతులు పట్టుకు మనసారా మాట్లాడుకోవాలని అనిపించినట్లైంది వాళ్లకి. వాళ్లు మళ్లీ మార్య దీమ్త్రియెవ్నా పాన్‌షిన్‌ల దగ్గరికి వెళ్లారు. వాళ్లు పేకాట యింకా ఆడుతూనే వున్నారు. ఆఖరికి కడపటి రాజు అనగానే యజమానురాలు పడక్కుర్చీలోని మెత్తలమీదనుంచి మూలుగుతూ లేచింది. పాన్‌షిన్ టోపీ తీసుకుని, మార్య దీమ్త్రియెవ్నా చేతిని అభివాదపూర్వకంగా చుంబించి, కొంతమంది అదృష్టవంతులు బుద్ధిపుడితే నిద్రపోతారనీ, లేకపోతే రాత్రి అందాన్ని ఆస్వాదిస్తూ గడుపుతారనీ కాని తను మాత్రం తెల్లవార్లూ చెత్త కాగితాలు ముందేసుకు కూర్చోవాలనీ అని, లీజాకి ముభావంగా వందనం చేసి (అతను ఆమెని పెళ్లి సంబంధం అడిగినప్పుడు నిరీక్షించమంటుందని అనుకోలేదు — అందువల్ల ఆమె అంటే చిరచిరలాడుతున్నాడు) గదిలోనుంచి వెళ్లిపోయాడు. లవ్రేత్స్కీ అతన్ని అనుసరించి వెళ్లాడు. యిద్దరూ గేటు దగ్గర విడిపోయారు. పాన్‌షిన్ తన బండితోలేవాణ్ణి చేతికర్రతో మెడ మీద పొడిచి లేపాడు. బండిలో కూర్చుని, వెళ్లిపోయాడు. లవ్రేత్స్కీకి బసకి పో బుద్ధి

పుట్టలేదు. అతను పట్టణం దాటి విశాలమైన బయలుకి వచ్చాడు. చంద్రుడు లేకపోయినా ఆ రాత్రి నిర్మలంగా, ప్రశాంతంగా వుంది. లవ్రేత్‌స్కీ చాలా సేపు మంచుగరికలో పచార్లు చేశాడు. ఒక చిన్న దారి తగిలింది. అది పట్టుకునిపోయాడు. ఒక పొడుగాటి కంచె దగ్గరికి, గేటు దగ్గరికి ఆ తోవ అతన్ని తీసుకుపోయింది. గేటుని అనుకోకుండానే తోశాడు. కిర్రుమని గేటు తెరుచుకుంది, ఆదేదో అతని హస్తస్పర్శని ఆశిస్తున్నట్టు. లవ్రేత్‌స్కీ ఒక తోటలో తేలాడు. అక్కడ లైమ్‌చెట్ల మధ్య కొన్ని అడుగులు వేసి వున్నట్టుండి ఆశ్చర్యంతో ఆగిపోయాడు: అది కలీతిన్ల తోట అని గుర్తుపట్టాడు.

అతను వేగంగా ముళ్లపొదల నీడలోకి వెళ్లి, కదలకుండా చాలా సేపు నుంచుని, ఆశ్చర్యపోతూ భుజాలు యెగరేశాడు.

''యిది ఒట్టి కాకతాళీయం కాదు'' అనుకున్నాడు.

చుట్టూతా అంతా నిశ్శబ్దంగా వుంది. యింట్లోనుంచి పిసరు శబ్దం కూడా రావడం లేదు. అతను జాగ్రత్తగా నడిచాడు. ఒక మలుపులో యిల్లంతా కంటికి ఆనింది. పై గదుల కిటికీల్లో మిణుకుమనే దీపకాంతి తప్ప మొత్తం అంతా చీకటిగా వుంది. లీజా గదిలో తెల్లటి తెరవెనక ఒక కొవ్వొత్తి వెలుగుతోంది. మార్ఫ తిమొఫేయెవ్నా పడక గదిలో చిన్న చమురు దీపం విగ్రహం ముందు, బంగారు పూత చట్రంమీద సన్నని కాంతి ప్రసరింపచేస్తూ వెలుగుతోంది. కింద బాల్కనీకి దారి తీసే తలుపు వెడల్పుగా తెరిచే వుంది. లవ్రేత్‌స్కీ తోటలో వుండే కొయ్య బల్లమీద కూర్చుని, తల చేతిమీద ఆన్చుకుని తలుపు కేసీ, లీజా కిటికీకేసీ చూశాడు. వూళ్లో గడియారం అర్ధరాత్రి గంట కొట్టింది. యింట్లో వున్న చిన్న గడియారం గణగణమని పన్నెండు కొట్టింది. రాత్రి కాపలావాడు తన ఢంకా మోగించాడు. లవ్రేత్‌స్కీ దేన్ని గురించీ ఆలోచించలేదు, దేన్నీ ఆశించలేదు; తను లీజా దగ్గర వున్నందుకు, ఆమె తోటలో వున్నందుకు, ఆమె యెన్నో సార్లు కూర్చుని వున్న ఆ చోట కూర్చున్నందుకు అతనికి సంతోషంగా వుంది... లీజా గదిలో దీపం ఆరిపోయింది. ''గుడ్‌నైట్ నిద్రపో, ప్రియమైన పాపా'' అని మెల్లిగా అనుకున్నాడు లవ్రేత్‌స్కీ, కూచున్న చోటినుంచి కదలకుండా. అతని కళ్లు చీకటైపోయిన ఆ కిటికీకేసే లగ్నం అయివున్నాయి.

వున్నట్టుండి కింద భాగం కిటికీల్లోనుంచి దీపం కనిపించింది. దీపం ఒక గదిలోకి వెళ్లింది, యింకో గదిలోకి వెళ్లింది. ఎవరో చేత్తో కొవ్వొత్తి పట్టుకుని గదుల గుండా నడుస్తున్నారు. ''లీజా కాదు కదా? అసంభవం!'' అనుకుని లవ్రేత్‌స్కీ కూచున్న చోటినుంచి లేచాడు... బాగా పరిచయమైన ముఖం క్షణికంగా దర్శన మిచ్చింది. లీజా డ్రాయింగ్ రూంలోకి వచ్చింది. తెల్లటి గౌను తొడుక్కుంది. జడ వేసుకున్న జుట్టు భుజాలమీద జారుతోంది. ఆమె నెమ్మదిగా మేజా దగ్గరికి వెళ్లి, కొవ్వొత్తి కింద పెట్టి, దేనికోసమో చూడ్డం మొదలుపెట్టింది. అప్పుడు తోటకేసి తిరిగి, ఆమె తెరిచిన గుమ్మం దగ్గరికి వచ్చి, గడ

పలో నుంచుంది, నాజూగ్గా తెల్లటి బట్టలు వేసుకున్న విగ్రహం. లవ్రేత్స్కీ దడదడ వణికి పోయాడు.

''లీజా!'' దాదాపు వినిపించని స్వరం అతని పెదాలమీదనుంచి జారింది.

ఆమె కంపించి, చీకట్లోకి చూసింది.

''లీజా!'' అని లవ్రేత్స్కీ యింకా గట్టిగా అని, నీడలోనుంచి యివతలికి వచ్చాడు.

లీజా భయంతోటి మెడ చాచి, చుట్టుకుపోయింది. ఆమె అతన్ని గుర్తుపట్టింది. అతడు ఆమెని మూడో సారి పిలిచి, ఆమెకేసి చేతులు చాపాడు. ఆమె గుమ్మంలోనుంచి వచ్చి, తోటలో ప్రవేశించింది.

''మీరా?'' ఆమె గొణిగింది. ''మీరు యిక్కడ?

''నేనే.... నేనే.... చెప్పేది వినండి'' అని లవ్రేత్స్కీ మెల్లిగా అన్నాడు, ఆమె చెయ్యి పుచ్చుకుని బల్ల దగ్గరికి నడిపించుకుని వెళ్లాడు.

అతనికి యెదురు చెప్పకుండా ఆమె అతన్ని అనుసరించింది. వివర్ణమైన ఆమె ముఖమూ, నిశ్చలమైన ఆమె చూపూ, ఆమె ప్రతి భంగిమా వక్తంకాని ఆశ్చర్యాన్ని తెలియజేసాయి. లవ్రేత్స్కీ ఆమెని కూర్చోబెట్టి ఆమెకి అభిముఖంగా నుంచున్నాడు.

''నేనిక్కడికి రావాలని అనుకోలేదు'' అని అతను మొదలుపెట్టాడు. ''యేమిటో అలా నన్ను లాక్కొచ్చేసింది.... నేను.... నేను.... నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను'' అని అను కోని దిగులుతో అన్నాడతను.

లీజా అతనికేసి మెల్లిగా చూసింది. యెక్కడ వున్నదీ యేం జరుగుతున్నదీ ఆమెకి యిప్పుడే స్పృహలోకి వచ్చినట్టుంది. ఆమె లేవాలని అనుకొంది, కాని లేవలేకపోయింది, ముఖం చేతులతో కప్పేసుకుంది.

''లీజా'' లవ్రేత్స్కీ గొణిగాడు. ''లీజా'' అని మళ్లీ అన్నాడు. ఆమె కాళ్ల దగ్గర మోకరిల్లాడు.

ఒక రకమైన సన్నటి వణుకు ఆమె భుజాల్ని కుదిపింది. ఆమె పాలిన చేతివేళ్లు యింకా గట్టిగా ముఖాన్ని హత్తుకున్నాయి.

''ఏమిటి సంగతి?'' అని లవ్రేత్స్కీ గొణిగాడు, మెల్లిగా వెక్కి వెక్కి యేడవడం అతనికి వినిపించింది. అతని హృదయం కదిలి పోయింది. ఆ కన్నీళ్ల అర్థం యేమిటైందీ అతనికి తెలుసు. ''మీరు నన్ను ప్రేమిస్తున్నట్టేనా?'' అని అతను మెల్లిగా అడిగాడు, ఆమె మోకాళ్లు తాకాడు.

''లేవండి'' అని ఆమె అనడం విన్నాడు. ''లేవండి ఫ్యోదొర్ ఇవానిచ్. యేం చేస్తు న్నాం?''

అతను లేచి ఆమె పక్కన కూర్చున్నాడు. ఆమె యిక యేడవడం లేదు. అతన్ని తడి కళ్లతో అదేపనిగా చూసింది.

''నాకు భయంగా వుంది. మనం యేమిటి చేస్తున్నాం?'' ఆమె నట్టింది.

''నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను'' అతను యింకో సారి గొణిగాడు. ''నా జీవిత మంతా మీకు అర్పించడానికి సిద్ధంగా వున్నాను.''

ఆమె తనని యేదో కుట్టినట్టుగా మళ్లీ ఒణికింది. ఆకాశంకేసి కళ్లు యెత్తింది.

''అదంతా దేవుడి చేతుల్లో వుంది'' అంది.

''కాని మీరు నన్ను ప్రేమిస్తున్నారా లీజా? మనం ఆనందంగా వుంటామా?''

ఆమె కళ్లు వాల్చుకుంది. అతను ఆమెని మెల్లిగా హత్తుకున్నాడు. ఆమె తల అతని భుజాలమీద వాలింది.... అతను తన తలని కొంచెం వంచి ఆమె పాలిన పెదాలని తన పెదాలతో తాకాడు.

* * *

అరగంట తర్వాత లవ్రేత్‌స్కీ తోటగేటు దగ్గర నుంచుని వున్నాడు. అది తాళం వేసి వుండటంతోటి, కంచెమీదనుంచి దూకాల్సివచ్చింది. అతను వూళ్లోకి వచ్చి నిద్రపోతూన్న వీధుల గుండా నడిచిపోయాడు. ఆశించని అంతులేని ఆనందం అతని హృదయంలో నిండి పోయింది. అతని సందేహాలన్నీ తీరిపోయాయి. ''పోండి, గతకాలపు మసక భూతాల్లారా!'' అనుకున్నాడతను. ''ఆమె నన్ను ప్రేమిస్తోంది. ఆమె నాది అవుతుంది.'' హఠాత్తుగా పైన గాలి దివ్యమైన, విజయోపేతమైన ధ్వనితోనిండి పోయింది. అతను ఆగాడు. ఆ ధ్వని బ్రహ్మాండమైన శ్రావ్యతతో మిళితమైపోయింది — అతని అపరిమిత ఆనందమంతా సంగీతంలో పులకించి మాట్లాడి పాడుతూ వున్నట్టుంది. అతను చుట్టూతా చూశాడు. ఆ ధ్వనులు ఒక చిన్న యింటి పై కిటికీలనుంచి వస్తున్నాయి.

''లెమ్!'' ఆ యింటికేసి పరిగెడుతూ లవ్రేత్‌స్కీ అరిచాడు. ''లెమ్! లెమ్!'' గట్టిగా మళ్లీ కేకేశాడు.

ఆ శబ్దాలు ఆగాయి. రాత్రి వేసుకునే బట్టలతోటి, ఛాతీమీద ఆచ్ఛాదన లేకుండా, రేగిన జుట్టుతోటి వున్న లెమ్ మూర్తి కిటికీ దగ్గర ప్రత్యక్షమైంది.

''ఓ!'' అతను హుందాగా అరిచాడు. ''మీరా!''

''క్రిస్టఫర్ ఫ్యోదొరొవిచ్ యేం అద్భుతమైన సంగీతమండీ! మీకు పుణ్యముంటుంది, నన్ను లోపలికి రానీయండి.''

ఒక్క మాట అనకుండా, చేతిని రాజసంగా తిప్పి, ఆ ముసలాయన కిటికీలోనుంచి తాళం రోడ్డుమీదకి విసిరాడు. లవ్రేత్‌స్కీ మీదకి పరిగెత్తాడు, దూసుకుని ఆ గదిలోకి వెళ్లాడు, లెమ్ దగ్గరికి పరిగెత్తాడు. కాని ఆయన అతనికి సగర్వంగా ఒక కుర్చీ చూపించి, వున్నట్టుండి రష్యన్‌లో ''కూర్చోండి, వినండి'' అని తనే పియానో దగ్గర కూర్చుని, గర్వంగా బింకంగా చుట్టూ చూసి, వాయించడం మొదలుపెట్టాడు. లవ్రేత్‌స్కీ అలాం

టిది విని చాలా రోజులైంది. మధురమైన ఆవేశభరితమైన శ్రావ్యత మొదటి ఆలాపన నుంచీ అతని హృదయాన్ని ఆకట్టుకుంది. ఉత్తేజం, ఆనందం, అందం అనే జ్వాలతో అది ఆమూలాగ్రం వెలిగిపోతోంది. ఉత్థానం అయి, గాలిలో కరిగిపోతోంది. ప్రపంచంలో యెంతో విలువైన, గూఢమైన, పవిత్రమైన ప్రతిదాన్నీ అది స్పృశించింది. మృత్యురహిత విషాదాన్ని అది నిశ్వసిస్తూ, మరణిస్తూనే ఆకాశానికి అధిరోహించింది. లవ్రేత్‌స్కీ ముడుచుకుపోయి, పాలిపోయి నుంచుని, పారవశ్యంతో గడ్డకట్టిపోయాడు. సంగీతం యింకా నూతనంగా అందిన ప్రేమ సందేశంతో వణుకుతున్న అతని హృదయంలోకి దిగిపోయింది, అది కూడా ప్రేమతోనే కంపించింది. ''మళ్లీ'' అన్నాడతను మెల్లిగా ఆఖరి పల్లవి అయిపోగానే. ఆ ముసలాయన డేగలాంటి చూపు విసిరి, ఛాతీ చరుచుకుని, మెల్లిగా తన భాషలో ''నేనిది సాధించాను, నేను గొప్ప వాగ్గేయకారుణ్ణి'' అని మళ్లీ ఆ అద్భుత కృతిని వాయించాడు. గదిలో కొవ్వొత్తులు లేవు. ఆకాశంలో అధిరోహించే చంద్రుని కిరణాలు కిటికీలోనుంచి యేటవాలుగా పడుతున్నాయి. మృదువైన గాలి శబ్దంతో కంపిస్తోంది. ఆ చిన్నగది పవిత్ర స్థలంగా కనిపించింది, ఆ ముసలాయన శిరస్సు ఉన్నతంగా, ఆ రజతకాంతిలో ఉత్తేజితమైన ట్టుగా కనిపించింది. లవ్రేత్‌స్కీ అతని దగ్గరికి వెళ్లి ఆలింగనం చేసుకున్నాడు. మొదట్లో లెమ్ అతని ఆలింగనానికి బదులివ్వలేదు, మోచేత్తో తోసేశాడు కూడా. చాలా సేపు నిశ్చ లంగా, అదే రకమైన బింకపు చూపుతో, దాదాపు చిరచిరలాడుతూ వుండిపోయాడు. వూరికే రెండు సార్లు గొణిగాడు ''ఆహా!'' అని. ఆఖరికి ఆయన వదనం తెప్పరిల్లింది. లవ్రేత్‌స్కీ ఉత్సాహభరితమైన అభినందనలకి అతను మొదట్లో చిరునవ్వునవ్వి, అప్పుడు భోరున యేడ్చాడు, చిన్న పిల్లాడిలా నీరసంగా వెక్కుతూ.

''మీరీ క్షణంలో రావడం ఆమోఘంగా వుంది. కాని నాకు తెలుసు. నాకు ప్రతీదీ తెలుసు'' అన్నాడతను.

''మీకు ప్రతీదీ తెలుసా?'' అన్నాడు లవ్రేత్‌స్కీ, ఆశ్చర్యపోయి.

''నేనన్నది విన్నారా? నాకు ప్రతీదీ తెలుసునని మీరు గుర్తించలేదా?'' అని బదులు చెప్పాడు లెమ్.

తెల్లవారిందాకా లవ్రేత్‌స్కీ నిద్రపోలేకపోయాడు. రాత్రంతా మంచంమీద కూర్చునే వున్నాడు. లీజా కూడా నిద్రపోలేదు. ఆమె ప్రార్థన చేస్తూ వుంది.

## 35

పాఠకుడికి లవ్రేత్‌స్కీ బాల్యం గురించీ, పెంపకం గురించీ తెలుసు. యిప్పుడు లీజా చదువు గురించి రెండు ముక్కలు చెప్పుకుందాం. తండ్రి చనిపోయేనాటికి లీజాకి పదేళ్లు. అతను ఆమె పట్ల యెక్కువ శ్రద్ధపట్టలేదు. వ్యాపారపు లావాదేవీల్లో కూరుకుపోయి,

తన ఐశ్వర్యాన్ని పెంచుకోనే పథకాలతో నిరంతరం మునిగిపోయి, పరుషంగా, బండగా, చిరాకుగా వుండే అతను, ఉపాధ్యాయులకీ, ఆయాలకీ, బట్టలకీ పిల్లల తదితర అవసరాలకీ విసుక్కోకుండానే డబ్బు యిచ్చేవాడు. కాని అతనన్నట్టు "గీపెడుతూ వుండే పాడు పిల్లల్ని" ముద్దుచెయ్యడం అతనికి అసహ్యంగా వుండేది. వాస్తవానికి పిల్లల్ని ముద్దుచేసేటంత వ్యవధి అతనికి వుండేది కాదు. పనిలో వుండేవాడు, వ్యాపారం చూసుకునేవాడు, తక్కువ నిద్ర పోయేవాడు, యెప్పుడేనా పేకాడేవాడు, మళ్లీ పనిలో మునిగిపోయేవాడు. కాడికి కట్టిన యెద్దుతో తనని పోల్చుకునేవాడు. "ప్చ్, నా జీవితం చాలా వేగంగా జారిపోయింది" అని, అతను యెండిన పెదాలమీద కటువైన చిరునవ్వుతోటి, మృత్యుశయ్యమీద గొణిగాడు. మార్య దీమ్రిత్రియెవ్నా పిల్లలకోసం భర్తకంటే యెక్కువ సమయం కేటాయించలేదు, ల్రవేత్స్కీతోటి అంతా తనొక్కత్తీ పిల్లల్ని పెంచుకొచ్చానని గొప్పలుపోయినా. కూతుర్ని బొమ్మలాగా అలంకరించి, యెవళ్లేనా చూడ్డానికి వచ్చినప్పుడు తల నిమిరి, ముఖంమీదనే తెలివైన పిల్ల అనీ, నా ముద్దుల మురారి అనీ అనేది, అంతే. ఆ సోమరి స్త్రీకి క్రమపద్ధతిగా పిల్లల్ని చూడ్డం యాతనే మరి. తండ్రి బతికున్న రోజుల్లో లీజా పారిస్‌నుంచి వచ్చిన మేదమ్ మొరో అజమాయిషీలో వుండింది. అతను చనిపోయాక మార్ఫ తిమొఫేయెవ్నా అజమాయిషీలోకి పోయింది. మార్ఫ తిమొఫేయెవ్నా సంగతి పాఠకుడికి తెలుసు. మేదమ్ మొరో చిన్నగా, ముడతలుపడిపోయి, విహంగరీతిలో, విహంగ మేధతో వుండే మనిషి. వయసులో వున్నప్పుడు పైలా పచ్చీసుగా బతికింది, కాని ముసలిది అయాక రెండే కోరికలు మిగిలాయి — తీపివస్తువులు తినడం, పేక ఆడ్డం. కడుపునిండా తినకపోయినా, పేక ఆడక పోయినా, వాగడం లేకపోయినా ఆవిడ ముఖం శవాకారం తేలేది. ఆమె వుండేది — కూర్చుని, చూస్తూ, వూపిరిపీలుస్తూ; కాని ఆమె బుర్రకి మాత్రం యే ఆలోచనలూ తెలియవు. ఆమెని దయగల మనిషి అని కూడా అనలేం, యేమంటే దయగల పక్షిలాంటిదేమీ లేదు కాబట్టి. వయసులో చిత్తం వచ్చినట్టు తిరిగిన దాని వల్లనో, పుట్టిందగ్గర్నుంచి పారిస్ గాలిపీల్చడం వల్లనో యేమో ఆమెకి అతి సామాన్యంగా "తు స సె డె బెతీజ్"* లాంటి మాటల్లో వ్యక్తమయే చవకబారు సాధారణ సంశయాత్మకత అంటుకుంది. ఆమె లక్షణ విరుద్ధమైనదైనా స్వచ్ఛమైన పారిస్ నుడికారంతో మాట్లాడేది. చెడ్డ మాటలలో చెవులు కొరికేదికాదు, తిక్కలేమీ లేవు — ఆయానుంచి అంతకంటే ఆశించేదే ముంటుంది? ఆమెకి లీజామీద చాలా తక్కువ ప్రభావం వుండేది. ఆ పిల్లమీద దాది అగాఫ్య వ్లాస్యెవ్నా ప్రభావం యెక్కువ వుంది.

* "ఇదంతా చెత్త" (ఫ్రెంచి).

యీ ఆడమనిషి చరిత్ర ఆసక్తికరమైంది. ఆమె రైతు కుటుంబపు బిడ్డ. పదహా రవ యేట ఒక రైతుతోటి పెళ్లిఅయింది. కాని ఆమె తోటి రైతు సోదరీమణుల్లా వుండేదే కాదు. ఆమె నాయన జమీ పెత్తందారుగా యిరవై యేళ్లు పనిచేశాడు. బోలెడు డబ్బు సంపాదించి, కూతుర్ని గారం చేశాడు. ఆమె చాలా అందగత్తె, ఆ ప్రాంతానికల్లా రాణి, తెలివైంది, ధైర్యవంతురాలు, దురుసుతనంగా మాట్లాడేది. ఆమె యజమాని దీమ్రితియ్ పేస్తొవ్, అంటే మార్య దీమ్రితియెవ్నా తండ్రి, చాలా సౌమ్యుడైన మనిషి. ఒక సారి ఆమెని నూర్పిడికళ్లం దగ్గర చూసి, ఆమెతో మాట్లాడి, విపరీతంగా ఆమెని ప్రేమించేశాడు. ఆ తర్వాత త్వరలోనే ఆమె భర్త పోయాడు. పేస్తొవ్, వివాహితుడైనా, ఆమెని చేరదీసి, యింట్లో పెట్టుకుని దొరసానిలా ముస్తాబుచేశాడు. అసలు అంతకు ముందు తను వేరే బాపతు జీవితం గడపనట్టే అగాఫ్య తన నూతన పాత్రకి అలవాటు పడిపోయింది. నున్నగా, కండపట్టి బొద్దుగా తయారైంది. మజ్లిను చొక్కా చేతులకింద ఆవిడ హస్తాలు "పిండిలా తెల్లగా," వ్యాపారస్తుని భార్య చేతుల్లా తయారయ్యాయి. సమొవార్ యెప్పుడూ బల్లమీద అలానే వుండేది. ఆమె సిల్కు, ముఖమల్ తప్ప మరోరకం బట్ట కట్టలేదు. యీకల పరుపులమీదే పడుకునేది. యీ ఆనందమయమైన స్థితి అలా అయిదేళ్లు సాగింది. అప్పుడు దీమ్రితియ్ పేస్తొవ్ అస్తమించాడు. ఆయన వితంతువు, దయార్ద్రపూరితమైన యజమానురాలు, దివంగతుడైన భర్త స్మృతిని మన్నించడంవల్ల, పైగా, అగాఫ్య తన ముందటి స్థానాన్ని యెన్నడూ మర్చిపోక పోవడంవల్ల తన సవితితోటి కటువుగా ప్రవర్తించదలచుకోలేదు. కాని అగాఫ్యని తగినంత దూరంలోనే పెట్టడం జరిగింది. ఏమైనా ఆమె అగాఫ్యకి పశువుల కాపరికిచ్చి పెళ్లిచేసేసి కనుమరుగు చేసుకుంది. మూడు సంవత్సరాలు గడిచాయి. వేసవికాలంలో వేడిగా వున్న ఒక రోజున యజమానురాలు తన పశుక్షేత్రాన్ని సందర్శించింది. అగాఫ్య ఆమెకి రుచికరమైన మీగడ పెట్టి ఆదరించి, యెంత వినయంగా ప్రవర్తించిందంటే, యెంత శుభ్రంగా, ఉల్లాసంగా సంతృప్తిగా వుందంటే యజమానురాలు ఆమెని క్షమించేసి మళ్లీ యింట్లో పెట్టుకుంది. ఆరు నెలల్లో ఆమె యెంత చేరిక అయిందంటే యజమానురాలు ఆమెకి యింటి పెత్తనం అప్పగించి, మొత్తం గృహ యాజమాన్యం చేతిలో పెట్టింది. అగాఫ్య మళ్లీ పుంజుకుని, నునుపెక్కి, బొద్దుగా తయారైంది. ఆమెకి యజమానురాలి అర్థతః గర్భితమైన విశ్వాసం వుంది. యింకో అయిదేళ్లు గడిచాయి. అప్పుడు అగాఫ్యకి మళ్లీ దుఃఖం సంప్రాప్తించింది. సేవకుని హోదాకి పెంచిన ఆమె భర్త తాగుడుకి అలవాటుపడి, తరచుగా యింటినుంచి పరారీ అయిపోయి, ఆఖరికి యజమానురాలి వెండి చెంచాలు ఒక అరడజను కొట్టేసి రహస్యంగా భార్య ఖజానాలో దాచేశాడు. యీ విషయం బయటపడింది. మళ్లీ పశువులకాపరిగా కిందకి జారిపోయాడు, అతని భార్య ఉన్నత స్థానం నుంచి భ్రష్టమైపోయింది. యింట్లోంచి ఉద్వాసన జరక్కపోయినా ఆమె స్థితిలో పతనం

సంభవించి కుట్టుమనిషిగా వుండిపోయి, నెత్తికి లేసుటోపీ బదులుగా రుమాలు కట్టు కోవాల్సివచ్చింది. అందరికీ ఆశ్చర్యం కలిగించేటట్టుగా అగాఫ్య యీ దెబ్బని నోరుమెదప కుండా భరించింది. అప్పటికి ఆమెకి ముప్ఫైయేళ్ళు, పిల్లలు చనిపోయారు, భర్త కూడా ఎక్కువ కాలం బతకలేదు. ఆమె యింగితం తెలుసుకోవాల్సిన సమయం వచ్చింది, తెలుసు కుంది కూడా. ఆమె చాలా ముభావంగా, దైవభక్తిపరురాలిగా తయారైంది. ఒక ప్రార్థన సమావేశంగాని, భజన కార్యక్రమంగాని మానలేదు. తన మంచి బట్టలన్నిటినీ దానం చేసే సింది. పదిహేనేళ్ళు ఆమె ప్రశాంత, సాధు, సాదా జీవితం గడిపింది. ఎవళ్ళతోటీ పోట్లాడ లేదు, ప్రతివాళ్ళకీ అణిగి మణగి వుండేది. యెవళ్ళేనా అవమానపరిస్తే వాళ్ళకి నమ్రతగా వందనం చేసి, ధర్మోపన్యాసానికి కృతజ్ఞురాలిగా వుండేది. ఆమె యజమానురాలు ఆమెని యెప్పుడో క్షమించింది, అనుగ్రహపాత్రురాలిని చేసుకుంది, తన టోపీ కూడా యిచ్చేసింది. కాని అగాఫ్య తన రుమాలుని వదల్లేదు, యెప్పుడూ నల్లని బట్టల్నే వేసుకునేది. ఆమె యజమానురాలి మరణం తర్వాత యింకా వినయంగా, సాధువుగా తయారైంది. మామూ లుగా, ఒక రష్యను భయానికీ, అనురాగానికీ త్వరగా లొంగుతాడు; కాని అతన్నుంచి గౌరవం మాత్రం సులభంగా లభించదు, అది త్వరగానూ రాదు, విచక్షణ లేకుండానూ రాదు. యింట్లో వున్న ప్రతిఒక్కళ్ళకీ అగాఫ్య అంటే మంచి గౌరవం వుంది. గత దోషాలని యెవళ్ళూ ప్రస్తావించలేదు, అవియేవో పాత యజమానుడితోబాటుగానే భూస్థాపితం అయి పోయినట్టుగా.

కలీతిన్ మార్ఫ దిమ్త్రియెవ్నాని పెళ్ళిచేసుకున్నాక, అగాఫ్యకి యింటి బాధ్యతని అప్ప గించాలనుకున్నాడు; కాని ఆమె "పాపకార్యములకి పురిగొల్పడం అనే భయం" వల్ల లొంగ లేదు. అతను ఆమెని గట్టిగా గదమాయించే సరికి మెదలకుండా వందనం చేసి గదిలోనుంచి అవతలికి వెళ్ళిపోయింది. మనుషుల్ని అంచనాకట్టడంలో కలీతిన్ తెలివితక్కువ వాడేం కాదు. అతను అగాఫ్యని కూడా అంచనాకట్టి యెన్నటికీ మరిచిపోలేదు. అతను పట్టణానికి మకాం మార్చినప్పుడు, ఆమె అంగీకారంతోనే, అప్పుడు అయిదో యేడు నడుస్తున్న లీజాకి దాదిగా నియమించాడు.

బింకంగా, గంభీరంగా పని చేసే కొత్త దాది అంటే లీజా మొదట్లో భయపడింది, కాని త్వరలోనే అలవాటుపడి ఆమెని చాలా అభిమానించింది. తనే గంభీరంగా వుండే పిల్ల. ఆమెలో తండ్రి తాలూకు శుద్ధ నియమభరిత లక్షణాలు వున్నాయి. ఒక్క ఆమె కళ్ళే అతని పోలికవి కావు. ఆ కళ్ళకి పిల్లల్లో అరుదుగా కనిపించే మృదుత్వం, దయ వుండేవి. ఆమె ఆట బొమ్మలని యెప్పుడూ పట్టించుకోలేదు, ఆమె నవ్వు గట్టిగానూ వుండేది కాదు, దీర్ఘంగానూ వుండేది కాదు, ఆమె ఆరిందాలా వుండేది. ఆమెది అలవాటుగా ఆలోచనా మగ్నమై వుండే మానసిక ప్రవృత్తి కాదు గాని, ఆలోచనకి మేత మాత్రం ఆమెకి కొరత వుండేది

కాదు. కొంచెం సేపు నిశ్శబ్దంగా వున్న తర్వాత ఆమె మామూలుగా పెద్దవాళ్లని యేదేనా ప్రశ్న అడిగేది. ఈ కొత్త అనుభూతి గురించి ఆమె ఆలోచిస్తున్నదని దానివల్ల తెలిసేది. గునుస్తూ ముద్దమాటలు మాట్లాడ్డం యెంతో చిన్నతనంలోనే మానేసింది. మూడేళ్ల వయస్సప్పుడే స్పష్టంగా మాట్లాడేది. ఆమెకి తండ్రి అంటే భయం. తల్లి పట్ల వుండే అభిప్రాయాలు అనిర్దిష్టంగా వుండేవి. అంటే ఆమె భయపడనూ లేదు, ప్రేమచూపించనూ లేదు. ఆమె అగాఫ్య అంటే కూడా ప్రేమచూపించలేదు, ఆమెని మాత్రమే తను అభిమానించినప్పటికీ. ఆమెతోడు లేకుండా అగాఫ్య యెన్నడూ కనిపించలేదు. యిద్దరూ కలిసి వింత దృశ్యంగా వుండేవారు. అగాఫ్య మొత్తం నల్లని బట్టలు తొడుక్కుని నెత్తిమీద నల్లని రుమాలు చుట్టుకుని, అంటుకుపోయి మైనంలా వుండి అయినా అందంగా భావస్ఫోరకంగా వుండే వదనంతోటి, మేజోళ్లు కుడుతూ నిబ్బరంగా కూర్చునేది. అప్పుడు లీజా ఒక చిన్న చేతుల కుర్చీలో ఆమె కాళ్ల దగ్గర కూర్చుని, అలాగే యేదో పనిలో మునిగిపోయో లేదా అగాఫ్య చెప్పేది కళ్లప్పగించి చూస్తూ వింటూనో వుండేది. అగాఫ్య ఆమెకి అద్భుత కథలు చెప్పేది కాదు, పవిత్ర కన్య గురించీ, ఋషుల, సాధువుల జీవితాల గురించీ, పతివ్రతల గురించీ, వాళ్లూ యెలా మోక్షం పొందిందీ దాన్ని గురించీ, వాళ్లు ఆకలి దారిద్ర్యం అనుభవించిందీ వాటిని గురించీ, చక్రవర్తులంటే యెలా భయపడకుండా వుండి క్రీస్తుని నమ్ముకుని వున్నదీ దాన్ని గురించీ, ఆకాశంలోని పక్షులు వాళ్లకి యెలా ఆహారం తెచ్చిపెట్టిందీ, అడవిలోని మృగాలు వినయంగా వాళ్లకి వందనం చేసిందీ దాన్ని గురించీ, వాళ్ల రక్తం చిందిన చోట యెలా పువ్వులు మొసులెత్తిందీ దాన్ని గురించీ వర్ణించేది. ''పాతగోడల పై పెరిగే సువాసన పూలా?'' అని ఒక సారి లీజా అడిగింది — ఆమెకి పువ్వులంటే యిష్టం. అగాఫ్య లీజాతోటి గంభీరంగా, అయినా వినయంగా, సంగతి ఎరిగి అంతటి పవిత్రమైన ఉన్నతమైన మాటలు చెప్పడం తనకి యుక్తం కాదన్నట్లు మాట్లాడేది. లీజా ఆమె చెప్పే మాటలని భక్తి శ్రద్ధలతో వినేది. సర్వశక్తిమంతుడైన సర్వాంతర్యామి భగవంతుని బొమ్మ మధురమైన శక్తితోటి ఆమె హృదయంలోకి, దాన్ని స్వచ్ఛమైన భక్తి భావంతో నింపేస్తూ ప్రవేశించింది. క్రీస్తు చేరువగా, సన్నిహిత మిత్రునిగా, యెవరో ఆత్మబంధువుగా అయిపోయాడు. అగాఫ్య ఆమెకి ప్రార్థన చెయ్యడం కూడా నేర్పింది. ఒకో అప్పుడు ఆమె లీజాని తెల్లవారుతూనే లేపేసేది, హడావుడిగా బట్టలు తొడిగేసి, ఆమెని తీసుకుని ఉదయం ప్రార్థనకి జారిపోయేది. లీజా ఉగ్గబట్టుకుని మునివేళ్లమీద వెనక్కాలే నడిచివెళ్లేది. ప్రభాత సమయపు చలి, చల్లగా, ఖాళీగా వుండే చర్చి, యిలా రహస్యంగా రావడంపోవడం, మళ్లీ గుట్టుగా మంచమెక్కెయ్యడం — యివన్నీ కూడా యేదో అడ్డగించిన, వింతైన, పవిత్రమైన భావంతో కలిసిపోయి ఆ పిల్లని హృదంతరాళంలో కంటా పులకింపచేసేవి. అగాఫ్య యెవర్నీ యెన్నడూ నిందించలేదు, అల్లరి చేస్తున్నందుకు లీజాని కూడా యెన్నడూ కేకలు వెయ్యలేదు. యేదేనా

నచ్చకపోతే ఆమె గమ్ముగా వుండిపోయేది, లీజాకి తెలుసు ఆ నిశ్శబ్దపు అర్థం యేమిటైం
దీపీ. చిన్న పిల్లలకి వుండే చురుకైన సహజగ్రహణ శక్తితోటి అగాఫ్య యెవరితోనేనా —
మార్య దీమ్త్రియెవ్నాతోగాని, కలీతిన్‌తోటేగాని చిరాకుపడితే, అర్థంచేసుకునేది. మేదాం
మొరో తననుంచి లీజా బాధ్యతతీసుకునే నాటికి, మూడేళ్ళ అగాఫ్య లీజా సంరక్షణ చూసింది.
ఆ చవిటబ్బర ఫ్రెంచి ఆవిడ "ఇదంతా చెత్త" అనే లాంటి మాటలతోటే, నిరుత్సాహ
పూరిత ప్రవర్తనతోటే లీజా హృదయంలో ఆమె ప్రియమైన దాది స్థానం పొందలేక
పోయింది. ఆ విత్తనాలు హృదయంలో లోతుగా నాటుకుపోయాయి. పైగా, అగాఫ్య లీజా
సంరక్షణ చూడకపోయినా, యింకా యింట్లోనే వుండేది. లీజా తరచు తన దాదిని చూసేది,
ఆమె వునికి యింకా తనకి నిజంగానే వుండేది.

మార్ఫ తిమొఫేయెవ్నా కలీతిన్ల యింట్లో వుండటానికి వచ్చినప్పుడు అగాఫ్యకీ ఆమెకీ
సరిపడలేదు. ముంగోపి స్వాతిశయపు ముసలావిడకి తమ పూర్వపు రైతు కూతురి హోదా
అయిన గంభీరమైన ధోరణి నచ్చలేదు. అగాఫ్య యేదో యాత్రకి పోతానని చెప్పి వెళ్ళిపోయి,
మళ్ళీ తిరిగిరాలేదు. ఆమె ఒక సన్యాసుల మఠంలో కలిసిపోయిందని కర్ణాకర్ణిగా తెలిసింది.
కాని ఆమె లీజామీద వేసిన ముద్రమాత్రం చెరగనిది. లీజా ప్రార్థనకి వెడుతూనే వుండేది,
దానికోసం పండగలాగా యెదురుచూసేది, సంతోషంగా, బెరుకుగా ఒక రకమైన హద్దులో
పెట్టుకున్న ఉత్సాహంతోటి ప్రార్థన చేసేది. అది మార్య దీమ్త్రియెవ్నా గుట్టుగా ముక్కు
మీద వేలేసుకోవడానికి కారణం అయేది. మార్ఫ తిమొఫేయెవ్నా కూడా, ఆమె యెన్నడూ
లీజా స్వేచ్ఛకి అడ్డురాకపోయినా, అతి ఉత్సాహన్ని తగ్గించడానికీ, ఆ పిల్ల అనేక సార్లు
సాష్టాంగ నమస్కారాలు చెయ్యడం మాన్పించడానికీ ప్రయత్నం చేసింది. ఆవిడ దృష్టిలో
అది గొప్పయింటి పిల్లకి తగదు. లీజా బాగానే చదివేది, అంటే శ్రద్ధగా. ఆమెకి
ప్రత్యేకమైన తెలివితేటలుగాని, అద్భుతమైన సామర్థ్యంగాని లేవు. కష్టపడి కృషిచేసి నేర్చు
కునేది. ఆమె పియానో బాగానే వాయించేది. కాని అది ఆమెకి యెంత మూల్యం అవు
తుందో ఒక్క లెమ్‌కి తెలుసు. ఆమె యెక్కువ చదివేది కాదు. ఆమెకి తన "సొంత
మాటల"వేవి లేవు. కాని ఆమె సొంత ఆలోచనలుండేవి. సొంత దారి వుండేది. ఆమె ఆ
తండ్రి కూతురన్నది వూరికేనే కాదు: అతను కూడా యెప్పుడూ యెవర్నీ యేం చెయ్యమా
అని సలహా అడిగిన వాడు కాదు. ఆరకంగా ఆమె శాంతంగా, నిదానంగా పంధొమ్మిదేళ్ల
ప్రాయం దాకా పెరిగింది. తనకి తెలియకుండానే ఆమె మనోహరంగా వుండేది. ఆమె
ప్రతి కదలికా అనుకోని, కొంచెం యింపుగాలేని సొగసుతో వుండేది. ఆమె కంఠస్వరం
స్పృశించని యువశక్తి తాలూకు రజిత కంపనంలా వుండేది. పిసరు సంతోషభరిత అను
భూతి కూడా ఆమె పెదాలమీదకి చిరునవ్వుని తెప్పించేది, ఆమె కళ్లని లోతైన లాలిత్య
భరిత తేజస్సుతో వెలగించేది. నిశితమైన కర్తవ్య దీక్షతో నిండిపోయి, యెవళ్ళనేనా గాయ

పరుస్తానేమోనని భయపడి, దయ, సానుభూతి నిండిన హృదయంతో ఆమె అందర్నీ ప్రేమించేది, ప్రత్యేకించి యెవళ్లనీ ప్రేమించలేదు. ఒక్క భగవంతుణ్ణి మాత్రమే ఆమె పారవశ్యంతో, బెరుగ్గా, మృదువుగా ప్రేమించింది. ఆమె ప్రశాంత ఆంతరంగిక జీవితాన్ని కలచిన మొదటి వాడు లవ్రేత్స్కీయే.

లీజా అలాంటిది.

## 36

ఆ మర్నాడు, ఉదయం పదకొండు దాటిన కొంచెం సేపటికి లవ్రేత్స్కీ కలీతిన్ల యింటికి వెళ్లాడు. దారిలో అతనికి పాన్‌షిన్ తటస్థపడ్డాడు. అతను గుర్రంమీద స్వారీ చేస్తూ, టోపీ కనుబొమలమీదకి లాక్కుని లవ్రేత్స్కీని దాటిపోయాడు. కలీతిన్ల యింటి దగ్గర అతన్ని యెవరూ ఆదరించలేదు, వాళ్లతో పరిచయమైన తర్వాత మొదటి సారిగా అలా జరిగింది. మార్య ద్మీత్రియెవ్నా యింకా మంచం దిగలేదులా వుంది. అమ్మగారికి తల నొప్పిగా వుందని నౌకరు మనిషి అన్నాడు. మార్ఫ తిమొఫేయెవ్నా, ఎలిజవేతా మిహైలొవ్నా యింటి దగ్గర లేరు. లీజాని కలుసుకోవచ్చుననే నీరసపు ఆశతోటి లవ్రేత్స్కీ తోటలో పచారుచేశాడు, గాని అతనికి యెవరూ కనిపించలేదు. అతను మళ్లీ రెండు గంటల్లో వెనక్కి యింట్లోకి వెళ్లాడు గాని నౌకరు మనిషి మళ్లీ అదే విషయం చెప్పాడు. అతను యితనికేసి అనుమానంగా చూశాడు. ఒకే రోజున మూడు సార్లు అక్కడికి వెళ్లడం బాగోదని అనుకొని లవ్రేత్స్కీ కొన్ని చూడాల్సిన పనులని చక్కబెట్టడం కోసం వసీల్యెవ్స్కాయె వెళ్లిపోదామనుకున్నాడు. దారిలో అతను పథకాలు వేశాడు. ప్రతీదీ ముందటి దాని కంటే ఆశావహమైందే. కాని అతను మేనత్తగారి చిన్న గ్రామం చేరేటప్పటికి అతని ఉత్సాహం అడుగంటింది. అతను అన్‌తోన్‌తో మాట్లాడ్డం మొదలుపెట్టాడు. కర్మ అల్లా వుండబట్టి ఆ ముసలాడికి వున్న వన్నీ పీడ జ్ఞాపకాలే. గ్లఫీర పెత్రోవ్నా చనిపోయే ముందు తన చెయ్యి తనే యెలా కొరుకున్నదీ అతను చెప్పాడు. కొంచెం సేపు ఆగి మళ్లీ అన్నాడు: ''అయ్యా, ప్రతి మనిషి తనని తనే కొరుక్కు తింటాడండీ'' అని. లవ్రేత్స్కీ మళ్లీ పట్టణానికి తిరిగిపోయేటప్పటికి పొద్దుపోయింది. అంతకు ముందునాటి సంగీతస్వరాలు అతన్ని వెంటాడుతున్నాయి, మృదువైన స్వచ్ఛతతోటి లీజా విగ్రహం మనోఫలకం ముందు నుంచుంది. ఆమె తనని ప్రేమించిందన్న ఆలోచన అతన్ని సంతోషంతో ఉక్కిరిబిక్కిరి చేసింది. అతను తన బసకి నిశ్శబ్దంగా, సంతోషంగా వెళ్లిపోయాడు.

హాల్లోకి అడుగుపెట్టగానే అతనిమీద దాడిచేసింది మరువం వాసన. అతనికి అదంటే అసహ్యం. పెద్ద ప్రయాణం పెట్టెలూ, సూటుకేసులూ అక్కడ వున్నాయి. పరిగెత్తుకుని

అతని దగ్గరికి వచ్చిన నౌకరు ముఖం వింతగా వుంది. ఏమిటి జరిగిందీ అని నితర్కించుకో కుండానే అతను డ్రాయింగ్ రూం గడప దాటాడు... అతను లోపలికి వెళ్లగానే జాలరున్న నల్లని సిల్కు బట్టలు తొడుక్కున్న ఆడావిడ సోఫాలోనుంచి లేచినుంచుంది. సన్నటి నాణ్యమైన జేబురుమాలు పాలిపోయిన ముఖంమీదకి యెత్తిపట్టుకుని, ఆమె కొన్ని అడుగులు ముందుకు వేసి, చక్కగా దువ్వుకుని సువాసనలీనే తలని వంచి — అతని పాదాలమీద వాలింది. అప్పుడే అతను ఆమెని గుర్తుపట్టాడు. ఆమె అతని భార్య.

అతనికి వూపిరి సలపలేదు, గోడకి ఆసరా కోసమని ఆనుకున్నాడు.

"థియొడోర్, యేమండీ నన్ను గెంటయ్యకండి!" అని ఆమె ఫ్రెంచ్‌లో అంది. ఆమె గొంతుక కత్తిలాగా అతని గుండెని దూసింది.

అతను ఆమెకేసి శూన్యంగా చూశాడు. కాని ఆమె తెల్లగా, జబ్బుపడ్డట్టుందని గమనించాడు.

"ఏమండీ" అని ఆమె మళ్లీ మొదలుపెట్టింది, అప్పుడప్పుడు కళ్లు పైకి యెత్తుతూ, గులాబీ రంగు వేసిన వేళ్లున్న అతి చక్కటి చేతుల్ని నులుముకుంటూ; "నేను మీకు అన్యాయం చేశాను — వుహుం, నేను పాపిష్టిదాన్ని, కాని నేను చెప్పేది సాంతం వినండి. నేను పశ్చాత్తాపంతో మగ్గిపోతున్నాను. నాకు నేనే భారమైపోయాను; నా స్థితిని యిక నేను భరించలేకపోయాను, యెన్నో సార్లు మిమ్మల్ని ప్రాధేయపడదామనుకున్నాను, కాని మీకు కోపంగా వుందని భయం వేసింది. నేను గతంతోటి తెగతెంపులు చేసుకున్నాను.... వ్యుయి, జె ఎటె సి మలద్, నాకు యెంతో జబ్బుగా వుంది" అందామె చేత్తోటి కనుబొమలూ, చెక్కిళ్లూ తుడుచుకుంటూ. "నేను చనిపోయాననే పుకారు వార్తని ఆధారం చేసుకుని ఆ జీవితాన్ని వదిలిపెట్టేద్దామని అనుకున్నాను. పగలూ, రాత్రీ అని లేకుండా యిక్కడికి పరిగెత్తుకునివచ్చాను. నా తీర్పరి అయిన మీ ముందుకు రావడానికి ధైర్యం చిక్కబట్టుకొనేందుకు చాలా సందేహించాను, — పర్లే్ దెవంత్ వ్యూ, మోం జ్యాగ్, కాని ఆఖరికి ధైర్యం చిక్కబట్టుకున్నాను, మీరు యెప్పుడూ యెంత జాలిగుండె వాళ్లం యిదీ గుర్తుకుతెచ్చుకుని. మాస్కోలో మీ చిరునామా దొరికింది. నన్ను నమ్మండి" అని ఆమె చెబుతూనే వుంది, మెల్లిగా నేలమీదనుంచి లేచి, చేతుల కుర్చీ అంచున కూర్చుంటూ. "ఎన్నో సార్లు చనిపోదామనే ఆలోచన బుర్రలోకి వచ్చింది, అలాంటిదంటే నాకు జంకూ లేదు — అబ్బా, జీవితం భరించలేని భారం అయింది నాకు యిప్పుడు! — కాని నా కూతురు వుందన్న ఆలోచన, నా చిట్టితల్లి ఆడా వుందన్న ఆలోచన, నన్ను కట్టిపడేసింది. పాప యిక్కడే వుంది. పక్క గదిలో నిద్రపోతోంది, వెర్రి పిల్ల! బాగా నలిగిపోయింది. మీరు చూద్దురు గాని. ఆమె మీ ముందు అమాయకురాలు. ఓ, నా దౌర్భాగ్యం, దౌర్భాగ్యం!" అని మదాం లవ్రేత్‌స్కయా అరిచి, వలవలా యేడ్చేసింది.

ఆఖరికి బ్రవేత్స్కీ తనని తాను కూడదీసుకున్నాడు. అతను గోడ దగ్గర్నుంచి పోయి గుమ్మం దగ్గరికి వెళ్లాడు.

''వెళ్లిపోతున్నారా?'' అని ఆమె విచారంగా అరిచింది. ''అబ్బా, ఎంత కఠినత్వం! ఒక్క మాటా, పలుకూ అనకుండా కనీసం ఒక్క సారి తిట్టను కూడా తిట్టకుండా.... యీ యేవగింపు భయంకరమైంది, యిది నన్ను చంపేస్తుంది.''

బ్రవేత్స్కీ ఆగాడు.

''నేను యేం చెబితే వినాలనుకుంటున్నావు?'' అన్నాడు మణిగిపోయిన గొంతుకతో.

''యేం లేదు, యేం లేదు'' అని ఆమె గబగబా అడ్డం వచ్చింది. ''యేమీ అడిగే హక్కులేదని నాకు తెలుసు. నేను పిచ్చిదాన్ని కాదు, నమ్మండి. నాకు నిష్కృతిలేదు, మీరు క్షమిస్తారని ఆశించే సాహసం కూడా లేదు. నేను యేం చెయ్యాలో, యెక్కడ వుండాలో ఆజ్ఞాపించమని అర్థిస్తున్నాను. మీ ఆజ్ఞని శిరసావహిస్తాను, అవి యేమైనా సరే, ఒక బానిస లాగా.''

''నీకు యివ్వాల్సిన ఆజ్ఞలేమీ నాకు లేవు'' అన్నాడు బ్రవేత్స్కీ, యే భావమూ ద్యోతకం కాని గొంతుకతో. ''మనిద్దరి మధ్యా అంతా ముగిసిపోయిందని నీకు తెలుసు.... యిప్పుడు మరీసీ. నీ కిష్టమైన చోట యెక్కడేనా నువ్వుండవచ్చు; నీ భరణం చాలక పోయినట్లయితే....''

''అయ్యో, అలాంటి భయంకరమైన మాటలు అనకండి'' అంది వర్వార పావ్లొవ్నా. ''దయచేసి నన్ను మన్నించి.... కనీసం యీ పసిదాని కోసం...'' అంటూ ఆమె పక్క గది లోకి పరిగెత్తివెళ్లి ముచ్చటగా ముస్తాబుచేసిన చిన్నపిల్లని చేతుల్లో పట్టుకుని తీసుకు వచ్చింది. పొడుగాటి చక్కని గిరజాలు ఆ పిల్ల గులాబీ రంగు ముఖంమీదా, నల్లని నిద్రమత్తు కళ్లమీదా పడుతున్నాయి. ఆ పిల్ల ముడతలుపడే చిన్న చేతిని తల్లి మెడమీద వేసి, వెలుతురికి కళ్లు చికిలించి చిరునవ్వునవ్వింది.

''ఆడా, వు సె తొన్ పేర్''* అంది వర్వార పావ్లొవ్నా, గిరజాలు ఆమె కళ్లమీద నుంచి తప్పించి, ముద్దుపెట్టుకుంది, ''ప్రి ల్యో అవెక్ మువా.''**

''సె సా పపా''*** గారంగా చెప్పింది ఆ పిల్ల.

''కీ, మొం అన్ఫాన్, నె ఎస్ ప త్యు లెమ్?''****

---

* ''ఆడా, చూడు యిదిగో మీ నాన్న'' (ఫ్రెంచి).

** ''నాతోసహా ఆయన్ని బతిమాలు'' (ఫ్రెంచి).

*** ''మా నాన్న'' (ఫ్రెంచి).

**** ''నా చిట్టితల్లి, అతన్ని ప్రేమిస్తున్నావ్, ఏమిటి?'' (ఫ్రెంచి.)

ల్రవేత్స్కీ యిదంతా భరించలేకపోయాడు.

"యే మెలోడ్రామాలో యిలాంటి రంగం వుంది?" అని గొణుక్కుని, అతను అవతలికి వెళ్ళిపోయాడు.

వర్వార పావ్‌లొవ్నా కొన్ని క్షణాలు నిశ్చలంగా నుంచుని అప్పుడు భుజాలు కొంచెం యెగరేసి, ఆ చిన్న పిల్లని పక్క గదిలోకి తీసికెళ్ళి, బట్ట తీసేసి, పడుకోబెట్టింది. అప్పుడొక పుస్తకం తీసుకుని దీపం పక్కనే కూర్చుని, ఓ గంట సేపు నిరీక్షించి, నిద్రపోయింది.

"ఎ బ్యాం, మదాం?"* అని ఆమె పారిస్‌నుంచి తీసుకువచ్చిన ఫ్రెంచి పనిమనిషి అంది, తను బాడీ విప్పుకుంటూ వుంటే.

"ఎ బ్యాం,** జస్తీన్" అని అంది వర్వార పావ్‌లొవ్నా. "కొంచెం పెద్దవాడు అయినట్టుంది. కాని యెప్పటిలాగా కనికరంగానే వున్నాడు. యేవీ, నా రాత్రి గ్లవ్స్ యిలా యియ్యి. రేపటికి మెడ బొత్తం బూడిద రంగు గౌను తీసివుంచు. అడా కోసం మాంసం ముక్కలు మర్చిపోవద్దు. యిక్కడ అవి దొరకాలంటే మహా యాతన. అయినా ప్రయత్నించాలి."

"అ ల గెర్ కొమ్ అ ల గెర్"*** అంది జస్తీన్. అప్పుడు కొవ్వొత్తి ఆర్పేసింది.

## 37

ల్రవేత్స్కీ వూళ్ళోని వీధుల్లో రెండు గంటలకి పైగా తిరిగాడు. పారిస్ శివార్లలో గడిపిన ఆ రాత్రి అతనికి గుర్తుకువచ్చింది. అతని హృదయమంతా దిగులుతో నిండిపోయింది. అతని బుర్ర మొద్దు బారిపోయి, నిశ్చేష్టితమైపోయింది. అదే నల్లని, అర్థరహిత, ఉన్మాదకర ఆలోచనలతో సుళ్ళుతిరిగిపోతోంది. "ఆమె బతికే వుంది, తిరిగి వెనక్కి వచ్చింది," అని యెప్పటికప్పుడే కొత్తగా వుండే ఆశ్చర్యంతో అనుకున్నాడు. లీజాని పోగొట్టుకున్నట్టే అతనికి అనిపించింది. ఆగ్రహం అతనికి వూపిరి ఆడకుండా చేసింది. యీ దెబ్బ అతనికి పిడుగుపాటులా పడింది. అయినా తను చొల్లుకార్చుకునే ఆ వ్యాసాన్ని, ఆ కాగితం ముక్కని నమ్మడమేమిటి? "సరే, నేను నమ్మలేదే అనుకున్నా దానివల్ల పెద్ద ఒరిగేదేమిటి?" అనుకున్నాడతను. లీజా నన్ను ప్రేమిస్తున్నదని నాకు తెలిసి వుండేది కాదు, ఆమెకీ తెలిసి వుండేది కాదు." అతను తన భార్య రూపాన్ని, ఆమె గొంతుకని, కళ్ళని తన ముందునుంచి తప్పించుకోలేకపోయాడు. తనని తను శపించుకున్నాడు, మొత్తం లోకాన్ని శపించాడు.

---

* "ఎలాగుంది మదాం?" (ఫ్రెంచి.)

** "ఫరవాలేదు" (ఫ్రెంచి).

*** "యుద్ధంలో యుద్ధం లాగ" (ఫ్రెంచి).

తెల్లవారే ముందు అలిసిపోయి, అలుక్కుపోయి లెమ్ దగ్గరికి వెళ్లాడు. చాలా సేపు తలుపు కొట్టినా యెవరూ పలకలేదు. ఆఖరికి రాత్రి టోపీ పెట్టుకున్న ఆ ముసలాయన తల కిటికీ దగ్గర ప్రత్యక్షమైంది. కటువుగా, కుంచించుకుపోయి కనిపించాడు అతను. యిరవై నాలుగు గంటలకితం మహోదాత్త కళాత్మకతవల్ల ఉద్భవించిన నైష్ఠిక మహోన్నత్వంతోటీ లవ్రేత్స్కీని వీక్షించిన ఉత్తేజిత వదనం యిక యెంత మాత్రమూ కాదది.

''ఏమిటది?'' అని అడిగాడు లెమ్. ''ప్రతి రోజు రాత్రీ మీకోసం వాయించలేను. నేను కషాయం తాగాను'' అన్నాడు లెమ్.

లవ్రేత్స్కీ ముఖం చిత్రంగా కనిపించి వుంటుంది, యేమంటే ఆ ముసలాయన చేతులతో కళ్లు కప్పుకున్నాడు, ఆవేళప్పుడు వచ్చిన అతిథిని నఖశిఖ పర్యంత్యం పరిశీలించాడు, అప్పుడు తలుపు తీశాడు.

లవ్రేత్స్కీ గదిలోకి వచ్చి, కుర్చీలో కూలబడ్డాడు. ఆ ముసలాయన, యీనులు లేచిపోయిన డాబు నైట్ గౌను యీడ్చుకుంటూ, వణుకుతూ, పెదాలు కొరుకుతూ, అతని ముందు నిలబడ్డాడు.

''మా ఆవిడ వచ్చింది'' అన్నాడు లవ్రేత్స్కీ. అతను పైకి చూసి, ఒక సారి నిరుత్సాహభరితంగా నవ్వాడు.

లెమ్ ముఖంలో ఆశ్చర్యం కనిపించింది, కాని ఆయన చిరునవ్వు కూడా నవ్వలేదు. నైట్ గౌనుని యింకా దగ్గరసా లాక్కున్నాడు అంతే.

''మీకు తెలీదేమో బహుశా'' అన్నాడు లవ్రేత్స్కీ. ''నేను అనుకున్నాను.... ఆమె చచ్చిపోయిందని పేపర్లో చదివాను.''

''ఓహో! అది చదివి చాలా కాలమవలేదేమో?'' అని అడిగాడు లెమ్.

''వుహు, చాలా కాలం అవలేదు.''

''ఓహో!'' అని రెట్టించాడు ముసలాయన, కనుబొమ లెగరేస్తూ. ''అయితే ఆమె యిప్పుడు వచ్చిందన్నమాట.''

''అవును. ఆమె యిప్పుడు మా యింటి దగ్గరుంది; నేను... నేను దురదృష్టవంతుణ్ణి.''

అతను కటువుగా నవ్వాడు.

''మీరు దురదృష్టవంతులు'' లెమ్ మెల్లిగా ఆ మాటనే తిరిగి అన్నాడు.

''క్రిస్టఫర్ ఫ్యోదొరొవిచ్ నా తరపున ఒక ఉత్తరం అందజేసి పెడతారా?'' అని అడిగాడు లవ్రేత్స్కీ.

''ఊఁ, అలాగా? ఎవరికి?''

''ఎలిజవేతా...''

''ఆఁ, అలాగే, అలాగే, అర్థమైంది. సరే, యెప్పుడు యివ్వాలి?''

''రేపు. యెంత త్వరగా వీలైతే అంత త్వరగా.''

''హుమ్. మా వంటమనిషి కాథరైన్‌ని పంపిస్తా. వుహుఁ, నేనే వెడతాను.''

''మరి దానికి జవాబు కూడా తెస్తారా?''

''ఊఁ.''

లెమ్ నిట్టూర్చాడు.

''నిజమే, ప్రియ మిత్రమా, పాపం, మీరు దురదృష్టవంతులు.''

ల్రవేత్‌స్కీ లీజాకి ఓ నాలుగు ముక్కలు రాశాడు. తన భార్య రాక గురించి చెప్పాడు, ఆమెని చూడ్డానికి తనకి అవకాశం యివ్వవలసిందిగా అడిగాడు. అప్పుడు సన్నగా వున్న సోఫామీద వాలి ముఖం గోడకేసి తిప్పుకున్నాడు. ముసలాయన మంచంమీద పడుకుని, తెరిపి లేకుండా అటూ యిటూ దొర్లుతూ, దగ్గుతూ, కషాయం తాగుతూ వున్నాడు.

తెల్లవారింది. యిద్దరూ లేచారు. యిద్దరూ ఒకళ్లనొకళ్లు వింతగా చూసుకున్నారు. ల్రవేత్‌స్కీ ఆ క్షణంలో ఆత్మహత్య చేసుకుందా మనుకున్నాడు. వంటమనిషి కాథరైన్ కొంచెం దరిద్రమైన కాఫీ తెచ్చింది. గడియారం యెనిమిది కొట్టింది. లెమ్ టోపీ పెట్టుకుని, తను కలీతిన్ల యింట్లో పాఠం పది గంటలకి చెబుతాననీ, అయినా యేదో సాకు చూస్తాలెమ్మని చెప్పి బయల్దేరి వెళ్లిపోయాడు. ల్రవేత్‌స్కీ మళ్లీ సోఫామీద వాలిపోయాడు. కటువైన నవ్వు కొత్తగా అతని హృదంతరాళంలో నిండిపోయింది. తన భార్య యెలా తనని యింట్లోనుంచి గెంటివేసిందో తలుచుకున్నాడు. లీజా స్థితిని గురించి తలుచుకున్నాడు, కళ్లు మూసుకుని చేతులు రెండూ తల వెనక మడుచుకున్నాడు. ఆఖరికి లెమ్ వచ్చి ఒక కాగితం అతనికి యిచ్చాడు. దానిమీద లీజా పెన్సిల్‌తోటి రాసింది: ''మనం యివాళ కలుసుకోలేం. బహుశా రేపు సాయంత్రం. సెలవు.'' ల్రవేత్‌స్కీ పొడిగా, పరాకుగా లెమ్‌కి కృతజ్ఞతలు చెప్పి యింటికి వెళ్లిపోయాడు.

భార్య నాస్తా తింటోంది. నీలం రిబ్బన్లతోటి వున్న చిన్న తెల్లని ఫ్రాకు తొడుక్కుని, తలంతా గిరజాలు తిరిగి వున్న (ఆ చిన్న పిల్ల) ఆడా మాంసం ముక్కలు తింటోంది. ల్రవేత్‌స్కీ లోపలికి అడుగెట్టగానే వర్వార పావ్‌లొవ్నా ఠకీమని లేచి నుంచుని, అణిగిమణిగి వుండేటట్టు కనిపిస్తూ అతనికేసి ముందుకు నడిచింది. ఆమెని తను చదువుకునే గదిలోకి రమ్మని చెప్పి, లోపలనుంచి గడియవేసుకుని, గదిలో అటూ యిటూ పచార్లు చెయ్యడం మొదలుపెట్టాడు. ఆమె చేతులు జోడించి కూర్చుని, కొంచెం షోకు చేసుకున్నప్పటికీ, యింకా అందంగా వున్న కళ్లతో అతని కదలికల్ని చూస్తూనేవుంది.

ల్రవేత్‌స్కీ కొంచెం సేపటిదాకా మాట్లాడలేకపోయాడు. తనమీద తనకి పట్టు లేనట్టు అతనికి అనిపించింది. వర్వార పావ్‌లొవ్నాకి తనంటే యెంత మాత్రం భయం లేదనీ,

వూరికే యే క్షణంలోనేనా మూర్ఛగొట్టిపడిపోతున్నట్టు నటిస్తున్నదనీ అతను స్పష్టంగా గమనించాడు.

"చూడు, మేడమ్" అని మొత్తంమీద అతను మొదలుపెట్టాడు, భారంగా నిశ్వసిస్తూ, పళ్లు బిగపట్టి. "ఒకొళ్లకొకళ్లం నటించుకుని లాభం లేదు. నీ పశ్చాత్తాపం మీద నాకు నమ్మకం లేదు. ఒక వేళ అది నిజమే అయినా, నేను మళ్లీ వెనక్కి తిరిగిరావడం, నీతో కాపరం చెయ్యడం అసాధ్యం."

వర్వార పావ్‌లొవ్నా మూతి బిగించుకుని, ఓర కళ్లతో కూర్చునేవుంది. "యిదే అసహ్యమంటే. అంతా అయిపోయింది! నేనిప్పుడతనికి ఆడదాన్ని కూడా కాను" అనుకుంటోంది.

"అసాధ్యం" అని రెట్టించాడు లవ్రేత్‌స్కీ, కోటు బొత్తాలు పైకంటా పెట్టుకుంటూ. "నువ్వు యిక్కడికి యెలా రాగలిగావో కూడా నాకు తెలియదు. బహుశా డబ్బు అయిపోయి వుంటుంది."

"అబ్బా! నన్ను అవమాన పరుస్తున్నారు" అని మెల్లిగా అంది వర్వార పావ్‌లొవ్నా.

"యెమైనప్పటికీ, దురదృష్టవశాత్తూ నువ్వింకా నాకు భార్యవే. నిన్ను యింట్లోంచి గెంటెయ్యలేను.... నా ప్రతిపాదన యిదీ. నువ్వు, యివాళే, కావాలనుకుంటే లావ్రికి వెళ్లిపోవచ్చు. అక్కడ వుండు. అక్కడ మంచి యిల్లు వుంది, నీకు తెలును కదా. నీకు ముట్టే భరణంతో బాటుగా నీకేం కావాలన్నా లభిస్తుంది. సరేనా?"

వర్వార పావ్‌లొవ్నా లేసు అంచులున్న జేబురుమాలు ముఖానికి అద్దుకుంది.

"నేను మీకు యిదివరకే చెప్పాను" అందామె వణికే పెదాలతో, "మీరు నాకు సంబంధించి యేది సబబుగా వుంటుందని మీకు తోచి చేసినా ఒప్పుకుంటానని. నేను ఒక్కటి అర్థిస్తున్నాను — మీ యింతటి మంచితనానికి నన్ను కృతజ్ఞతలు చెప్పనివ్వండి?" అంది.

"యే కృతజ్ఞతలూ అక్కర్లేకుండానే వుందాం, దయచేసి — అలాగే బాగుంటుంది" లవ్రేత్‌స్కీ హడావుడిగా అన్నాడు. "అంచేత" అన్నాడతను తలుపు దగ్గరకు వెడుతూ. "యిక నేను...."

"రేపు నేను లావ్రికి వెడతాను" అని గొణిగింది వర్వార పావ్‌లొవ్నా, గౌరవపూర్వకంగా కూర్చున్న చోటునుంచి లేస్తూ. "కాని ఫ్యోదొర్ ఇవానిచ్".... (ఆమె అతన్ని యిక థియొడోర్ అనడం లేదు.)

"ఏం కావాలి?"

"నాకు యింకా మీనుంచి క్షమాపణ రాలేదు. కాని కాలక్రమేణా వస్తుందని కనీసం ఆశిస్తూ...."

"ఆహా! వర్వార పావ్‌లొవ్నా, నువ్వు తెలివైన దానివి" అని అడ్డం వచ్చాడు లవ్రేత్‌స్కీ.

''నేనూ తెలివితక్కువ వాణ్ణి కాను. నీకు క్షమాపణ పీసరు ఖాతరీలేదని నాకు తెలుసు. నేను నిన్ను యేనాడో క్షమించేశాను. కాని మన యిద్దరి మధ్య అగాధం వుంది.''

''నా అదృష్టం అంతేనని సరిపెట్టుకుంటాను'' అంది వర్వార పావ్‌లొవ్నా తల వంచి. ''నా పాపాన్ని నేను మర్చిపోలేదు. నేను చనిపోయాననే వార్త విని మీరు సంతోష పడివుంటారంటే కూడా నేను ఆశ్చర్యపోను'' అందామె సౌమ్యంగా, లవ్రేత్‌స్కీ బల్లమీద వదిలిపెట్టిన పేపరుకేసి చూపిస్తూ.

ఫ్యొదొర్ ఇవానిచ్ ఉలికిపడ్డాడు. ఆ వ్యాసం పెన్సిల్‌తో గుర్తుపెట్టివుంది. వర్వార పావ్‌లొవ్నా యెప్పటికంటే వినయంగా అతనికేసి చూసింది. ఆ క్షణంలో ఆమె చాలా ముచ్చటగా వుంది. లాఘవంగా, ఆడపిల్లలాగా వుండే ఆమె మూర్తిమీద అంటిపెట్టుకుని వున్న పారిస్ గౌనూ, తెల్లటి కాలర్ చుట్టుకున్న పొంకమైన మృదువైన మెడ, మెల్లిగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో కదిలే ఆమె వక్షస్సు, గాజులుగాని, ఉంగరాలుకానిలేని ఆమె బోసి చేతులూ మొత్తం ఆమె విగ్రహమే, నున్నని జుట్టు వున్న తలనుంచి, కనిపించీ కనిపించని చెప్పుల అంచుదాకా యెంతో సొగసుగా వుంది.

లవ్రేత్‌స్కీ ఆమెకేసి కళ్లు చెదిరేటట్టు చూశాడు. దాదాపుగా, 'సిగ్గుసిగ్గు' అని అరిచాడు. దాదాపుగా ఆమె కణతలమీద పిడికిటితో కొట్టాడు, కాని వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు. ఒక గంట తర్వాత అతను వసీల్యెవ్‌స్కొయె వెళ్లే దారిలో వున్నాడు. రెండు గంటల తర్వాత వర్వార పావ్‌లొవ్నా వూళ్లోని అతి చక్కటి బండిని కుదుర్చుకుని, సాదా గడ్డి టోపీ, సాదా ఉత్తరీయం నల్లని ముసుగు ధరించి, ఆడాని జుస్తీన్‌కి అప్పగించి, కలీతిన్ల యింటికి వెళ్లింది. యింట్లో పనివాళ్లనుంచి రాబట్టిన సమాచారంవల్ల తన భర్త రోజూ వాళ్లని చూడడానికి వెడతాడని తెలుసుకొంది.

## 38

ఓ— పట్టణానికి లవ్రేత్‌స్కీ భార్య వచ్చిన రోజు అతనికి ఉల్లాసంలేని రోజు, అలాగే లీజాకీపీ. ఆమె మేడమీదనుంచి కిందికి దిగి తల్లిని పలకరించిందో లేదో, బయట గుర్రాల గిట్టల చప్పుడు వినిపించింది, లోలోపల బెదురుతో ఆమె పెరట్లో పాన్‌షిన్ రావడం చూసింది. ''జవాబుకోసమని పెందరాళే వచ్చాడు'' అనుకొంది. అలా అనుకోవడంలో పొరపాటు పడలేదు. డ్రాయింగ్ రూంలో కొంచెం సేపు పచారుచేసిం తర్వాత అతను తోటలోకి వెడదామని అన్నాడు. అక్కడ యే సంగతీ తేల్చమని అడిగాడు. ధైర్యం చిక్కబట్టుకుని, తను అతని భార్య కాలేనని లీజా అంది. టోపీ నుదుటిమీదకి లాక్కుని, ఆమె పక్కన నించుని అతను ఆమె చెప్పేదంతా సాంతం విన్నాడు. మర్యాదగానే, కాని మారిన గొంతుక

తోటి అదే ఆమె చెప్పదలచుకున్న ఆఖరి మాటా అనీ, తను ఆమె మనను మార్చుకోవడానికి యేదేనా ఆధారం యిచ్చానా అనీ అడిగాడు. అప్పుడు తన చేత్తో కళ్లు అద్దుకుని బాధాకరమైన చిన్న నిశ్వాసం చేసి, చెయ్యి తీసేశాడు.

''తొక్కేసిన దారిలో వెళ్లకూడదనుకున్నాను. నా హృదయానికి అనుకూలమైన తోడు తెచ్చుకుందా మనుకున్నాను. కాని అది జరిగేట్టు లేదు. సెలవు, మధుర స్వప్నమా!'' అన్నాడు శూన్య కంఠంతో. చిన్నగా వంగి లీజాకి వందనం చేసి, యింటికేసి వెళ్లిపోయాడు.

అతను వెంటనే వెళ్లిపోతాడని ఆమె ఆశించింది. కాని అతను మార్ఫ దీమ్రితియెవ్నా గదిలోకి వెళ్లి అక్కడ దగ్గరదగ్గర గంట సేపు గడిపాడు. వెళ్లిపోయేటప్పుడు, అతను లీజాతోటి ''వోత్ర్ మెర్ వ్యుజపాల్; అద్యో అ జమే''* అని గుర్రం యెక్కి, ఆ గుమ్మం దగ్గర్నుంచి ఒక్క అంగలో అక్కడినుంచి వెళ్లిపోయాడు. మార్ఫ దీమ్రితియెవ్నా కళ్లనీరు పెట్టుకోవడం లీజా చూసింది: పాన్షిన్ తన దురదృష్టాన్ని గురించి ఆమెతో చెప్పాడు.

''యేం చేశావే నాకు, యేం చేశావు?'' అని దుఃఖపడ్డ ఆ వింతంతువు మొర పెట్టింది. ''ఎవరు కావాలి నీకు? ఏం అతను తగలేదా నీకు? అతను కామేర్ జుంకర్. అతనేం బావుకుపోదామని నిన్ను చేసుకుంటా ననటం లేదు! కావాలనుకుంటే అతను సెయింట్ పీటర్స్బుర్గ్లో యే గొప్పింటి పిల్లనేనా చేసుకోగలడు. ఓసి పిల్లా! యెంతగా దీనికోసం యెదురు చూశానే! నీ మనసు యెప్పుడు మార్చుకున్నావే? యిదేదో వూరకే పుట్టింది కాదు, యెవడో నిప్పుపెట్టాడు. ఆ మూర్ఖుడైన తమ్ముడు లేడుకదా దీని వెనక్కాల కొంపతీసి! మనసులో మాట చెప్పుకోడానికి యెలాంటి వాడు దొరికాడే నీకు!''

''పాపం యితను'' మార్ఫ దీమ్రితియెవ్నా చెపుతూనే వుంది. ''యెంత మర్యాదస్థుడు, దురదృష్టం తగిలినప్పుడు కూడా యెంత వందనంగా వున్నాడు! నన్ను వదిలిపెట్టనని అన్నాడు. అమ్మా! నేను యీ బాధ భరించలేనే! తల బద్దలైపోతోందే! పలాష్కాని నాదగ్గరికి పంపించు. నీకు యింగితం రాకపోతే నాకు చావు రాసిపెట్టి వున్నట్టే. వింటున్నావా?'' ఆమె యెంత కనికరంలేని పిల్లో అని కొన్ని సార్లు అన్నాక మార్ఫ దీమ్రితియెవ్నా ఆమెని పొమ్మంది.

లీజా తన గదిలోకి వెళ్లింది. పాన్షిన్తోటీ, తల్లితోటీ సంభాషణ అయ్యాక యింకా సరిగా స్థిమితపడిందో లేదో, తను అసలు వూహించని చోటినుంచి తుఫాన్ మళ్లీ ఫెళ్లున విరుచుకుపడింది. మార్ఫ తిమొఫేయెవ్నా తలుపు ఫెడీల్మని వేసి, తన గదిలోకి హుటాహుటీన వచ్చింది. ఆ ముసలావిడ ముఖం పాలిపోయింది, టోపీ వంకరగా వుంది. ఆమె కళ్లు జ్యోతుల్లా వున్నాయి; ఆమె పెదాలూ చేతులూ వణుకుతున్నాయి. లీజా ఆశ్చర్యపడిపోయింది.

---

* ''మీ అమ్మ మిమ్మల్ని పిలుస్తోంది; సెలవ్, యెప్పటికీ'' (ఫ్రెంచి).

నిబ్బరంగా, వివేకంగా వుండే తన మామ్మ అలా వుండటం ఆమె అంతకు ముందెన్నడూ చూడలేదు.

''ఏం నంగనాచివే, ఆహ్,'' మార్ఫ తిమొఫేయెవ్నా అణిగిన, వణికే గొంతుకతో అంది. ''చాలా బాగుంది! నువ్వసలు యిలాంటివి యెక్కడ నేర్చావు? వూ, చెప్పు! నాక్కాసిని మంచి నీళ్లు పొయ్యండి, నాలిక పిడచకట్టుకుపోతోంది.''

''స్థిమితంగా వుండు, మామ్మా. ఏం జరిగింది?'' అంది లీజా ఆమెకి ఒక గ్లాసు మంచి నీళ్లు యిస్తూ. ''నీకూ పాన్‌షిన్ అంటే పెద్దగా యిష్టం లేదనే అనుకున్నాను.''

మార్ఫ తెమొఫేయెవ్నా గ్లాసు కింద పెట్టింది.

''నేను తాగలేను – నా పళ్లు కాసినీ వూడిపోతాయి. పాన్‌షిన్‌కి యేమిటి సంబంధం? మధ్యలో వాడెందుకు వచ్చాడు? చెప్పమ్మా, అర్థరాత్రిళ్లు వాళ్లతోటీ వాళ్లతోటీ మాట్లాడడం యెవరు నేర్పారు నీకు? ఏం?''

లీజా పాలిపోయింది.

''చూశావా? కాదనలేవు.'' మార్ఫ తిమొఫేయెవ్నా ధాటీ ఆగలేదు. ''షూరొచ్కా అంతా తన కళ్లతో చూసి నాకు చెప్పింది. దాన్ని వాగద్దని గద్దించాను గాని, అదేం అబద్ధాలకోరు కాదు.''

''నేనేం కాదనడం లేదు, మామ్మా'' అంది లీజా తగ్గు గొంతుకతో.

''ఓహో! అదా సంగతి, ఆఁ! అయితే నువ్వు వెర్రి బాగులాడిలా వుండే ఆ పాపాత్ముడితో మాటలు సాగిస్తున్నావన్న మాట!''

''లేదు.''

''మరి?''

''నేను కింద గదిలోకి పుస్తకం తెచ్చుకుందామని వెళ్లాను. అతను తోటలో వున్నాడు. నన్ను పిలిచాడు.''

''నువ్వు వెళ్లావు! భేష్! నువ్వతన్ని ప్రేమిస్తున్నావా. యేమిటి?''

''వూఁ'' అని గొణిగింది లీజా.

''ఓరి భగవంతుడా! అతన్ని ప్రేమిస్తోందట!'' మార్ఫ తిమొఫేయెవ్నా టోపీ నెత్తి మీదనుంచి టపామని తీసేసింది. ''పెళ్లయిన వాణ్ణి ప్రేమిస్తోంది! ఆఁ! వింటున్నావా? ప్రేమిస్తోందట!''

''అతనన్నాడు నాతోటి....'' అని మొదలుపెట్టింది లీజా.

''యేం చెప్పాడేవాడు? యేం చెప్పాడు?''

''తన పెళ్లాం చనిపోయిందని అన్నాడు.''

మార్ఫ తిమొఫేయెవ్నా శిలువ గీసుకుంది. ''ఆమె ఆత్మ శాంతించుగాక'' అంది

మెల్లిగా. "ఆమె దండగమారి ముండ. దేవుడు క్షమించాలి. చూశావా, అతను యిప్పుడు అపత్నీకుడు. వాడు మోసగాడులా కనిపిస్తున్నాడు. ఓ పెళ్ళాన్ని చంపాడో లేదో, యింకో దానికి యెగబడుతున్నాడు. దంభాలరాయుడు. ఓ విషయం వినవే తల్లీ! మా రోజుల్లో, నేను పడుచుదానిగా వున్నప్పుడు కన్నెపిల్లలు యిలాంటి చేష్టలకి కాగిపోయేవారు! కోప్పడకు! మూర్ఖులే నిజం వింటే కోప్పడతారు. యివాళ వాణ్ణి గెంటేశాను. వాడంటే నాకిష్టమే, కాని యీ పనికి వాణ్ణి యెప్పుడూ క్షమించను. అపత్నీకుడు, నీకిష్టమైతే! యేదీ, కాసిని మంచి నీళ్ళు! పాన్షిన్ని చీవాట్లుపెట్టి పంపెయ్యడమూ మంచి పని చేశావు, తెలివైన పిల్లవి. కాని రాత్రిళ్ళు మేకపోతు జాతితో మాత్రం తిరగద్దు, అంటే ఆ బాపతు మనుషులని. యీ ముసలిదాని గుండెలమీద సమ్మెట్లు మోదకు. నేను గారం చేసి, ముద్దు చెయ్యడమే కాదు, కాటెయ్యగలను కూడానూ. అపత్నీకుడు!"

మార్ఫ తిమొఫేయెవ్నా వెళ్ళిపోయింది. లీజా ఓ మూల కూర్చుని యేడవడం మొదలు పెట్టింది. ఆమె హృదయం గాయపడింది. అలాంటి అవమానం ఆమెకి తగదు. ప్రేమ వల్ల ఆమెకి యే సంతోషమూ రాలేదు. గత రాత్రినుంచి ఆమె రెండు సార్లు యేడుస్తూనే వుంది. యీ నూతన అద్భుత అనుభూతి ఆమె హృదయంలో మొలక యెత్తగానే, ఆమె అధిక మూల్యం చెల్లిస్తూనే వుంది. ఆమె పవిత్ర రహస్యం పరాయి వాళ్ళ కఠిన హస్తాల్లో పడిపోతూనే వుంది. ఆమె అవమానం చెందినట్టుగా, కటువుగా, గాయపడ్డట్టుగా బాధపడింది. కాని ఆమెకి యే అనుమానమూ లేదు, భయమూ లేదు. లవ్రేత్స్కీ అంతకు ముందు యెన్నడూ లేనంతగా ఆమెకి ప్రియమయ్యాడు. తన మనసు తనకే అర్థం కానంత కాలం ఆమె వూగిసలాడింది. కాని ఆ సమావేశం తర్వాత, ఆ చుంబనం తర్వాత ఆమెకి యే వూగిసలాటా లేదు. అతన్ని ప్రేమిస్తున్నట్టు, నిజాయితీగా, మనః పూర్వకంగా, జీవితకాలం పాటు, యే బెదిరింపులకీ లొంగనట్టుగా అతన్ని ప్రేమిస్తున్నట్టు ఆమెకి అర్థమైంది. ఆ బంధాన్ని భూమ్మీద యే శక్తీ విడదియ్యలేదని ఆమెకి అనిపించింది.

## 39

వర్వార పావ్లొవ్నా లవ్రేత్స్కయా వచ్చిందని విన్నప్పుడు మార్య దీమ్రితియెవ్నా మహా తత్తరపడింది. ఆమెని ఆహ్వానించాలా అక్కర్లేదా అన్న విషయం తేల్చుకోలేకపోయింది. ఫ్యొదొర్ ఇవానిచ్ కష్టపెట్టుకుంటాడేమోనని భయపడింది. ఆఖరికి కుతూహలం నెగ్గింది. "ఆ, యేమైంది, యెంత చెడ్డా ఆమె బంధువు కదా" అనుకొంది. పడక కుర్చీలో సర్దుకుని కూర్చుని నౌకరుతోటి "ఆమెని తీసుకురా" అంది. కొన్ని క్షణాలు గడిచాయి. తలుపు

తెరుచుకుంది. వర్వార పావ్‌లొవ్నా అసలు చప్పుడవకుండా అడుగులు వేసి, వేగంగా లోపలికి వెళ్లి, మార్య దీమ్త్రియెవ్నాకి కుర్చీలోనుంచి లేచే వ్యవధి యివ్వకుండా, దాదాపు ఆమె ముందు మోకరిల్లింది.

''కృతజ్ఞతలు, పిన్నిగారూ'' అని లోగొంతుకతోటి రష్యన్‌లో మొదలుపెట్టింది ఆమె. ''యెన్నో కృతజ్ఞతలు. మీరు అంత క్షమ చూపిస్తారని నేను అనుకోలేదు. మీరు దేవతలాంటి వారు.''

యీ మాటలు అనేసి, వర్వార పావ్‌లొవ్నా వున్నట్టుండి మార్య దీమ్త్రియెవ్నా చేతుల్ని తీసుకుని, ఎరుపు చాయ నీలి రంగు గ్లవ్సుల మధ్యని మెత్తగా అదుముతూ వాటిని నిండు గులాబీ పెదాల దాకా యెత్తుకుంది. యీ అందమైన, అద్భుతంగా ముస్తాబైన ఆడ మనిషి తన కాళ్లమీద సాష్టాంగ పడ్డంతోటి మార్య దీమ్త్రియెవ్నా మాటపడిపోయేటంత చకితురాలైపోయింది. ఆవిడకేం చెయ్యాలో తోచలేదు; తన చేతిని వెనక్కి లాక్కుని వుండేది, ఆమెకి ఒక కుర్చీ చూపించి కూర్చోమని, యేదో మంచి మాట చెప్పి వుండేది. అందుకు బదులుగా ఆమె నుంచుని, వర్వార పావ్‌లొవ్నా నున్నటి, అత్తరుపూసుకున్న నుదుటిమీద ముద్దుపెట్టుకుంది. వర్వార పావ్‌లొవ్నా పరవశురాలైపోయింది.

''బావున్నావా'' అంది మార్య దీమ్త్రియెవ్నా. ''నేనసలు వూహించలేదు.... కాని, మొత్తంమీద నిన్ను చూసినందుకు సంతోషంగా వుంది. చూడమ్మా, మొగుడూ పెళ్లాల మధ్య నేను తీర్పరిని గాననుకో....''

''ఆయన నూటికి నూరుపాళ్లూ ఒప్పే'' అని మాటకి అడ్డం వచ్చింది వర్వార పావ్‌లొవ్నా. ''తప్పంతా నాదే.''

''ఆ జ్ఞానం వుంటే అదే పదివేలు, మెచ్చుకోదగ్గది'' అంది మార్య దీమ్త్రియెవ్నా. ''చాలా మెచ్చుకోదగ్గది. చాలా కాలమైందా వచ్చి? అతను కనిపించాడా? కూర్చో, కూర్చో.''

''నిన్న వచ్చాను'' అంది వర్వార పావ్‌లొవ్నా, అణకువగా కూర్చుంటూ. ''ఫ్యోదొర్ ఇవానిచ్‌ని చూశాను. ఆయనతో మాట్లాడాను.''

''ఆఁ, యేమన్నాడు?''

''ఇంతలా అనుకోకుండా నేను రావడం ఆయనకి కోపం తెప్పిస్తుందని అనుకున్నాను. కాని నాకు ఆయన కనుచాటు కాలేదు'' అంది వర్వార పావ్‌లొవ్నా.

''అంటే, అతను.... ఆఁ, ఆఁ, అర్థమైంది'' అంది మార్య దీమ్త్రియెవ్నా. ''పైకి మోటుగా కనిపిస్తాడు గాని, మనసు మంచిది.''

''ఫ్యోదొర్ ఇవానిచ్ నన్ను క్షమించలేదు. నేను చెప్పింది సాంతం వినలేదు. కాని లావ్రికి యిల్లు నేను వుండటానికి యిచ్చేసేటంత దయచూపించారు.''

''ఆహా! అందమైన ఎస్టేట్!''

''ఆయన కోరికమేరకి నేను రేపు అక్కడికి వెళ్లిపోతున్నాను. కాని ముందుగా మిమ్మల్ని చూడ్డం నా విధి కదా.''

''ఎంతమాట, తల్లీ, ఎంతమాట. ఎప్పుడూ చుట్టాల్ని మరిచిపోకూడదు. నువ్వు రష్యన్ యెంత బాగా మాట్లాడుతున్నావు, నాకు ఆశ్చర్యంగా వుంది. సె ఎటొనన్.*''

వర్వార పావ్‌లొవ్నా నిట్టూర్చింది.

''నేను విదేశాల్లో చాలా కాలం వున్నాను మార్య దీమ్త్రియెవ్నాగారూ, కాని నా మనసు రష్యన్‌ది గానే వుండిపోయింది. నేను పుట్టిన గడ్డని మరిచిపోలేదు.''

''బాగుంది, బాగుంది. మంచి సంగతి. ఏమైనా, ఫ్యోదొర్ ఇవానిచ్ నువ్వు వస్తావని అనుకోలేదు. అవును, నే చెబుతున్నా ల ప్రతి అవన్ తు** ఓహో! యెంత అందంగా వుంది ఉత్తరీయం, యేదీ చూడనీ.''

''మీకిది నచ్చిందా?'' వర్వార పావ్‌లొవ్నా దాన్ని భుజాలమీదనుంచి తీసేసింది. ''యిది చాలా సాదాది. మదాం బౌద్రాన్ చేసింది.''

''ఆ మాట వెంటనే చెప్పచ్చు. మదాం బౌద్రాన్ చేసింది... ఎంత ముచ్చటగా, ఠీవిగా వుంది! నువ్వు యెన్నో అందమైన వస్తువులు తెచ్చివుంటావు. వాటిని నేను చూస్తే బావుండును.''

''నా అలంకరణ సామగ్రి అంతా మీ ముందు వుంటుంది, పిన్నిగారూ. మీరు వూఁ అంటే. కొన్నింటిని మీ పనిమనిషిని తీసికెళ్లి చూపిస్తాను. నేను పారిస్‌నుంచి తీసుకువచ్చిన పనిమనిషి నాతో వుంది—ఆమె అద్భుతంగా దుస్తులు తయారుచేస్తుంది.''

''చాలా మంచిదానివి. కాని నిన్ను కష్టపెట్టడం యెందుకులే.''

''కష్టపెట్టడమా...'' అంది వర్వార పావ్‌లొవ్నా చిన్నగా నిష్ఠూరం ఆడుతున్నట్టు. ''నాకు ఆనందం కలగాలంటే, నన్ను మీ సొంత మనిషిగా చూడండి.''

మార్య దీమ్త్రియెవ్నా కరిగిపోయింది.

''వుజెత్ షర్‌మంత్''*** అని ఆమె అంది. ''కాని ఆ గ్లవ్సూ, టోపీ తీసెయ్యి.''

''తీసెయ్యనా?'' అంది వర్వార పావ్‌లొవ్నా జాలిగా ఆమె చేతుల్ని పట్టుకుంటూ.

''అయ్యో, తప్పకుండానూ: నువ్వు మాతో భోజనం చేస్తున్నావు, కదూ? నేను.... మా అమ్మాయిని చూపిస్తాను.'' మార్య దీమ్త్రియెవ్నా కొంచెం పస్తాయించింది. ''సరే కానీలే'' అనుకొంది ఆమె. ''దానికి యివాళ వొంట్లో బాగా లేదు.''

---

* యిది ఆశ్చర్యంగా వుంది (ఫ్రెంచి).

** పుట్టిన దేశం అన్నిటికంటే ముందు (ఫ్రెంచి).

*** ''మీరు మనోహరంగా వున్నారు'' (ఫ్రెంచి).

''ఓ, మ తాంత్* యెంత మంచి మనిషి మీరు!'' అంది వర్వార పావ్‌లొవ్నా, జేబు రుమాలు కళ్లదగ్గర పెట్టుకుంటూ.

గెదెయొనోవ్‌స్కీ వచ్చాడని నౌకరు చెప్పాడు. ఆ ముసలి వదరుబోతు చేతులు విసురుకుంటూ, కోతిలా పళ్లికిలిస్తూ వచ్చాడు. మార్య ద్మీత్రియెవ్నా అతన్ని ఆమెకి పరిచయం చేసింది. మొదట్లో అతను తికమకపడిపోయాడు. వర్వార పావ్‌లొవ్నా యెంత టక్కులుపోతూ మర్యాద చూపించిందంటే, అతని శ్రవణేంద్రియాలు త్వరలోనే జలపరించిపోయి పుకార్లేమిటి, పిచ్చికూతలేమిటి, పొగడ్తలేమిటి అతని నాలికమీదనుంచి సునాయాసంగా తేనెలా జారిపోయాయి. వర్వార పావ్‌లొవ్నా అణిచిపెట్టుకున్న చిరునవ్వుతో విని, క్రమేపీ సంభాషణలోకి దిగింది. పారిస్‌ని గురించీ, తన ప్రయాణాల గురించీ, బాడెన్ గురించీ అణకువగా మాట్లాడింది. ఒకటి రెండు సార్లు మార్య ద్మీత్రియెవ్నాకి వినోదం కలిగించింది, ప్రతి సారీ తన అనుచిత కులాసాతనానికి లోలోపల తిట్టుకుంటున్నట్టు నిట్టూర్చి. మళ్లీసారి వచ్చినప్పుడు ఆడాని తనతో తీసుకురావడానికి వాళ్ల అంగీకారం సంపాదించింది. గ్లవ్సు తీసేసి, ''అ లా గిమావ్'' సబ్బు సుగంధం వాసన వేస్తున్న నున్నటి చేతులతోటి జాలరుకుచ్చులు, యీకలు, లేసు, గులాబీ ఆకారపు చిత్రాలూ యెక్కడ యెలా ధరిస్తారో వర్ణించి చూపించింది. విక్టోరియా ఎస్సెన్స్ కొత్త ఇంగ్లీషు అత్తరువు ఒక సీసా తీసుకువస్తానని అని, మార్య ద్మీత్రియెవ్నా దానిని బహుమతిగా తీసుకుంటానికి ఒప్పుకున్నప్పుడు చిన్న పిల్లలా మురిసిపోయింది. మొదటి సారిగా రష్యన్ చర్చి గంటలని విన్నప్పుడు తనకి కలిగిన అనుభూతిని గుర్తుకు తెచ్చుకుని కళ్లనీళ్లు పెట్టుకుంది: ''అవి నా హృదయంలోకి సూటిగా దూసుకుపోయాయి'' అంది.

ఆ సమయంలో లీజా గదిలోకి వచ్చింది.

ఉదయంనుంచీ, లవ్రేత్‌స్కీ చీటీ చదివినదగ్గర్నుంచీ భయంతో గడ్డకట్టుకుపోయి, అతని భార్య యెదటపడడానికి ఆయత్తం అవుతూనే వుంది, ఆమెని తను కలుసుకుంటానని ముందే అనుమానంగా వుండింది. ఆమెని తప్పించుకోకూడదని నిర్ణయించేసుకుంది, పాపపు ఆశలు అని తను పిలిచే వాటికి శిక్షగా. ఆమె జీవితపు ఆకస్మిక సంక్షోభం ఆమెని పునాదుల్లోకంటా కదిలించివేసింది. రెండు, మూడు గంటల్లో ఆమె ముఖం యీడ్చుకుపోయినట్టైంది. కాని ఒక్క కన్నీటి బొట్టు కార్చలేదు. తనని దిగులు పరచిన కటువైన, అసహ్యకర ప్రేరణల ఉరవడిని సరిగ్గా అణుచుకోలేకుండా ''యిది నాకు తగ్గట్టే వుంది'' అని ఆమె అనుకొంది. ''సరే, వెడతాను'' అనుకొంది, లవ్రేత్‌స్కీ భార్య వచ్చిందని వినగానే. డ్రాయింగ్ రూం తలుపు తొయ్యడానికి ధైర్యం చిక్కబట్టుకునే ముందు చాలా సేపు

---

* పిన్నిగారు (ఫ్రెంచి).

ఆమె గుమ్మం దగ్గర నిలబడిపోయింది. ''నేను ఆమెకి అన్యాయం చేశాను''—యీ ఆలో చనతోటి ఆమె డ్రాయింగ్ రూంలోకి ప్రవేశించి, బలవంతంగా వర్వార పావ్‌లొవ్నాని చూసి, బలవంతంగా చిరునవ్వునవ్వింది. లీజాని తను చూసిన తక్షణం వర్వార పావ్‌లొవ్నా ముందుకి వచ్చింది, మర్యాదగా చిన్నగా వంగి వందనం చేసింది. ''నేను మీకు తెలుసనుకుంటాను'' అందామె తనమీద దయకలిగేలాగా చేసుకుంటూ. ''మీ అమ్మగారు నాపట్ల చాలా కని కరంగా వున్నారు, మీరు కూడా కనికరంగా వుంటారని ఆశిస్తున్నాను.'' ఆఖరి మాట అన్న ప్పుడు వర్వార పావ్‌లొవ్నా ముఖంమీద కనిపించిన భావం, ఆమె కపటమైన చిరునవ్వు, నిరాదరమైన, అయినా మృదువుగా వున్న చూపు, ఆమె చేతులా భుజాలా కదలికలూ, ఆమె తొడుక్కున్న గౌనూ, మొత్తం ఆమే లీజాకి యెంతటి వెగటు పుట్టించే భావం కలి గించాయంటే ఏమీ అనలేక ఆమె వూరికే చెయ్యి ముందుకు చాపగలిగింది. ''యీ కుర్రపిల్ల నన్ను సరిగా చూడదు, సహించదు'' అనుకొంది వర్వార పావ్‌లొవ్నా లీజా చల్లని వేళ్లని ఒత్తుతూ. మార్య ద్మీత్రియెవ్నాకేసి తిరిగి ''మె ఎల్ ఎ డెలిస్యెజ్''* అంది. లీజా నీరసంగా పాలిపోయింది; యీ మాటలో యేదో ఎగతాళీ, అవమానం వున్నాయి. కాని మొదట కలిగే అభిప్రాయాలనే నమ్మడం మంచిది కాదని అనుకొంది. కిటికీదగ్గర అల్లికచట్రం పట్టుకు కూర్చుంది. యిక్కడా వర్వార పావ్‌లొవ్నా ఆమెని ఆమె మానాన కూర్చోనివ్వలేదు. ఆమె దగ్గరికి వెళ్లి ఆమె అభిరుచికీ, నేర్పుకీ అభినందించింది. లీజా గుండె తీవ్రంగా బాధగా కొట్టుకుంది. ఎంతో తీవ్రమైన శ్రమతోటి తన అనుభూతుల్ని కూడగట్టుకుంది. వర్వార పావ్‌లొవ్నా అన్నీ తెలిసినట్టూ, లోపల్లోపల ఉత్సాహంగా వుంటూ తనని రహస్యంగా వేళా కోళం చేస్తున్నట్టూ అనిపించింది. తన అదృష్టవశాత్తూ గెదెయొనోవ్‌స్కీ వర్వార పావ్‌లొవ్నా తోటి మాట్లాడ్డం మొదలుపెట్టి, దృష్టిమళ్లించాడు. లీజా అల్లికచట్రంమీద వంగి ఆమెని రహస్యంగా చూసింది. ''అతను ఒకప్పుడు ప్రేమించిన ఆడమనిషి యీవిడ'' అనుకొంది. కాని తక్షణం తన మనసులో నుంచి లవ్రేత్‌స్కీ వూహని చెరి పేసుకుంది: తనమీద తనకే అదుపు తప్పుతుందని భయం వేసింది, తన తల మెల్లిగా తిప్పుతున్నట్లు అనిపించింది. మార్య ద్మీత్రియెవ్నా సంగీతం గురించి మాట్లాడ్డం మొదలెట్టింది.

''నువ్వు మంచి సంగీతజ్ఞానం వున్నదానివట గదా'' అంది.

''చాలా రోజులైంది వాయించి'' అంది వర్వార పావ్‌లొవ్నా, వెంటనే పియానోదగ్గర కూర్చుని, మెట్లమీద అలవోకగా వేళ్లని తాటిస్తూ. ''వాయించనా?''

''కానీ.''

---

* ''ఆమె నిజంగా చాలా అందంగా వుంది'' (ఫ్రెంచి).

పేర్ట్స్ అద్భుతమైన, కష్టమైన కీర్తన నొకదాన్ని చెయ్యి తిరిగినట్టుగా, యెంతో శక్తివంతంగా, నేర్పుగా వాయించింది.

''గంధర్వగానం!'' అన్నాడు గెదెయొనోవ్‌స్కీ.

''బ్రహ్మాండం!'' అంది మార్య దీమ్రితియెవ్నా. ''బాగుంది వర్వార పావ్‌లొవ్నా'' అందామె మొదటి సారిగా పేరుపెట్టి పిలుస్తూ. ''నువ్వు నన్ను ముంచెత్తేశావు. అసలు నువ్వు కచేరీలు చెయ్యాలి. మాకిక్కడ ఒక సంగీతం ఆయన వున్నాడు, జర్మన్, తిక్క ముసలాయన, కాని శాస్త్రం బాగా తెలిసినవాడు. ఆయన లీజాకి పాఠాలు చెబుతాడు. నిన్ను చూస్తే ఆయన పిచ్చెక్కిపోతాడు.''

''ఎలిజవేతా మిహైలొవ్నా కూడా వాయిస్తుందా?'' అని తల కొంచెం ఆమెకేసి తిప్పుతూ అడిగింది వర్వార పావ్‌లొవ్నా.

''ఆఁ, ఫరవాలేదు బాగానే వాయిస్తుంది, ఆమెకి సంగీతం అంటే చాలా యిష్టం, కాని నీ ముందు యెంత? కాని యిక్కడ యింకో పడుచాయన వున్నాడు. నువ్వు కలుసుకోవాల్సిన మనిషి. మనిషి కళాత్మక హృదయం వున్నవాడు. చక్కటి గీతాలు కూరుస్తాడు. అతనొక్కడే నిన్ను సరిగా మెచ్చుకోగలవాడు.''

''పడుచాయనా?'' అని అడిగింది వర్వార పావ్‌లొవ్నా. ''ఎవరతను? ఎవరేనా బీదతనా?''

''ఛ, ఛ, కాదు. ఆడపిల్లలు వెంటపడే మనిషి. యిక్కడే కాదు సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో కూడా. కామేర్ జుంకర్, చాలా గొప్పగొప్ప వాళ్లు ఆదరించే మనిషి. నువ్వు బహుశా అతన్ని గురించి వినే వుంటావు. పాన్‌షిన్ వ్లదీమిర్ నికొలాయెవిచ్. యిక్కడనే వున్నాడు, ప్రభుత్వం పనిమీద.... ముందు ముందు మంత్రి అవుతాడు కూడా.''

''కళాకారుడా, ఏం?''

''మామూలుగానా? ఆ లీవి! నువ్వు అతన్ని చూద్దువుగాని. అతనిక్కడికి అస్తమానూ వస్తున్నాడు. యివాళ సాయంత్రం రమ్మన్నాను. వస్తాడనే అనుకుంటున్నాను'' అంది మార్య దీమ్రితియెవ్నా, కొంచెం నిట్టూరుస్తూ, చేదు స్మృతి పూర్వకమైన చిరునవ్వు నవ్వుతూ.

లీజా ఆ చిరునవ్వుని అర్థంచేసుకుంది, కాని పట్టించుకోవడం మానేసింది.

''కుర్రాడేనా?'' పెద్ద గొంతుకతో అడిగింది వర్వార పావ్‌లొవ్నా.

''యిరవై యెనిమిది, చూడదగ్గవాడు. ఎన్ జెన్ ఒం అక్కొంప్లి* నిజంగా.''

''చూడదగ్గ కుర్రాడనుకో'' అన్నాడు గెదెయొనోవ్‌స్కీ.

వర్వార పావ్‌లొవ్నా హఠాత్తుగా ప్రచండమైన స్ట్రౌస్ వాల్ట్‌జ్‌నృత్య సంగీతం వాయించింది. అది యెంత ఘంయ్‌మని మొదలైందంటే గెదెయొనోవ్‌స్కీ అదిరిపోయాడు. సంగీత

---

* కలివిడైనవాడు (ఫ్రెంచి).

10—2444

కృతిమధ్యలో ఆమె విషాదభరిత ఆలాపాన్ని ప్రవేశపెట్టి "లూచియా" ఒపెరాలోనుంచి "ప్రా పోకో"* అనేమాటలతో ఆరంభమవుతున్న ఆరియా గీత విశేషాన్ని తడిమి ముగించింది. ఉల్లాసభరితమైన సంగీతం తను వున్న పరిస్థితికి తగదని ఆమెకి స్ఫురించింది. భావోద్విగ్న భాగాలని వక్కాణించే ఆ "లూచియా"నుంచి ఆరియా గీతం మార్య దీమ్త్రియెవ్నాని గాఢంగా కదిలించివేసింది.

"ఏం అనుభూతి!" అని ఆమె గెదెయొనోవ్‌స్కీతో తగ్గు గొంతుకతో అంది.

"గంధర్వగానం!" అని రెట్టించాడు గెదెయొనోవ్‌స్కీ కళ్లు పైకి తిప్పుతూ.

భోజనాల సమయం అయింది. వడ్డన ఆరంభమయే సమయానికి మార్ఫ తిమొఫేయెవ్నా కిందికి దిగివచ్చింది. ఆమె వర్వార పావ్‌లొవ్నాని నిరాదరంగా చూసింది. వర్వార పావ్‌లొవ్నా మర్యాదపూర్వక సంభాషణకి పొడి ముక్కలతో జవాబుచెప్పింది. యీ ముసలావిడనుంచి దక్కేది యేమీ లేదని గ్రహించి వర్వార పావ్‌లొవ్నా ఆమెని దువ్వడం మానేసింది. అతిథిపట్ల మొత్తం జాలి చూపించింది మార్య దీమ్త్రియెవ్నాయే. తన మేనత్త మొరటుతనం ఆమెకి కోపం తెప్పించింది. మార్ఫ తిమొఫేయెవ్నా మాట్లాడకుండా తప్పించుకున్నది వర్వార పావ్‌లొవ్నానే కాదు, ఆమె లీజాకేసి కూడా చూడలేదు, ఆమె కళ్లు మెరుస్తూ వున్నప్పటికీ. ఆమె పసుప్పచ్చగా, పాలిపోయి రాతి విగ్రహంలా కూర్చుంది మూతి బిగించుకుని, యేమీ తినలేదు. లీజా ప్రశాంతంగా వుంది. వాస్తవానికి ఆమె లోపలి తుఫాను అణిగింది. ఆమె చిత్రంగా నిశ్చింతభావంతో వుంది, విధి తీర్పు అయిన మనిషికుండే నిశ్చింతభావం. భోజనాలదగ్గర వర్వార పావ్‌లొవ్నా యెక్కువ మాట్లాడలేదు. ఆమెకి మళ్లీ బెరుకు పట్టినట్టు అయింది, ఆమె ముఖంమీద వినయపూర్వక విచార రేఖ కమ్మింది. తన కథలతోటి సంభాషణ కొనసాగించినవాడు గెదెయొనోవ్‌స్కీ ఒక్కడే, అతను మార్ఫ తిమొఫేయెవ్నా కేసి యిబ్బందికరంగా చూసినా, గొంతు సవరించుకున్నా — ఆమె ముందు యెప్పుడు అబద్ధం చెప్పాల్సివచ్చినా అతని గొంతు బొంగురుపోయేది — కాని ఆమె అతన్ని ఆపలేదు, అడ్డగించలేదు. భోజనాల తర్వాత వర్వార పావ్‌లొవ్నాకి ప్రిఫరెన్స్ పేకాట అంటే చాలా యిష్టమని తేలింది. ఆ మాట విని మార్య దీమ్త్రియెవ్నా యెంత సంబరపడిపోయిందంటే, ఆమె పరవశురాలైపోయింది, తనకి తనే అనుకుంటూ: "ఆ ఫ్యోదొర్ ఇవానిచ్ లవ్రేత్‌స్కీ యెంత చవట! యిలాంటి ఆడమనిషిని అభినందించకపోవడం!"

ఆమె గెదెయొనోవ్‌స్కీతోటీ, వర్వార పావ్‌లొవ్నాతోటీ పేకాటకి కూర్చుంది. లీజాని చూస్తే జడుసుకొనేటట్టు కనిపిస్తోందనీ, తప్పకుండా తలనొప్పి వుండే వుంటుందనీ అంటూ మార్ఫ తిమొఫేయెవ్నా ఆమెని మేడమీదకి తీసుకుని వెళ్లిపోయింది.

---

* "తర్వాత త్వరలో" (ఇటాలియన్).

''అవును, ఆమెకి చెడ్డ తలనొప్పిగా వుంది'' అంది మార్య దీమ్రిత్రియెవ్నా వర్వార పావ్‌లొవ్నాతోటి, కళ్లు అటు తిప్పి. ''తీవ్రమైన తలనొప్పి నాకూ వస్తూవుంటుంది.''

''నిజంగా?'' అని గొణిగింది వర్వార పావ్‌లొవ్నా.

లీజా ఆ ముసలావిడ గదిలోకి వెళ్లి శక్తిలేనట్టు కుర్చీలో కూలబడింది. మార్ఫ తిమొఫేయెవ్నా చాలా సేపు నిశ్శబ్దంగా ఆమెకేసి చూసి, అప్పుడు మోకాళ్లమీద వాలి ఆమె చేతుల్ని ఒక దాని తర్వాత ఒకటి ముద్దుపెట్టుకోవడం మొదలుపెట్టింది. లీజా ముందుకి వంగి, సిగ్గుపడింది, ఏడవడం మొదలుపెట్టింది. కాని మార్ఫ తిమొఫేయెవ్నాని లేవనివ్వ లేదు, తన చేతుల్ని వెనక్కి తీసుకోలేదు: అలా వెనక్కి తీసుకునే హక్కు తనకి లేదని ఆమె భావించింది, ఆ ముసలావిడ పశ్చాత్తాపపడటాన్నీ, జాలిపడటాన్నీ అడ్డగించే హక్కు తనకి లేదని భావించింది, అంతకు ముందు రోజు జరిగిన దానికి క్షమాపణ అర్థించకుండా చేసే హక్కు తనకి లేదని భావించింది. మార్ఫ తిమొఫేయెవ్నా ఆ అమాయకపు, పాలిపోయిన, సత్తువలేని చేతుల్ని అంతగా ముద్దుపెట్టుకోలేకపోయింది, నిశ్శబ్దంగా అశ్రువులు ఆమె కళ్లనుంచీ, లీజా కళ్లనుంచీ స్రవించాయి. పిల్లి మత్రోస్ పడక కుర్చీలో అల్లిక వూలుమధ్య గుర్రుమంది, దేవుడి విగ్రహం ముందు చమురు దీపపు జ్వాల మెరిసింది; ఆ సమయంలో పక్క గదిలో నస్తాస్య కార్పొవ్నా బంతిలాగా ముడిచిన తన చారల జేబురుమాలుతో రహస్యంగా కళ్లు తుడుచుకుంటూ, నుంచుని వుంది.

## 40

యీలోపున కింద డ్రాయింగ్ రూంలో ఆ బృందం ప్రిఫరెన్సు ఆడుతోంది. మార్య దీమ్రిత్రియెవ్నా నెగ్గుతోంది, మంచి హుషారుగా వుంది. ఒక నౌకరు వచ్చి పాన్‌షిన్ వచ్చాడని చెప్పాడు.

మార్య దీమ్రిత్రియెవ్నా పేక కింద పడేసి కుర్చీలో కుదురుగా వుండకుండా కదలడం మొదలుపెట్టింది. వర్వార పావ్‌లొవ్నా ఆమెకేసి వినోదభరితమైన చిరునవ్వుతోటి చూసి, అప్పుడు దృష్టిని గుమ్మంకేసి తిప్పింది. పాన్‌షిన్ వచ్చాడు. ఇంగ్లీషు యెత్తు కాలరు వున్న నల్లని ఫ్రాక్ కోటుని మెడ దగ్గర బొత్తాం పెట్టుకుని తొడుక్కున్నాడు. చిరునవ్వు లేకుండా, అప్పుడే శుభ్రంగా గడ్డం గీసుకున్న అతని ముఖం ''లోబడి వుండటం నాకు సులభం కాదు, కాని చూశారా, వచ్చేశాను'' అని చెప్పినట్టు వుంది.

''నిజంగా, వొల్దెమార్'' అంది మార్య దీమ్రిత్రియెవ్నా. ''కబురు చెయ్యకుండానే యెప్పుడూ లోపలికి వచ్చేవాడివి.''

పాన్‌షిన్ మార్య దీమ్రిత్రియెవ్నాకి కళ్లతోటే జవాబు చెప్పి, మర్యాదగా వంగి వందనం

చేశాడు కాని ఆమె చేతిని చుంబించలేదు. ఆమె వర్వార పావ్‌లొవ్నాకి అతన్ని పరిచయం చేసింది. అతను ఒక్క అడుగు వెనక్కి వేసి, అంతే మర్యాదగా, కాని యింకొంచెం హుందా, గౌరవం కనబడేటట్టుగా, వంగి అభివాదం చేసి పేకాట బల్ల దగ్గర కూర్చున్నాడు. ఆట త్వరలోనే అయిపోయింది. పాన్‌షిన్ ఎలిజవేతా మిహైలొవ్నా గురించి వాకబుచేసి ఆమెకి వంట్లో బాగుండలేదని విని అయ్యో పాపం అని అన్నాడు. అప్పుడు దౌత్యనీతియుక్తంగా ప్రతి మాటనీ ఆచితూచి వాడుతూ, ఆమె చెప్పేది శ్రద్ధగా వింటూ వర్వార పావ్‌లొవ్నా తోటి సంభాషణలోకి దిగాడు. అతని దౌత్యనీతిపరమైన గొంతుక తాలూకు గంభీరత్వం వర్వార పావ్‌లొవ్నాకి నచ్చలేదు. తద్భిన్నంగా ఆమె అతన్ని ఉల్లాసభరితమైన ఆసక్తితోటి పరకాయించింది, అలవోకగా సునాయాసంగా, ఆమె చక్కని నాసికాపుటలు అణచుకున్న హుషారుతో కంపిస్తూవుంటే అతనితో మాట్లాడింది. మార్య ద్మీత్రియెవ్నా ఆమె ప్రతిభా విశేషాలని పొగడ్డం మొదలుపెట్టింది. పాన్‌షిన్ మర్యాదగా, అతని కాలరు యిబ్బంది పెట్టనంత మేరకి మెడ వంచి ఆ విషయం అంతటి గురించీ తనకి యెప్పుడో నమ్మకం కలిగిందని చెప్పి, పక్క దారిలో వంకరగా పోయిపోయి ఆఖరికి మెటర్నిఖ్ దగ్గరికి చేరాడు. వర్వార పావ్‌లొవ్నా తన మఖమల్ కళ్లని చిన్నవి చేసింది. "మీరు కళాకారులు కూడానూ, ఎన్ కన్‌ఫ్రెర్* అని గొణుగుతూ; యింకా లోగొంతుకతో అంది పియానోకేసి తల వూపుతూ "వెనె!"** అని. ఆ మాట, "వెనె!" అని ఆమె వదిలిన ఆ మాట, పాన్‌షిన్‌మీద తక్షణం, మంత్రించినట్టు ప్రభావం చూపించింది. అతని గంభీరమైన వాలకం అంతా పోయింది. అతను చిరునవ్వు నవ్వాడు, హుషారు పుంజుకున్నాడు, ఫ్రాక్ కోటు బొత్తాం విప్పుకున్నాడు. "అంత పెద్ద కళాకారుణ్ణి కాను లెండి! కాని మీరు నిజమైన కళాకారులని విన్నాను" అంటూ వర్వార పావ్‌లొవ్నా వెనకాల పియానో దాకా వెళ్లాడు.

"తేలిపోయే చందమామని గురించి అతని పాటని పాడమను" అని అరిచింది మార్య ద్మీత్రియెవ్నా.

"మీరు పాడతారా?" అతనికేసి తటాల్న చిరునవ్వు నవ్వి చూస్తూ అడిగింది వర్వార పావ్‌లొవ్నా. "కూర్చోండి."

పాన్‌షిన్ యేవేవో సాకులు చెప్పబోయాడు.

"కూర్చోండి" అందామె మళ్లీ, తన వేళ్లతోటి కుర్చీ వీపుని తాటిస్తూ.

అతను "వూఁ" అని, దగ్గి, కాలరు వదులుచేసుకుని, తన పాటని పాడాడు.

---

* మా బంధువులే (ఫ్రెంచి).

** "పదండి!" (ఫ్రెంచి.)

''షార్మాం''* అంది వర్వార పావ్లొవ్నా. ''మీరు చాలా బాగా పాడారు. వుజవే ద్యు స్తిల్** – మళ్లీ పాడండి.''

ఆమె పియానో చుట్టు తిరిగివెళ్లి అతనికి యెదురుగా నుంచుంది. అతను మళ్లీ తన పాట పాడాడు, గొంతుకలోకి భావోద్విగ్న కదలిక నంతటినీ చొప్పిస్తూ. మోచేతుల్ని పియానోమీద ఆనుకుని, తెల్లటి చేతుల్ని పెదాల దగ్గరగా పెడుతూ వర్వార పావ్లొవ్నా అతనికేసి తదేకంగా చూసింది. పాన్షిన్ ముగించాడు.

''షార్మాం, షార్మాం ఇదీ''*** కళ్లలో అనుభజ్ఞులైన వాళ్ల మాదిరీ ధైర్యంతోటి అంది ఆమె. ''మీరు ఆడవాళ్ల పాడడం కోసం యేమైనా రాశారా చెప్పండి, మెజ్జ స్ప్రానా**** కోసం?''

''నేను అసలు యేమీ రాయను'' అన్నాడు పాన్షిన్. ''వూరికే నా సరదా కోసం రాసు కున్నాను తెలుసా.... కాని మీరు పాడతారా?''

''వూఁ.''

''ఓ, అయితే ఒకటి పాడు'' అని అడిగింది మార్య ద్మీత్రియెవ్నా.

వర్వార పావ్లొవ్నా కెంపెక్కిన చెక్కిళ్లమీదనుంచి జుట్టు వెనక్కి తీసుకుని, తల ఆడించింది.

''మన యిద్దరి గొంతుకలూ కలవాలి మరి'' అని మెల్లిగా అందామె పాన్షిన్కేసి తిరిగి. ''యిద్దరం ఒక డ్యూయెట్ పాడదాం. మీకు 'సాంగ్ గెలొసొ'***** లేకపోతే 'లా సి దరెం'****** లేకపోతే 'మిరా ల బ్యాంక లూనా'******* తెలుసా?''

''నేను 'మిరా ల బ్యాంక లూనా' యెప్పుడో పాడాను'' అన్నాడు పాన్షిన్. ''అబ్బే. అది యేనాడనగానో, యిప్పుడు మర్చిపోయాను.''

''ఫరవాలేదు, మెల్లిగా అనుకుంటూ లాగించేద్దాం, ఏం.''

---

* బాగుంది (ఫ్రెంచి).

** మీకు శైలి వుంది (ఫ్రెంచి).

*** అద్భుతమైన, బ్రహ్మాండమైన ఐడియా (ఫ్రెంచి).

**** ఆలాపనలో స్థాయికి పంచమం అనీ షడ్జమం అనీ పేర్లు వున్నట్టే వ్యక్తుల స్వరస్థాయికి ఇటాలియన్లో యిలాంటి పేర్లు వున్నాయి. 'మెజ్జ స్ప్రానా' హెచ్చు స్థాయి స్వరం అన్నమాట. – అను.

***** ''నాకు అసూయ'' (ఇటాలియన్).

****** ''చెయ్యి యిలా యివ్వండి'' (ఇటాలియన్).

******* ''చూడండి యిక్కడ పాలిన చందమామ వుంది'' (ఇటాలియన్).

వర్వార పావ్‌లొవ్నా పియానో దగ్గర కూర్చుంది. పాన్‌షిన్ ఆమె పక్కన నిలబడ్డాడు. వాళ్లిద్దరూ ఆ డ్యూయెట్‌ని తగ్గు గొంతుకలో పాడేరు, వర్వార పావ్‌లొవ్నా అతన్ని కొన్ని సార్లు దిద్దుతూ వుండగా. అప్పుడు వాళ్లు పైకి పాడేరు రెండు సార్లు "మిరా ల బ్యాంక లు — ఉ — నా" అనుకుంటూ. వర్వార పావ్‌లొవ్నా గొంతుక నేవళింపు పోయింది, కాని ఆమె నేర్పుగా నిర్వహించింది. పాన్‌షిన్ మొదట్లో సిగ్గు పడ్డాడు, కొంచెం గాడిలో పడలేదు, కాని త్వరలోనే కూడగట్టుకున్నాడు. అతని పాట అంత పాడుగా లేకపోవడానికి కారణం, అతను భుజాలు యెగరేసీ, శరీరాన్ని వూపీ, సిసలైన పాటగాడిలాగా చేతులు పైకి యెత్తి కమ్మేసుకోవడమే. వర్వార పావ్‌లొవ్నా థాల్‌బర్గ్ గీతాలు రెండు మూడింటిని వాయించి, వగలాడి లాగా ఒక ఫ్రెంచ్ ఆరియెట్ (చిన్న ఆరియా)ని "చదివింది." మార్య దీమ్రితి యెవ్నాకి తన ఆనందాన్ని వర్ణించడానికి మాటలు దొరకలేదు. కొన్ని సార్లు ఆమె లీజా కోసం కబురు పెడదా మనుకొంది. గెదెయొనోవ్‌స్కీకి కూడా మాటలు అందలేదు, అతను వూరికే తల ఆడించాడంతే. అప్పుడతను హఠాత్తుగా ఆవలించాడు, ఆవలింతని దాచుకోలేక పోయాడు. వర్వార పావ్‌లొవ్నా అది గమనించకపోలేదు. ఆమె వున్నట్టుండి పియానోకేసి వీపు తిప్పి గొణిగింది: "అస్సె డె మ్యుజిక్ కొమ్ స* రండి మాట్లాడుకుందాం" అని చేతులు ముడుచుకుంది. పాన్‌షిన్ హుషారుగా "ఉఇ, అస్సె డె మ్యుజిక్"** అని చిన్న సంభాషణలోకి దిగాడు — తెలిగ్గా, తళుక్కుమంటూ ఫ్రెంచిలో. వాళ్ల తేలికైన తప్పించు కునే సంభాషణ చూసి "అసలైన పారిస్ డ్రాయింగ్ రూంల సంభాషణల లాగానే వుంది" అనుకొంది మార్య దీమ్రితియెవ్నా. పాన్‌షిన్ బ్రహ్మాండంగా ఆనందిస్తున్నాడు; అతని కళ్లు మెరుస్తున్నాయి; అతని వదనం చిరునవ్వులతో నిండిపోయింది. మొట్టమొదట మార్య దీమ్రితియెవ్నా దృక్కుని చూడగానే అతను ముఖంమీద చెయ్యి పెట్టుకుని, కను బొమలు ముడుచుకుని, అప్పుడు హుస్సురని నిట్టూర్చేవాడు. ఆ తర్వాత అతను ఆమెని గురించి పూర్తిగా మరిచిపోయి, సగం లౌకిక, సగం కళాత్మకమైన పిచ్చాపాటీలో మునిగిపోయాడు. వర్వార పావ్‌లొవ్నా నిజమైన వేదాంతిలా కనిపించింది. ప్రతీదానికీ తక్కున సమాధానం చెప్పేది, యెప్పుడూ వూగిసలాడలేదు, సందేహించలేదు. ఆమె అన్ని రకాల మేధావులతోటి దీర్ఘంగా యెన్నో సార్లు మాట్లాడే వున్నట్టు కనిపించింది. ఆమె ఆలోచనలూ అను భూతులూ అన్నీ పారిస్ చుట్టూ పరిభ్రమించాయి. పాన్‌షిన్ సంభాషణని సాహిత్యం వేపు మళ్లించాడు. ఆమె కూడా అతని లాగానే ఫ్రెంచ్ పుస్తకాలు మాత్రమే చదువుతున్నట్లు తేలింది: జార్జ్ సాండ్ ఆమెకి మంట తెప్పించాడు, ఆమె బాల్జాక్‌ని గౌరవించింది,

---

* సరే సంగీతం చాలు (ఫ్రెంచి).

** "అవును, సంగీతం చాలు" (ఫ్రెంచి).

అతను విసుగనిపించినా; స్యూ, క్రైబ్‌లకి మానవ తత్వపు ప్రగాఢజ్ఞానం వుంది, డ్యూమా, ఫెవల్‌లని ఆమె ఆరాధించింది; హృదయంలో ఆమె అందరికంటే యెక్కువగా పాల్ డె కొక్‌ని అభిమానించింది, అతని పేరు చెప్పకపోయినా. అసలు చెప్పాలంటే సాహిత్యం ఆమెకి యెక్కువ ఆసక్తి కలిగించదు. తన పరిస్థితికి సంబంధించి యేదేనా అతిదూరపు ప్రస్తావన వుండే మాటని కూడా వర్వార పావ్‌లొవ్నా నేర్పుగా తప్పించేసింది. ఆమె సంభాషణలో ప్రేమ ప్రస్తావన లేదు. అందుకు భిన్నంగా ఆ మృదువైన అనుభూతి పట్ల ఆమె దృక్పథం నైష్ఠికంగా, భ్రమ రహితంగా, నిగర్వంగా వున్నట్లుండింది. పాన్‌షిన్ నిరసన తెలియచేశాడు; ఆమె సిగ్గుతో కూడిన మూకీ భావం వహించింది — కాని చిత్రం యేమిటంటే, ఆమె పెదాలు నిరసనపూర్వకమైన మాటలు అంటూ వుంటే, తరచుగా ఖండించే మాటలు, ఆ మాటల ధ్వని మెత్తగా, గోముగా వుండింది, ఆమె కళ్ళు మాట్లాడేయి — ఆ కళ్ళు కచ్చితంగా యేం మాట్లాడిందీ చెప్పడం కష్టం; కాని వాటి సారాంశం అందీ అందనట్టుగా, మధురంగా, యింకోలా యెలాగేనా వుండచ్చుగాని నైష్ఠికంగా మాత్రం లేదు. పాన్‌షిన్ వాటి రహస్య అర్థాన్ని తరచ ప్రయత్నించాడు. అతను కూడా కళ్లతో మాట్లాడ ప్రయత్నించాడు, కాని అతని ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి. వర్వార పావ్‌లొవ్నా విదేశాలనుంచి వచ్చిన, తన కంటే యెత్తులో వున్న ఆడసింహం అని అతనికనిపించింది, కాబట్టి తనకి తనమీదే ఆధిపత్యం లేదు. వర్వార పావ్‌లొవ్నాకి ఒక అలవాటు వుంది. ఎవళ్లతోనేనా మాట్లాడేటప్పుడు ఆ వ్యక్తి చొక్కా చేతుల్ని మెల్లిగా తాకడం. యీ క్షణికమైన స్పర్శలు వ్లదీమిర్ నికొలాయెవిచ్‌మీద సంచలనభరితమైన ప్రభావాన్ని కలిగించాయి. మనుషులతోటి సునాయాసంగా నెట్టుకొచ్చే జాణతనం వర్వార పావ్‌లొవ్నాకి వుంది. కొన్ని గంటల వ్యవధిలో కొన్ని యేళ్లుగా ఆమె తనకి తెలిసినట్లూ, తను నిజంగా ప్రేమించిన లీజా, అంతకు ముందు రోజే తనని పెళ్లి చేసుకొమ్మని తను అడిగిన లీజా ఒక పొగమంచులో మసక కమ్ముకుపోయినట్లూ పాన్‌షిన్‌కి అనిపించింది. టీ తెచ్చారు. సంభాషణ యింకా చులాగ్గా సాగిపోయింది. మార్య ద్మీత్రియెవ్నా నౌకర్ని పిలిచి లీజాకి గనక తల నొప్పి తగ్గి బాగుంటే కిందకి రమ్మని చెప్పవలసిందిగా కబురు చేసింది. లీజా ప్రస్తావన రాగానే పాన్‌షిన్ ఆత్మత్యాగం గురించి, యెవరు యెక్కువ ఆత్మత్యాగం చేసేదీ మగవాళ్లా, ఆడవాళ్లా అన్న దాన్ని గురించి మాట్లాడ్డం మొదలుపెట్టాడు. మార్య ద్మీత్రియెవ్నాకి తక్షణం ఆవేశం వచ్చేసి ఆడవాళ్లే యెక్కువ ఆత్మత్యాగం చెయ్యగలరనీ, దాన్ని తను అక్కడే రుజువు జేస్తాననీ చాటి, చెప్పడంలో స్పష్టత లేక చిక్కుకుపోయి ఆఖరికి కుంటి పోలికతో ముగించింది. వర్వార పావ్‌లొవ్నా ఓ సంగీతం పుస్తకం తీసుకుని సగం అడ్డు పెట్టేసుకుని, ఒక కేకు కొరుకుతూ పాన్‌షిన్‌మీదకి వంగి పెదాలమీదా, కళ్లల్లోనూ మృదువైన చిరునవ్వు తొణికిసలాడుతూ వుంటే "ఎల్ న ప ఎన్‌వంతె ల పుద్ర్, ల బొం

దామ్''* అని అంది. పాన్‌షిన్ వర్వార పావ్‌లొవ్నా తెగువకి కొంచెం ఆశ్చర్యపడిపోయి, నిర్ఘాంతపోయాడు. కాని హఠాత్తుగా ఫెళ్లుమన్న ఆ నిర్మొహమాటత్వంలో తనమీదకే యెంత యేవగింపు దాగులాడుతున్నదీ అనుమానించలేకపోయాడు. మార్య దీమ్రితియెవ్నా తనకి పెట్టిన భోజనాలు, చూపించిన ఆదరణ, అప్పిచ్చిన సొమ్ము అన్నీ మరిచిపోయి (దుర్మార్గుడు) అదే చిరునవ్వుతోటే, నిర్మొహమాటత్వంతోటే అతను అన్నాడు: ''జె క్రుఅ బ్యం'' అని, వుహుఁ, అంతే కాదు, ''జ్ క్రుఅ బం''** అని కూడా.

వర్వార పావ్‌లొవ్నా అతనికేసి స్నేహపూర్వకంగా ఒక సారి చూసి లేచింది. లీజా లోపలికి వచ్చింది. మార్ఫ తిమొఫేయెవ్నా ఆమెని వారించబోయింది కాని లాభంలేకపోయింది, ఆమె అగ్ని పరీక్షకి నిలబడాలనే నిర్ణయించుకుంది. వర్వార పావ్‌లొవ్నా పాన్‌షిన్‌తోటి కలిసి ఆమెని కలుసుకోడానికి ముందుకు వెళ్లింది. పాన్‌షిన్ మళ్లీ దౌత్యాధికారి పోజు పెట్టేశాడు.

''ఎలా వుంది?'' అని అడిగాడతను లీజాని.

''ఫరవాలేదు, బాగానే వుంది లెండి'' అందామె.

''కాస్త సంగీతం విని వినోదిస్తున్నాం యిక్కడ. నువ్వు వర్వార పావ్‌లొవ్నా పాట వినాల్సింది. ఎంత అద్భుతంగా పాడింది, అన్ అర్‌తిస్త్ కొంసొమె.''***

''యిలా రా, మా షెర్''**** అంది మార్య దీమ్రితియెవ్నా.

వొద్దికైన పిల్ల మాదిరీ వర్వార పావ్‌లొవ్నా ఆమె చెప్పిన మాటని శిరసా వహించి ఆమె కాళ్ల దగ్గర ఒక చిన్న స్టూలుమీద కూర్చుంది. తన కూతుర్ని పాన్‌షిన్‌తో మాట్లాడనివ్వడానికి ఒక క్షణం అవకాశం యిచ్చేందుకు గాను మార్య దీమ్రితియెవ్నా ఆమెని పిలిచింది. ఆ పిల్ల మనసు మార్చుకుంటుందని యింకా ఆమెకి ఆశగా వుంది. దానికి తోడు ఆమెకి యింకో ఆలోచన తట్టింది. దాన్ని వెంటనే చెప్పెయ్యాలని వుంది ఆమెకి.

''చూడు'' అని ఆమె వర్వార పావ్‌లొవ్నాతోటి గుసగుసలాడింది. ''నీకూ, మీ ఆయనకీ మధ్య పొత్తు కుదర్చడానికి ప్రయత్నిద్దా మనుకుంటున్నాను నేను. నెగ్గుతానని అనలేను కాని ప్రయత్నిస్తాను. నేనంటే అతనికి మంచి గౌరవం వుంది, తెలుసు కదా?''

---

* అక్షరాలా అనువాదం చేస్తే ''ఆమె మందుగుండు కనిపెట్టలేదు'' (ఫ్రెంచి) అని అర్థం. పెద్ద తెలివితేటలున్న ఆడది కాదు అన్నమాట.

** ''వూఁ, అలా అనుకుంటున్నాను'' (ఫ్రెంచి).

*** పరిపూర్ణ గాయకురాలు (ఫ్రెంచి).

**** నా ప్రియా (ఫ్రెంచి).

వర్వార పావ్‌లొవ్నా నెమ్మదిగా మార్య దీమ్త్రియెవ్నాకేసి కళ్ళు యెత్తి, అందమైన భంగిమలో తన చేతుల్ని కట్టుకుంది.

''మీరే నాకు దిక్కు, మా పిన్నిగారు'' అందామె విచారంగా. ''నా పట్ల మీరు చూపించే ఆదరానికి మీ రుణం యెలా తీర్చుకోగలనో నాకు తెలీదు. కాని నేను ఫ్యొదొర్ ఇవానిచ్‌కి చాలా అన్యాయం చేశాను. ఆయన నన్ను క్షమించరు.''

''కాని నువ్వు.... నిజంగా...'' మార్య దీమ్త్రియెవ్నా గుచ్చి, గుచ్చి అడిగింది.

''నన్నడక్కండి'' అని ఆమెకి అడ్డం వచ్చింది వర్వార పావ్‌లొవ్నా, కళ్ళు వాల్చుకుంటూ. ''నాకు చిన్నతనం, చిలిపితనం. అయినా నేను చేసిందానికి నాదే తప్పు అని ఒప్పుకుంటాను.''

''సరే, పోనీలే, ప్రయత్నించడానికేం? విచారించకు'' అంది మార్య దీమ్త్రియెవ్నా. ఆమెని చెక్కిళ్లమీద నిమరడానికి ఉద్యుక్తమై, ఆమె ముఖంకేసి చూసి తత్తరపడింది. ''అణకువ అయిన పిల్ల, కాని నిజంగా ఆడసింహమే'' అనుకొంది.

''వంట్లో బాగా లేదా'' అని యీలోపున పాన్‌షిన్ లీజాని అడుగుతున్నాడు.

''వుహుఁ, బాగా లేదు.''

''నాకర్థమైంది'' అని కొంచెం సేపు ఆగి అతను గొణిగాడు ''నాకర్థమైంది.''

''అంటే మీ ఉద్దేశం?''

''నాకర్థమైంది'' అన్నాడు పాన్‌షిన్ మళ్లీ మళ్లీ తెలిసినట్టుగా. అతనికి వూరికే యేం చెప్పాలో తెలీలేదు.

లీజా నిర్ఘాంతపోయింది, అప్పుడు అనుకొంది: ''ఎవరు పట్టించుకుంటారు!'' పాన్‌షిన్ మళ్లీ నిగూఢమైన వాలకంలో పడిపోయి యింకా గంభీరమైన భంగిమతో యెటో చూశాడు.

''పదకొండు కొట్టినట్టుంది'' అంది మార్య దీమ్త్రియెవ్నా.

అతిథులు ఆ సూచనని గమనించి సెలవు తీసుకోడానికి తయారయారు. ఆ మర్నాడు భోజనానికి వస్తాననీ, ఆడాని తీసుకువస్తాననీ వర్వార పావ్‌లొవ్నా అని, ఒట్టుపెట్టేటట్టు చేశారు. ఓ మూల జోగుతూ వున్న గెదెయొనోవ్‌స్కీ ఆమెని యింటిదగ్గర దిగపెడతానని అన్నాడు. పాన్‌షిన్ విధియుక్తంగా ప్రతి ఒక్కళ్లకీ వందనం చేసి, బయట మెట్లమీద, వర్వార పావ్‌లొవ్నా బండి యెక్కుతూ వుంటే, ఆమె చేతిని నొక్కి ''ఓ రెవుఅర్''* అన్నాడు. గెదెయొనోవ్‌స్కీ ఆమె పక్కనే కూర్చున్నాడు. ఆమె తన మృదువైన కాలి అంచుని అతని కాలిమీద యేదో పరధ్యాన్నంగా వుంచుతున్నట్టే వుంచుతూ వినోదిస్తోంది. అతను మురిసి ముప్పందుం అయిపోయి ఆమెని పొడుగుతూనే వున్నాడు. వీధి దీపాల వెలుతురు బండిలో

* ''సెలవ్'' (ఫ్రెంచి).

పడినప్పుడు ఆమె యికిలించి అతనికేసి ఓరగా చూసింది. తను వాయిస్తూ వున్న వాల్ట్జ్ గీతం ఆమె మనసులో మోగి ఆమెని ఉత్తేజ పరిచింది. ఆమె యెక్కడున్నా సరే వూరికే దీపాలనీ, బాల్ రూమ్‌నీ, సంగీతం మోగుతూ వుంటే చుట్టూ నాట్యం తిరిగే వాళ్లనీ వూహించుకుంటే చాలు — ఆమె రక్తం ఉడుకులెత్తేది, ఆమె కళ్లకి పొగమంచు కమ్మేసేది, పెదాలమీద చిరునవ్వు లాస్యం చేసేది, జాతరలో తాగి వూగిపోయేలాంటి ఉత్సాహం శరీర మంతా జలదరింపచేసేది. యింటి దగ్గరికి రాగానే వర్వార పావ్‌లొవ్నా అలవోకగా బండి లోనుంచి దూకింది — ఆడసింహం తప్ప యెవరేనా అలా చెయ్యగలరా? — గెదెయొనోవ్‌స్కీ కేసి తిరిగి, అతని ముఖంమీదే హుషారుగా ఫక్కున నవ్వేసింది.

"మంచి సరదా అయిన మనిషి" అనుకున్నాడు యింటికి పోతూ వుంటే ఆ ప్రభుత్వోద్యోగి. యింటిదగ్గర నౌకరు ఒకడు ఒక గ్లాసుడు కర్పూర తైలం పుచ్చుకుని యీయన కోసం సిద్ధంగా వున్నాడు. "నేను పెద్దమనిషినే, బాగుంది. ఆమె యెందుకు నవ్విందబ్బా?"

మార్ఫ తిమొఫేయెవ్నా రాత్రంతా లీజా మంచందగ్గరే కూర్చుంది.

## 41

లవ్రేత్‌స్కీ వసీల్యెవ్‌స్కొయెలో ఒకటిన్నర రోజు గడిపాడు, అధిక భాగం పరిసర ప్రాంతాల్లో తిరుగుతూనే. అతను యెక్కువ సేపు ఒక్క చోట వుండలేదు. అతని మనసు క్షోభతో నిండిపోయింది. యెడతెరిపిలేని, తీవ్రమైన, శక్తిహీనమైన ప్రేరణల చిత్రహింస లన్నీ అతను భరించాడు. వూళ్లోకి వచ్చిన మర్నాడు తన మనసుని ముంచెత్తిన అనుభూతుల్ని జ్ఞాపకం చేసుకున్నాడు. తను అప్పుడు వేసుకున్న పథకాలని జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. తనమీద తనకే అసహ్యం పుట్టింది. తన విధి అని తను తెలుసుకున్న దాన్నుంచి, తన భవిష్యత్ యేకైక కర్తవ్యంనుంచి తనని యేది విడదీసి వుంటుంది? ఆనందం కోసం కోరిక — మళ్లీ ఆనందం కోసం అదే కోరిక! "మిహాలేవిచ్ అన్నది రైటే" అనుకున్నాడతను. "నువ్వు మళ్లీ జీవిత మాధుర్యాన్ని రెండో సారి రుచి చూద్దామనుకున్నావు" అని తనకి తనే చెప్పుకున్నాడు. "మనిషికి ఒక సారే వచ్చినా కూడా అది ఒక భోగమనీ, అర్హతలేని వరమనీ నువ్వు మర్చి పోయావు. అది సంపూర్తికాదనీ, అది అబద్ధమనీ నువ్వు అనుకున్నావు. సంపూర్తి అయిన, సిసలైన ఆనందం కోసం మళ్లీ అర్రులు చాచావు! అందుకు నీకు హక్కేం వుంది? నీ చుట్టూ చూడు యెవరు ఆనందంగా వున్నారో, యెవరు సంతోషంతో వున్నారో? అడుగో రైతు, కోతకి వెడుతున్నాడు, అతనికి తృప్తివుందా? అతనూ, నువ్వూ చోట్లు బదలాయించు కుంటారా? మీ అమ్మని చూడు ఆమె జీవితంలో యేమి అర్థించింది — కాని ఆమె గతి యేమైంది? నువ్వు రష్యాకి వచ్చింది పొలం దున్నుకోడానికని పాన్‌షిన్‌తో చెప్పినప్పుడు

గొప్పలు పోయావన్న మాట. యీ వయసులో ఆడపిల్లల వెనకాల పడడానికి వచ్చావన్న మాట. నీకు స్వేచ్ఛ వచ్చింది అన్న వార్తరాగానే అన్నిటిపీ వదిలేసి, భూమ్మీద అన్నిటినీ మర్చిపోయి, సీతాకోక చిలకల వెంటబడే బడిపిల్లల్లా పరిగెత్తావు.'' లీజా రూపం అతని ఆలోచనలన్నిటి అంచునా వుంది. అతను ప్రయత్నంమీద దాన్ని తొలగించేశాడు, కలచ కుండా వుండే కొంటె, అందమైన విముఖమైన కవళికలతో యెడతెగకుండా వెంటాడే రూపాన్ని తొలగించేటట్టే. తన యజమాని వికలంగా వున్నాడని ముసలి అన్తోన్ గమనిం చాడు. ఒకటి రెండు సార్లు తలుపు వెనక్కాల, ఒకటి రెండు సార్లు గుమ్మంలోనూ నిట్చూ ర్చాక అతను ధైర్యం కూడదీసుకుని యజమాని దగ్గరికి వెళ్లి యేదేనా వెచ్చనిది తాగమని సలహా యిచ్చాడు. ల్రవేత్స్కీ అతన్ని అవతలకి పొమ్మని అరిచి, కేకలేసి, తర్వాత యేమీ అనుకోవద్దని సద్దుకున్నాడు. కాని అది అన్తోన్‌కి యింకా విచారం కలిగించింది. ల్రవేత్స్కీ డ్రాయింగ్ రూంలో వుండలేకపోయాడు. ఆ బొమ్మలోనుంచి అతని ముత్తాత అంద్రేయ్ తనకి యిలాంటి నీరసమైన వారసుడేమిటా అని నిష్ఠూరంగా చూస్తున్నట్టు వుంది. ''ఛ, ఛ! చవట!'' అని ఆయన వంకర మూతి అపహాస్యం చేస్తున్నట్టు వుంది. ''కానీ'' అనుకున్నాడు అతను. ''నేను నాశనం అయిపోకూడదు, యీ... యీ బరుకులకి నేను లొంగిపోకూడదు.'' (యుద్ధంలో తీవ్రంగా గాయపడ్డవాళ్లు యెప్పుడూ గాయాలని బరుకులనే అంటారు. మనిషి తనని తాను మోసపుచ్చుకోకపోతే భూమ్మీద బతకలేడు.) ''నేను ఏడుపుగొట్టు పిల్లాణ్ణి కాదు, సరే. నాకు దగ్గరగా చూసే భాగ్యం దక్కింది. ఒక జీవితకాలపు ఆనంద అవకాశం నా చేతులతో దాదాపు పట్టుకున్నాను — అది అకస్మాత్తుగా అదృశ్యమైపోయింది. లాటరీ కూడా చక్రం యింకొంచెం తిరిగితే ముష్టివాడు ధనికుడైపోతాడు. అలా కాకపోతే లేదు. అంతా అంతే అవుతుంది. నేను నడుం బిగించి నా పనికి సిద్ధం అవుతాను. బలవంతంగా ప్రశాంతంగా వుంటాను. నేను కూడదీసుకోవడం యిదే మొదటి సారి కాకపోవచ్చు. నేనెందుకు పారిపోవాలి? యిక్కడ యిసకలో తల దూర్చిన ఉష్ట్రపక్షి మాదిరిగా యెందుక్కూర్చున్నాను? ధైర్యం చాలకనా — ఛ! అన్తోన్!'' అని అరిచాడు. ''బండిని తక్షణం సిద్ధం చేయించు.'' ''అవును'' అనుకున్నాడు మళ్లీ. ''నేను బలవంతంగా ప్రశాంతంగా వుంటాను. పట్టు దప్పిపోను.''

యిలాంటి తర్కంతోటి ల్రవేత్స్కీ తన బాధని తగ్గించుకో బోయాడు. కాని అతని బాధ లోతుగా, తీవ్రంగా వుంది. అనుభూతికంటే తెలివి యెక్కువ లోపించిన అప్రాక్సేయా కూడా అతను బండిలోకి యెక్కుతూ వుంటే తల పంకించి, విచారంగా అతన్ని కళ్లతో అనుసరించింది. గుర్రాలు ఒక్క ఉదుట్న లగెత్తాయి. అతను కదలకుండా బిగుసుకుపోయి ముందున్న రోడ్డుకేసి నిరుత్సాహపూర్వకంగా చూస్తూ వుండిపోయాడు.

సాయంత్రం కలుసుకొమ్మని లీజా అతనికి అంతకు ముందు రోజున రాసింది. కాని అతను మొదట తన బసదగ్గరికి వెళ్లాడు. యింటిదగ్గర అతనికి భార్యగాని, కూతురుగాని కనిపించలేదు. ఆమె పిల్లని తీసుకుని కలీతిన్ల యింటికి వెళ్లిందని అతనికి పనిమనుషులు చెప్పారు. ఆ వార్త అతనికి ఆశ్చర్యం కలిగించింది, ఆగ్రహం తెప్పించింది. ''వర్వార పావ్లొవ్నా నేను నికృష్టంగా బతకాలని చూస్తున్నట్టు వుంది'' అనుకున్నాడతను, తీవ్రమైన కోపంతోటి. అతను అడ్డం వచ్చిన బొమ్మల్నీ, పుస్తకాలనీ, ఆడవాళ్ల వస్తువులనీ తన్నేస్తూ అటూ యిటూ పచార్లు చెయ్యడం మొదలుపెట్టాడు. జుస్తిన్‌ని పిలిచి ఆ ''చెత్తంతా'' తీసెయ్యమన్నాడు. ''ఉఇ, మెస్యే''* అని ఆమె కోణంగి మూతిపెట్టుకుని అంది. గది శుభ్రం చెయ్యడానికి సుతారంగా వంగి లవ్రేత్‌స్కీకేసి తనేదో అతన్ని యెడ్డి ఎలుగుబంటి లాగా చూస్తున్నట్టు అర్థమిచ్చే చూపు చూసింది. పోకిరీగా వున్నప్పటికీ, ''సరసంగా'' ఎగతాళిగా వున్న ఆమె పారిస్‌వాసుల వదనం లాంటి ముఖంకేసీ, తెల్లని చొక్కా చేతులకేసీ, రొమ్ముమీద కప్పుకున్న సిల్కుతువ్వాలుకేసి, చిన్న టోపీకేసి అతను ద్వేషంతో చూశాడు. ఆమెని పంపించివేసి, చాలాసేపు తటపటాయించిన తర్వాత — వర్వార పావ్లొవ్నా యింకా తిరిగి రాకపోవడం వల్ల — అతను కలీతిన్ల యింటికి వెడదామని అనుకున్నాడు. మార్య దీమ్రిత్రియెవ్నా దగ్గరికి కాకుండా (అతను డ్రాయింగ్ రూంలోకి, తన భార్య వున్న ఆ గదిలోకి యేమైనా సరే వెళ్లడు) మార్ఫ తిమొఫేయెవ్నా దగ్గరికి వెడదామనుకున్నాడు. నౌకర్లు వెళ్లేదారినుంచి మెట్లు తిన్నగా ఆమె గదిలోకి వున్నాయని అతనికి గుర్తువచ్చింది. అతను అలాగే చేశాడు. అతనికి అవకాశం కలిసివచ్చింది. పెరట్లో అతనికి షూరొచ్కా తగిలింది. ఆమె అతన్ని మార్ఫ తిమొఫేయెవ్నా గదిలోకి తీసికెళ్లింది. ఆమె మామూలుగా వున్నట్టుగా పరివార పరివేష్ఠిత అయికాకుండా ఒంటరిగా ఒక్కత్తే వుంది. ఆమె ఒక మూల, టోపీ లేకుండా, ముడుచుకుపోయి, చేతులు గుండెలమీద కట్టుకుని కూర్చుని వుంది. లవ్రేత్‌స్కీని చూడగానే ఆమె గాభరా పడిపోయి, లటాల్న లేచి, టోపీ వెతుక్కోడాని కన్నట్టు గదిలోనుంచి దూసుకుపోయింది.

''ఓ, నువ్వా, నువ్వా'' అందామె అతని చూపు తప్పించుకుంటూ, గదిలో కలదిరుగుతూ. ''బాగున్నావా? ఆఁ, వచ్చావు? నిన్న యెక్కడికి వెళ్లావు? అయితే ఆమె వచ్చిందన్న మాట. అవున్లే, యేం చేస్తాం.''

లవ్రేత్‌స్కీ కుర్చీలో కూలబడ్డాడు.

---

* ''అలాగేనండి'' (ఫ్రెంచి).

''ఆఁ, కూర్చో, కూర్చో, అయితే తిన్నగా పైకి వచ్చావన్న మాట. అవున్లే, బాగుంది. అయితే నన్ను చూడ్డానికి వచ్చావన్న మాట. సంతోషం.''

ఆ ముసలావిడ ఆగింది. ఆమెకి యేం చెప్పాలో ల్రవేత్స్కీకి తెలియలేదు. అయినా ఆమె అతన్ని అర్థం చేసుకుంది.

''లీజా.... వూఁ, లీజా యిందాకటి దాకా యిక్కడే వుంది'' అని మొదలుపెట్టిందామె తన చేతి సంచీ తాటిని కదుతూ, విప్పుతూ. ''దానికి ఒంట్లో అంత బాగా లేదు. ఘూరొచ్కా, యెక్కడున్నావ్? యిలారా అమ్మా; నువ్వు కుదురుగా కూర్చోవేం? నాకు తలనొప్పిగా వుంది, ఆ పాటలకీ సంగీతానికీ అనుకుంటాను.''

''పాటలేమిటి? అత్తా?''

''అయ్యో వాళ్ల ఆ పాటలు, యేమంటారు వాటిని?... ఆఁ, డ్యూయెట్లుట, అవి పాడేస్తూ వుంటే. అదీ యేమిటో భాష ఇటాలియనట 'చీ, చీ,' 'చా, చా' అబ్బబ్బ, కాకిలాగా ఒకటే గోల! ఆ స్వరాలేమిటో తెలీదు పళ్లు తీపులు పట్టిపోతాయి. అదుగో ఆ పాన్షిన్ గాడూ, మీ అర్ధాంగీనీ; ఎంత చేరికైపోయారు వాళ్లిద్దరూ, బంధువుల మాదిరీ, ఓ సందర్భం లేదు. చూడు, కుక్కకి కూడా తల దాచుకోవడానికి కప్పు కావాలి. దాన్ని తరిమేసే వాళ్లు లేనంతకాలం అది నశించిపోకుండా అలానే వుంటుంది.''

''అయినా నేనిదంతా యింకా నమ్మలేను'' అన్నాడు ల్రవేత్స్కీ ''దానికి చాలా నిబ్బరం కావాలి.''

''కాదు నాయనా, నిబ్బరం కాదు, ముందు చూపు. దేవుడు దాన్ని చల్లగా చూస్తాడు! దాన్ని ల్రావికికి పంపుతున్నావటగా?''

''అవును. ఆ ఎస్టేట్ని వర్వార పావ్లొవ్నాకి అప్పగిస్తున్నాను.''

''డబ్బడిగిందా?''

''యింకా అడగలేదు.''

''అదీ త్వరలోనే జరుగుతుందిలే. యిప్పుడే నిన్ను సరిగా చూస్తున్నాను. వంట్లో బాగుంది కదా?''

''ఆఁ.''

''ఘూరొచ్కా!'' అని పిలిచింది మార్ఫ తిమోఫేయెవ్నా. ''వెళ్లి ఎలిజవేతా మిహైలొవ్నాతో చెప్పు — అంటే ఆమెని అడుగు.... ఆమె కింద వుంది, వుందా?''

''ఆఁ.''

''సరే, వెళ్లి నా పుస్తకం యేం చేసిందో అడుగు, దానికి అర్థమవుతుంది.''

''అలాగే నమ్మా.''

ఆ ముసలావిడ మళ్లీ గదిలో డ్రాయరు సొరుగులు తెరుస్తూ, మూస్తూ తచ్చాడుతూ వుండింది. లవ్రేత్‌స్కీ కదలకుండా కూర్చున్నాడు.

ఉన్నట్టుండి మెల్లని అడుగుల చప్పుడు మెట్లమీద వినిపించింది. లీజా లోపలికి వచ్చింది.

లవ్రేత్‌స్కీ నుంచుని అభివాదం చేశాడు. లీజా గుమ్మం దగ్గర ఆగిపోయింది.

"లీజా, ఏదే? ఏదే నా పుస్తకం? యేం చేశావ్?" మార్ఫ తిమొఫేయెవ్నా హడావుడి పడిపోయి అడిగింది.

"పుస్తకం యేమిటి మామ్మా?"

"ఒరి నాయనో, పుస్తకమేమిటా? సర్లే నిన్ను పిలవడం యెందుకు. కింద యేం జరుగుతోంది? యిక్కడకి ఫ్యోదొర్ ఇవానిచ్ వచ్చాడు. ఎలా వుంది తలనొప్పి?"

"తగ్గింది, ఫరవాలేదు."

"అస్తమానూ ఫరవాలేదంటూనే వుంటావు. కింద యేం జరుగుతోంది? మళ్లీ పాటలేనా?"

"వుహుఁ, వాళ్లు పేకాడుతున్నారు."

"మొత్తానికి, దానికి అన్నింటికీ వూఁ అనే నేర్పు వుంది. షూరొచ్కా, తోటలోకి పోయి ఆడుకోవాలను కుంటున్నావ్? ఫో, పరిగెత్తిపోయి ఆడుకో."

"లేదండీ, అమ్మగారూ."

"వూ, మాటకు మాట చెప్పకు. ఫో, ఆడుకో. నస్తాస్య కార్పొవ్నా తనూ తోటలోనే వున్నట్టుంది. వూఁ కానీ, అదీ మంచి పిల్ల." షూరొచ్కా వెళ్లిపోయింది. "నా టోపీ యెక్కడే? ఎక్కడ చచ్చిందో?"

"నేను వెతుకుతా" అంది లీజా.

"అక్కర్లేదు, కూచో. నా కాళ్లకి యింకా సత్తువ వుంది. నా పడక గదిలో వుందేమో."

లవ్రేత్‌స్కీకేసి ఓర చూపులు చూసి, మార్ఫ తిమొఫేయెవ్నా బయటికి వెళ్లిపోయింది. ఆమె తలుపు ఓరగా వేసింది కాని వెంటనే వెనక్కి వచ్చి మూసేసింది.

లీజా కుర్చీలో వెనక్కి వాలి మెల్లిగా ముఖంమీద చేతులు పెట్టుకుంది; లవ్రేత్‌స్కీ కదల్లేదు.

"మొత్తానికి యీ రకంగా మనం మళ్లీ కలుసుకోవాల్సి వుందన్న మాట" అని అతను మాట కదలేశాడు.

లీజా ముఖంమీదనుంచి చేతులు తీసేసింది.

"అవును. మనకి మరీ త్వరలోనే శిక్షపడింది" అందామె లోగొంతుకతో.

"శిక్షపడ్డమా" గొణిగాడు లవ్రేత్‌స్కీ. "మీకు దేనికి శిక్షపడింది?"

లీజా అతని కళ్లకేసి చూసింది. లీజా కళ్లల్లో విచారం గాని ఆదుర్దా గాని లేవు.

అవి యింకా చిన్నవిగా, నిరుత్సాహపూరితంగా కనిపించాయి. ఆమె ముఖం పాలిపోయింది. కొద్దిగా తెరుచుకున్న ఆమె పెదాలు కూడా పాలిపోయివున్నాయి.

లవ్రేత్‌స్కీ హృదయం కనికరంతోటీ ప్రేమతోటీ మెలితిరిగిపోయింది.

''అంతా అయిపోయిందని మీరు రాశారు'' అతను మెల్లిగా అన్నాడు. ''ఆఁ, అంతా అయిపోయింది — యింకా మొదలవక ముందే.''

''అదంతా మనం మరిచిపోవాలి'' అని లీజా గొణిగింది. ''మీరు వచ్చారు. నాకు సంతోషంగా వుంది. మీకు రాద్దామనుకున్నాను, కాని యిదే బాగుంది. మనం యీ క్షణాలని వృథా పోనివ్వకూడదు. మనిద్దరం మన విధిని నిర్వహించాలి. మీరు, ఫ్యొదొర్ ఇవానిచ్, మీ ఆవిడ తోటి సర్దుబాటు చేసుకోవాలి.''

''లీజా!''

''అలా చెయ్యండని మిమ్మల్ని ప్రాధేయ పడుతున్నాను. ఆ రకంగానే మనం చేసిన దానికి నిష్కృతిని.... జరిగిన దానికి చేసుకోగలం. ఆలోచించండి — యీ నా కోరికని కాదనకండి.''

''లీజా, అసలు — మీరడిగేది చెయ్యడం అసాధ్యం. మీరు ఆజ్ఞాపించిన యేదేనా గానీ నేను చెయ్యడానికి సిద్ధంగా వున్నాను. కాని ఆవిడతోటి యిప్పుడు సర్దుబాటుకావడమా!... నేను దేన్నేనా భరిస్తాను. నేను మరిచిపోగలిగాను, క్షమించగలిగాను. కాని నా హృదయాన్ని బలవంతంగా.... అబ్బ, అది దారుణం!''

''నేను మిమ్మల్ని చెయ్యమని అడిగేది.... మీరు అంటూ వున్నదాన్ని చెయ్యండి. వుండలేకపోతే ఆమెతో కలిసి వుండకండి. కాని ఆమెతో సర్దుబాటు చేసుకోండి'' అంది లీజా. మళ్లీ చేతుల్లో ముఖం దాచుకుంది. ''మీ కూతురి గురించి ఆలోచించండి. యిది నాకోసం చెయ్యండి.''

''సరే'' అని లవ్రేత్‌స్కీ బిగించిన పళ్లమధ్యనుంచి గొణిగాడు. ''అది చేస్తాను, యేం; ఆ రకంగా నేను నా విధిని నిర్వర్తిస్తున్నాను. కాని మీ సంగతి యేమిటి? మీ విధి యేమిటి?''

''నా విధి యేమిటో నాకు తెలుసు.''

లవ్రేత్‌స్కీ బెదిరాడు.

''పాన్‌షిన్‌ని పెళ్లాడాలని అనుకుంటున్నారు, అవునా?'' అతను గట్టిగా అడిగాడు.

లీజా నీరసంగా చిరునవ్వు నవ్వింది.

''ఉహుఁహూఁ! లేదు!''

''లీజా! లీజా!'' అరిచాడు లవ్రేత్‌స్కీ. ''మనం యెంత ఆనందంగా వుండి వుండే వాళ్లం!''

లీజా అతనికేసి మళ్లీ చూసింది.

''యిప్పుడు చూడండి, ఫ్యోదొర్ ఇవానిచ్, ఆనందం అనేది మనమీద ఆధారపడిలేదు. దేవుడి చేతుల్లో వుంది.''

''అవును, యెందుకంటే మీరు....''

పక్క గదిలోకి వుండే తలుపు గబగబా తెరుచుకుంది. చేతుల్లో టోపీ పట్టుకుని, మార్ఫ తిమొఫేయెవ్నా మళ్లీ వచ్చింది.

''దొరికింది, దీని దుంపతెగ'' అందామె లీజాకీ, లవ్రేత్‌స్కీకీ మధ్యన నుంచుంటూ. ''నేను యెక్కడో పెట్టి వుంటాను. వయసు మీదబడితే అలాగే వుంటుంది తెలుసా? యేమిటో! పడుచుదనం మాత్రం మెరుగ్గా వుందా? నువ్వు కూడా మీ ఆవిడతోటి లావ్రికి వెడుతున్నావా?'' అందామె ఫ్యోదొర్ ఇవానిచ్‌కేసి తిరిగి.

''ఆమెతోటి లావ్రికికా? నేనా? నాకు తెలీదు'' అని కొంచెం సేపు ఆగాక అతను గొణిగాడు.

''కిందికి వెడుతున్నావా?''

''యివాళ వెళ్లను.''

''సరే నీకు తెలుసు. కాని నువ్వు వెళ్లాల్సి వుంటుంది, లీజా. అయ్యో, బుల్‌ఫించ్‌కి గింజలు వెయ్యలేదు. ఓ క్షణం వుండండి యిప్పుడే వస్తాను.''

మార్ఫ తిమొఫేయెవ్నా టోపీ పెట్టుకోకుండా మళ్లీ అవతలికి వెళ్లిపోయింది.

లవ్రేత్‌స్కీ గబగబా లీజా దగ్గరికి వెళ్లాడు.

''లీజా'' అని అతను అర్థించే గొంతుకతో మొదలుపెట్టాడు. ''మనం యెప్పటికీ విడిపోతున్నాం, నా హృదయం బద్దలైపోతోంది—నాకు వీడ్కోలు చెబుతూ యేదీ మీ చెయ్యి యిలా యివ్వండి.''

లీజా తన తలని యెత్తింది. అతన్ని మసక కమ్మిన, అలసిన కళ్లతోటి చూసింది.

''వద్దు'' అని ఆమె గొణిగింది, ముందుకు చాచిన చేతిని వెనక్కి లాక్కుంటూ. ''వద్దు, లవ్రేత్‌స్కీ (మొట్టమొదటి సారిగా ఆమె అతన్ని ఆ పేరుతో పిలిచింది) వద్దు, చెయ్యి యివ్వను. యేమిటి లాభం? వెళ్లిపొండి, మిమ్మల్ని అర్థిస్తున్నాను. మీకు తెలుసు నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను.... అవును, మిమ్మల్ని ప్రేమిస్తున్నాను'' అని అందామె కొంచెం ప్రయత్నంతోటి. ''కాని వద్దు.... వద్దు.''

ఆమె జేబురుమాలుని పెదాలకి అద్దుకుంది.

''కనీసం ఆ జేబురుమాల్ని నాకియ్యి.''

తలుపు కిర్రుమంది... జేబురుమాలు లీజా వొడిలోకి జారింది. అది జానపడకుండానే లవ్రేత్‌స్కీ దాన్ని పట్టుకున్నాడు, గబగబా దాన్ని జేబులో కుక్కుకున్నాడు, వెనక్కి తిరిగి మార్ఫ తిమొఫేయెవ్నా దృక్కుని చూశాడు.

''లీజా, మీ అమ్మ పిలుస్తోందను కుంటానమ్మా'' అందా ముసలావిడ.

లీజా వెంటనే లేచి, అవతలికి వెళ్లిపోయింది.

మార్ఫ తిమొఫేయెవ్నా మళ్లీ మూల, తన చోట్లో, కుచుంది. లవ్రేత్‌స్కీ వెళ్లి పోవడానికి సెలవు తీసుకుందామని లేచాడు.

''ఫేద్యా'' అందామె వున్నట్టుండి.

''ఏం, అత్తా?''

''నువ్వు నిజాయితీ అయిన వాడివేనా?''

''అంటే?''

''ఉహుఁ, నువ్వు నిజాయితీ అయిన వాడివేనా?''

''అనుకుంటున్నాను.''

''హుమ్. నువ్వు నిజాయితీ పరుడివని నాకు మాటియ్యి.''

''అలాగే కానీ. యింతకీ సంగతేమిటి?''

''యీ గొడవంతా యేమిటో నాకు తెలుసు. నీక్కూడా నాయనా, కొంచెం ఆలోచిస్తే — నువ్వేం తెలివితక్కువ వాడివి కాదు, నీకు తెలుసు — నేను యేది ఉద్దేశిస్తున్నానో తెలిసే వుంటుంది. అంచేత, బాబూ, సెలవు. నన్ను చూడ్డానికి వచ్చావు, సంతోషం. గుర్తుంచుకో మాట యిచ్చావు, ఫేద్య. రా, చుంబించు. అవును బాబూ నీకు కష్టం. నాకు తెలుసు. యెవళ్లకేనా గానీ కష్టమే. ఒకప్పుడు యీగల్ని చూసి అసూయ పడేదాన్ని — అవే కులాసాగా వున్నా యనుకునేదాన్ని — ఒక రోజున ఒకటి సాలెగూడులో చిక్కుకునే దాకా. అప్పుడనిపించింది వాటి కష్టాలు వాటికున్నాయని. యేం చేస్తాం, ఫేద్య. నీ మాట మర్చి పోవద్దు. వెళ్లిపో. సెలవు.''

లవ్రేత్‌స్కీ వెనక మెట్లు దిగి గేటు దాకా వెళ్లిపోయాడు, అప్పుడు ఒక నౌకరు అతన్ని అందుకున్నాడు.

''అయ్యా, మార్య ద్మీత్రియెవ్నాగారు మిమ్మల్ని పిలుస్తున్నారండి'' అన్నాడతను లవ్రేత్‌స్కీతోటి.

''ఆవిడతోటి చెప్పూ, నేను యిప్పుడే...'' ఫ్యోదొర్ ఇవానిచ్ చెప్పబోయాడు.

''అమ్మగారు మీతో యిది ముఖ్యమని చెప్పమన్నారండి. తను ఒక్కత్తే వున్నానని చెప్పమన్నారండి'' అన్నాడు నౌకరు.

''చుట్టాలు వెళ్లిపోయారా?'' లవ్రేత్‌స్కీ అడిగాడు.

''ఆయ్, వెళ్లిపోయారండి'' అన్నాడు నౌకరు యికిలిస్తూ.

లవ్రేత్‌స్కీ భుజాలు యెగరేసి అతని వెనక్కాలే వెళ్లాడు.

## 43

మార్య దీమ్త్రియేవ్నా తన గదిలో ఒకత్తి వాల్టేర్ కుర్చీలో కూర్చుని ఉడికులాం వాసన చూస్తూ వుంది. పక్కనే బల్లమీద ఒక గ్లాసులో నారింజ పువ్వుల పరిమళ జలం వుంది. ఆమె ఆందోళనగా కంగారుగా వున్నట్టుగా వుంది.

ల్రవేత్స్కీ లోపలికి వచ్చాడు.

"నన్ను రమ్మన్నారా?" అన్నాడు, ముభావంగా వందనం చేస్తూ.

"అవును" అంది మార్య దీమ్త్రియేవ్నా ఒక్క గుక్క నీళ్లు తాగుతూ. "మీరు తిన్నగా అత్తయ్య దగ్గరికి వెళ్లారని తెలిసింది. మిమ్మల్ని పిలవమని చెప్పాను. మీతో మాట్లాడదా మనుకున్నాను. కూర్చోండి" అంది మార్య దీమ్త్రియేవ్నా. కాస్త వూపిరి పీల్చుకోవడం కోసం ఆగింది. "మీకు తెలుసు కదా మీ ఆవిడ వచ్చింది" అందామె.

"తెలుసు" అన్నాడు ల్రవేత్స్కీ.

"వూఁ, అమ్.... యేం, నే చెప్పాలనుకున్నదేమిటంటే ఆమె నన్ను చూద్దామని వచ్చింది. నేనూ ఆదరించాను. ఆ విషయం గురించే మీతో మాట్లాడదామని పిలిచాను, ఫ్యోదొర్ ఇవానిచ్. యేదో దేముడి దయవల్ల అందరూ నన్ను గౌరవంగా చూస్తారు. నా చేత యేదీ అన్యాయమైందీ, అగౌరవమైందీ యీ భూమ్మీద చేయించలేదు. మీకు అసంతృప్తిగా వుంటుందని అనుకున్నాననుకోండి, అయినా ఆవిణ్ని కాదనలేకపోయాను. ఫ్యోదొర్ ఇవానిచ్, ఆమె యెంత చెడ్డా మన చుట్టం చూశారూ — మీ ద్వారానే అనుకోండి — మాటకి నా స్థానంలోనే మీరున్నారనుకోండి; ఆమెని రానివ్వకుండా తలుపులు మూసేసే అధికారం నాకేం వుంది? ఏమంటారు?"

"మీరు దాన్ని గురించి బాధపడకండి, అక్కయ్యగారూ" అన్నాడు ల్రవేత్స్కీ. "మీరు చేసిన పని సబబైందే. నాకు పిసరు కూడా కోపం లేదు. తన పరిచయస్థుల్ని కలుసుకోకుండా వర్వార పావ్లొవ్నాని అడ్డగించే హక్కు నాకు లేదు. యివాళ నేను మీ గదిలోకి రాకపోవడానికి కారణం వూరికే ఆమెని చూడ్డం యిష్టంలేకనే — అంతే."

"ఆ మాటన్నారు చాలు, ఫ్యోదొర్ ఇవానిచ్" అంది మార్య దీమ్త్రియేవ్నా. "మీరు మంచి వాళ్లనీ అలా అంటారనీ నాకు తెలుసు. నా బాధకి సంబంధించి — అందులో వింత లేదు, నేను ఆడదాన్ని కానా తల్లిని కానా. మీ ఆవిడ, మీకు తెలుసు కదా, — నేను మీకు తీర్పరిని కాననుకోండి — నేనే ఆ ముక్క ఆవిడతో అన్నాను; కాని ఆమె యెంత స్నేహశీలి, చాలా సరదాగా వుంటుంది. అసలు ఆమె అంటే యిష్టపడకుండా యెలా వుండగలరు యెవరేనా."

ల్రవేత్స్కీ యెత్తిపొడుపుగా చిరునవ్వునవ్వి, టోపీతోటి ఆడుకుంటున్నాడు.

''యింకో విషయం వుంది మీతో చెప్పాలనుకుంటున్నది ఫ్యోదొర్ ఇవానిచ్'' మార్య దీమ్రిత్రియెవ్నా దడదడ చెపుతూనే వుంది యింకొంచెం అతనికి దగ్గరగా జరిగి. ''ఆమె యెంత వినయంగా వుంటున్నదీ, యెంత మర్యాదగా వుంటున్నదీ మీరే గమనించి వుంటారు. చాలా హత్తుకుపోయేటట్టు వుంది, నిజంగా. ఆమె మిమ్మల్ని గురించి యెలా మాట్లాడు తుందని, మీరు వినాలి! 'తప్పంతా నాదేనండీ' అంటుంది తను. 'ఆయన్ని సరిగ్గా అర్థం చేసుకోలేకపోయానండీ' అంది. 'ఆయన మనిషి కాడండీ, దేముడు' అంటుంది. నిజంగా ఆ మాటే వాడింది — దేముడు. యెంత పశ్చాత్తాపపడింది. నిజంగా నేను అలా పశ్చాత్తాప్పడ్డవాళ్లని నా జన్మలో చూళ్లేదు, ఒట్టు!''

''నేను అడుగుతున్నానని అనుకోకండి, అక్కయ్యగారూ'' అంటూ లవ్రేత్స్కీ గొణిగాడు. ''వర్వార పావ్లొవ్నా యిక్కడ పాటలు పాడుతూ వుందని విన్నాను. పశ్చాత్తాపంతో నలిగి పోతూ పాటలు పాడుతోందేం?''

''రామరామ! అలా మాట్లాడ్డం మహా పాపం! పాపం ఆ పిల్ల పియానో వాయించి పాటలు పాడింది నా కోసం, నన్ను సంతోషపెట్టడానికి, నేనే పాడమని అడిగాను, అడగడ మేమిటి, ఆజ్ఞాపించాను. ఆమె చాలా విచారంగా వుంది, చాలా. ఆమెని యెలా దృష్టి మళ్లిం చాలా అనుకున్నాను. అప్పుడు ఆవిడకి అలాంటి మంచి అభినివేశం వుందని గుర్తుకువచ్చింది. ఫ్యోదొర్ ఇవానిచ్, పాపం ఆమె పూర్తిగా చితికిపోయింది, సెర్గేయ్ పెత్రోవిచ్‌ని అడగండి కావలిస్తే — గుండె పగిలిపోయిన ఆడది, తుత్-అ-ఫే* నిజంగా.''

లవ్రేత్స్కీ వూరికే భుజాలు యెగరేశాడు.

''యిక ఆ పిల్ల ఆడా వుంది, మీ కూతురు, చిదిమి దీపం పెట్టవచ్చు. యెంత ముద్దొచ్చే పిల్ల! యెంత ముచ్చటగా, యెంత తెలివిగా వుంది పిల్ల! ఫ్రెంచ్ అద్భుతంగా మాట్లాడుతుంది. రష్యన్ కూడా తెలుసు — నన్ను అత్తా అంది. తన యీడు పిల్లల్లాగా కొత్తే లేదు ఆ పిల్లకి, అస్సలు. అంతా మీ పోలికే ఫ్యోదొర్ ఇవానిచ్, యెక్కడో గాని అలా వుండదు. ఆ కళ్లు, కనుబొమలు.... అచ్చం మీ ముద్రే. నాకు చిన్న పిల్లలంటే పెద్ద యిష్టం వుండదు, నిజం చెప్పాలంటే, కాని మీ అమ్మాయిని చూశాక నన్ను నేనే మర్చి పోయాననుకోండి.''

''మార్య దీమ్రిత్రియెవ్నా'' లవ్రేత్స్కీ ఆశ్చర్యపోతున్నట్టు అన్నాడు. ''యిదంతా నాకు యెందుకు చెవుతున్నారో, మీ అభిప్రాయం యేమిటో నాకు తెలియటం లేదు.''

''నా అభిప్రాయమా?'' మార్య దీమ్రిత్రియెవ్నా యింకో సారి ఉడుకులాం వాసన చూసి, యింకో గుక్క నీళ్లు తాగి అంది. ''వూఁ, ఫ్యోదొర్ ఇవానిచ్ యిదంతా యెందుకు

---

* పూర్తిగా (ఫ్రెంచి).

చెబుతున్నానంటే.... నేను మీకు బంధువుని కదా, యేమైనా. మీరంటే నాకభిమానం మీ మనసు సరైందని నాకు తెలుసు. చూడండి, మోం కుజిం, తమ్ముడుగారూ నేను అంతో యింతో అనుభవం వున్న ఆడదాన్ని, వూరికే మాటలు వదిలేదాన్ని కాదు. ఆమెని క్షమించండి, మీ ఆవిడని క్షమించండి.'' మార్య ద్మీత్రియెవ్నా కళ్లల్లో వున్నట్టుండి నీళ్లు తిరిగాయి. ''కొంచెం ఆలోచించండి. ఆమె కుర్రతనం, లోకజ్ఞానం లేకపోవడం.... బహుశా చెడ్డ ఉదాహరణ కావచ్చు. ఆమెని సరైన దార్లో పెట్టే తల్లి వుండకపోవచ్చు. ఆమెని క్షమించండి, ఫ్యోదొర్ ఇవానిచ్, ఆమెకి యిప్పటికే తగినంత శిక్షపడింది.''

మార్య ద్మీత్రియెవ్నా కళ్లనీళ్లు చెక్కిళ్లమీదనుంచి జారిపోయాయి. ఆమె వాటిని తుడుచుకోలేదు. ఓ సారి యేడవడమే మంచిదని ఆమెకి అనిపించింది. లవ్రేత్స్కీ ముళ్ల మీద కూర్చున్నట్టు కూర్చున్నాడు. ''ఓరి భగవంతుడా'' అనుకున్నాడతను ''ఏమిటీ హింస? యీ రోజంతా యిలా యేడిసిందేమిటి?'' అని.

''మాట్లాడరేం?'' మార్య ద్మీత్రియెవ్నా మళ్లీ మొదలుపెట్టింది. ''నేను దీన్ని యెలా అర్థం చేసుకోవాలి? మీరు నిజంగా అంత క్రూరంగా వుంటారా? వుహుం, నేను నమ్మలేను. నా మాటలు మిమ్మల్ని ఒప్పించాయనే నేను అనుకుంటాను. ఫ్యోదొర్ ఇవానిచ్, మీ దయాగుణానికి దేముడు మీకు మేలు చేస్తాడు, మీరు ఆమెని నా చేతులమీదుగా అందుకోండి....''

లవ్రేత్స్కీ కూర్చున్న చోటినుంచి దిగ్గున లేచాడు. మార్య ద్మీత్రియెవ్నా కూడా లేచింది, లేచి ఒక తెర వెనక్కాలకి పోయి వర్వార పావ్లొవ్నాని చెయ్యి పట్టుకుని తీసుకు వచ్చింది. పాలిపోయి, జీవచ్ఛవంలాగా వుండి, కళ్లు నేలకేసి చూస్తూ ఆమె మొత్తం సొంత ఆలోచననీ, యిష్టాన్నీ వదిలేసినట్టుగా మార్య ద్మీత్రియెవ్నా చేతుల్లో వాలిపోయింది.

లవ్రేత్స్కీ ఒక్క సారి వెనక్కి గెంతాడు.

''అయితే నువ్వింత సేపూ యిక్కడే వున్నావన్న మాట!'' అన్నాడతను.

''ఆమె తప్పులేదు'' అంది గబగబా మార్య ద్మీత్రియెవ్నా. ''ఆమెససేమిరా వుండనంది. నేనే వుండి తీరాలని పట్టుబట్టాను. నేనే ఆమెని తెర వెనక్కాల వుంచాను. మీకు దాని వల్ల యింకా కోపం వస్తుందని ఆమె అంటూనే వుంది కాని నేనే వినలేదు. కాని మీ గురించి ఆమె కంటే నాకే యెక్కువ తెలుసు. రండి, మీ ఆవిడని నా చేతులమీదుగా గ్రహించండి. వర్వార, రా, భయపడద్దు, అతని ముందు కిందపడు'' (ఆమె వర్వార పావ్లొవ్నాని చేత్తో పొడిచింది) ''నా ఆశీర్వచనాలు...''

''ఒక్క క్షణం ఆగండి మార్య ద్మీత్రియెవ్నా'' లవ్రేత్స్కీ భయంకరమైన గొంతుకని అణుచుకుంటూ ఆమె మాటకి అడ్డం వచ్చాడు. ''హృదయ విదారక దృశ్యాలంటే మీకు యిష్టమని నాకు తెలుసు'' (లవ్రేత్స్కీ పొరపాటు పడలేదు; మార్య ద్మీత్రియెవ్నా

బడిపిల్లల మాదిరీ నాటకీయంగా వుండే కుతూహలాన్ని పోగొట్టుకోలేదు); ''అవి మీకు సరదాగా వుండవచ్చు. మిగిలిన వాళ్లకి అలా వుండవుకదా. యేమైనా నేను మీతో మాట్లాడను. యీ రంగంలో మీరు ముఖ్య పాత్ర ధారులు కారు. యేమిటి కావాలి మీకు చెప్పండి, మదాం'' అన్నాడతను భార్యకేసి తిరిగి. ''నేను చెయ్యగలిగింది చేశాను కదా? యీ నాటకం నేను యేర్పాటుచేసింది కాదండీ అని నా దగ్గర టక్కులు పోవద్దు — నేను నమ్మను — నేను నిన్ను నమ్మనని నీకు తెలుసు. మరి నీకేం కావాలి? నువ్వు తెలివైన ఆడదానివి. ఉద్దేశ్యం యేమీ లేకుండా నువ్వు యే పనీ చెయ్యవు. యిదివరలో వున్నట్టుగా నీతో కలిసి నేను బతకడం అనే సమస్యేలేదని నువ్వు గ్రహించాలి. నీమీద నాకు కోపం వుందని కాదు, నేను గతంలో లాంటి మనిషిని కాను. ఆ విషయం నీతోటి నువ్వు వచ్చిన రోజనే చెప్పాను. యిప్పుడు నువ్వూ లోపల్లోపల ఆ విషయం అవుననే అనుకుంటూ వుంటావు. కాని ప్రపంచం దృష్టిలో నువ్వు మళ్లీ యథాస్థానంలోకి రావాలని అనుకుంటు న్నావు. నా యింట్లో వుండటమే నీకు చాలదు, నువ్వు అదే యింట్లో నాతో వుండాలను కుంటున్నావు — యేం కాదా?''

''మీరు నన్ను క్షమించాలని అర్థిస్తున్నాను'' అంది వర్వార పావ్‌లొవ్నా కళ్లు పైకి యెత్తకుండానే.

''ఆమె మీరు తనని క్షమించాలని అడుగుతోంది'' అని మార్య దీమ్రితియెవ్నా రెట్టిం చింది.

''నాకోసం కాదు, ఆడాకోసం'' అని మెల్లిగా అంది వర్వార పావ్‌లొవ్నా.

''తనకోసం కాదు, ఆడాకోసం'' మార్య దీమ్రితియెవ్నా వల్లించింది.

''సరే, అదేనా నీకు కావాల్సింది?'' లవ్రేత్‌స్కీ ప్రయత్నంమీద అన్నాడు. ''సరే, దానికీ ఒప్పుకుంటున్నాను.''

వర్వార పావ్‌లొవ్నా అతనికేసి టక్కున చూసింది. మార్య దీమ్రితియెవ్నా అరిచింది ''అమ్మయ్య, దేముడి దయ'' అని. అలా అని వర్వార పావ్‌లొవ్నాని మళ్లీ చెయ్యి పట్టు కుని లాగి, ''యిప్పుడు నా చేతులుమీదుగా అందుకోవాల్సింది....''

''ఒక్క క్షణం ఆగండి, యేం?'' లవ్రేత్‌స్కీ ఆమె మాటకి అడ్డం వచ్చాడు. ''నేను నీతో వుండటానికి ఒప్పుకుంటున్నాను, వర్వార పావ్‌లొవ్నా'' అన్నాడతను. ''అంటే నిన్ను లావ్రికి తీసుకుపోయి అక్కడ నీతో వుండగల్గినంత కాలం వుంటాను. అప్పుడు వెళ్లిపోతాను. తర్వాత అప్పుడప్పుడు వస్తూవుంటాను. నేను నిన్ను మోసం చేద్దామనుకో వడం లేదు. కాని అంతకంటే నన్నేం యింక అడగద్దు. పాపం మన అక్కయ్యగారి మాట పట్టుకుని నిన్ను గుండెల కదిమేసుకుని.... జరిగింది జరగనట్టూ, పడిపోయిన చెట్టు మళ్లీ చిగురిస్తుందనీ చెప్పడం మొదలుపెడితే నువ్వే నవ్వుతావు. విధిగా జరగవలసిందాని

ముందు నుసం మోకరిల్లాల్సిందే. నీకు నే చెప్పే మాటల్లో నా ఉద్దేశ్యం యేమిటైందీ అర్థం కాదు.... పోనీలే. మళ్లీ చెబుతున్నాను. నీతో కలిసి వుంటాను.... వుహుఁ, నేను వాగ్దానం చెయ్యలేను.... నీతో రాజీపడతాను, నిన్ను మళ్లీ నా పత్నిగా చూస్తాను....''

''ఆ మాటమీద కనీసం ఆమెకి మీ చెయ్యి అయినా యియ్యండి'' అంది మార్య దీమ్రితియెవ్నా, అప్పటికి ఆవిడ కన్నీళ్లు యిగిరిపోయాయి.

''నేనెప్పుడూ వర్వార పావ్‌లొవ్నాని మోసం చెయ్యలేదు'' అన్నాడు లవ్రేత్‌స్కీ. ''నా మాట చాలు. నేను ఆమెని లావ్రికిలో దిగబెడతాను. గుర్తుంచుకో, వర్వార పావ్‌లొవ్నా, నువ్వు లావ్రికి వదలిపెట్టిన మరుక్షణం యీ యేర్పాటు భంగం అయిపోతుంది. మరి మీ దగ్గర సెలవు తీసుకుని వెళ్లిపోతున్నాను.''

ఆ యిద్దరు ఆడవాళ్లకీ అభివాదం చేసి అతను గబగబా వెళ్లిపోయాడు.

''ఆమెని మీతో తీసుకుని వెళ్లరూ?'' అని పిలిచింది మార్య దీమ్రితియెవ్నా.

''ఆయన్ని వెళ్లనివ్వండి'' అని వర్వార పావ్‌లొవ్నా ఆమెతో మెల్లిగా అని, తక్షణం ఆమెకి కృతజ్ఞతలు చెబుతూ ఆమె మెడని చుట్టేసుకుని, చేతుల్ని ముద్దుపెట్టుకుని తనని కాపాడిన దేవత అని అంది.

మార్య దీమ్రితియెవ్నా యీ అనురాగ చిహ్నాల్ని అనుగ్రహపూర్వకంగా అందుకుంది. కాని ఆవిడ మనసులో లవ్రేత్‌స్కీ పట్ల, వర్వార పావ్‌లొవ్నా పట్ల, మొత్తం ఆ దృశ్యం అంతటి పట్లా అసంతృప్తి మిగిలిపోయింది. ఆవిడ యెంతో జాగ్రత్తగా ఆ రంగం సిద్ధం చేసింది. తను అనుకున్నంతగా ఆ దృశ్యం కదిలించలేదు. వర్వార పావ్‌లొవ్నా భర్త కాళ్లమీద వాలిపోవాలని ఆమె అనుకుంది.

''నన్ను అర్థం చేసుకోలేదేం నువ్వు? నేను నీకు చెబుతూనే వున్నాను: ''కింద పడు మోకరిల్లు అని'' అందామె.

''యిలాగే బాగుంది లెండి; భయపడకండి – అంతా అద్భుతంగా జరిగిపోయింది'' అని వర్వార పావ్‌లొవ్నా ఆమెకి హామీ యిచ్చింది.

''నిజమే, అతను మంచు లాగా గడ్డకట్టిపోయి వున్నాడు'' అంది మార్య దీమ్రితియెవ్నా. ''నువ్వు యేడవలేదు. కాని నేను వలవల యేడ్చాను. అయితే నిన్ను లావ్రికిలో బంధించి వుంచేస్తాడన్న మాట. అంటే నువ్వు నన్ను చూడ్డానికి కూడా రాలేవనేనా? మొగాళ్లంతా కటిక గుండె వాళ్లే'' అందామె తెలిసినట్టుగా తల వూపుతూ.

''ఆడవాళ్లు దయనీ, దాతృత్వాన్నీ అర్థం చేసుకోగలరు'' అని అంది వర్వార పావ్‌లొవ్నా. మార్య దీమ్రితియెవ్నా ముందు మోకాళ్లమీద వాలి, ఆమె భారీ నడుము చుట్టూ

చేతులు వేసి, తన ముఖాన్ని ఆమెకి అదిమింది. ఆ ముఖంమీద దొంగ చిరునవ్వు వుంది. మార్యా దీమ్మిత్రియెవ్నా కళ్లమ్మట మళ్లీ కన్నీళ్లు తిరిగాయి.

ల్రవేత్‌స్కీ యింటికి వెళ్లాక నౌకరు గదిలో తలుపు బిడాయించుకుని సోఫాలో వాలి పోయి అలాగే ఉదయందాకా వుండిపోయాడు.

## 44

ఆ మర్నాడు ఆదివారం. ప్రాతఃకాల ప్రార్థనా ఘంటా నాదాలు ల్రవేత్‌స్కీని లేప లేదు — అతను రాత్రి తెల్లవార్లూ కళ్లు మూస్తేనా — లీజా కోరిక మేరకి తను చర్చికి హాజరవాల్సిన మరో ఆదివారమని అవి అతనికి గుర్తుచేశాయి. అతను హడావుడిగా లేచాడు. తను ఆమెని అక్కడ ఆవేళ కూడా చూస్తాడని యేదో అంతర్వాణి అతనికి బోధించింది. అతను యింట్లోనుంచి మెల్లిగా జారుకున్నాడు. యింకా నిద్రపోతున్న వర్వార పావ్‌లొవ్నా తోటి తను భోజనాల వేళకి వస్తానని చెప్పమని నౌకరుతో చెప్పి యేకతార గీతం లాగా వస్తున్న ఆ ఘంటా నాదాలకేసి పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్లిపోయాడు. అతను పెంద రాళే వెళ్లాడు. అక్కడ ఒక్క పురుగు కూడా లేదు. ఒక డీకన్ ఆ సమయానికి నిర్ణీతమైన ప్రార్థన చేస్తున్నాడు. బొంగురుగా, బయ్‌మంటూ వుండే ఆయన గొంతుకు, మధ్య మధ్యన ఒక దగ్గు తెర అడ్డం వస్తూ వుంటే, హెచ్చుతూ తగ్గుతూ వుంది. ల్రవేత్‌స్కీ తలుపు దగ్గర ఒక చోట జాగా చూసుకున్నాడు. భక్తులు ఒక్కొక్కళ్లే వచ్చి, ఆగి, శిలువ గీసుకుని, అన్ని వేపులకీ వంగి వందనం చేశారు. ఎత్తైన కప్పు వున్న ఆ ఖాళీ చర్చిలో వాళ్ల అడుగుల చప్పుడు శూన్యంగా స్పష్టంగా వినిపిస్తోంది. ఉడిగిపోయి, చిన్నగా వున్న ముసలా విడ ఒకత్తి మాసిపోయిన ఉత్తరీయమూ, తలపాగా వేసుకుని, తీవ్రంగా ప్రార్థన చేసేస్తూ ల్రవేత్‌స్కీ దగ్గర్లో వుంది. ఆమె బోసి నోరూ, పసుప్పచ్చని కృశించిన ముఖమూ పవిత్ర భావంతోటి తీక్ష్ణంగా వున్నాయి. విగ్రహాల మందిరంలోని విగ్రహాలకేసి ఆమె అరుణ నేత్రాలు తదేకంగా చూస్తూవున్నాయి. చర్మం తొడిగిన ఎముకలా వున్న ఆమె చెయ్యి ఉత్త రీయం కిందనుంచి మెల్లిగా శిలువ ఆకారం గీసుకుంటున్నట్టు కదిలింది. ముడతలు పడిపోయి, జుట్టు రేగిపోయి, దట్టమైన గడ్డంతోటీ, మబ్బుగా వున్న ముఖంతోటీ వున్న రైతు ఒకడు చర్చిలోకి వచ్చి, మోకాళ్లమీద వాలిపోయి, శిలువ గీసుకుంటూ, సాష్టాంగ పడిన ప్రతి సారీ అటూ యిటూ తల హడావుడిగా కదుపుతూ వున్నాడు. అతని ముఖమూ, కవళికయూ యెంతటి ఉద్విగ్నమైన వేదనని వ్యక్తం చేసాయంటే, అతన్ని నిలిపి యేమిటి బాబూ నీ యిబ్బంది అని ల్రవేత్‌స్కీకి అడుగుదామని పించింది. ఆ రైతు బెదిరి వెనక్కి చూసి, అతనికేసి కోపంగా తేరిపార కళ్లప్పగించి వుండిపోయాడు. ''నా కొడుకు చనిపోయాడు'' అని చెప్పి ఆ ముసలాడు మళ్లీ ప్రార్థనలో దిగిపోయాడు. ''దైవ సాన్నిధ్యపు వూరటే యీ

మనుషులకి సర్వస్వమూనూ'' అనుకుని, ల్రవేత్‌స్కీ తనే ప్రార్థన చెయ్యడం కోసం ఉద్యు క్తుడయ్యాడు. కాని అతని హృదయం భారంగా, కటువుగా వుంది, అతని ఆలోచనలు యెక్కడ్నో వున్నాయి. అతను యింకా లీజా కోసం నిరీక్షిస్తున్నాడు. కాని లీజా రాలేదు. చర్చిలో జనం నిండుతున్నారు, కాని ఆమె రాలేదు. ప్రార్థన మొదలైంది, డీకన్ సువార్త చదివేశాడు, కడసారి ప్రార్థన కోసం గంట కూడా మోగించారు. ల్రవేత్‌స్కీ కొంచెం ముందుకు వెళ్లాడు. హఠాత్తుగా అతనికి లీజా కనిపించింది. అతను రాకముందే ఆమె చర్చికి వచ్చింది కాని అతను గమనించలేదు. గోడకీ, బృంద గాయకులకీ మధ్య ఒదిగిపోయి ఆమె కదల్లేదు, చుట్టూ చూడలేదు. ప్రార్థన అయేంతవరకూ ల్రవేత్‌స్కీ ఆమెనుంచి దృష్టి తిప్పుకోలేదు. అతను ఆమెకి వీడ్కోలుచెపుతున్నాడు. భక్త బృందం వెళ్లిపోతోంది కాని ఆమె యింకా తచ్చాడుతూనే వుంది. ల్రవేత్‌స్కీ వెళ్లిపోవడం కోసం ఆమె పస్తాయిస్తున్నట్టుగా వుంది. ఆఖరికి ఆమె శిలువ గీసుకుని, తల పక్కకి తిప్పకుండా అవతలికి వెళ్లిపోయింది. ఆమెతో కూడా ఒక పనిపిల్ల వుంది. ల్రవేత్‌స్కీ ఆమె వెనక్కాలే బయటికి వెళ్లి రోడ్డు మీద ఆమెని కలుసుకున్నాడు. ఆమె తల వంచుకుని, ముఖంమీదకి ముసుగు లాక్కుని గబ గబా నడిచింది.

''బాగున్నారా, ఎలిజవేతా మిహైలొవ్నా'' అన్నాడతను గట్టిగా, బలవంతంగా మామూ లుగా వుంటున్నట్టు. ''మిమ్మల్ని దిగబెట్టనా?''

ఆమె యేం మాట్లాడలేదు, అతను ఆమె పక్కనే నడిచాడు.

''యిప్పుడు మీకు నేను చేసిన పని తృప్తిగా వుందా?'' అన్నాడతను గొంతు తగ్గించి. ''నిన్న యేం జరిగిందో విన్నారా?''

''ఆఁ'' అందామె మెల్లిగా. ''మంచిదే.''

ఆమె యింకా గబగబా నడిచింది.

''మీకు తృప్తిగా వుందా?''

లీజా వూరికే తల ఆడించింది.

''ఫ్యొదొర్ ఇవానిచ్'' అని ఆమె స్థిరంగా, సన్నని గొంతుతో మొదలుపెట్టింది. ''నేను మిమ్మల్ని అడగాలనుకున్నాను. దయచేసి మమ్మల్ని చూడ్డానికి యిక రాకండి, దయచేసి యెంత త్వరగా వీలైతే అంత త్వరగా వెళ్లిపొండి; యిద్దరం తర్వాత — మరో అప్పుడు, బహుశా యింకో యేడాది తర్వాత మళ్లీ కలుసుకుందాం. కాని యిప్పుడు దయ చేసి, నా కోసం యీ పని చెయ్యండి. నేనడిగినట్టు చెయ్యండి, నేను అర్థిస్తున్నాను.''

''ప్రతి దాంట్లోనూ మీ మాట శిరసా వహించడానికి సిద్ధంగా వున్నాను, ఎలిజవేతా మిహైలొవ్నా — కాని మనం విడిపోవాల్సింది యిలాగేనా? మీరు నాతో ఒక్క మాటేనా చెప్పరూ?''

''ఫ్యోదొర్ ఇవానిచ్ మీరు యిప్పుడు నా పక్కన నడుస్తున్నారు.... కాని మీరు అప్పుడే చాలా దూరంలో వున్నారు, నాకు చాలా దూరంలో. మీరే కాదు....''

''వూఁ, మాట్లాడండి, దయచేసి!'' అరిచాడు ల్రవేత్‌స్కీ. ''ఏమిటి మీరు ఉద్దేశించింది?''

''బహుశా మీరు ఆ సంగతి వింటారు. కాని యేం జరిగినా మర్చిపొండి.... వుహుఁ, నన్ను మర్చిపోకండి, నన్ను గురించి అనుకోండి.''

''నేను మిమ్మల్ని మర్చిపోగలనా?''

''చాలు, సెలవు. నా వెనక్కాల రాకండి.''

''లీజా'' ల్రవేత్‌స్కీ యేదో చెప్పబోయాడు.

''సెలవు, సెలవు!'' ముసుగు యింకా కిందకి లాక్కుంటూ, దాదాపు పరిగెడుతున్నంత వేగంగా వెళ్లిపోతూ, అంది ఆమె.

వెళ్లిపోయే ఆమె విగ్రహంకేసి తేరిపార చూశాడు ల్రవేత్‌స్కీ. అప్పుడు మళ్లీ వీధి వెనక్కి మళ్లాడు, తల వంచుకుని. కళ్లమీద కంటా టోపీ లాక్కుని నేలకేసే చూస్తూ నడుస్తూ వున్న లెమ్‌ని ఢీకొట్టాడు.

యిద్దరూ ఒకళ్లకేసి ఒకళ్లు చూసుకున్నారు.

''ఓ, ఏమంటారు?'' అన్నాడు ల్రవేత్‌స్కీ కొంచెం సేపటికి.

''ఏమంటాను?'' అన్నాడు లెమ్ మబ్బుగా. ''ఏమీ అనను, ప్రతీదీ నశించింది, మనమూ నశించాం (అలెస్ యిస్త్ తాడ్ట్, ఉండ్ విర్ సింద్ తాడ్ట్) మీరు కుడివేపు వెడతారా?''

''వూఁ.''

''నేను యెడంవేపు వెడతాను, సెలవు.''

* * *

ఆ మర్నాడు ఫ్యోదొర్ ఇవానిచ్ భార్యని తీసుకుని లావ్రికికి ప్రయాణమయ్యాడు. ఆమె ఒక బండిలో ఆడాతోటీ, జాస్తిన్‌తోటీ ముందు వెళ్లింది; అతను వెనక్కాల నాలుగు చక్రాల బండిలో వెళ్లాడు. ముచ్చటగా వుండే ఆ చిన్నపిల్ల ప్రయాణమంతా బండి కిటికీ దగ్గరే వుండిపోయింది. ప్రతీదీ ఆ పిల్లకి ఆశ్చర్యమే. రైతు జనం, గుడిసెలు, నూతులు, గుర్రాల మెడలమీద కాళ్లు, చిరుగంటలు, లెక్కలేనన్ని కాకులు అన్నీ ఆశ్చర్యమే. జాస్తిన్‌కి కూడా ఆశ్చర్యంగానే వుంది. వర్వార పావ్‌లొవ్నా వాళ్ల మాటలకీ, అరుపులకీ నవ్వింది. ఆమె మంచి హుషారుగా వుంది. ప్రయాణానికి ముందు ఆమె భర్తతో వ్యవహారం తేల్చుకుంది.

''మీ పరిస్థితి నాకు అర్థమైంది'' అని ఆమె అతనితో అంది. ఆమె చురుకైన కళ్లలోని చూపులని బట్టి ఆమె తనని పూర్తిగా అర్థం చేసుకున్నట్టుగా అతను భావించాడు.

''కాని కలిసి జీవించడానికి తగ్గ అనుకూలమైన మనిషిని నేను తన్ను గుర్తింపేనా కనీసం మీరు నాకు యివ్వాలి. నేను వచ్చి మీదపడను, మీ దారికి అడ్డురాను. నాకు కావాల్సిందల్లా ఆడా భవిష్యత్తు బాగుండడమే. అంతే.''

''సరే; నీక్కావాల్సినవన్నీ నీకు వచ్చాయి'' అన్నాడు ఫ్యోదొర్ ఇవానిచ్.

''నేను కలగనేదల్లా యిప్పుడు అదే. యెప్పటికీ యేకాంతంగా వుండిపోతాను. నా జీవితాంతం మీ దయని మరిచిపోలేను....''

''వాహ్, సాధించావ్'' అని అడ్డం వచ్చాడతను.

''మీ స్వేచ్ఛనీ, మనశ్శాంతినీ మన్నించడం నాకు తెలుసు'' అని పూర్తిచేసింది ఆమె, తను కూర్చుకున్న పదబంధం చెప్తూ.

లవ్రేత్‌స్కీ ఆమెకి చిన్న అభివాదం చేశాడు. తన భర్త తనకి లోపల కృతజ్ఞతగా వున్నాడని వర్వార పావ్‌లొవ్నా గ్రహించింది.

ఆ మర్నాడు సాయంత్రం వాళ్లు లావ్రికికి చేశారు. ఓ వారం తర్వాత లవ్రేత్‌స్కీ మాస్కో వెళ్లాడు. ఆమెకి భత్యఖర్చుల నిమిత్తం అయిదు వేల రూబుళ్లు యిచ్చాడు. అతను వెళ్లిన మర్నాడు పాన్‌షిన్ రంగ ప్రవేశం చేశాడు. ఆమె పాన్‌షిన్‌కి తను యేకాంతంలోకి పోయినా మర్చిపోవద్దని ముందే చెప్పింది. ఆమె అతనికి స్వాగతం చెప్పింది, నడి రాత్రిదాకా యింట్లో గదులూ, బయట తోటా గానా బజానాతోటీ, ఫ్రెంచ్ సంభాషణతోటీ హోరెత్తిపోయాయి. పాన్‌షిన్ వర్వార పావ్‌లొవ్నా ఆతిథ్యాన్ని మూడు రోజులు అనుభవించాడు. సెలవు తీసుకుని వెళ్లిపోయేటప్పుడు అతను ఆమె అందమైన చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని అదిమి, మళ్లీ వస్తానని వాగ్దానం చేశాడు. ఆ వాగ్దానం నిలబెట్టుకున్నాడు.

## 45

లీజాకి వాళ్ల యింట్లో పైన సొంత గది వుంది. చక్కని గాలి వచ్చే శుభ్రమైన గది. అందులో తెల్లటి పరుపు, మూలల్లోనూ, కిటికీల ముందూ పూలకుండీలూ, చిన్న రాతబల్ల, పుస్తకాల అలమారా, గోడమీద శిలువ వున్నాయి. యీ మూలని పురిటి గది అంటారు. లీజా అందులోనే పుట్టింది. చర్చిలో లవ్రేత్‌స్కీని కలుసుకుని యింటికి వచ్చిం తర్వాత ఆమె గది అంతా యింకా యెక్కువగా శుభ్రం చేసింది. అన్నీ దుమ్ము దులిపేసింది. నోటు పుస్తకాలూ, స్నేహితురాండ్రనుంచి వచ్చిన ఉత్తరాలూ అన్నీ పోగుచేసి రిబ్బనుతో కట్టేసింది, అన్ని సొరుగులకీ తాళాలు వేసింది. మొక్కలన్నిటికీ, ప్రతి పువ్వునీ తడుముతూ, నీళ్లు పోసింది. యిదంతా కూడా ఆమె సావకాశంగా, నిశ్శబ్దంగా, తదేక ధ్యానంతోటీ, సాత్విక విచారంతోటీ చేసింది. అప్పుడు మెల్లిగా చుట్టూతా చూస్తూ గది మధ్యలో

నుంచుంది. పైన శిలువ వేలాడే బల్ల దగ్గరికి వెళ్లి మోకరిల్లి, కట్టుకున్న చేతులమీద తల ఆన్చి నిశ్చలంగా వుండిపోయింది.

మార్ఫ తిమోఫేయెవ్నా లోపలికి వచ్చి ఆ పరిస్థితిలో వుండగా ఆమెని చూసింది. ఆమె లోపలికి రావడం చప్పుడు లీజా వినలేదు. మునివేళ్లమీద ఆ ముసలావిడ బయటికి పోయి కొన్నిసార్లు గట్టిగా దగ్గింది. లీజా లేచి, చెమర్చిన కన్నీళ్లతో తళుకుమన్న కళ్లని తుడుచుకుంది.

''ఓహో అయితే యీ తేనెగూడు మళ్లీ శుభ్రం చేస్తున్నావన్నమాట'' అంది మార్ఫ తిమోఫేయెవ్నా, ఒక చిన్న గులాబీ మొక్కమీదకి వంగి. ''యెంత సువాసనగా వుంది.''

లీజా ఆమెకేసి ఆశగా చూసింది.

''యేమిటీ నువ్వు అన్న మాట!'' అని ఆమె మెల్లిగా అంది.

''ఏ మాట? ఎహ్?'' అంది ఆ ముసలావిడ గబగబ. ''ఏమిటి నీ ఉద్దేశం? యిది దారుణం!'' అని అరిచింది ఆవిడ, టోపీ విసిరేసి, లీజా చిన్న మంచంమీద కూచుంటూ, ''నేనిది భరించలేను తల్లీ! యీ నాలుగు రోజులుగానూ నాకు కాలూచెయ్యీ ఆడడం లేదు. నేనేదీ తెలియనట్టుగా నటించి బతకలేను — నువ్వు యింకా పాలిపోయి బెంగతోటి చిక్కిపోయి యేడుస్తూ వుండటం నే చూళ్లేను, నా వల్లగాదు, నా వల్లకాదు!''

''యేమిటి? యేం జరిగింది మామ్మా?'' అని లీజా అడిగింది. ''నేను బాగానే వున్నాను....'' అంది.

''బాగున్నావు?'' మార్ఫ తిమోఫేయెవ్నా అరిచింది. ''నువ్వు వాళ్లకీ వాళ్లకీ చెబుతావు గాని నాకు చెప్పవూ? సర్లే, యిప్పుడెవళ్లే మోకరిల్లి ప్రార్థిస్తూ వున్న వాళ్లు? ఎవళ్ల కంటి రెప్పలే యేడ్పుతోటి చెమ్మగిల్లింది? సరే, ఒక సారి నీ ముఖం చూసుకో యెలా వున్నావో? ఆఁ, సరేనా, యిదంతా నాకేం తెలీనట్టు.''

''అదే పోతుందిలే మామ్మా, కొంచెం తాళితే.''

''పోతుందా, యెప్పటికి? ఓరి భగవంతుడా! వాణ్ణి అంతలా ప్రేమిస్తున్నావటే? కాని వాడు పెద్దవాడే తల్లీ! వాడు మంచి వాడే, కాదనను — వాడు కరవడు అయితే యేమిటి? మనమంతా మంచి వాళ్లమే. యీ ప్రపంచం చాలా పెద్దది. చాలు, అలాంటి సరుకు సరిపడంతగా వుంటుంది.''

''అదే పోతుందని చెబుతున్నాన్నీకు. యిప్పటికే పోయింది.''

''చూడమ్మా'' అంది మార్ఫ తిమోఫేయెవ్నా వున్నట్టుండి, లీజాని మంచంమీద తన పక్కన కూర్చోపెట్టుకుని కాస్సేపు జుట్టు నిమురుతూ, కాస్సేపు రుమాలు సవరించు కుంటూ. ''యిప్పుడు నువ్వున్న వేడిలో నీ దుఃఖానికి ఉపశాంతి లేదని నీకు అనిపించ వచ్చు. చూడమ్మా, ఒక్క చావుకే మందు లేదు! వూరికే నువ్వు చిక్క బట్టుకుని అనుకో

''నేను లొంగను, భయం లేదు'' అని. నువ్వే ఆశ్చర్యపోతావు బయట పడడం యెంత సులభమో. వూరికే 'ప్చ్' అనుకుని భరించడమే.''

''మామ్మా, అది యిప్పటికే పోయింది, అంతా అయిపోయింది'' అంది లీజా.

''అంతా అయిపోయింది! ఆఁ, అయిపోయింది! ముక్కూ, మొహం యెలా యెర్ర బడిపోయాయో చూడు! మా బాగా అయిపోయింది!''

''అవును, అయిపోయింది మామ్మా, వూరికే నువ్వు నా పక్కన వుండి వూఁ అంటే'' అంది లీజా ఒక సారి ఉత్సాహంతోటి, తన చేతుల్ని మార్ఫ తిమొఫేయెవ్నా మెడ చుట్టూ వేసి. ''మామ్మా, మా మంచి మామ్మా, నాతో స్నేహంగా వుండు, నాకు సాయం చెయ్యి, కోప్పడకు. నన్ను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు....''

''యేమిటి? యేమిటిదంతా, యేమిటే అమ్మా? నన్ను అలా బెదరగొట్టకే తల్లీ, నీకు పుణ్యం వుంటుంది. నేను భయంతో అరుస్తానేమో కూడానూ, అలా చూడకే అమ్మా; వూఁ, చెప్పు, ఏమిటి?''

''నేను.... నేను....'' లీజా మార్ఫ తిమొఫేయెవ్నా గుండెల్లో ముఖం దాచుకుని అంది. ''నేను సన్యాసినుల ఆశ్రమానికి వెళ్లిపోతాను'' అని.

ఆ ముసలావిడ మంచంమీదనుంచి దొర్లిపడినంత పనిచేసింది.

''దైవనామ స్మరణ చెయ్యి తల్లీ, నువ్వే మంటున్నావో నీకు అర్థంకావడం లేదు. అయ్యో దేవుడో! ఏం మాట!'' అని ఆమె నత్తినత్తిగా అంటూనే వుంది. అప్పుడు ఆమెకి మాట చిక్కింది. ''పడుకో అమ్మా, కాసేపు కునుకు తియ్యి. నిద్రలేకపోవడం వల్ల యిలా వుంది అంతా, ఏం?''

లీజా తల పైకి యెత్తింది. ఆమె చెక్కిళ్లు వెలుగుతున్నాయి.

''లేదు, మామ్మా'' అందామె. ''అలా మాట్లాడవద్దు. నేను నిశ్చయం చేసుకున్నాను. నేను ప్రార్థించాను, భగవంతుడి సాన్నిధ్యం అర్థించాను. అంతా అయిపోయింది. మీతో నేను గడిపే జీవితం అయిపోయింది. అలాంటి గుణపాఠం వృథాపోదు, యిలా నేను ఆలోచించడం యిది మొదటి సారి కాదు. ఆనందం నాకు ప్రాప్తం లేదు. ఆనందపుటాశలు నిండుగా వున్న రోజుల్లో కూడా నా హృదయం యేదో యిలాంటి దాని సూచనతో భారంగానే వుండేది. నాకు అన్నీ తెలుసు—నా పాపాలు, యితరుల పాపాలు, నాన్న సంపద యెలా కూడబెట్టింది అన్నీ నాకు తెలుసు. దీన్నంతటినీ జపం, జపం మాత్రమే శుద్ధిచెయ్యాలి. నాకు విచారంగానే వుంది మీకోసం, అమ్మకోసం, లేనొచ్కాకోసం; కాని చెయ్యగలిగింది యేమీ లేదు. యిక్కడి జీవితం నాకోసం కాదని నాకు అనిపిస్తోంది. యింట్లో వున్న అందరికీ అన్నిటికీ నేను కడసారి వీడ్కోలు చెప్పేశాను. యేదో నన్ను వచ్చెయ్యమని పిలుస్తోంది. నా హృదయం బాధతో నలిగిపోతోంది; నేను ఒక్కత్తినీ యెప్పటికీ యేకాంతంగా వుండి

పోవాలని వుంది. నన్ను వెనక్కి లాగద్దు, నన్ను ఆపు చెయ్య ప్రయత్నించవద్దు. కాని నాకు సాయం చెయ్యి, లేదా ఒక్కత్తినీ వెళ్లిపోతాను....''

మార్ఫ తిమొఫేయెవ్నా ఆమె చెప్పింది కొయ్యబారిపోయి వింది.

''దీనికి వంట్లో బాగోలేదు, యిది పేలుతోంది'' అని ఆమె అనుకొంది. ''యెవ ళ్లేనా డాక్టరుకి కబురెడితే బాగుండును. కాని యెవరున్నారు? గెదెయొనోవ్‌స్కీ మొన్న యెవళ్లోనో పొగుడుతున్నాడు. వాడో అబద్ధాలకోరు—యేమో యిప్పుడు నిజం చెపుతు న్నాడేమో?'' కాని లీజా జబ్బుగా లేదనీ, పేలడం లేదనీ, తను యెన్ని సార్లు ఖండిస్తూ వున్నా అదే సమాధానం చెపుతూ వుందనీ ఆమెకి తట్టగానే మార్ఫ తిమొఫేయెవ్నా భయ పడిపోయి, నిజంగానే విచారించింది.

''కాని చూడు నా చిట్టి తల్లీ'' అని ఆమెని బుజ్జగించింది. ''ఆ మఠాల్లో బతుకు యెలా వుంటుందో నీకు తెలియదు! పరమ పాడు నూనె వంటకాలు పెడతారమ్మా, ముతక బట్ట కట్టుకోవాలి, చలిలో పంపిస్తారు. నువ్వు తట్టు కోలేవే, తల్లీ! యిదంతా అగాఫ్యాయే చేసింది యిదంతా—ఆ మనిషే నిన్ను యిలా పక్క దారి పట్టించింది. తనేమో మొదట్లో హాయిగా కులుకుతూనే బతికింది; నువ్వు మామూలుగా బతకాలమ్మా. నన్ను చీకూ చింతా లేకుండా చచ్చిపోనివ్వండే తల్లీ! అప్పుడు మీరు యే గంగలోనేనా దూకండి. మేకపోతుగాడి సాకుతోటి, అదేనే, ఒక మగాడి వల్ల యెవరేనా మఠంలో చేరారని విన్నామా? నీకంత బాగా లేకపోతే యేదేనా యాత్రకెళ్లు. యే సాధువునేనా సేవించు, జపం చేయించు, అంతే కాని ఆ నల్ల బురఖా వేసుకుని తిరగొద్దే తల్లీ, నా చిట్టి తల్లీ....''

మార్ఫ తిమొఫేయెవ్నా భోరున యేడ్చింది.

లీజా ఆమెని ఓదార్చి, కన్నీళ్లు తుడిచి, తనూ యేడిచింది, కాని తన పట్టు మాత్రం వదల్లేదు. విచారంతో మార్ఫ తిమొఫేయెవ్నా బెదిరింపులకి దిగింది. అన్నీ వాళ్ల అమ్మతో చెప్పేస్తానంది, అయినా లాభం లేకపోయింది. ఆఖరికి ఆ ముసలావిడ ప్రాథేయ పడ్డమీదట లీజా తన ఉద్దేశాన్ని అమలు పెట్టడం ఒక ఆర్నెల్లు వాయిదా వేసింది. యీ ఆర్నెల్లల్లోనూ లీజా తన మనసు మార్చుకోకపోతే మార్ఫ తిమొఫేయెవ్నా ఆమెకి సహాయం చేసేటట్టూ, మార్య దీమ్త్రియెవ్నా అనుమతిని సంపాదించేటట్టూ ఆమె వాగ్దానం చేసింది.

* * *

మొదటి చలిగాలి తిరగ్గానే వర్వార పావ్‌లొవ్నా, యేకాంతంలో బతుకుతాననే ఒట్టు తీసి గట్టున పెట్టి, సెయింట్ పీటర్స్‌బుర్గ్‌కి వెళ్లిపోయింది. సొమ్ములుండటం వల్ల ఒక మాదిరి, అందమైన యింటిని అద్దెకి తీసుకుంది. ఆమె కంటే ముందే ఓ— పట్టణం వదిలిపెట్టి వెళ్లిపోయిన పాన్‌షిన్ దాన్ని ఆమెకి కుదిర్చిపెట్టాడు. అతను

ఓ— పట్టణంలో వున్న తర్వాతి కాలంలో మార్య దీమ్త్రియెవ్నా అనుగ్రహం పూర్తిగా పోగొట్టుకున్నాడు; అతను హఠాత్తుగా ఆమెని సందర్శించడం మానేశాడు. లావ్రికిలో దాదాపు పాతుకుపోయాడు. వర్వార పావ్లొవ్నా అతన్ని బానిసని చేసేసింది; ఆమె అతని మీద చూపించిన తిరుగులేని, అడ్డులేని శక్తిని మరే మాటా వర్ణించలేదు.

లవ్రేత్స్కీ ఆ శీతకట్టు మాస్కోలో గడిపాడు. ఆ తర్వాత వసంతకాలం నాటికి లీజా బి— అనే సన్యాసినుల మఠంలో దీక్ష పొందిందని తెలిసింది. అది రష్యాలో మారుమూల యెక్కడో వుంది.

# ఉపసంహారం

ఎనిమిది సంవత్సరాలు గడిచాయి. వసంతం మళ్లీ వచ్చింది.... కాని మిహాలేవిచ్, పాన్‌షిన్, మదాం ల్రవేత్‌స్కయాలకి యేం జరిగిందో తెలుసుకుని వాళ్లని వదిలేద్దాం. మిహాలేవిచ్ తెగిన గాలి పటంలా అలా తిరిగితిరిగి ఆఖరికి ఒక ప్రభుత్వ పాఠశాలలో సీనియర్ ఉపాధ్యాయుడుగా చేరాడు. అతనికి అది తృప్తిగానే వుంది. అతని శిష్యులు అతన్ని "ఆరాధిస్తారు," వెనక్కాల ఆటపట్టించినా. పాన్‌షిన్ నిచ్చెన మెట్లు పై కంటా యెక్కాడు, డైరెక్టరు పదవి ఆశిస్తున్నాడు. అతను కొద్దిగా వంగి నడుస్తాడు, బహుశా వ్లదీమిర్ శిలువ పతకం మెళ్లో వేలాడుతూ వుండటం వల్లనేమో. అతని స్వభావంలో వుండే అధికార దర్పం అతనిలో వుండే కళాకారుడిమీద పూర్తి ఆధిపత్యాన్ని సంపాదించింది. యింకా యువకుడి లాగానే కనిపించే అతని వదనం పాలింది, జుట్టు పల్చబడింది. అతను యిక పాడటం లేదు, బొమ్మలూ గియ్యడం లేదు, కాని లోపాయకారీగా సాహిత్యంతో వినోదిస్తు న్నాడు. ఒక సామెత ఫక్కీలో అతను ఒక కామెడీ రాశాడు. యివాళ రచయితలు ఎవర్నో ఒకర్ని, దేన్నో ఒక దాన్ని "చిత్రిస్తూ" వుంటారు. అతను అందులో ఒక వగలాడిని చిత్రించాడు, దాన్ని రహస్యంగా తన పరిచయస్థులైన యిద్దరు ముగ్గురు అర్పితులైన మగువలకి చదివి వినిపించాడు. అతను వివాహ వేదికని అధిరోహించలేదు, అందుకు అవకాశాలు చాలా వచ్చినప్పటికీ కూడా. దానికి దోషం వర్వార పావ్‌లొవ్నాది. యిక ఆ మహిళకి సంబంధించి ఆవిడ శాశ్వతంగా పారిస్‌లో ముందటి లాగానే నివాసం యేర్పాటుచేసుకొంది; ఫ్యోదొర్ ఇవానిచ్ ఆమెకి చెల్లు చీటీ యిచ్చేశాడు ప్రామిసరీ నోటు, ఆరకంగా మరో సారి ఆవిడ హఠాత్తుగా దాడిచేసే ప్రమాదాన్ని తప్పించుకున్నాడు. ఆమె కొంచెం పెద్దదైంది, లావెక్కింది, అయినా యింకా ఆకర్షణీయంగానే, హుందాగానే వుంది. ప్రతివాళ్లకీ వాళ్ల వాళ్ల జీవిత మణి దీపం వుంటుంది: వర్వార పావ్‌లొవ్నాకి డ్యూమా నాటక కృతుల్లో అది దొరికింది. రంగంమీద సుక్కిపోతూ వుండే నిత్య యౌవన భరిత పుష్పసములైన స్త్రీలని

వర్ణించే థియేటర్లకి మహా ఆతృతగా వెళ్లేది; మదాం దోష్ లాగా వుండటం అనేది ఆమెకి మానవ ఆనందపు అత్యున్నత దశ అన్నమాట. తన కూతురికి అంతకంటే మంచిదేదీ తను కోరుకోవడం లేదని ఒక సారి ప్రకటించింది. చిరంజీవి సౌభాగ్యవతి ఆడాకి అలాంటి ఆనందం పట్టకుండా వుండుగాక అని ఆశించాలి: గులాబీ రంగు బూరె బుగ్గల పిల్లగా వుండే యీామె, దుర్బల వక్షస్థురాలిగా, పాలిన చిన్న ఆడ పిల్లలా తయారైంది. ఆమె నరాలు అప్పటికే బలహీనంగా అయ్యాయి. వర్వార పావ్‌లొవ్నా భక్తులు సంఖ్య తగ్గింది, కాని యింకా దర్శనం యిస్తున్నారు. కొంత మందిని బహుశా ఆవిడ తన అవసాన దశ దాకా నిలబెట్టుకో వచ్చును. వాళ్లల్లో మహోద్దండ మోహితుడు యీా మధ్య జకుర్దాలొ-స్కుబీర్నికొవ్ అని మీసాలు పెంచుకునే తెగ మనిషి ఒకాయన. ఆయన ముప్పై యెనిమిదేళ్ల వాడు, తుంచి బలాఢ్యుడు. మదాం ల్రవేత్స్కయా మందిరంలోని ఫ్రెంచి అతిథులు అతన్ని "ల గ్రో తొరొ డె ల'యుక్రేన్"* అని పిలుస్తారు; వర్వార పావ్‌లొవ్నా అతన్ని తన సాయంకాలపు గానాబజానా వినోదాలకి యెప్పుడూ పిలవదు కాని, అతను మాత్రం ఖాయంగా ఆవిడ విశ్వాసాన్ని చూరగొన్న మనిషి.

అంచేత.... యెనిమిదేళ్లు గడిచాయి. మరో సారి వసంత శోభ ఆనందం వెల్లివిరిసింది. మరోసారి వసంతం యిలమీదా, మనుషులమీదా హసించింది. మరోసారి యీా భూమి వసంత లాలనలో పుష్పిస్తోంది, ప్రేమిస్తోంది, పాడుతోంది. యీా యెనిమిదేళ్లలోనూ ఓ— పట్టణం యేమీ మారలేదు; కాని మార్య ద్మీత్రియెవ్నా యిల్లు పడుచుదైనట్లుంది. కొత్తగా వెల్ల వేసిన గోడలు కళకళల్లాడుతున్నాయి. తెరిచిన కిటికీల గాజు పలకలు ఎండలో మెరుస్తూ తళతళలాడుతున్నాయి. యీా కిటికీల్లోంచి వీధిలోకి స్వచ్ఛమైన యువకంఠాల ఆనంద ధ్వనులూ, యెడతెగని నవ్వులూ తేలిపోతున్నాయి. మొత్తం యిల్లంతా జీవంతోటి తొణికిస లాడుతోంది, ఉల్లాసంతోటి పొర్లుతోంది. ఆ యింటి యజమానురాలు దివంగతురాలై చాలా కాలమైంది. లీజా సన్యాసినుల మఠంలో కలిసిన రెండేళ్లకి మార్య ద్మీత్రియెవ్నా చనిపోయింది. మార్ఫ తిమొఫేయెవ్నా మేనకోడలు పోయిం తర్వాత యెక్కువ కాలం బతక లేదు. శ్మశానంలో యిద్దరి సమాధులూ పక్క పక్కనే వున్నాయి. నస్తాస్య కార్పొవ్నా కూడా మిగల్లేదు; ఆ విశ్వాసపాత్రురాలైన ముసలావిడ తన మిత్రురాలి సమాధి దగ్గర ప్రార్థన చెయ్యడానికి ప్రతివారమూ వెళ్లేది, అలా కొన్ని యేళ్లు వెళ్లింది.... ఆమెకీ కాలం చెల్లింది, ఆమె అస్థికలూ తడిమట్టిలో కలిశాయి. కాని మార్య ద్మీత్రియెవ్నా యిల్లు పరుల పాలవలేదు, కుటుంబం దాటి పోలేదు, గూడు చెదిరిపోలేదు. లేనొచ్కా చక్కని నాజూకైన పిల్ల అయింది — ఆమె పాణిగ్రహణం చేసినవాడు చక్కని కురులున్న అశ్వికదళ ఆఫీసరు; మార్య ద్మీత్రి

---

* "ఉక్రేయిన్‌నుంచి వచ్చిన అచ్చు పోసిన ఆంబోతు" (ఫ్రెంచి).

యెవ్నా కొడుకు సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో అప్పుడే పెళ్లిచేసుకుని, కొత్త పెళ్లికూతురి తోటి వసంతం గడపడానికి అక్కడికి వచ్చాడు; బళ్లో చదువుకునే పదహారేళ్ల గులాబీ బుగ్గల మరదలు పిల్ల కూడా వుంది; షూరొచ్కా కూడా యెదిగింది, ముద్దుగా తయారైంది. అదీ పడుచువాళ్ల మందిరం. వాళ్ల నవ్వులతోటీ, సల్లాపాలతోటీ కలితిన్ల యింటి గోడలు మార్మోగుతున్నాయి. యింట్లో వుండే ప్రతీదీ మారిపోయింది, ప్రతీదీ కొత్తవాళ్ల అభిరుచులకి తగ్గట్టు వుంది. మీసకట్టు కూడా రాని హుషారైన మెరికల్లాంటి కుర్రాళ్లు ఒంగి ఒంగి వుండే ముసలాళ్ల స్థానంలో పరిచారకులుగా వచ్చారు. యిదివరకు రోస్కా పూతంగా అటూ యిటూ కదిలే చోట యిప్పుడు చక్కటి కుక్కలు పిచ్చిగా యెగురుతూ, సోఫాల మీద గెంతుతూ తయారయాయి. యిప్పుడు అశ్వశాలలో గునుకుతూ నడిచే బక్క పల్చటి గుర్రాలు, జవం వున్న రథతురగాలు, జడలు పెరిగిన తురపుసవాళ్లు, దాన్‌నుంచి తెచ్చిన జీను గుర్రాలు వున్నాయి. ఉదయం నాస్తా, మధ్యహ్న భోజనం, సాయంత్రం భోజనం వేళ లన్నీ కలగా పులగం అయిపోయాయి. యిరుగుపొరుగు వాళ్లన్నట్టు అన్నీ కూడా ''చోద్యంగా'' తయారైపోయాయి.

అప్పుడు ఒక రోజు సాయంత్రం, కలితిన్ల యింటి సభ్యులు (వాళ్లల్లో కల్లా పెద్ద వాడు లేనొచ్కాకి కాబోయే వరుడు యిరవై నాలుగేళ్ల వాడు) ఒక తేలికైన, సరదా అయిన ఆటలో మునిగివున్నారు, అలా అని వాళ్ల హుషారైన నవ్వుని బట్టే తెలుస్తోంది: ఒకళ్ల నొకళ్లు గదుల్లో తరుముకుంటున్నారు; కుక్కలు కూడా హుషారుగా మొరుగుతూ వాళ్ల వెనక పరిగెడుతున్నాయి; కిటికీల ముందు వేలాడే పంజరాల్లో వున్న రామచిలకలు కిలకిల లాడుతూ ఆ సందోహాన్ని అధికం చేస్తున్నాయి. యీ చెవులు చిల్లులు పడే సంరంభం సాగుతూ వుండగా మట్టి కొట్టుకుపోయిన నాలుగు చక్రాల బండి అక్కడికి వచ్చింది. ప్రయాణపు అంగీ తొడుక్కున్న నలభై అయిదేళ్ల వ్యక్తి ఒకతను అందులోనుంచి దిగి, నిశ్చేష్టంగా మౌనై నుంచుండిపోయాడు. అతను కదలకుండా కొంచెం సేపు నుంచుండిపోయి, యింటి కేసి తేరిపార చూసి, గేటుదాటి పెరట్లోకి వెళ్లి నెమ్మదిగా సింహద్వారం వున్న మెట్లు యెక్కాడు. అతనికి హాల్లో ఎవరూ కనిపించలేదు. హఠాత్తుగా తలుపు తెరుచుకుంది. ఎరు పెక్కిన షూరొచ్కా అరుస్తూ కేకలేస్తూ దూసుకుని వచ్చింది, వెనకాల మిగిలిన పడుచు వాళ్లు తరుముకొస్తున్నారు. వాళ్లు వున్నట్టుండి ఆగిపోయారు, కొత్త వ్యక్తిని చూసి తగ్గి. కాని అతనికేసి తిరిగిన తళతళ మెరిసే కళ్లు అంతే దయగా వున్నాయి, నవనవలాడే ముఖాలు యింకా చిరునవ్వు నవ్వుతూ వున్నాయి. మార్య దీమ్రితియెవ్నా కొడుకు ఆ వచ్చిన అతనికేసి వెళ్లి, స్నేహపూర్వకంగా యేం కావాలని అడిగాడు.

''నేను లవ్రేత్‌స్కీని'' అన్నాడతను.

ఒక్క సారి ఫెళ్లున కేకలు వినిపించాయి — యెంతో దూరపు బంధువు దాదాపు

మరిచిపోయిన బంధువు, వచ్చినందుకు ఆ పడుచువాళ్ళు సంతోషంతో మురిగిపోయిందాని వల్ల కాదు, వాళ్ళు సందర్భ మేదేనా సరే అరిచి కేకలేసి వినోదించే స్థితిలో వున్నారు కాబట్టి. తక్షణం లవ్రేత్‌స్కీని చుట్టు ముట్టేశారు. వున్న వాళ్లల్లో పాత పరిచయస్థు రాలవడం వల్ల లేనొచ్కా ముందు తన పేరు చెప్పి, యింకొంచెం వ్యవధి యిచ్చి వుంటే తనే గుర్తుపట్టే దాన్నని చాటి, అప్పుడు మిగిలిన వాళ్లని వరసగా తన కాబోయే పెనిమిటితో సహా ముద్దుపేర్లతో పిలిచి పరిచయం చేసింది. అంతా భోజనాల గది గుండా డ్రాయింగ్ రూంలోకి వెళ్లారు. రెండు గదుల్లోనూ వాల్ పేపరు కొత్తది. కుర్చీలూ వగైరా సామాను అదే. లవ్రేత్‌స్కీ పియానోని గుర్తుపట్టాడు కిటికీదగ్గరి అల్లికచట్రాలు కూడా అవే, అదే స్థానంలో, అసంపూర్తిగా వుండే అల్లికపనితోటి యెనిమిదేళ్ల నాడు వున్నట్టే వున్నాయి. వాళ్లు అతనికి సౌకర్యంగా వుండే పడక కుర్చీని కూర్చోడానికి యిచ్చారు, అందరూ అతని చుట్టూతా శాంతంగా కూర్చున్నారు. ప్రశ్నలు, అరుపులు, అవీ యివీ చెప్పడాలు ఒక దాని వెనక ఒకటి వచ్చేశాయి.

''మిమ్మల్ని చూసి చాలా రోజులైంది'' అంది లేనొచ్కా అమాయకంగా, ''వర్వార పావ్‌లొవ్నాని కూడా.''

''అవునుమరి!'' ఆమె సోదరుడు గబగబా అన్నాడు. ''ఫ్యోదొర్ ఇవానిచ్ యింకా పల్లెలో వుండగానే నిన్ను నేను సెయింట్ పీటర్స్‌బుర్గ్‌కి తీసికెళ్లిపోయాను.''

''అవును అప్పుడు అమ్మ పోయింది.''

''మార్ఫ తిమొఫేయెవ్నా కూడా'' అంది షూరొచ్కా.

''నస్తాస్య కార్పొవ్నా, లెమ్ కూడా....'' అంది లేనొచ్కా.

''ఏమిటీ? లెమ్ కూడా పోయాడా?'' అని అడిగాడు లవ్రేత్‌స్కీ.

''వూఁ'' అని యువ కలీతిన్ సమాధానం చెప్పాడు. ''ఆయన యిక్కడనుంచి ఒదేస్సకి వెళ్లాడు; ఎవరో ఆయన్ని వలలో వేసుకున్నట్టు చెబుతారు. ఆయన అక్కడ చచ్చిపోయాడు.''

''ఆయనేమన్నా సంగీతకృతులు మిగిల్చాడేమో తెలుసా?''

''తెలీదు, లేదనుకుంటాను.''

అంతా నిశ్శబ్దంగా అయిపోయి, ఒకళ్లనొకళ్లని చూసుకున్నారు. ఒక విచారపూర్వక మేఘం వాళ్ల వదనాలమీదనుంచి జారింది.

''మాత్రోసూ బతికే వుంది, తెలుసా?'' అంది లేనొచ్కా హఠాత్తుగా.

''గెదెయొనోవ్‌స్కీ కూడా'' అన్నాడామె సోదరుడు.

గెదెయొనోవ్‌స్కీ పేరు రాగానే పకపక నవ్వులు వినిపించాయి.

''ఆఁ, ఆయన బతికే వున్నాడు, యింకా అదే అబద్ధాలకోరుగా.'' మార్య ద్మీత్రి

యెవ్నా కొడుకు చెప్పాడు. ''మరి చూశారా, యీ కుంక పిల్ల (అతను తన మరదలికేసి చూపించాడు) ఆయన ముక్కుపొడుం డబ్బాలో నిన్న మిరియాల పొడుం కలిపేసింది.''

''అబ్బ ఆయన తుమ్మడం చూడాలి!'' అంది లేనొచ్కా. ఆమె గొంతుక మళ్లీ యింకో నవ్వు తెరలో మునిగిపోయింది.

''యీ మధ్యనే మాకు లీజా కబురు తెలిసింది'' అన్నాడు యువ కలీతిన్. మళ్లీ అంతా నిశ్శబ్దం అయింది. ''ఆమె బాగానే వుంది. ఆమె ఆరోగ్యం యిప్పుడు మెరుగు.''

''ఆమె యింకా అదే మఠంలో వుందా?'' అని అడిగాడు లవ్రేత్స్కీ, అది కొంత ప్రయత్నపూర్వకంగా లేకపోలేదు.

''ఆఁ!''

''ఆమె ఉత్తరాలు రాస్తుందా?''

''ఉహుం, ఎన్నడూ రాయదు. కాని వాళ్లద్వారానూ, వాళ్లద్వారానూ మాకు వర్త తెలుస్తుంది.'' వున్నట్టుండి గంభీరమైన నిశ్శబ్దం ఆవహించింది. అందరూ మౌనంగా వున్నారు.

''తోటలోకి వెడదామంటారా?'' అన్నాడు కలీతిన్. ''అక్కడ యిప్పుడు బాగుంది. కొంచెం కంగిరిపింగిరిగా పెరిగినా.''

లవ్రేత్స్కీ తోటలోకి వెళ్లాడు. అతను మొదటగా చూసింది, తోటలోని ఆ చెక్క బల్ల, లీజాతోటి తను గడిపిన మరుపురాని ఆనందపు నశ్వర క్షణాల సీటు. అది నల్ల బడింది, కొంచెం అప్పళించుకు పోయింది కాని అతను గుర్తుపట్టాడు. అతని హృదయం మాధుర్యంతోనూ కటుత్వంతోనూ సాటిలేని అనుభూతితో బిగ పట్టుకుని పోయింది — పొగొట్టుకొన్న యౌవనం కోసం తీక్ష్ణమైన విచారానుభూతి, ఒకనాడు తను పొందిన ఆనందం కోసం తీక్ష్ణమైన విచారానుభూతి. అతను ఆ యువజనంతో కలిసి ఆ దారుల్లో తిరిగాడు. లైమ్ చెట్లు యేమంత పెద్దవైనట్టూ, పొడుగైనట్టూ లేదుగాని, నీడమాత్రం దట్టమైంది. పొదలన్నీ దట్టంగా అయాయి. రాస్ప్బెర్రీ పొదలు దృఢంగా పెరిగాయి, కాయలపొదలు ముదురుగా యెక్కువ పెరిగిపోయాయి, ప్రతీదీ గుగ్గిలం, కలప, గడ్డి, లైలాక్ వాసనకొడుతోంది.

''దాగుడుమూత దండా కోర్ ఆటకి అనువైన చోటు యిదే'' అని ఒక్క సారి లేనొచ్కా అరిచింది, లైమ్ చెట్లల్లోనుంచి ఒక ఖాళీ జాగాలోకి వాళ్లు రాగానే. ''సరిగ్గా మనం అయిదుగురమే వున్నాం కూడానూ.''

''ఫ్యొదొర్ ఇవానిచ్‌గార్నో, లేకపోతే నిన్ను నువ్వో లెక్కపెట్టుకోకుండా వదిలేసుకున్నావా?'' అని ఆమె సోదరుడు అడిగాడు.

లేనొచ్కా కొంచెం సిగ్గుపడింది.

''కాని ఫ్యోదొర్ ఇవానిచ్‌గారు, యీ వయసులో....'' అని అనబోయింది.

''అహహా, మీరు కానివ్వండి'' అని లవ్రేత్‌స్కీ గబగబా అన్నాడు. ''నన్ను గురించి పట్టించుకోవద్దు. నేను మీకు అడ్డం లేనట్టుగా వుంటేనే నాకు మరీ బాగుంటుంది. నా కాలక్షేపం సంగతి మీకు వద్దు. మా ముసలాళ్లకి వుండే వ్యాపృత్తి మీ కుర్రకారుకి తెలీదు, దానికి యే కాలక్షేపమూ సాటి రాదు — జ్ఞాపకాలు.''

ఆ కుర్రకారు లవ్రేత్‌స్కీ చెప్పేది స్నేహపూర్వకమైన గౌరవంతోటి, కొంచెం సరదాతో కలిసి, — యేదో ఉపాధ్యాయుడు పాఠం చెబుతున్నట్టు — విన్నారు. అప్పుడు చెదిరిపోయి, పచ్చటి ఖాళీ జాగాలోకి వెళ్లిపోయారు. నలుగురు, చెట్ల కింద యెవళ్లె వళ్ల స్థానంలో వాళ్లు నుంచున్నారు, ఒకళ్లు మధ్యలో నుంచున్నారు. ఆట మొదలైంది.

లవ్రేత్‌స్కీ వెనక్కి యింట్లోకి వెళ్లాడు. భోజనాల గదిలోకి వెళ్లాడు. పియానో దగ్గరికి వెళ్లాడు. మెట్లు నొక్కాడు: ఒక నీరస స్వరం, అయినా స్పష్టమైందే గాలిలో తరంగించింది, అతని హృదయంలో ఒక తీగని స్పృశించింది. ఆ మరుపురాని మధుర నిశీధి వేళ అప్పుడెప్పుడో లెమ్, పాపం, పోయిన ఆ లెమ్, తనని ఆనంద పర్చిన ఉత్తేజిత స్వరపు యెత్తుగడ స్వరం అది. అప్పుడు లవ్రేత్‌స్కీ డ్రాయింగ్ రూంలోకి వెళ్లి, అక్కడ చాలా సేపు తచ్చాడాడు; యిక్కడ, తను యెన్నో సార్లు లీజాని చూసిన ఆ చోట, ఆమె విగ్రహం మరింత స్పష్టంగా అతని ముందు గోచరించింది; ఆమె ఉనికి తన చుట్టూతా వున్నట్టు అతను అనుకొంటున్నట్టు వుంది. కాని ఆమెకోసం అతని వేదన పిండేస్తున్నట్లుంది, భరించడం కష్టంగా వుంది; అందులో మృత్యువు తీసుకుని వచ్చే ప్రశాంతత యేమీ లేదు. లీజా యెక్కణ్నో బతికే వుంది, యెక్కణ్నో దూరంగా, అందుకోలేనంత దూరంగా. ఆమెను అతను సజీవమూర్తిగా వూహించుకున్నాడు గాని, తను ప్రేమించిన ఆ పిల్ల ఆకారరేఖల్ని సన్యాసిని బట్టలు వేసుకున్న మసక బారిన పాలిపోయిన దృశ్యంగా, సుళ్లు తిరిగే అగరు ధూపం మధ్య కదులుతున్నట్టుగా వూహించుకోలేకపోయాడు. తను మానసికంగా లీజాని చూసినట్టుగా ఆ కళ్లతోటి తననే లవ్రేత్‌స్కీ చూసుకుని వుంటే, తననే గుర్తుపట్టి వుండేవాడు కాదేమో. యీ యెనిమిదేళ్లల్లోనూ అతను జీవితపు మలుపు తిరిగాడు, చాలా మంది తిరగకుండానే మలుపు దాటతారు, కాని అది లేకుండా యెవరూ గౌరవప్రదులుగా వుండలేరు: అతను నిజంగా తన ఆనందాన్ని గురించీ, స్వప్రయోజనాన్ని గురించీ ఆలోచించడం మానేశాడు. అతను శాంతుడయ్యాడు — నిజం చెప్పాలంటే అతను వయస్సులోనూ, ముఖంలోనూ, శరీరంలోనూనే కాకుండా మానసికంగా కూడా పెరిగాడు. పెద్ద వాళ్లయ్యాక హృదయాన్ని పడుచుగా వుంచుకోవడం, యేదో శాస్త్రం చెప్పినట్టు, కష్టమూ అసంభవమూ కూడా. మంచితనంలో విశ్వాసాన్నీ, లక్ష్యస్థిరత్వాన్నీ, ఆచరించాలనే సంకల్పాన్నీ పోగొట్టుకోనివాడు తృప్తుడు కావచ్చు. లవ్రేత్‌స్కీకి తృప్తుడయే హక్కు వుంది. అతను

నిజంగా మంచి హాలికుడయాడు, నిజంగా భూమిని దున్నడం నేర్చుకున్నాడు, తనకోసం మాత్రమే పని చెయ్యలేదు. తన రైతుల సంక్షేమానికి చెయ్య గలిగినదంతా చేశాడు.

లవ్రేత్‌స్కీ తోటలోకి వెళ్లి, పరిచితమైన ఆ బల్లమీద కూర్చున్నాడు. యిక్కడ, యింటికి అభిముఖంగా వున్న తన ప్రియమైన స్థానంలో, ఆనంద మధువుతో నురగలు కక్కుతూ తొణికిసలాడి ఆశించే చషకంకోసం, నిష్ఫలంగా తను కడసారి చేరుకున్న ఆ స్థానంలో తను — యిల్లు లేని, ఒంటరి పథికుడు, జీవిత పథం కేసి ఒక్కసారి వెను దిరిగి చూసుకు న్నాడు, అదే సమయంలో కొత్తతరం, అప్పటికే తన స్థానంలో ప్రవేశించిన వాళ్లు, హుషారుగా కొట్టే కేరింతాలు తోటమీదుగా తేలుతూ తనని చేరుతున్నాయి. అతని హృద యంలో విచారం వుంది, కాని బాధగాని, పరుషత్వం గాని లేవు: అతను విచారించవలసినదెం తేనా వుంది, కాని సిగ్గు పడాల్సింది యేమీ లేదు. "ఆడుకోండి, ఆనందించండి, ఎదగండి, శక్తివంతమైన యువతా" అనుకున్నాడతను, కాని అతని ఆలోచనల్లో చేదుకసి లేదు. "మీ జీవితం ముందు వుంది. జీవించడం మీకు సులభ తరం. మీరు మీ జీవిత పథాన్ని మాకులాగా వెదుక్కోనక్కర్లేదు చీకటి మధ్యంలో పోరాడుతూ, పడిపోతూ, మళ్లీ లేస్తూ. బతకడానికి ప్రయత్నించడంలోనే మా పని తీరింది, — మాలో యెంతమంది బతకలేకపోయారు! — కాని మీకొక కర్తవ్యం వుంది, చెయ్యాల్సిన పని వుంది — పెద్దతరం వాళ్లమైన మా ఆశీ స్సులు మీకుంటాయి. నాకు సంబంధించి, యీ రోజు తర్వాత యీ అనుభూతుల తర్వాత, కడసారి మీనుంచి సెలవు తీసుకోవడమే మిగులుతుంది — ఆసన్న అవసానం దృష్ట్యా, నిరీక్షి స్తున్న భగవంతుని పరంగా, అసూయలేకుండా, మకిలి పట్టిన భావాలు లేకుండా విచారంగా 'రా, యేకాంత వార్ధక్యమా! దగ్ధమవు వ్యర్థ జీవితమా!' అనడం మిగులుతుంది."

లవ్రేత్‌స్కీ నెమ్మదిగా లేచి, నెమ్మదిగా వెళ్లిపోయాడు. అతన్నెవరూ గమనించలేదు, యెవరూ ఆపలేదు. యెత్తైన లైమ్‌చెట్ల హరిత కుడ్యం వెనక ఆనంద సందోహపు సరంభం అధికమైంది. లవ్రేత్‌స్కీ బండియెక్కి యింటికి తోలుకు పొమ్మనీ, గుర్రాల్ని మరీ ఆది లించి తోలవద్దనీ బండివాడితో చెప్పాడు.

* * *

"ముగింపు యేమైనట్టు?" నిరుత్సాహపడిన పాఠకుడు అడగవచ్చు. "తర్వాత లవ్రేత్ స్కీకి యేమైంది? లీజాకి యేమైంది?" కాని ప్రపంచంనుంచీ, యీ పెనుగులాటనుంచీ విరమించుకున్న వాళ్లని గురించి, వాళ్లు జీవిస్తూ వున్న వాళ్లైనా, గానీ యేం చెబుతాం? లీజా దీక్ష పుచ్చుకున్న సుదూర మఠం దగ్గరికి వెళ్లి లవ్రేత్‌స్కీ ఆమెని చూశాడట. ఆరా ధన గాయక బృందంనుంచి యింకో బృందం మధ్యగా అలా వెడుతూ ఆమె సన్యాసిని లాగా

నిబ్బరంగా, సాధువుగా, వేగంగా వుండే నడకతో అతనికి దగ్గరసా వచ్చి వెళ్లిపోయింది గాని అతన్ని చూడలేదు. ఆమె పక్ష్మాలు కొద్దిగా వణికాయి, కృశించిన ఆమె వదనం యింకా కిందికి వంగింది అంతే. జపమాల అల్లుకుపోయి కట్టుకున్న చేతులు యింకా గట్టిగా అదు ముకున్నాయి. వాళ్లిద్దరూ యేమనుకుంటున్నారు? యే అనుభూతి వాళ్లకి కలిగింది? ఎవరికి తెలుసు? ఎవరు చెప్పగలరు? జీవితంలో అలాంటి క్షణాలు, అలాంటి అనుభూతులు వుంటాయి.... వూరికే వాటికేసి చూపించి, వెళ్లిపోవడమే యెవళ్లేనా చెయ్యగలిగింది.

1858

పాఠకులకు మనవి

ఈ పుస్తకాన్ని గురించిగానీ, దీని అనువాదాన్ని గురించిగానీ మీ అభిప్రాయాలనూ మీ సలహాలనూ మా భావిప్రచురణల సహాయార్థం మాకు పంపండి. మా చిరునామా:


Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

## మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్స్
విజయవాడ – 520004

విశాలాంధ్ర బుక్ హౌస్
ఏలూరు రోడ్డు
విజయవాడ – 520002

విశాలాంధ్ర బుక్ హౌస్
బాంక్ రోడ్డు
హైదరాబాదు – 500001

విశాలాంధ్ర బుక్ హౌస్
కాలేజి రోడ్డు
అనంతపురం – 515004

విశాలాంధ్ర బుక్ హౌస్
11–1–37 గాంధీ రోడ్డు
తిరుపతి – 517501

విశాలాంధ్ర బుక్ హౌస్
సూపర్ బజారు ఎదుట
మెయిన్ రోడ్డు
విశాఖపట్నం – 530002

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
హనుమకొండ
వరంగల్ – 506011

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
అరండల్ పేట
గుంటూరు – 522002



ఇవాన్ తుర్గెనెవ్ (1818–1883) రష్యన్ సాహిత్య చరిత్రలోనూ, ప్రపంచ సాహిత్య చరిత్రలోనూ అందెవేసిన వచన రచయిత.

"గొప్పవారి గూడు" నవలలోని యితివృత్తం లీజా, లవ్రేత్స్కీల విషాద ప్రేమ గాథ. అయినా నైతిక కర్తవ్యాన్ని గురించీ, ఆత్మ పరిత్యాగాన్ని గురించీ, ఆనందాన్ని గురించీ, జీవిత పరమార్థాన్ని గురించీ కూడా యీ నవల తెలియ జేస్తుంది.

"....సామాన్యంగా తుర్గెనెవ్ రచనలన్నిటి గురించీ యెవళ్లైనా చెప్పగలిగింది యేమిటి? వాటిని చదివిం తర్వాత సునాయాసంగా జీవించగలిగేటువంటి, విశ్వసించగలిగేటువంటి, ఆర్ద్రంగా వుండగలిగేటువంటి అనుభూతా? మీ నైతిక స్థాయి యెలా యెదుగుతోందో మీరు స్పష్టంగా అనుభూతం చేసుకోగలిగి, మీ ఆలోచనల్లో రచయితని అభిమానించి, అభినందించే అనుభూతా?... గంధర్వ సదృశంగా వుండేటువంటి రూపాలు, ప్రతి పాదంలోనూ స్పందించేటువంటి యీ ప్రేమ వెలుగుల వసంతం కలిగించే అనుభూతి నిజంగా అదే."

ఎమ్. సల్తికోవ్-శ్చెద్రిన్




"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో